# PUBLISHERS' NOTE

Here is an inspiring Scripture. It is the thrilling account of a great spiritual being's yearning, Sadhana, Spiritual experiences, renunciation and utlimate realisation of the .Lord - the Lord embodied in H. H. Sri Swami Sivanandaji Maharaj. This volume is the touch stone of discipleship, spiritual aspiration and experience.

Telugu Publication of this book is rendered possible to the devoted Public by the Magnanimous donation of Sri Y. Ramakrishna Prasad—Adayar,Madras-20, the ardent and devoted disciple of Gurudev Sri Swami Sivananda. May Gurudev's blessings be upon him & his family.

8th Nov. 1965.
Madras.

Publishers

# విషయానుక్రమణిక

## ప్రథమాధ్యాయము

### నా గురుదేవుడు శివానందస్వామి



## ద్వితీయాధ్యాయము.

### శిష్యురాలియొక్క ఉత్తరములు

## తృతీయాధ్యాయము

### ఆయన కటాక్షమువలన జరిగిన అమానుష కృత్యములు



## చతుర్థాధ్యాయము

### చెల్లమ్మకు శివుడు వ్రాసిన ఉత్తరములు

## పంచమాధ్యాయము

### ఆంతర యోగసంబంధమైన విధేయత (శ్రీ స్వామిశివానంద)



## షష్ఠాధ్యాయము

### శ్రీ శివానందస్వామి తత్త్వము బోధనలు



## సప్తమాధ్యాయము

### నా ఆత్మయొక్క గీతము





# 1. ఆత్మ అనగా నేమి ?

"ఆ నిజము. ఆ ఆత్మ, అదియే నీవు."

ఈ దివ్యాక్షరములు నేను మొట్టమొదట చూచి నటువంటివిన్ని నాకు ఆధ్యాత్మిక ఉద్రేకము తీవ్రముగా కలిగి నటువంటివిన్ని నా గురుదేవుడు శ్రీ స్వామి శివానందుని బొమ్మక్రింద వ్రాయబడియున్నవి. ఈ మాటలు గురువుగారి పుస్తకములలో నొకటియగు "ఆధ్యాత్మిక సాధనలు" అను పుస్తకమునందు గలవు.

ఒక ఆశ్చర్యకరమైన సంఘటనద్వారా ఆ పుస్తకము నా చేతిలోనికి వచ్చినది. అది చదువుటవల్ల నా జీవితము యొక్క దృక్పథమంతయు మారినది. ఆ పుస్తకము చదువదగినది.

ఆధ్యాత్మిక జీవితము ప్రారంభించక పూర్వము ప్రతి వ్యక్తియు నిజవస్తువగు ఆత్మ విషయమై కొంత తెలిసికొన వలసియున్నది. ఎందువల్ల ననగా మన ఆధ్యాత్మిక జీవితముయొక్క ఉద్దేశము మనలోననుండు ఆత్మను తెలిసి కొనుటయే.

మనము మనుష్యులుగా పుట్టినది మన నిజమైన కోరికయగు ఆధ్యాత్మిక ఆత్మను తెలిసికొనుటకే. మనము అది తెలిసికొనువరకు మనము తిరిగితిరిగి పుట్టి యీ ప్రపంచ మందు బాధపడుచుందుము. మన స్వంత ఆత్మయొక్క రహస్యము తెలిసికొనుటయే మనలో ప్రతివ్యక్తియొక్క ముఖ్య ఉద్దేశముగా నుండవలెను.*

మన విద్య అనేక విషయములలో తర్ఫీదగుటను మనకు నేర్పినది. కాని మనవిషయమై చాల తక్కువ. ఆత్మ శాస్త్రము తెలిసికొనుట చాల ముఖ్యమైన విషయము. అందు మనము ఎంతమాత్రము ఆలస్యము చేయకూడదు. మనకు చాల వస్తువుల విలువ తెలియును కాని మన విలువ మనకు సరిగా తెలియదు.

మనలో ప్రతివ్యక్తియు సౌఖ్యమును కోరుచుండును. కాని అది యెచ్చటనుండునో మనకు తెలియదు. క్షణ భంగురములగు ప్రపంచ సౌఖ్యములలో దానికొఱకు వెదకు దుము. మనము ఎంత బుద్ధికుశలత గలవారమైనను లేక మనము ఎంత ధనికులమైనను మనకు నిరంతరసౌఖ్యము గలుగదు. ఒక కోరిక తృప్తియైన పిమ్మట ఇంకొక కోరిక బయలుదేరును. మన కెల్లప్పుడు ఇంకను పూర్తికావలసిన కోరికలు కనుపడుచుండును. కాని యేది మనకు నిరంతర సౌఖ్య మిచ్చునో అది మనకు తెలియదు.

మనకు శాశ్వత శాంత ఆనందముల నిచ్చునది ఒకటేగలదు. అది ఆత్మసాక్షాత్కారము లేక భగవంతుని తెలిసికొనుట.

గొప్ప ఋషులు మునులు అందరు అన్ని ప్రపంచ సౌఖ్యములను బలిదానముచేసి ఆత్మవిషయమై విశ్వప్రయత్నముచేసి ఆత్మసాక్షాత్కారము పొందిరి. వారు వారి యనుభవమునుండి మనకు చెప్పునది యేమనగా నిజమైన సౌఖ్యము శాశ్వతమైన పరమానందము, మరియు శాంతి ఆత్మసాక్షాత్కారము తేగలదని—.

ఇప్పుడు ఆ నిజమగు ఆత్మ ఎట్టిదో విమర్శించ ప్రయత్నించెదము—.

నిజమగు ఆత్మ మనము చూచెడి యీ నశించు మాంసశరీరము కాదు. ఇంకొక ఆశ్చర్యకరమైన శక్తిగల ఆత్మ మనలోపల మాంసము మానసిక తెలివికి అవతల ఉన్నది. ఈ అంతరాత్మ మన బుద్ధియొక్క అన్నిపనులు కనిపెట్టుచుండును. అది అంతులేనిది మరియు మార్పులేనిది. ఈ లోపలనుండునదియే ఆత్మ. అది మనకు కనిపించదు. కాని అంతయు చూచుచుండును. అది వినబడదు. కాని అంతయు వినును. అది తెలిసికొనబడదు కాని అది అన్నిటిని తెలిసికొనును.

మన అంతరాత్మను తెలిసికొనుటకు మన వ్యక్తిత్వము యొక్కొక్క భాగమును తీసివేయుటకు ప్రయత్నించెదము. మరియు ఉల్లిపాయలయొక్క పొరలన్నియు తీసినట్లు తీసి లోన వెదకెదము.

ఆత్మ యీ మాంసశరీరమా ? మన ఆత్మయొక్క చైతన్యము సంపూర్ణభావము మన శరీరము ముక్కలు క్రింద కోసినను లేక మన శరీరమంతయు కదలలేని స్థితిలో నున్నను మార్పు ఏమియు చెందదు. గాఢనిద్రలోను మరియు శరీరస్పృహ తప్పినపుడు శరీరము జీవించియున్నను ఆత్మ యొక్క ఉనికి మనకు అనుభవమునకు రాదు. కాన శరీరముకాక యింకొకటి ఆత్మవిషయమై మనము తెలిసికొనుటకు మనకు కావలసియున్నది. కాబట్టి ఆ యంతరాత్మ

కొఱకై మనము శరీరముకన్న లోతుగా వెదకవలసి యున్నది.

ఆత్మ యింద్రియములలో కనిపించలేదు. మరియు నేదైన పనిలో నిమగ్నమైయున్నప్పుడు మన యెదుట నేమి యున్నది మనము చూడలేము. మనతో మాట్లాడిన మాటలు వినబడవు. ఎవరైనను మనలను ముట్టుకొనిరేని ఆ స్పర్శజ్ఞానము మనకుండదు. దీనినిబట్టి మనకు తెలిసినది యేమనగా పనిలో నిమగ్నమైన వానికి ఇంద్రియములతో సంబంధము లేనియెడల ఇంద్రియములు పనిచేయవు. కావున మనము అంతరాత్మకొఱకు ఇంకను లోతుగా వెదకవలెను.

ఆత్మ ఉద్రేకముతోడి కార్యములగునా ? మనకు అనేక సమయములందు అనేకవిధములగు మనోవికారములు గలుగును. ఒకదినము మనము సంతోషముగా నుందుము. మఱరోజున విచారముగా నుందుము. కాని యీ మనో వికారములయందలి మార్పులు తెలిసికొనుటకు మనోవికార ములకంటె లోపల ఇంకొకటి వాటిని అణచెడు శక్తిగలది యుండవలెను. దీనినిబట్టి తెలియబడునది యేమనగా మనో వికారముల యవతల ఇంకొక ఆత్మ ఉండవలెను.

ఇపుడు ఆ ఆత్మ మన బుద్ధి అగునా అని విచారించు దము. మన బుద్ధికుశలత కూడ వివిధకాలములందు వివిధ విధములుగా నుండును. నిరుడు మనకు గలిగిన ఊహాలు ఈ సంవత్సరము మనకు కలిగినట్టివి కావు. గాఢనిద్రలోను మనకు స్పృహలేనప్పుడును ఆలోచన బుద్ధియొక్క పని ఆగిపోవును. కాని ఆత్మ అప్పుడుకూడ నుండును. కావున

మనలో శాశ్వతముగా నుండునది బుద్ధిమార్పు లన్నియు తెలిసికొనునదియు నగు ఒక లోతైన ఆత్మ ఉన్నది. నిజముగా ఈ యంతరాత్మయే లేక ఆత్మ బుద్ధికి పనిచేయుటకు శక్తి నిచ్చును.

పైన చెప్పబడిన విమర్శనమువలన మనకు తెలిసిన దేమనగా అంతరాత్మ మాంసము ఇంద్రియములు మనో వికారములు బుద్ధి—వీని యన్నింటికంటె లోతున నున్నది. అది అన్నిజీవులకు ఒక స్థిరమైన సామాన్యవిషయము. అది యెన్నడును ఎట్టి పరిస్థితియందును మార్పుచెందదు. కాని వ్యక్తియందు అన్నిమార్పులు అది చూడగలదు. అది మనుజునియొక్క చాల లోతున నుండునది. అది బాహ్య చక్షువువలన చూడబడదు. కాని మనచూపు ఆధ్యాత్మిక పద్ధతుల ద్వారా లోన ప్రసరింపజేయగలిగిన దానిని తెలిసికొనవచ్చును.

ఆత్మకు మొదలు లేదు. తుది లేదు. అది యెల్లప్పుడు నుండునది. శరీరము నశించినను అది నశించదు. మొదలు తుద లేనటువంటిది ఎల్లపుడు నుండునటువంటిది ఒకవస్తువు ఎట్లు ఉండునో తెలిసికొనుటకు మనము మనలోనుండు దివ్య అంతరాత్మకు ప్రపంచమంతటిలో నున్న దివ్య ఆత్మ లేక పరమాత్మ లేక భగవంతునకు గల సంబంధమును తెలిసికొనవలెను.

అంతులేని చావులేని ఒక వస్తువు ఉన్నదనియు అది భగవంతుడు లేక ప్రపంచ దివ్యశక్తియనియు మనకు

తెలియును. కాన మన ఆత్మకూడ అంతులేని చావులేని దైనయెడల ఆత్మ పరమాత్మలో భాగమై యుండవలెను. అంతులేనివి చావులేనివి రెండు వస్తువులుగాని శక్తులుగాని ఉండనేరవు. కాబట్టి మనముచూచునది తెలిసికొనునది అంతయు మనముకూడ ఒక దివ్యశక్తి లేక భగవంతుని వలన సృష్టింపబడితిమి. సూర్యునియొక్క ఒక్క కిరణము సూర్యునినుండి మనము విడదీయజాలనట్లు జీవాత్మను పర మాత్మనుండి విడదీయజాలము. ప్రపంచమంతటను నుండు దివ్యశక్తి (ఇది భగవంతు డని మనకు తెలియును.) లో కొంతభాగము మన అందరిలోను కనబడును. మరియు అది మన లోపలిభాగమందు నివసించియుండును.

ప్రకాశముతోగూడిన సూర్యుడు ఒకానొకప్పుడు మేఘములవల్ల కప్పబడి కనబడనట్లు మాయ లేక అహము వల్ల కప్పబడుటవల్ల మనము మనలోనుండు దివ్య ఆత్మను కనుగొన శక్తిలేకయున్నాము. మనచూపు ప్రపంచము యొక్క బాహ్యవస్తువులపై పరుగిడుచున్నది. మరియు మనము దీనివల్ల గలిగిన మానసిక ప్రపంచమునందు నివ సించుచున్నాము. దీని తరువాత మనము తరచిచూచుట లేదు.

ఏదైన ఒకపద్ధతిప్రకారము మన మనస్సు బాహ్య ప్రపంచమునుండి త్రిప్పి మనలో లోపలగా నుండుదాని యందు ప్రసరింపజేసిన అనగా మనము మానసిక ప్రాకృతిక నిర్మలత్వము లేక స్తబ్ధత గలుగజేయగలిగిన మనము

అంతరాత్మను కనుగొనగలము. ఆత్మ సాక్షాత్కారము పొందినవారు వారి ప్రత్యేక అనుభవమునుబట్టి చెప్పునది యేమన మన నిజమైన దివ్యఆత్మను మనము కనుగొనిన జీవితముయొక్క అన్ని రహస్యములు తెలియబడుననియు, మరియు శాశ్వత ఆనందము ముక్తి అమరత్వము పొంద గలుగుదు మనియు—

శాశ్వతమైన సౌఖ్యము మరియు ఆనందము అంతు లేని మరియు అమరము మార్పులేని దానివల్ల గలుగునని మనకు తెలిసియే యున్నది. మరియు ఆత్మశక్తి యొకటే యున్నదనియు అది సర్వమునకు జెందెడు దివ్యశక్తి లేక భగవంతు డనియుకూడ మనకు తెలియును. మనలోనుండు దివ్య ఆత్మ భగవంతునిలో నొక భాగము కాన శాశ్వత సౌఖ్యము తృప్తి మనలోనుండు ఆత్మను తెలిసికొనినప్పుడే కలుగగలదు. ఒక్కసారి మన అంతరాత్మను కనుగొనిన యెడల మనము భగవంతునికూడ కనుగొనినట్లే.

ప్రారంభమందు మనము మన నిజమైన భగవత్సాక్షాత్కారము నొందిన గురువును జేరినప్పుడు మన అంతరాత్మ యొక్క క్షణికజ్ఞానము కలుగగలదు. గురువుగారియొక్క ఆశీర్వచనమువల్ల మనయందుండు దివ్య ఆధ్యాత్మిక ఆత్మను తెలిసికొందుము. అట్టి సమయములందు మనము పొందెడి ఆధ్యాత్మిక ఉద్రేకము అది తెలిసికొనుటకంటె వేరు కాదు.

మనకు మన గురువునందు పూర్తి నమ్మకము భక్తి ఉన్నయెడల మనకు అంతర్యములో కలిగిన ఆధ్యాత్మిక జ్ఞానము వరుసగా కలిగియుందుము. భగవత్సాక్షాత్కారము పొందిన గురువుయొక్క శక్తిగల దివ్యకంపనములు వాటంతట అవి మన మనస్సును ఆకర్షించి దానిని లోనికిపంపును. మరియు మనకు అప్పటివరకు తెలియనటువంటి అంతర లేక నిజసౌఖ్యము మనము పొందగలుగుదుము. గాఢధ్యానము లోనికి మనము పోవలెనని అంతర ఆసక్తి మనకు గలుగును. మరియు మన అంతరశక్తి వృద్ధిపొందును.

ఆ ప్రకారము అంతరిక దివ్య ఆత్మకొఱకు వెదకెడు స్థితియొక్క ప్రారంభదశయందు కూడ మన జీవితముయొక్క ప్రతి పద్ధతియందు ఒక్కొక్క సౌఖ్యము వృద్ధికలుగును.

మనము ఉచ్చజీవితము గడపవలయు నను ఆసక్తి కలుగును. మరియు ప్రపంచవస్తువులయందు కలుగని నిజమైన సౌఖ్యము అనుభవించుటకు ప్రారంభమగును. జీవితమునందు మనకు పూర్ణమైన మార్పు కలుగును. అంతకు పూర్వము మనకు బాధకలిగించు అనేక ఆదుర్దాలు అసౌఖ్యములు స్వల్పములుగా కనిపించినను, నిజము అబద్ధము అని విచక్షణచేయు క్రొత్తశక్తి మనకు వచ్చును. మనకు ఉండకూడనటువంటి ఆవేశములు అనగా కోపము భయము ఈర్ష్య వగైరాలకు మనమనస్సు ఆస్పదమైనపుడు మనలో నుండు దివ్య ఆత్మ మనలను చీవాట్లువేయుటకు ప్రారంభిం

చును. క్రమశ మనము తప్పుడు మార్గములు త్రొక్కుటకు శక్తి లేనివార మగుదుము.

నాకు గలిగిన కొద్దిపాటి అనుభవమునుండి నేను ఇది వ్రాయుచున్నాను. నేను ఇంకను నిజమైన ధ్యేయమగు భగవత్సాక్షాత్కారమునకు దూరస్థుడగానే యున్నాను. అయినను ఆధ్యాత్మికజీవితము ప్రారంభించుట మంచిదని నేను ధైర్యముగా చెప్పగలను.

నా గురువుగారును ఒకరు కనుగొనగలిగిన పూర్ణ గురువును అగు **H. H.** స్వామి శివానంద మహారాజుగారికి హృదయపూర్వక ధన్యవాదము లిచ్చుచు నేను ఇది ముగించుచున్నాను. వారికి ఆరోగ్యము సౌఖ్యము మరియు దీర్ఘాయువు నిచ్చుటకు భగవంతుని ప్రార్థించుచున్నాను.



# 2. భక్తి

భక్తి అనునది భగవంతునియెడల పరమ నిస్స్వార్థ ప్రేమ. ఈ పవిత్రప్రేమకు బేరమాడుటగాని భయముగాని ఉండదు. అది మధురమైన పవిత్రమైన ప్రేమస్వరూపము. దివ్యప్రేమయందు ఒకవ్యక్తి కేవలము ప్రేమకొఱకే ప్రేమించును. అందు ఇంద్రియ సంబంధమైన కోరిక లేదు.

ఈ ప్రపంచమునందు గొప్ప చలింపజేయు శక్తి ప్రేమ. అది క్షుద్రజీవి లగాయతు ఉచ్ఛజీవివఱకు ప్రతిదానియందు కనపడును. అది విచారములు పోగొట్టగల గొప్ప శక్తి.

మానవులయొక్క చాల భాగము ఆదుర్దాలకు మూలము. ఈ ప్రపంచమునందు ఒంటరిగా సహాయము ఏమియు లేకుండినట్లు అనుకొనుటయే. ప్రతివ్యక్తియు నితరులు తనను ప్రేమించమని అడ్డంకిలేని కోరిక గలిగి యుండును. ఆహారము తరువాత ప్రతివ్యక్తియు నిందుకు ఆతురతపడుచుండును. అది ఆత్మకు ముఖ్యమైన ఆహారము. దీనినుండి జీవితముయొక్క ముఖ్యసంతోషము బయలుదేరును. ఈ సౌఖ్యముయొక్క మొదటి సూచన మనము ఎక్కువగా ప్రేమించు వ్యక్తి మనలను ఒప్పుకొని మన అవసరము కావలెనని కోరినప్పుడు కలుగును. మనకును ప్రేమయొక్క వస్తువు దైవసంబంధమైనప్పుడు ఈ సౌఖ్యము పరమ మగును.

మనము పుట్టినలగాయతు మనకు తెలియకుండ మనలో ప్రతివ్యక్తియు పరమప్రేమ అనగా భగవంతుని ప్రేమకొఱకు వెదకుచుందుము. మన జీవితములో ప్రారంభ దశయందు మనము దేనికొరకు వెదకుచున్నామో మనకు తెలియదు. అనేకసార్లు మనము అసలు వస్తువుకు బదులు దాని నీడనే కాంచుచుందుము. దీనికి కారణము మాయ.

ప్రారంభమునందు మనతల్లిని ప్రేమించుటలో మనము సంతోషించెదము. ఇదిమనము ప్రపంచమందు కనిపెట్టు ప్రేమలన్నింటిలో మిక్కిలి పవిత్రమైన ప్రేమలలో ఒకటి' కాని దీనియందుకూడ స్వలాభముయొక్క ఛాయ ఉన్నది. పిల్లడు తల్లిని ప్రేమించుట ఎందువల్లననగా వానికి కావలసిన వన్నియు తల్లివల్ల వచ్చును. పిల్లడు పెద్దవాడై స్వతంత్రత గలిగినతరువాత ఆ ప్రేమలో మార్పుండును. అప్పుడు అతడు వాని తల్లినిమాత్రమే ప్రేమించుటయందు తృప్తిపడడు. అప్పుడు స్నేహితుల ప్రేమ కోరును. అటుతరువాత స్త్రీల ప్రేమకొరకు ఆసక్తి వృద్ధియగును.

ఆ ప్రకారము మనము ఒకరకము ప్రేమగలిగి దానితో హృదయమందు పూర్తిగా తృప్తిపొందక అది విడిచి యింకొకరకము ప్రేమను కోరి తిరిగి దానితో తృప్తి పడక యింకొకటికోరి చివరకు ఈ ప్రపంచమే స్థిరముకాదు, స్వలాభరహితముకాదని తెలిసికొని మార్పులేనిది పవిత్రమైనదియగు ప్రేమ భగవంతుని ప్రేమ లేక దివ్యప్రేమయని

తెలిసికొందుము. నిజము ఎచ్చట తీవ్రమైన పవిత్రతతోకూడి నిస్స్వార్థమైన ప్రేమగలదో అచ్చట భగవంతుడు ఉండును.

భగవంతుడు తప్ప మిగిలినవన్నియు నశించునవి గనుక ఇతర కారణములవల్ల గలుగు ప్రేమఅంతయు నశించునదే. ఇంద్రియప్రేరణలు భాగ్యము లేక ప్రపంచ స్త్రీల యందు స్థిరమైన శాంతిలేదు.

భక్తి మానవహృదయమును వృద్ధిచేయును. మార్పు చేయును. ఉత్తేజము గలుగజేయును. పవిత్రపరచును. నీరసులకు బలము నిచ్చును. అసహాయులకు శక్తినిచ్చును. విచారముగనున్నవారికి ధైర్యమిచ్చును. నిరుత్సాహముతో నుండు జీవితమును కార్యరూపము కర్తవ్యరూపముగా మార్చి వ్యక్తికి సౌఖ్యము స్వేచ్ఛ యనుభవించునట్లు శక్తి నిచ్చును.

ఎప్పుడు భగవంతునియందలి ప్రేమ కలుగునో యప్పుడు మనలోనుండి ఆ దివ్య ఆత్మయొక్క కనిపించని హృదయస్పందనములు మనకు పరమానందము సౌఖ్యము నిచ్చును. భగవంతునియందు ఆసక్తి ఆత్మకు భగవంతునితో గలుగు భాషారహితమైన సంభాషణ మనము గొప్ప ఆపదలో నుండినను మనకు శాంతికలుగజేయును. భగవంతునియందు మనకుగల తీవ్రమైన ప్రేమ మనయందుండెడి గౌరవమైన ఊహలు ప్రకటపరచును. మరియు నిర్దుష్టమైన జీవితము గడపుటకు ప్రయత్నించు కోరిక గలుగును.

భక్తి ఉత్కృష్టముగా నున్నప్పుడు మనలోనుండు దివ్యాత్మ వ్యక్తిత్వము లేక అహము అను ఖయిదునుండి విడుదలయై భగవంతునిలో కలియుటకు ప్రయత్నించును. మరియు అట్టిసమయములు మిక్కిలి ఆశ్చర్యమగు సంతోష మును గలుగజేయును. అట్టిసమయములందు గలుగు సంతో షము ఆత్మలో నిండి వృద్ధియై మరియు దానిని ముంచి వేయును. అట్టి పరవశస్థితిగల సమయములు అనుభవ యోగ్యములు. భక్తులయొక్క హృదయమునుండి ప్రకా శించు సంతోషము మరియు హృదయశాంతి ప్రతిఫలించి వారి సౌఖ్యమైన ముఖములందు కనిపించును.

మనకు నిజమైన భక్తియుండిన భగవంతునితో రాజీ చేసికొన నవసరము లేదు. వానియొక్క భయము మనకు గలుగదు. మనము మనయొక్క మినహాయింపులు రహస్య ములు ఆత్మరక్షణలు ప్రక్కకు త్రోసిపుచ్చెదము. మన జీవితముయొక్క సంతోషము హృదయపూర్వకముగా భగవంతుని ఎల్లప్పుడు తలచుటయందే యిమిడియుండును. తినుట త్రాగుట నిద్రించుటలు రెండవ పక్షముగా కనిపిం చును. ప్రపంచసౌఖ్యములు నిస్సారములగును. మరియు భగవంతు డిచ్చినదానియందు తృప్తికలుగును. మనకు మనయందును ఇతరులయందును నమ్మిక వృద్ధియగును.

కొన్ని సమయములందు మనము భగవంతుని వైపు నకు ప్రేమతో లాగబడినట్లు ఊహించెదము. ఆ సమయము లందు మనకు గలుగు శాంతిసౌఖ్యము వర్ణింపశక్యము

కాదు. భగవంతునియొక్క మానముతోఁగూడిన ఆశ్చర్యమగు ఆంతరికభావముయొక్క మాధుర్యము అనుభవించవలసినదేగాని వర్ణించ వీలుకాదు.

మనము అనుభవమునకు తెచ్చుకొనవలసినది యేమనగా ప్రపంచప్రేమ అంతయు అబద్ధము అస్థిరము అనియు మన సంతోషము ఆశ వైభవము అంతయు భగవంతుని ప్రేమయందు గలవనియు తెలిసికొనుట. మరియు ఆశక్తియే ఈ ప్రపంచమందు మన కష్టములన్నియు తగ్గించగలదు. మనము వానిని తండ్రివలెను తల్లివలెను స్నేహితునివలెను గురువువలెను ప్రేయసివలెను ప్రేమించుట నేర్చుకొనవలెను.

మనము పరమభక్తిస్థితికి చేరినపుడు భగవంతుడు ప్రతి జీవునియందు నివసించుననియు తెలిసికొందుము. మరియు ఆ ప్రకారము విశ్వప్రేమను వృద్ధిపరచుకొనెదము. మరియు భగవంతుడే అన్నియు అయి అనగా ప్రపంచము అందుండు జీవులు అయియున్నాడని తెలిసికొందుము. ఆఖరుకు మనము పూజలుచేయు వస్తువులో నైక్యమై ఆ ప్రకారము భగవత్సాక్షాత్కారము పొందెదము.

భగవత్సాక్షాత్కారము పొందుటకు భక్తి సులభమైనదియు మిక్కిలి సంతోషమైన మార్గమైయున్నది. ఈ పద్ధతియందు మన స్వాభావికవికారము అనగా భగవంతుని

వైపుకు గలుగుకోరిక అణచుకొననవసరము లేదు. ఇదియే భక్తి సాధనయొక్క సారము. ప్రేమయొక్క తీవ్రత కారణముచే మనము భగవంతునకు పూర్తిగా శరణాగతు లగుదుము. మరియు మన అహముకూడ దానంతట అదియే అప్పగించును. ఆత్మసాక్షాత్కార పద్ధతియందలి చాల ముఖ్యమైన ఆధ్యాత్మిక ప్రయత్నమందు ధ్యానములో భక్తి కూడ సహాయముచేయును. ధ్యానమనగా ధ్యానము చేయబడు వస్తువుయొక్క నిరంతరజ్ఞాపకము. భక్తియొక్క పరమస్థితియందు ఒకవ్యక్తి తాను ప్రేమించిన వస్తువును ఎల్లప్పుడు జ్ఞాపకముంచుకొనును. మరియు ఇదియే యొక ధ్యానపద్ధతిగాను ముక్తిమార్గముగాను అగును.

భక్తి వివిధ స్థితులయందు వివిధతరగతులుగా ప్రకటింపనగును. మొదటిస్థితి వ్యక్తిగల దేవతగా ఆరాధించుట. ఆధ్యాత్మికజీవితమందు ప్రారంభదశయందు ఈ రకపు భక్తి ఉపయోగకరముగా నుండును. ప్రారంభకునకు రూపము లేని కనబడని పథమునకు జెందెడు భగవంతునియందు వాని ప్రేమ నమ్మకమంతయు ఉంచుటకు సాధ్యముకాదు. భగవంతుడు భక్తుడు తాను పూజింపగోరిన రూపమును దాల్చును. మరియు భగవంతుడు ప్రతి వస్తువునందును ప్రత్యక్షముగ నుండును. కనుక విగ్రహమునుగాని భగవంతుని కనుగొనిన మహనీయునిగాని భగవంతునిగా పూజించుటయందు అప్రశస్తతయేమియు కనిపించదు. భగవత్సాక్షాత్కారము పొందిన వ్యక్తియందు భగవంతుని యొక్క పూర్తి ప్రత్యక్షత కనిపించును. కాబట్టి వానిలోను

వానిద్వారా భగవంతుని తెలిసికొని వానిని ప్రేమించుట సులభము. మరియు అతడు మనయందు శక్తి ఆసక్తి ప్రోత్సాహపరచి ఉచ్ఛసత్యమును మనకు తెలియపరచి భగవంతునియొద్దకు తీసికొనిపోవును.

మనము మన భక్తిలో వృద్ధిపొందినకొలది మనము ఊహించురూపము వెనుకనుండు దివ్యశక్తి మనకు అనుభవమునకు వచ్చును. మరియు అపుడు రూపములేని భగవంతుని పూజించుట మనకు సులభమగును.

కొందరియందు భక్తి బాల్యమునందే ప్రకటితమగును. చాలమంది బాగా వయసు ముదిరినవరకు వేచియుండవలెను. మరియు కొద్దిమంది అభాగ్యులకు అది కలలోనే కలుగదు. అది అంతయు మన పూర్వజన్మకర్మల ఫలితములపై ఆధారపడియుండును.

అనేకులయందు భగవంతుని ప్రేమకొరకు తీవ్ర ఆసక్తివారి ప్రపంచసౌఖ్యములన్నియు తృప్తిపడునంతవరకు లేక ఏదో యొక్క విచారమైన అనుభవముగాని లేక ప్రమాదముగాని అనుభవమునకు వచ్చువరకు ప్రకటితము కాదు.

ప్రతి తల్లిదండ్రుల యొక్క కర్తవ్యము బిడ్డయొక్క మానసికవృద్ధి ప్రారంభించెడు ప్రథమస్థితినుండి వాని మనస్సుకు భక్తి పట్టించవలెను. మామూలు పిల్లవాడు కనపడు వస్తువులుగాక మిగతా విషయములను గ్రహించు శక్తిలేకుండును. కనుక అట్టివానికి మనోహరమగు వ్యక్తి రూపములో భగవంతుని ప్రేమించుట బోధపర్చవలెను.

ఇది పిల్లవానియందుండు భగవత్ చైతన్యము వృద్ధిపొందుటకు సహాయపడును. క్రమశః భగవంతుని సర్వశక్తిత్వము తాను పూజచేయు రూపము వెనుకనుండు దివ్యశక్తి పిల్లవానికి తెలియునట్లు బోధపర్చవలెను. ఒకసారి పిల్లవాడు భగవంతునియందుగల ప్రేమవల్ల సౌఖ్యము శాంతి అనుభవించుటకు ప్రారంభించినప్పుడు అతడే తన భక్తి వృద్ధిపొందించుటకు మార్గములు తెలిసికొనును. మరియు భగవంతుడు వానియొక్క ఆశ్చర్యమైన విధముల ద్వారా అతని ఆత్మసాక్షాత్కారము యొక్క అన్వేషణయందు వానికి సహాయముచేయును.

మనము పరమభక్తియొక్క జీవిత ఉదాహరణ భవత్సాక్షాత్కారముపొందిన నాయొక్క గురుభగవానులు స్వామి శివానందవారియందు కనిపెట్టవచ్చును. వారి అనుభవమునుండి వారు ఆధ్యాత్మిక జీవితమునకు ఆధారము భక్తియని మాకు తెలిపియున్నారు. భగవంతునియందు వారికిగల అగాధ ప్రేమ వారు 'ఓ పూజ్యుడగు ప్రేమస్వరూపా!' ప్రార్థన ఆత్మోత్తేజితమగు ఆసక్తితోకూడిన వాక్కుతో పఠించునప్పుడు మరియు వారికి మానవజాతియంతటియందుగల విశ్వప్రేమ మరియు దయవల్లను తెలియగలదు.

అట్టివారికి ఆరోగ్యము సౌఖ్యము దీర్ఘఆయుస్సు ఇచ్చుటకును భగవంతుని జేరుటకు మనకు మార్గము చూపుటకు భగవంతుని ప్రార్థించుచు నింతటితో ఇది ముగించెను.

2

---

# 3. ఆధ్యాత్మికవృద్ధికి అవసరమగు కొన్ని విషయములు

మన ఆధ్యాత్మిక జీవితముయొక్క ఉద్దేశము ఆత్మానుభవమును లేక భగవంతుని తెలిసికొనుట. ఇది పొందుటకు మనము కొన్ని పద్ధతులను అభ్యసించవలెను. ఈ పద్ధతులలో ముఖ్య విషయము: మన శ్రద్ధ మనయొక్క మధ్య భాగమునకు తీసికొని పోవుట అనగా చైతన్యము ఒక గుండుసూది మొనవరకు తగ్గించుట. ఈ స్థితికి చేరుటకు మనము ప్రతి కోరికయు మనలను ఈ ప్రపంచస్పృహకు లాగదగిన ప్రతి ఊహయు విడిచిపెట్టవలయును.

మనకు దినమంతయు మానసిక సమత్వము మనోశాంతి ఉండినగాని ధ్యానసమయములందు మనస్సు యావత్తు లాగుకొనుటకు వీలుండదు. మనకు మానసిక సమత్వము మనోశాంతి మనము ఊహ మాట కర్మలలో పవిత్రముగా నుండినగాని ఉండనేరదు. కాబట్టి పవిత్రమైన జీవితము గడపుట అవసరము. మన స్వంత వ్యవహారముల విషయమై స్వాధీనపర్చుకొనుట నేర్చుకొనవలయును. అవి మంచివైనను చెడ్డవైనను స్వాధీనమం దుంచుకొనవలయును. మరియు మన దైనిక వ్యవహారమునుండి కూడ మన శ్రద్ధ తీసివేసికొనవలెను.

ఒక మలిన అద్దమందు మన రూపము సరిగా ప్రతిఫలించదు. ఆలాగుననే ప్రపంచ కోరికలతోగాని స్వాలా

భము కోరు దురాశ నిర్దయత మొదలగువానివల్లగాని మలిన పడినవాడు భగవంతుని అనుభవమునకు తెచ్చుకొనలేడు.

ఈ విషయము విస్పష్టముగా తెలియుటకు మనము ఈ ప్రపంచము రేడియోను బాగుచేయు స్టేషనుకును మరియు ప్రజలు పాడయిన రేడియోలకును పోల్చెదము. మరమ్మతు అవసరమైన రేడియోలే మరమ్మతు చేసే షాపుకు పంపబడును. ఆ ప్రకారము కర్మలు ఖండింప జేయుటకు పోయిననే తిరిగి యీ ప్రపంచమున పుట్టుదురు. వర్కుషాపులో మరమ్మతు జరుగునట్లు భగవంతుడు మనకు ఈ ప్రపంచమందు అనేక అవకాశములు మరియు అనుభవ ములు ఆధ్యాత్మికముగా మారుటకు ఇచ్చుచున్నాడు. రేడియో మరమ్మతు అయిన తరువాత కూడ అది విద్యు చ్ఛక్తి ప్రవాహమునకు పనిచేయుటకు కలుపుదురు. ఆ ప్రకా రమే మనకు ఆధ్యాత్మిక బోధలు గ్రహించుటకు తగిన శక్తి గలిగినప్పుడు భగవంతుడు గురువురూపమున మనలో ఆధ్యాత్మిక తెలివి గలుగుటకు కనిపించును. రేడియో స్విచ్చి చెడిన తరువాతకూడ అది యెట్లు బాగా పాడుటకు సరిచేయవలెనో ఎరిగినవారివల్ల సరిచేయకపోయిన మనకు సంగీతము స్పష్టముగా వినపడదు. ఇది గురువు మనకు ఆధ్యాత్మ మెలకువ గలిగినప్పుడు చేయును. మనకు వారిచే నివ్వబడు ఆధ్యాత్మిక అభ్యాసములు మనము భగవంతుని ఆహ్వానము చేయుటకు అవసరమగునవి. రేడియో ట్యూను చేయబడినను దాని మరమ్మతు సరిగా చేయనియెడల

మనకు స్పష్టముగా సంగీతము వినపడదు. ఆ ప్రకారమే మన మనస్సు పవిత్రత చేసికొననియెడల మనము ఆధ్యాత్మిక మార్గమందు వృద్ధిపొందజాలము. గొప్ప గురువుకు కూడ అపవిత్రతతో కూడిన వ్యక్తికి ఆధ్యాత్మికవృద్ధి ఇచ్చుటకు చాల కష్టము గలుగును. అందువల్లనే మనము పవిత్రత పొందుట చాల ముఖ్యము.

మన బాహ్యజీవితము మన ఆంతరిక లేక మానసిక జీవితమునకు ప్రతిబింబము. మన మనస్సుయొక్క స్వాభావిక స్థితి చంచలత్వము. దానిని స్థిరత్వమునకు మార్పు చేయవలెను. దీనికొరకు విడివిడిగా నుండు మన ఊహాల పైన మన అధికారము వృద్ధి చేసికొనవలెను. మన బాధలు చాలవరకు మన మనస్సును మనము స్వాధీనము చేసికొనుటకు శక్తి లేకపోవుటవల్లనే కలుగుచున్నవి. మనలో గూఢముగ మిక్కిలి లోపలనుండు దివ్య ఆత్మ మనము మన మనస్సుపై మంచి అధికారము పొందినప్పుడే పైకి కనిపించును. కాబట్టి మన మానసిక అలవాట్లలో మార్పులు మన శరీర సంబంధమైనవాట్ల మార్పులకంటె చాల యెక్కువ ముఖ్యము. మన ప్రాకృతిక జీవితమందు కూడ కొన్ని మార్పులు అవసరమే.

అవసరమైన మార్పులు చేసికొనుటకు ప్రపంచ కార్యకలాపమునుండి పారిపోయి ఆశ్రమములకు వెళ్ళ నవసరము లేదు. ఆశ్రమములకు తాత్కాలికముగ వెళ్లి కొద్ది

రోజులు అచ్చటనుండి వచ్చుట మన పురోవృద్ధికి కొంత సహాయకారి కావచ్చును.

ఆధ్యాత్మిక జీవితము ప్రారంభింపక పూర్వము మనకు నిజమైన ఆసక్తి మరియు భగవంతునియందు హృదయ పూర్వకమగు భక్తి మరియు మన గురువును భగవంతుని దృశ్యరూపముగా తెలిసికొని ప్రేమించుట మొదలగు గుణ ములు గలిగియుండవలెను. పూజ మరియు ధ్యాన సమ యములందు మరియు వీలైనంతవరకు ఇతర సమయము లందు గొప్ప శక్తియొక్క కటాక్షమునకు కోరిక తప్ప ఇతర ఊహ లేమియు మనకు కలుగకూడదు.

ఓర్పు అను మంచి గుణము ఉచ్ఛస్థితికి మనము వృద్ధిచేసికొనవలెను. ఎన్ని కష్టములు వచ్చినను భగవం తుని అనుభవమునకు దెచ్చుకొనుటకు చేయు ప్రయత్నము ముందుకూడ జరుగుటకు ఓర్పు గలిగియుండవలెను. అవసర మైన ఈ శోధనయందు సంవత్సరము తరువాత సంవత్స రము పట్టుదల గలిగియుండవలెను. మానసిక శాంతికి ప్రతి దినము చేయబడు పరిశ్రమలు ప్రారంభమందు కొందరికి కష్టము కలుగజేయవచ్చును. నిరుత్సాహములు మన పట్టు దలను తగ్గింపు చేయకూడదు.

ప్రాపంచిక లాభమున మన ఆశ ఉంచుకొనకూడదు. పైననుండు దివ్యశక్తికి నిబంధనలేని శరణాగతి యింకొక అవసరమైన విషయము. ప్రతిది భగవంతునకు సమర్పణ చేయుటకు పూర్ణమైన భక్తి యుండవలెను. పైనుండు

శక్తియే మన జీవిత సమస్యలన్నియు సరిచేయుటకు ఒప్పుకొనవలెను. ఒక్కొక్కప్పుడు ఆ పర్యవసానములు మనకు ఇష్టములేనివిగా నుండవచ్చును. కాని భగవంతుడు ఏమి చేసినను మన మంచికొరకే చేయునను తీవ్ర పూర్ణ నమ్మకము మనకు కలిగియుండవలెను

ఇంకొక ముఖ్యమైన గుణము నమ్రత లేక వినయము. మనలో చాలమంది మనము వినయముతో నున్నామని అనుకొనెదము కాని నిజముగా మనము అట్లుండము. లోన వినయము లేనియెడల బయటి వినయము వృథా. ఏ విషయమునందును ప్రాముఖ్యత మనము అసలు ఉన్నదాని కంటె ఎక్కువగా ఎంచుకొనకూడదు. మనము పైకి చాల కనిపించేదానికంటె ఎక్కువవారమని యితరులు కనిపెట్టుట మంచిది. దీనియర్థము మనము ఇతరుల యెదుట నీచముగా మెలగియుండవలెననికాదు. ముఖ్యమైన విషయమేమన మన అజ్ఞానము బలహీనత ఒప్పుకొనుటకు దీనులమై యుండవలెను. మనము చిన్నపిల్లలవలె నిష్కపటమైన మనస్సు కలిగియుండవలెను. మనకు నిజమైన నమ్రత లేనియెడల ఉచ్చమైన సత్యములు మన మనస్సునందు జొరబడవు.

మనము ప్రపంచవస్తువులయందు ఆంతరిక వైరాగ్యము అభ్యసించవలెను. మనయొక్క ప్రాకృతిక భాగ్యము మన స్నేహితులు బంధువులు మరియు భావములు క్షణికములని మనలో ప్రారంభమందే తెలిసికొనవలెను. నిజము ఒకటియే గలదు. అది భగవంతుడు. మన ప్రపంచజీవితము

యొక్క సౌఖ్యములు స్వప్నములయొక్క విలువగలవి. ప్రపంచసౌభాగ్యములేదని మనము అసౌఖ్యము పొంద కూడదు. మరియు అది కలిగినప్పుడు మురిసిపోకూడదు.

మనయొక్క ప్రతిచర్యలో నిష్కాపట్యము అవస రము. మనలను మనము మోసగించుకొనుట గొప్ప తప్పు లలో నొకటి. మనము ఏపనిచేసినను దానిమూలకారణము పవిత్రముగా నుండవలెను. మనము ఇతరులతో స్నేహముగా నుండి వారికి సహాయముచేయుటకు ప్రయత్నించుటకుముందు వారివల్ల మనము లాభముపొందు నుద్దేశముతో చేయ కూడదు. కేవలము తాత్కాలిక గొప్పదనమునకు మనము చేయలేనిపని చేసెదమని వాగ్దానము చేయకూడదు.

నీతి లేక న్యాయముయొక్క విలువ అందరకు తెలియునుకాని అవసరమైనది సంపూర్ణమైన నీతి లేక న్యాయము. పెద్దవిషయములందు నీతిగానుండి ప్రాముఖ్యత లేని విషయములందు అవినీతిగా నుండకూడదు. మనము ఊహా వాచా కర్మణా నీతిగా నుండవలెను. కాని కష్టము కలుగజేయు నిజము మన మొకరితో చెప్పిన అది వారికి విచారముగా నుండునని తోచేయెడల అట్టిది మనము చెప్పుట మానివేయవలెను. ఇతరులు మనవిషయమై యే ప్రకారము ఆలోచించినను ఇతరులకు అట్టిపనిచేయుట ఇష్టములేకపోయినను అది సరియైనపనియైన అది చేయుటకు మనకు ధైర్యము నుండవలెను.

తరువాత నిజమైన అర్థములో దానముచేయుట యందు మనము రుచికలిగియుండవలెను. మనము ఇతరులకు ఏమియిచ్చినను అది ధారాళముగా నివ్వవలెను. మన భాగ్యము గొప్పతనము చూపించుకొనుటకు నిచ్చు ఈవి యొక్క ప్రయోజనమేమియులేదు. మనముచేయు ధర్మ కార్యము భగవంతుని దరిద్రపిల్లలకు ఆతిథ్యము క్రింద చేయ వలెనుగాని తాము ఘనమైన కార్యము చేయుచున్నామని చేయకూడదు. దానము పుచ్చుకొనినవాడు మనోసౌఖ్యము పొందవలెనుకాని హీనతోద్దేశము నుంచుకొనగూడదు. తిరిగి ఏ రూపములోనైనను బహుమతిని ఆసించకూడదు. మనము దానముచేసిన మనుష్యునితో మన దానము విషయమై ఎన్నడును జ్ఞాపకముచేయకూడదు. ఇతరులు మెచ్చుకొనునిమిత్తము మనశక్తినిమించి దానము చేయ రాదు. మరియు చెడువృత్తులవల్ల సంపాదించిన సొమ్ము దానముచేయుటవల్ల ఉపయోగములేదు. మనయొద్ద పని చేయు నవుకర్లకు జీతములు ఇవ్వక దానముచేసిన ప్రయో జనములేదు. మనలో చాలమంది మనయొక్క ఖర్చులలో కొంతభాగము బలిదానముచేయుటకు ఇష్టపడినయెడల కొంతసొమ్ము దానముచేయవచ్చును. మనముచేయు అవసర మని చెప్పే ఖర్చులు మనస్ఫూర్తిగా పరిశీలించినయెడల అందులో కొన్ని నిజముగా విశేష భోగములుగా నుండును.

ఇంకను ముఖ్యమైన గుణములు అహింస మరియు దయ. మనము ఒకజీవుని చంపుటగాని చంపుటకు అనుజ్ఞ

యుచ్చుటగాని చేయకూడదు. ఎవరియందును మనకు బాధ కలుగజేసిన వారియందుకూడ మనము క్రూరత్వము చూపరాదు. మనము ఎట్టి మనోవికారము కనుపర్చినను అది ఎప్పుడో ఎచ్చటనో మనపై ప్రతిఫలించును. అన్నిటికంటె ముఖ్యమైన సూత్రమేమన మనకు ఇతరులు ఎట్టిపనులు చేయుటకు ఇష్టపడుదుమో మనము ఇతరులకు అట్టిపనులే చేయవలెను.

సరిపెట్టుకొనుట చాల ముఖ్యమైనది. సరిపెట్టుకొనుట నేర్చుకొనినయెడల మనంతటమనము అనేక మంచిగుణములు అలవర్చుకొనవచ్చును. మరియు ఆవిధముగా మానసిక శాంతి పొందవచ్చును. ఈ గుణము వృద్ధిపొందుటకు కొంత ఆత్మబలిదానము ఓర్పు ఆత్మశక్తి వగైరా అవసరము. మనకున్నది యితరులతో పంచుకొనుట మనము నేర్చుకొనవలెను. మరియు మనము కఠినమాటలు తిట్లు సహించవలెను. ఇతరుల అభిప్రాయములు మనకు నచ్చకపోయినను మనము వాటిని సహించవలెను. మరియు మన అభిప్రాయములు ఇతరులు ఆమోదించవలెనని మనము వారిని బలవంతము చేయరాదు.

ఇతరులు ఎట్టివారైనను మనము అందరియందు విశ్వప్రేమ కనుపర్చవలెను. మనఅందరిలో ఒకే దివ్యఆత్మ నివసించుచున్నదని మనము అనుభవమునకు తెచ్చుకొనవలెను. ప్రారంభమునందు మనము ఇతరులు విచారముతో కష్టముతో బాధపడుచుండుట చూచినప్పుడు మనము వారి

స్థానే యున్నాము అనుకొని వారికి సానుభూతి చూపవలెను. వారికి తగుసహాయము చేయవలెను. ఈప్రకారము క్రమశః ఇతరులు ఎవరు బాధలోనున్నను వారికి మనము సహాయము చేసికొనగలిగి విశ్వప్రేమ వృద్ధిచేసికొనవలెను.

మనము ఏదోయొకవిధమైన నిష్కామ సేవచేయుట అవసరము. మనముచేయు పనియందు మన హృదయము ఆత్మ చేర్చి చేయవలెను. కాని ఆ చేయుటలో మనము భగవంతుని ఆజ్ఞకు లోబడిచేయుచున్నట్లూహించవలెను. మనము ఆపనివల్ల ఏదో ఫలితము లేక లాభము పొందుదమని అనుకొనగూడదు. మనము భగవంతుని చేతులలో నుండు ఆయుధములవంటివారము. మనము చేసిన పనికి స్తోత్రము లేక లాభము రానియెడల మనము అందుకు నిరుత్సాహపడకూడదు. మనము మన కర్తవ్యము చేసినందుకు తృప్తిపొందవలెను, మరియు వచ్చినంతవరకు సంతోషించవలెను. మనయొక్క అవసరములు భగవంతునికి తెలియును.

ప్రపంచప్రాబల్యములో నివసించు మనలో కొందరు మిక్కిలి ముఖ్యమైనదియు మనకు తెలియనిదియునగు చెడుగుణమగు ఇతరుల నిందారోపణ మానుటకు ప్రయత్నించవలెను. ఆ చెడుగుణము మనకు తెలియకయే మనయందు అట్టిపెట్టుకొని యుండును. ఉద్దేశరహితముగను తెలియకుండగనే మనలో కొంతమంది యితరుల తప్పులను కనిపెట్టుచుందుము. కాని ఆ తప్పులే మనయం దున్నవని మనము గ్రహింపజాలము. మానసిక ఆందోళనలు చాల

వరకు చాడీలు చెప్పుట అపవాదులు పలుకుట లేనిపోని మాటలు చెప్పుటవల్ల గలుగుచుండును. ఈ చెడుగుణము పోగొట్టుకొనుటకు మంచి మార్గము ఏదనగా ఇతరుల మంచియే ఆలోచించి వారి మంచినే మాట్లాడునట్లు నిశ్చయ పరుచుకొనుట. మరియు ఒక్క సమావేశమునందు అట్టి చెడు సంభాషణ జరుగుచున్నప్పుడు తాను అచ్చటినుండి బయటకు వెళ్ళిపోవుట. తరువాత మనము ఎవరి విషయ మైనను మాట్లాడుటకు లేక వ్రాయుటకు పూర్వము కొన్ని నిమిషములు ఆ ప్రకారము వ్రాయుటకు కారణము యోచించి అది చెడుగా నున్నచో దానిని విడిచిపెట్ట వలెను. సాధారణముగా ఒకడు ఇంకొకనియందు అపవాదు మోపుటకు కారణము తాను చేసినపని సరియైనదని సమర్థించుకొనుటకు తాను వారికంటె గొప్పవాడనని చెప్పుకొనుటకు లేక ప్రతికక్షుగా పనిచేయుటకు లేక యింకొకరిని సంతోషపెట్టుటకు అయియున్నది. కాబట్టి యీ చెడుగుణములు విడిచిపెట్టినట్లగును.

కోపము స్వాధీనపర్చుకొనుటకూడ చాల ముఖ్య విషయము. ప్రారంభమందు ఆ స్థలమునుండి కోపము కలుగ జేయుచున్న వ్యక్తినుండి వెళ్ళిపోవుట ద్వారా కోపము యొక్క బాహ్యప్రకటన ఆపుచేయవలెను. తరువాత దీర్ఘముగా శ్వాసించుట నీరుత్రాగుట మొదలగు పనులు చేయవలెను. ఇవి మనముచేసిన క్రమశః ఆంతరిక బలము వృద్ధియై లోనప్రబలు క్రోధరూపములుకూడ అంతరించును.

స్త్రీ సాంగత్యమువల్ల మనకు శారీరకముగా మానసికముగా కొంతబాధ కలుగును గనుక బ్రహ్మచర్యము ఆధ్యాత్మిక జీవితములో అవసరములలో నొక ముఖ్య అవసరమైయున్నది. స్త్రీ సాంగత్యమునకు మనము తరచుగా లొంగినయెడల మనము సౌఖ్యముగాను బలముగాను ఆరోగ్యముగాను నుండజాలము. ఇది మన జీవితశక్తిని చాలవఱకు తగ్గించును. మరియు అది తిరిగి పొందుటకు చాలకాలము పట్టును. బ్రహ్మచర్యము కొన్ని నెలలు అభ్యసించినను మన శరీరము మనస్సులయొక్క బలము శక్తి వృద్ధిపొందించుకొనవచ్చును. మానసిక బ్రహ్మచర్యముకూడ సమానమైన ప్రాముఖ్యముగలది. మనము తిను పదార్థములలోను మన జీవితమార్గములందును మన సంభాషణయందును చదువులయందును మనలో కామోద్రేకము గలిగించునవి విడిచిపెట్టవలెను. పెండ్లి చేసికొనిన వారు పూర్తిగా బ్రహ్మచారులుగా నుండుటకు వీలు లేదు. అయినను వారు స్త్రీ సాంగత్యమునందు తెలివితో గూడిన కట్టుబాట్లు గలిగియుండవలెను. పెండ్లి అనునది భార్యాభర్తలు ఇద్దరు కలిసి ఆధ్యాత్మికముగా వృద్ధి పొందుటకు నిచ్చుటకు ఏర్పడినది. వారి యిద్దరిలో నొకరైనను భగవంతుని, గురువు అనుగ్రహమువలన బ్రహ్మచర్య వ్రతము జరుపుటయందు తీవ్రమయిన కోరికగలవా రుండిన రెండవవారిని కూడ తన మార్గమునకు మార్చుటకు కష్టముండదు. ఆ జీవితమునకు

నిజమైన ఆసక్తి యుండినయెడల పైనుండు దివ్యశక్తి మనకు ఆశ్చర్యకరమైన మార్గములద్వారా సహాయము చేయును. స్త్రీ పురుష సాంగత్య ప్రేరణ తెలివిగా స్వాధీనపర్చుకొనిన మనలో ఒక తీవ్రమైన ఆధ్యాత్మిక శక్తి వృద్ధి యగును. అది ఆధ్యాత్మిక జీవితము వృద్ధి పొందుటకు సహాయపడును.

ఆధ్యాత్మిక జీవితమందలి వృద్ధికి మంచి ఆరోగ్యము అవసరము. మనము శరీరము శుభ్రతవల్లను సరియైన శారీరక పరిశ్రమ మరియు తిండివల్ల ఆరోగ్యముగాను బలముగాను ఉంచుకొనవలెను. నేను గురుదేవునియొక్క బోధ అనుసరించుట ద్వారా పవిత్రమగుటకు నిర్మలమైన ప్రయత్నము చేయుచున్నాను. నా గురుదేవుడు **H. H.** శ్రీ స్వామి శివానందులు జ్ఞానము దయ మరియు ప్రేమయొక్క స్వరూపులు.

నేను సరియైన ప్రయత్నము చేసిన తరువాత తీవ్ర ధ్యానమునకు పోవుటకు శక్తి గలిగియుంటిని. ఉద్రేకము కలుగజేయు విషయములు అనుకొనని నిరుత్సాహములు మరియు సౌఖ్యములు ఇదివరకువలె ఇప్పుడు నన్ను కలత పెట్టుట లేదు. నాకు మనఃశాంతి రక్షణయొక్క నమ్మకము గలిగినవి. ప్రపంచముయొక్క ప్రాకృతిక సంపదయందు నాకు ప్రాముఖ్యత పోయినది. ముక్తసరిగా నేను లోగడ నెన్నడును పొందని ఆంతరిక ఆనందము కనుగొంటిని.

తరచుగా మనము వృద్ధి పొందితిమని తీర్మానించుకొనుటలో మనంతట మనము మోసపోవుచున్నాము. మన

గొప్ప తప్పులు సరిచేసికొనుట సులభము. కాని స్వల్పమై కనిపించని తప్పులు కనుగొనుటకు భగవత్సాక్షాత్కారము పొందిన ఒక గురువు పూర్తిగా అవసరము.

నా గురువుగారు నా స్వల్ప కష్టములలోకూడ నన్ను సరియైన మార్గములో నడపుటకు పడిన కష్టమునకు నేను వారికి కృతజ్ఞత తగిన విధముగా తెలియపర్చ లేకున్నాను. వారికి ఆరోగ్యము దీర్ఘ జీవితము మరియు సంతోషము ఇచ్చుటకును అజ్ఞానులయొక్క మార్గము ప్రకాశింప జేయుటకును మరియు భగవత్సాక్షాత్కారము కలుగజేయుటకు వారికి శక్తి కలుగుటకును నేను భగవంతునికి హృదయపూర్వకమైన ప్రార్థనలు సలిపెదను.



# 4. దివ్యమైన బ్యాంకు

భగవాన్ శివానందుడు నాయొక్క నీరస శక్తి లెక్కచేయడు. కాని నాకు వానియందు గల హృదయ పూర్వకమైన భక్తి తెలిసికొని దానిని స్వీకరించును. భగవానుడు నా పసితనమునుండి నేను చేయుచున్న ప్రార్థనలను నాణెములు ప్రోగు చేయుచున్నాడు. అతడు వాటి నుండి నా ప్రియమగు గురుదేవు రూపమున శాశ్వతముగా నుండు విలువగల ఖజానా తయారుచేసి వాని ధనము తన బ్యాంకి యగు ప్రపంచములో నిల్వ యుంచినాడు. ఆహా! అది ఆశ్చర్యమైన ధనము. అది నా సౌఖ్యమునకు కావలసిన ప్రతి వస్తువును సప్లయి చేయును. నేను ధ్యానమను చెక్కును భక్తియను సిరాతో వ్రాసి సంతకము చేసి దానిని దయగల ఊహ అలలను రెక్కలు గల వార్తాహరుని ద్వారా పంపుదును. అది ఆ ధనమును చేరిన నిమిషము నేను కోరినదంతయు తక్షణము నాలో డిపోజిట్టు చేయును. మరియు నాకు అవసరమైనప్పుడు అవసరమైన ధనము యొక్క మొత్తము గుణము నాకు సహాయము చేయుటకు పైకి వచ్చును. అది ఆశ్చర్యకరమైన బ్యాంకి కాదా?

శివానంద భగవంతుని పుస్తకములు. ఆహా అవి చాల ఆశ్చర్యకరమైనవి. ఓ నాశక్తిగల ఆకర్షణశక్తి గల ప్రభూ! నీయొక్క ప్రతి మాటయు ఉత్తేజము కలుగజేయును. అది తిన్నగా నా హృదయమునకు చేరును.



# 5. శివానంద - ప్రత్యక్ష భగవంతుడు

స్వామి శివానందునినుండి కొన్ని మామూలు మాటలు. వాటినుండి ఎంత సౌఖ్యము మరియు శాంతి నేను పొందుదును? గురుదేవ శివానంద భగవంతుని యొక్క ఉత్కృష్ట ప్రకటితరూపము. నేను ఇప్పుడు భగ వంతుని ఇకెక్కడను చూచుట లేదు. నేను వానిని నా జీవి తముయొక్క ప్రతి నిమిషము పూజించక తప్పదు. అతడు పవిత్రతకు స్వరూపము. మరియు ఎవరికిని వారియందు నిజ మైన భక్తి గలుగుటకును ఆ సమయముననే అపవిత్రత ఊహాలు గలుగుటకును అవకాశము లేదు. ఒకసారి వారితో ఆధ్యాత్మిక సంబంధము కలిగిన వాని దివ్యశక్తి అపవిత్రత ఊహాలన్నియు శుద్ధము చేయును.

నా గురుదేవు శివానందుడు 'మంచి చేయుము, ఎల్ల ప్పుడు మంచిగా నుండుము' అని ప్రోత్సాహపరచినట్లు ఇంకెవరు చేయలేదు. నాయందు చాల గొప్ప మార్పు గలిగినది. ఇప్పుడు కూడ అనేక విషయములు జరుగు చున్నవి. ఆ విషయములు నన్ను కలతపరచి నాకు అసౌఖ్య మును గలిగించుచున్నవి. కాని నేను వారి దివ్యశక్తిలో విశ్రమించుటవల్ల వారి దివ్య కంపనముల వల్ల నేను రక్షింపబడి సౌఖ్యము పొందుటవల్ల నేను వారి దివ్య ప్రకా శములో చుట్టబడి నేను శాంతిగా నుండగలిగితిని. నన్ను కలత పెట్టకుండ అనేక విషయములు జరుగుచున్నవి.

గురుదేవునియొక్క శరీరము మామూలు మనుష్య శరీరము కాదు. అది పవిత్రమైన దేవాలయము. దాని ద్వారా భగవంతుడు భక్తులగు మనకు ప్రకటితమగు చున్నాడు. అందువల్ల మనము గురుదేవుని ఇంకను ఎక్కువ విశ్రాంతి తీసికొమ్మని కోరుచున్నాము. మరియు అతడు మనలో ఎల్లప్పుడు నివసించుటకు ప్రార్థించుచున్నాము. గురుదేవునియొక్క వార్తాపత్రిక 'ఆరోగ్యము మరి దీర్ఘ జీవితము' ప్రజలకు వరమువంటిది. ముఖ్యముగా అర్థముగాని పెద్ద పెద్ద కఠిన వైద్య పదములకు వరమువంటిది. అతడు ప్రతిది చాల సామాన్యముగా ఉపయోగకరము చేసెను. డాక్టర్లు అందరు దానికి చందాదారులుగా నుండుటకు నేను ఆశించెదను. అది వారికి చాల సహాయకారిగా నుండును. ఈ నెల దాని సాంవత్సరిక చందా నేను పంపుచున్నాను. ఎన్ని విధములుగా మానవజాతికి గురుదేవుడు సహాయపడుచున్నాడు! అతడు భగవంతుడే!



# 6. శివానందుడు పరమ ప్రభువు

ఓం నమో భగవతే శివానందాయ

8–9–1956 మిక్కిలి ప్రభావమైన మంచిరోజు. ఆ సంతోషమైన అమరదినంబున పరమ పవిత్రుడును పూజ్యుడును దివ్య గురువు భగవంతునియొక్క అవతార పురుషుడు అగు స్వామి శివానందజీ యీ ప్రపంచమున ఉద్భవించి 69 సంవత్సరములు కలిగియుండెను.

నేను ఈ సమయమందు నేను ప్రేమించిన ఆ గురువునకు భగవంతుని రూపమగువానికి నా భక్తి కృతజ్ఞత కనుపర్చుచున్నాను.

ఈ ప్రపంచమునకు గురువును పూజ్యపురుషులలో రాజును ప్రేమ ఆనందము జ్ఞానముయొక్క స్వరూపమును అగువాని తలచునపుడు నేను భక్తితో మూగవగుదును. వాని అంతులేని వైభవము వర్ణించుటకు తెలియబడిన ప్రతి భాషయు చాలదు. కాని నేను నా హృదయములోని భావమును ప్రకటించుటకు ఆవేశము ఆపుకొనలేకయున్నాను. మరియు సంతోషముతో ఈ నా కానుకయయిన విషయమును వ్రాయుచున్నాను.

మనుష్యరూపములో నుండు ఈ భగవానుని ఊహ కలిగిన నిమిషమందే నా మనస్సులో వాని ఆకర్షణీయమగు రూపము కనిపించుచున్నది.

అతడు వయస్సు ముదిరినవాడైనను వాని రూపమంతయు దివ్యబలము అందముతో ప్రకాశించుచున్నది.

వాని మానసిక బలము స్పష్టమైన ఆలోచనాశక్తి ముసలి వాండ్రు బాలలతో సమముగా కలిసి అందు ఇచ్చు సంతోషము మరియు వాని ప్రేమ మరియు హాస్యము వానిని వాని వయస్సుకంటె చిన్నవానినిగా కనిపింపజేసి వానిని నరరూపములో నుండు ప్రేమాస్పదమగు దైవముగా పరిగణింపబడునట్లు చేయుచున్నది.

ఒక వ్యక్తి లోన నివసించు శక్తియొక్క వైభవము ఎల్లప్పుడు ప్రసరింపజేయు వాని దివ్యముఖము ఎన్నడును మఱచిపోజాలడు. ముఖ్యముగా వానియొక్క వర్ణించరాని ప్రేమ ప్రకాశించు సంతోషముతో కూడి వాని ఆశ్చర్యమైన మందహాసము ప్రకాశించునప్పుడు వాని దివ్యముఖము ఎవరును మరువజాలరు. అట్టి సమయములందు ఒక వ్యక్తి తాను భగవంతుని ప్రకాశము వాని మనస్సు ముఖముద్వారా చూచునట్లు నిజముగా అనుకొనును.

వాని కండ్లు మందహాసముచే శక్తిని బాగుగా కలిగియున్నవని తెలియుచున్నవి. మరియు అవి సత్యము పవిత్రత మరియు ప్రేమయొక్క మిరుమిట్లు కొలుపు వెలుతురులో ప్రకాశించువాని దయగల చూపు శరీరమునుండి ఆత్మను పైకిలాగి పరమాత్మతో కలుపునట్లు కనిపించును. ఒక వ్యక్తి వానిని కలిసికొనిన నిమిషములో అతడు మన స్వత్వము దైవికత్వముతో సంతోషముతో మిళితమైనట్లు తెలియబడుచున్నది.

ఆయన ధ్వని యెల్లప్పుడు భగవంతుని అందము శాంతశక్తితో కంపించుచుండును. వాని కరుణాపూరితమైన

వాక్కులు హృదయము యొక్క లోతయిన రహస్యకుహరమును చేరును. అది తిన్నగా లోననుండు శక్తితో మాట్లాడి శరీరమంతయు పవిత్రమై సౌఖ్యముతో ముంచివేయును. అతడు మాట్లాడిన ప్రతి పదము వినువాని మనస్సునందు గాఢముగా నాటుకొని వానికి ఆశ్చర్యమైన సంతోషము ఉత్తేజము గలుగజేయును. వాని మామూలు సామాన్య వాక్యములు ఆకర్షణీయముగా నుండును. మరియు ఆవేశ శక్తివల్ల ప్రకాశింపబడును. వానితో కొన్ని నిమిషములు మాట్లాడిన వ్యక్తి అతడు భగవంతుని సాన్నిధ్యమున నున్నట్లు పూర్ణమైన ఉద్దేశము కలిగియుండును.

స్వామి నా భగవాన్ బుద్ధునియొక్క దయ జీసను క్రైస్తుయొక్క ఆత్మబలిదానశక్తి శ్రీ శంకరాచార్యుల యొక్క గొప్ప సూక్ష్మబుద్ధి చైతన్యప్రభువుయొక్క ప్రకాశించు భక్తి వేదవ్యాసునియొక్క సారస్వతప్రతిభ మహాత్మా గాంధియొక్క పూర్ణమైన నిస్వార్థత మొదలగు గుణసమూహములతో కూడియుండును. ప్రాచ్య పాశ్చాత్య దేశీయుల యందుగల మంచి అంతయు వారియందు పూర్ణీభవించి యుండును. మరియు ఈ కారణమువల్ల ఆయన ప్రపంచ మంతటిలో చాల జనప్రియుడగు పావనపురుషుడుగా ఎంచబడుచుండును. ఆయన పేరుప్రతిష్ఠలు చాల దూరమునకు వ్యాపించెను. మరియు ప్రపంచమందలి అన్ని భాగముల నుండి పురుష్షులు స్త్రీలు వారిని చూచుటకు వారి ఆశీర్వాదముల పొందుటకు వచ్చుచుండు దృశ్యము చూచుటకు చాల ఉత్తేజకముగా నుండును.

ఇంతవరకు ఎవరును స్వామివారివలె ఆధ్యాత్మిక జీవితము ప్రపంచమందలి ప్రతి చోటను ప్రతి సాధారణ మనుజునకును అందుబాటులో నుండునట్లు తెలివి తేటలతో చేసినవారు కనిపించరు. అతడు అన్ని మతముల ఏకత్వము మనుజుల మనస్సులలో బాగా నాటునట్లు చేయుటలో బాగా ఉత్తీర్ణుడయ్యెను. మరియు ఆధ్యాత్మిక జీవితము ప్రేమ సేవతో కూడిన జీవితము గడపినయెడల ప్రజలలోనే గాక వివిధ దేశములలోనుండు జనులతో గూడ ఏకత్వము కలుగునని కనుపర్చెను.

ఈ ఆధ్యాత్మిక రాజు వేలకొలది మనుష్యులకు మార్గదర్శియు పట్టుగొమ్మయు, పద్ధతి నేర్పువాడును అయియున్నాడు. వాని దివ్యశక్తి ప్రపంచమంతటను జనులలో జొచ్చి వారిని నిలబెట్టుచున్నది. వాని భక్తులకు అతడు కేంద్రజీవిత ఆధారము. అతడు శాశ్వతానురాగముయొక్క రహస్య బుగ్గ కనుగొనెను. మరియు దానివల్ల ఇతరులతో ఎన్నడును త్రెంచుటకు వీలుకాని మోక్షబంధము ఏర్పాటు చేసికొనగలిగెను. వాని దివ్యప్రేమ ప్రకాశమందు వ్యక్తి వాని ప్రపంచ ఆదుర్దాలు అన్నియు మరచిపోవును. మనకు తెలియకుండ అతడు మనకు అందము సంతోషముతోనుండు ప్రపంచమునకు మార్గము చూపును. మరియు మనశక్తిని ఉద్ధరించును. అతడు ఈ ప్రపంచమునకు హృదయమైయున్నాడు. వానియొక్క నమ్మకము స్నేహము ఎవరి హృదయమునైనను ఆశ్చర్యమైన ఆనందముతో నింపగలిగి

యున్నది. వానియొక్క ప్రేరేపణములో బడినవారు నిజమైన శాశ్వతమైన సౌఖ్యమును పొందియున్నారు.

మనుష్యుల నీరసించిన హృదయాలలోనికి జీవితము తెలివి తెచ్చుటకు అతడు అనేకవిధములగు మార్గములు పద్ధతులు ఉపయోగించును. తగవులున్నచోట శాంతి భద్రతలు నెలకొల్పుట యెట్లో వానికి బాగుగ తెలియును. సాధారణ మనుజులయొక్క దైనిక సమస్యలు తెలిసికొను తెలివి వానిలో సానుభూతిని పొందుటకు శక్తియిచ్చును. వానియొక్క అంతులేని మార్దవము మరియు వాని సహాయము కోరువారు ఎట్టి అయోగ్యులైనను వారికి సహాయము చేయుటకు వాని ఆతురత వానిని ప్రపంచమందుండు పావన పురుషులందరిలో నెక్కువ పూజ్యత జనాదరణగల పావన పురుషునిగా జేసినది. మానవ హృదయమందు ఏదోయొక విషయమును తాకి మార్పుచేయగల శక్తి వానియందు మాత్రమే గలదు.

అతడు వాని జీవితమువల్ల వైరాగ్యము ప్రేమ మరియు నిస్వార్థసేవలోని శాశ్వతసుఖము మరియు నిజమైన జీవితము గలదని అభ్యాసరీత్యా కనుపరచినాడు. ఆశ్రమము యొక్క వివిధ కర్తవ్యములలో నిమగ్నుడైయున్నను వాని మనస్సు ఎల్లప్పుడు శాంతియందు సమత్వముగలిగియుండును. మరియు అతడు సంపాదనకుగాని డబ్బు కూడబెట్టుటకుగాని లెక్కచేయడు. అతడు ప్రతి పనియు పరమ ప్రభువుపై తన హృదయము ఉంచి చేయును. మరియు వానివల్ల కలుగు ఫలితముల విషయమై పూర్తిగా నిర్లక్ష్యముగానుండును.

అయినను చాల కొద్ది పనియైనను అది చాల ముఖ్యముగా ఎంచుకొని దానిని సంపూర్తిగా చేయుచుండును. అతడు తన జీవితము భగవంతుని సేవయందును బాధపడు మానవుల సేవయందును వినియోగపర్చును. మరియు దివ్యజీవన సమాజము ద్వారా ప్రపంచమంతటికి లెక్కలేని విధములుగా సేవచేయును. ప్రపంచచరిత్ర అంతటిలో వానిప్రకారము లెక్కలేని ఆధ్యాత్మిక కరపత్రములు పుస్తకములు వివిధభాగములలో తయారుచేయించి మనుజుల మనస్సు వృద్ధిపరచుటకును వారికి శాశ్వతానందము శాంతి కలుగజేయుటకును ఉచితముగా పంచిపెట్టించిన యింకొక వ్యక్తి కనిపించదు.

స్వామిజీయొక్క జ్ఞానము అగాధమైనది; శాస్త్రసమ్మతమైనది. అతడు ప్రపంచమంతటిలో పరమ గురువుగా ఎంచబడుచున్నాడు. ఆధ్యాత్మికబోధనలు ఈ ఆధునిక ప్రపంచమందు జయప్రదముగా నుండవలెననిన అది మనుజుల ప్రతిరకపు మనస్సులకు అనుకూలముగా నుండవలెనని అతడు బాగుగ గ్రహించెను. కావున అతడు ఆధునిక జీవితముయొక్క రహస్యములు పూర్తిగా తెలిసికొనెను. ఆ కారణమున ఆధునిక మనుజునియొక్క హృదయములో ప్రవేశించి వాని సమస్యలు చక్కచేయుటకు వీలగుచుండెను. ఊహాలయొక్క సంకుచిత పద్ధతులకు అతడు గ్రుడ్డిగా కట్టువడడు. దివ్యపద్ధతి ప్రకారము అతడు పనిచేయును. లెక్కకు మించిన పుస్తకములద్వారా వాని నిరుపమానమైన విలువ

గల జ్ఞానము ఎట్టి సారస్వత గుణదోషములు ఎంచువాని నైనను ఆశ్చర్యనిమగ్నునిగా జేయును. వాని ఉత్తమ రచనా సౌష్టవము శైలియొక్క స్పష్టత ప్రత్యేక గుణము గలది. వారి పుస్తకముల అధ్యయనము మానవుల హృదయములందు తుడిచివేయజాలని గాఢభావమును గలుగ జేయును. వాని వ్రాతలయొక్క పద్ధతి మనస్సుకు కష్టము లేకుండ ఆ పాఠములు గ్రహింపదగ్గ ఆత్మాహ్లాదముగా నుండును. వాని మాటలు గూఢముగాను స్నేహముగానుండి అజ్ఞానము పోద్రోలగల శక్తిగలిగియుండును. సామాన్యమైన భాషలో హృదయభాషలో దివ్యజీవనము ఎట్లు గడప వలెనో అతడు ఇతరులకు బోధించును.

ప్రతివ్యక్తియు వానియొక్క ఔదార్యమునకు ఆశ్చర్య చకితుడగును. ఇచ్చుటయను కర్మ వానికి మిక్కుటమైన తృప్తి ఆనందము ఇచ్చును. మరియు అతడు అపుడు స్పృహ తప్పిన వాడుగా కనపడును. తనకు ఏమియు మరుదినమునకు ఉంచుకొనక తనకు వచ్చినదంతయు అవసరముగలవారికి బాధపడుచున్నవారికి జాతి మతములందు వివక్షత చూడక ఇచ్చివేయుచుండును.

క్లుప్తముగా అతడు ప్రతిమతము జాతియందలి లెక్క లేని బాధపడు మనుష్యులయొక్క ఆశ మరియు బలము అయియున్నాడు. సూర్యునివలె అతని ప్రేమకిరణములు అందరకు పంపును. మనుజులు సందేహములతో గూడి

నప్పుడు ఆశాభంగములు వారిని అతిసాహసమునకు తెగింపు చేసినప్పుడు మరియు కోరికలు వారిని అశాంతులుగా చేసినప్పుడు వారు ఈ పరమపావన పురుషునియొద్దకు పరుగెత్తుకొని వత్తురు. వారు వారి విచారములన్నియు విడిచి నవ్వుచు వారివద్దనుండి తిరిగి వెళ్లుదురు. అతడు సౌఖ్యమునకు అంతులేని గని. మరియు వానిని శరణుజొచ్చినవారి కందరకు అతడు దయచూపించును.

వాని 70–వ జన్మదిన పవిత్ర సమయమందు తీవ్ర ఆధ్యాత్మిక ప్రదర్శకుడును గురువును సేవయొక్క గుర్తును దయయొక్క స్వరూపమును అగు నా ప్రియమైన గురుదేవునకు దీర్ఘజీవితము దయచేయుటకు భగవానుని ప్రార్థించుచున్నాను. ఆ పరమ ప్రభువుయొక్క దివ్య ఆధ్యాత్మిక ప్రకాశ కిరణములు మానవజాతిని ఎల్లప్పుడు ఉత్తేజపరచి మార్గదర్శిగా నుండుగాక!



# 7. గురుదేవునియొక్క జన్మదినము ఎట్లు ప్రసిద్ధవిధిగా జరిగించుట

"సద్గురుదేవ పరమదయానిధే
సచ్చిదానందస్వరూప నమోస్తుతే—"

చాల ముఖ్యమైనటువంటిన్ని వైభవముతో కూడి నటువంటిన్ని శాశ్వతమైనటువంటిన్ని ఈ సంవత్సరము యొక్క తేదీ దగ్గరకు వచ్చుచున్నది. సెప్టెంబరు 8 వ తేదీ చాల పవిత్రమైన దినము. ఆ దినము మన గురుమహారాజ్ ప్రకాశించు సూర్యుడు, ఈ ప్రపంచరక్షకుడు ప్రతిమానవ హృదయము వృద్ధిచేసి గౌరవపరచి ఉత్తేజపరచుటకు దివ్యమైన రూపముతో ఈ భూమియందు అవతరించెను.

ఇది 70 వ జన్మదినము. వాని జీవితమందలి చాల భాగము మానవలోకమునంతను భగవంతునియందు నమ్మకము ప్రేమ కలుగజేయుటకు చలించని పట్టుదలతో ఉపయోగించెను. ఈ దివ్య ఆధ్యాత్మిక ఏకత్వము తెలిసికొనుటకు అవసరమగు మానసిక చైతన్యము ఉద్ధారణచేయు కష్ట కార్యము అనేకవిధములుగా చేసెను. స్నేహితుడుగాను మార్గదర్శిగాను తత్త్వవేత్తగాను అతడు పనిచేయుచున్నాడు. మరియు శక్తిలేనివారికి శక్తినిచ్చుటకును అసహాయులకు సహాయము నిచ్చుటకును ఓడిపోయినవారికి ధైర్యమిచ్చుటకును నిరుత్సాహులకు ఆశనిచ్చుటకును శక్తివంచన లేకుండ

సహాయముచేయుచున్నాడు. ప్రపంచమంతటను నివసించు అన్ని మతముల శాఖలకు సంబంధించిన కోట్లకొలది మనుష్యులయొక్కయు స్త్రీలయొక్కయు జీవితము ఎల్లప్పుడు మార్చివేయుచున్నాడు. వారికి ప్రస్తుతముండిన విచార గ్రస్తమగు త్రోవనుండి భాగ్యముతోను సౌఖ్యముతోను కూడిన భవిష్యత్తుకు త్రోవచూపుచున్నాడు.

నిస్వార్థప్రేమ స్వరూపముతో జీవించుచున్న అట్టి దివ్యవ్యక్తియొక్క జన్మదినము ఎట్లు మనము ప్రసిద్ధవిధిగా జరిగించగలము ?

స్థూలరూపమైన కానుకలతో వాని గొప్ప కార్యమందు వానికి సహాయము చేయగలుగుదుము. మన హృదయపూర్వకమైన భక్తికనపర్చి వారిని పూజించగలము. ఈరోజు గొప్పవైభవముతో ప్రసిద్ధికెక్కునట్లు చేయగలుగుదుము. కాని యీ పై పనులలో నేదియైనను వారికి పూర్తిగా తృప్తికలుగజేయునా ? తరువాత మన మందరముకూడి వాని ఆరోగ్యమునకు దీర్ఘజీవితమునకు ప్రార్థనచేయగలము. కాని దీనివిషయమై గాఢముగా ఆలోచించగా ఇందులోగూడ స్వలాభముయొక్క కొంత అంశ కనిపించుచున్నది. వానికి దీర్ఘజీవితమును కోరుచున్నాము. ఎందువల్లననగా మనము వానిని ప్రేమించుచున్నాము. మరియు మన సౌఖ్యముకొరకు అతడు మనకు అవసరము.

కాన మనము పై చెప్పినవాటికంటె ఇంకొకటి చేయవలెను. గురుదేవుని విషయమై నాకు తెలిసినంతవరకు

వానికి మన ప్రేమకృతజ్ఞత తెలియపఱచుటకు మంచి మార్గము ఏమనగా మనము వారి బోధనప్రకారము కొన్నైనను సరిగా నడుచుకొనుచున్నామని తెలియపరుచుటయే. అప్పుడు మనము మన విలువగల కాలమును వృథా పుచ్చుటలేదని వానికి ఋజువగును.

అన్నిటికిని ప్రప్రథమమున మనలో ప్రతివారు సరిగా నమ్మకము నిజాయితీతో సాధనచేయవలెను. తరువాత వాని యందలి మంచిగుణములలో కొన్నైనను మనము అనుసరించవలెను. తఱచు ఒకరినిచూచి ఒకరు మనము చేయుచుండిన అది మన అలవాటుక్రింద స్థిరపడును.

మనము వారిని కలిసికొనినప్పుడు మనము కనిపెట్టు మొదటి మంచిగుణము ఏమన అతడు ప్రతివారియందును వారి సాంఘికస్థితి యెట్లున్నను వారి కులము మతము ఎట్లున్నను నిజమైన మర్యాద కనపర్చుచుండును. ఇందువలన ప్రతివ్యక్తియు వానియెదుట సంతోషముపొందు చుండును. వానియొక్క మర్యాదవల్ల అతడు ఇతరుల యొక్క భావములకు నిజమైన సానుభూతి ఆలోచన కనపర్చును. అన్నిటికంటె మనస్సుయొక్క అవసరములు సరిచూచుచుండవలెనని అతడు నమ్మును. మనదైనిక జీవితము నందుకూడ ఈ విలువగల అలవాటు మనము అభ్యసించవలెను. మన సమానులకు అధికారులకు నవుకర్లకు మరియు బీదవారికి సిరసస్థులమగు మనము మర్యాదగాను సరియైన పద్ధతిలోను నుండుటకు నేర్చుకొనవలెను. ఈ ప్రకారము చేసిన ప్రతివారియొక్క జీవితము సంతోషముగా నుండును.

తరువాత మనము వానిని కలుసుకొనిన వెంటనే మనము వానికి ఆకర్షించు విద్యుత్కాంతమునంటి గుణము వాని నిర్మలమైన సంతోషముతో కూడిన ముఖము–వాని యొక్క ఎల్లప్పుడు సంతోషముగా సౌఖ్యముగానుండు స్వభావమే. అతడు సూర్యునివంటి మిరుమిట్లు గొలుపు ప్రకాశమానమగు అందముతోను చంద్రునివంటి చల్లని ప్రకాశముతోను వెలుగుచున్నట్లు ఊహగలుగజేయును. తిరిగి ఈ ఆశ్చర్యమైన గుణమే వానిని కలుసుకొను ప్రతి వానికి సంతోషము సౌఖ్యముగలుగజేయును. వానియొక్క సంతోషముతో కూడిన పరమదివ్యకంపనములు వారిని కలుసుకొని వానియొక్క హృదయతీగెలకు అంటుకొనును. మరియు అవి ఒకవిధమైన ఆశ్చర్యసౌఖ్యమును అనుభవమునకు తెచ్చును. ఏది వీనికి అట్టి అపురూపమైన యీవి యిచ్చినది? అది అన్నికాలములయందు వానికిగల పవిత్రమైన ఊహలు మరియు కారణరహితమైన శరణాగతి మరియు భగవంతునితో శాశ్వతసంబంధము. మనముకూడ పవిత్రమైన ఊహలుమాత్రమే ఉంచుకొనుటకు నేర్చుకొనరాదా? మరియు భగవంతునకును భగవంతుని రూపమగు గురుదేవునకును పూర్తినమ్మకము ప్రేమతో మనముకూడ శరణాగతులై యీ యపూర్వ యీవినిపొందరాదా? సంతోషముగానుండిన మనము సుఖముగా నుండెదము. మరియు మనతో కలియుటకు వచ్చిన అందరిని సుఖపెట్టవచ్చును.

వానిని కలిసికొనిన వెంటనే వానియొక్క పూర్ణమైనది యగు ఆతిథ్యము అతడు మనకు బోధచేయు ఇంకొక సాధక పాఠము-వానిని హృదయముతో కలిసికొనక ఉత్తర ప్రత్యుత్తరములద్వారా కలిసికొనిన వారుకూడ వానియొక్క హద్దులేని దయయొక్క విషయము తెలిసికొని యుందురు. అతడు ఉచితముగా ప్రతివానికి నిచ్చెడు విలువ ఖరీదుగల అనేక పుస్తకములయొక్క మితి మామూలు మానవ ఊహకు మించిన విషయము. అతడు ఇతరులకు పుస్తకరూపముగా గాని ఆహారము ఆశ్రయరూపముగా గాని యేదైన ఇచ్చునప్పుడు వాని దివ్యముఖము సంతోషముతో ప్రకాశించును. వాని జీవితమంతయు ఈవియను కర్మక్రింద చేసికొనినట్లు అతడు కనిపించును. అతడు ఒక వ్యక్తికి వానియొక్క ఆదరత హృదయముయొక్క మంచితనముల యొక్క రుచి చూపించినగాని అతనిని విడిచిపెట్టుటకు ఒప్పుకొనుడు. అతడు కేవలము ఈవియొక్క సంతోషమునకే యిన్చునుగాని తిరుగ దానికి ప్రతిఫలము ఏమియు కోరడు. అతడు ఆశ్రమములో నుండిన అనేక విభాగములు పనిచేయుటకు అవసరమైన ఖర్చు నిమిత్తమై చాల సొమ్ము కావలసి యున్నను ఆవిధమున దయ చూపించుట వానియొక్క గొప్ప బలిదానము. అట్టి ఖర్చు వాని మనస్సునకు ఎన్నడును బాధ కలుగజేయదు. వాని యీవిలో తనయొక్క గొప్పతనము గాని సందేహముయొక్క లేశమాత్రముగాని కనిపించదు. అది అతడు ప్రేమతోను తృప్తితోను చేయును. ఈ గొప్ప మంచి గుణమును మనముగూడ అలవర్చుకొనుటకు ప్రయ

త్నము చేయుదము. మనము ఇతరులకు సహాయకారిగా నుండుటకు మన సౌఖ్యములను కొన్నిటిని బలిదానము చేసికొనెదము. బీదవారికి బాధపడువారికి సౌఖ్యము కలుగ జేయుటకు మనము ప్రతిదినము కొంత యిచ్చుటకు నేర్చుకొనెదము. మనము స్వామిజీ మనకు బోధించినట్లు మన అతిథులకు మనము సత్కారము చేయుటకూడ నేర్చుకొనెదము.

స్వామిజీని ఎరిగినవారుగాని వారి పుస్తకములు చదివినవారుగాని వారు లెక్కలేనిసార్లు నిస్వార్థపనియొక్క అంతులేని విలువ విషయమై నొక్కిచెప్పుట తెలిసికొనియున్నారు. నిజముగా అతని జీవితము ఈ పని నిమిత్తము సమర్పణ చేసియున్నాడు. వారి అస్థిరమైన ఆరోగ్యమందు ఈ వయస్సునందుకూడ వారు తమ శిష్యులకు సంగము లేకుండ పని చేయుటయొక్క ప్రాముఖ్యత తన సొంతి దృష్టాంతముతో బోధ చేయును. వాని దైనిక కర్మలలో వానిని కని పెట్టి చూచుట గీతను నూరుసార్లు చదువులకు తుల్యమగును. అతడు నిస్వార్థకర్మ హృదయమును పవిత్రము చేయు అన్ని రూపములలోను మరియు ఆధ్యాత్మిక జీవిత వృద్ధియందును చాల మంచిదని ఊహించును. అతడు భగవంతుని ఆరాధించు మంచిమార్గము లన్నిటిలో ఇది యొకటి. యని యూహించుచున్నాడు. స్తోత్రము లాభము ఎంత మాత్రము కోరకుండ జబ్బువారిని పోషణచేయుట అసహాయులను అవసరము గలవారిని వారి బాధలనుండి తొలగించుట బీదలకు భోజనమిడుట మొదలగునవి ఒక వ్యక్తి

సాధనయందు ముఖ్యభాగముగా నుండును. నిజముగా ప్రపంచ సంబంధమగు ప్రతి పనిని నిరంతరాభ్యాసము వలన నిస్వార్థముతో గూడిన సేవగా మార్చుకొనవచ్చును. అట్టి జీవితమును గడపుటకు ప్రయత్నించినవారుమాత్రమే అది మన దైనిక జీవితముయొక్క భావోద్రేకమును తగ్గించు టకు అది యెట్లు సహాయకారి అగునో తెలిసికొనగలరు. మరియు అది మన దైనిక కర్మముయొక్క అంత్య ఫలితము యొక్క ఆదుర్దా విడుచుటవల్ల ఆంతరిక శాంతి సుఖము పొందుటకు ఎట్లు సహాయపడునో కూడ తెలిసికొనగలరు.

అట్లు మన ప్రియమైన గురుమహారాజుయొక్క ప్రతి జన్మదినమందు మన శక్తికొలది వారి దివ్యగుణములలో కొన్ని ఆసక్తితో అనుసరించుటకు నిష్కాపట్యమైన ప్రయ త్నము చేయుదముగాక. మరియు ఆ ప్రకారము చేసి వారికి సౌఖ్యమును ముందు చాల సంవత్సరములు జీవించుటకు శక్తియు ఇచ్చుదముగాక.

నా ప్రియమైన గురుదేవునకు మంచి ఆరోగ్యము పరమ సౌఖ్యము దీర్ఘ ఆయుర్దాయము ఇచ్చుటకు నేను భగవానుని మనస్ఫూర్తిగా ప్రార్థన చేయుచు ఇది ముగించెదను.

—oo:o:oo—

# 8. శివానందుని కంఠధ్వని - దేవుని ధ్వని

శివానందులవారి కంఠధ్వని, ఆహా! అది ఎంత మంత్రముగ్ధమైన ఆశ్చర్యకరమైన ధ్వని! అది నిజముగా భగవంతుని కంఠధ్వనియే. ఆ ధ్వని తిన్నగా ఆత్మతో మాట్లాడును. ఆ ధ్వని ఉత్తేజము, సంతోషము శాంతి బలము పవిత్రత ప్రేమశక్తి గలిగించునది. ఎవడైనను అది ఒకసారి వింటే తిరిగి దానిని మరువడు. అది దాని పవిత్రమైన తియ్యదనముతో ఎప్పుడు చెవులలో మ్రోగుచుండును.

మనస్సు ఎల్లప్పుడు మంచి ధ్వనులచే ఆకర్షించబడును. త్రాచుపాముగూడ మంచి గానమునకు మంత్రముగ్ధమగును.

దివ్యశక్తితో పూర్ణింపబడిన కంఠధ్వని మనస్సును బాహ్యావిషయములనుండి మరల్చి ఏకాగ్రత ధ్యానమునందు నిలుపుటకు ఏర్పడు అనేకశక్తులుగల పద్ధతులలో చాల బలమైనది.

ధ్వని కంపనములకు అంతులేని బలము గలదు. ఆ శక్తి దీపము వెలుగుట వర్షము కురియుట ఆగుట మొదలగు పనులను చేయగలదని అనేక ఉదాహరణములు కనపర్చ

బడినవి. దానికి జబ్బులు కుదుర్చుటకు నరముల ఒత్తిడి తగ్గించుటకుగూడ శక్తిగలదు.

స్వామి శివానందజీయొక్క కంఠధ్వని విశ్వశాశ్వత హృదయముయొక్క కంఠధ్వని. మరియు అది ప్రతి వ్యక్తిగత హృదయము కంపించుటకు అవసరమగు ఆధ్యాత్మిక శక్తినిచ్చును. ఆ ధ్వనియందు దివ్యప్రేమ మృదుత్వముతో నుండు సూక్ష్మభావములు ఎక్కువగా నుండును. మరియు ఆత్మసాక్షాత్కారముయొక్క ఆవేశముతో ధ్వనించును. శ్రీకృష్ణుని వేణునాద మధురస్పందనములవలె అది భక్తుల యొక్క ఆత్మలో జొరబడును. వారి ధ్వనియొక్క ఉత్తేజమగు భాగ్యము అందము ఎట్టిస్థాయి కైనను మార్పగల సౌలభ్యము సరియైన పరిమాణము అంతులేని ఆధ్యాత్మిక శక్తితో కూడియుండుట దానిని ప్రపంచమంతటిలో పరిపూర్ణమైనటువంటి ఆశ్చర్యమైనటువంటి ధ్వనిగాచేయును. మరియు మంత్రదండముతో స్పృశింపబడినట్లు శరీరమంతయు శాంతి ఆనందములతో నింపును.

వానియొక్క దయ ప్రేమతో గూడిన పలుకులు మన శరీర అంతర్యమున జేరి అజ్ఞానమును చీకటిని తొలగించును. మరియు దానిని దివ్యఆసక్తియను వెలుతురుతో నింపును. స్వామిజీ నెమ్మదిగా మృదువుగా ఉపశమనముగా నిజముగా మాట్లాడును. మరియు మంచియేదియో అది మితమైన

మాటలతోనే మాట్లాడును. వాని కంఠధ్వని మనుష్యుల యొక్క మానసములను దివ్యప్రభావముయొక్క ఉచ్ఛస్థితికి తీసికొనిరాగల పద్ధతులలో ముఖ్యమైనది.

స్వామిజీ పెద్దసభలలో మాట్లాడునప్పుడు వాని కంఠ ధ్వని చాల శక్తివంతముగా నుండును. ఆ ధ్వని ఎట్టి స్పీకరు యంత్రము అవసరములేకుండ చాల దూరమువరకు విన బడును. జ్ఞానసంబంధమైన మాటలు విధేయతతో కూడిన దివ్యశక్తితో వానినుండి వచ్చును. వారి ఉత్తేజమైన మాటలు మనుజుల కప్పియుండు ప్రాపంచిక తెరను చించి వైచి ఆత్మోద్ధారణచేయును. కాని ఆకర్షణీయమైన వక్తృ త్వము కారణముగా జనులు మంత్రముగ్ధులగుదురు. ఆత్మ భేదన చేయువాని కంఠధ్వని ద్వారా తెలియబడు దివ్య సందేశము వినువారియందు శాశ్వత ఆకర్షణ గలిగించును. మరియు నిరీశ్వరవాదులనుకూడ దేవుని నమ్మువారిక్రింద మార్చివేయును.

స్వామిజీ పవిత్ర ఏకాక్షరమగు 'ఓం' ఉచ్చరించి నప్పుడు శ్రోతలకు చాల ఆనందము కలుగును. ఓం అనునది సర్వశక్తిమంతునియొక్క మొదటి ప్రకటితస్వరము కాన మనుజరూపములోనున్న భగవానుడు స్వామిజీ ఆవేశముతోడి భావముతో 'ఓం' ఉచ్చరించునపుడు ప్రతివ్యక్తియు అంత రిక సంతోషము అనుభవించుటయేగాక భగవంతుడు మన

దగ్గర నున్నట్టి స్ఫురణగలుగును. ఈ ధ్వనియొక్క శక్తిగల కంపనములు భగవత్సంబంధమైన శక్తితో పూరింపబడి స్థలమంతయు పవిత్రత తోషించును. మరియు వినువారి యొక్క హృదయములు పొంగిపొరలు భక్తితో నిండి యుండును. వాని కంఠధ్వనిలో స్వర్గమును భూమిని కలుపు నొక గొలుసు ఉన్నట్లు కనిపించును. మరియు వ్యక్తి యీ ప్రపంచమునకు దూరముగా భగవంతునికి దగ్గరగా అందును సంతోషముతో గూడిన పవిత్రమగు స్థలమున నున్నట్లు కనిపించును. ఈ ఆశ్చర్యకరమగు ధ్వని విచిత్రవిధముగా హృదయముయొక్క లోపలి గుహాలోనికి జొరబడి మనస్సును మార్చి స్వాధీనపరచుకొనును.

స్వామిజీ యొక్క సంగీతము లయ ఛందస్సు మాధుర్యములతో అసాధారణమైన మిళితము. అది అతడు భగవంతునితో కలియునప్పుడు పొందెడి ఆవేశ ప్రకటనము. వాని శ్రావ్యమైన కంఠధ్వని వినెడు సంతోషములో వ్యక్తి అస్థిరమైన ప్రపంచజీవితముయొక్క ఆదుర్దాలు, కష్టములు మరచిపోవును మరియు అధమపశువు ఆ నిమిషమందైనను తన ఆత్మ మనుష్య ఖైదిఖానాలోనుండి విడివడి శాశ్వత ప్రేమయొక్క సహవాసము అనుభవించునట్లు ఊహించును. వాని ఆ జ్ఞానము గలిగించు సంగీత అమృతము మత్తు కలిగించు ద్రావకమువలె పనిచేసి వ్యక్తిని దివ్యపిచ్చియందు ముంచివేయును.

దీర్ఘమైన మతఉపన్యాసములు వినుటకు ఓపిక లేని వారికి సహాయముగా వారిని ఉత్తేజపరచుటకు వాని సంగీత శక్తి ఉపయోగించును. వాని పాటలు ఆధ్యాత్మిక సాధన తత్త్వము వేదాంతము. మరియు అతడు వాని పాటలు అనేక భాషలలో పాడును.

ఆ ప్రకారము తన సర్వశక్తిత్వము సర్వజ్ఞత్వముకూడి వాని కంఠధ్వని శాశ్వతశాంతియొక్క దివ్యస్పందనము ద్వారా స్వామీజీ తనవద్దకు వచ్చు ప్రతివారికి ఆధ్యాత్మిక జ్ఞానము వెదజల్లుచుండును.

నా ప్రియమైన గురుదేవునకు మంచి ఆరోగ్యము దీర్ఘ ఆయుర్దాయము శక్తిమంతమైన కంఠధ్వనియు మనలను సంసారసముద్రమునుండి సురక్షితముగా దాటించుటకు వారికి ఇవ్వవలసినదిగా నేను భగవంతుని ప్రార్థించుచున్నాను.



# 9. ఆనందకుటీరముయొక్క నా భావములు

"కరుణాసాగర పరమానంద
గురుదేవ తవ పాదం శరణం."

ఆనందకుటీరమును గూర్చి నా భావములు తెలియ పర్చుటకు పూర్వము జరిగిన యొక సంఘటనము వ్రాయ వలసి యున్నది. నేను నా భర్తయు ఆనందకుటీరమునకు బయలుదేరకపూర్వము ఆ సంఘటన జరిగినది. దానినిబట్టి ఆనందకుటీరములో నివసించెడు నా గురుదేవుడగు H. H. శ్రీ స్వామి శివానందులవారి గొప్పదనముయొక్క అనిశ్చయ ఊహయొకటి కలిగెను.

నేనువారి శిష్యురాలను అయినసమయమునుండి కొన్ని ఆశ్చర్యమైన సంఘటనలవల్ల ప్రేరితనై నేను ఎప్పుడు గట్టి నమ్మకముతో వానిని ప్రార్థింతునో అప్పుడు వానియొక్క అమానుషశక్తులవల్ల నాకు ఆయన సహాయము చేయు చుండెను.

ఎనిమిదిమాసముల ఆలోచన ఆసక్తి అనంతరం 1955 ఏప్రియల్ నెలలో గురుదేవుని ఆశీర్వచనమువల్ల నేను ఆనంద కుటీరము వెళ్లి మనుష్యరూపము ధరించియున్న ఆ భగవం తుని చూచుటకు పూజించుటకు నాకు వీలుకలిగినది. నాకు అప్పుడు ఎట్టి సంతోషము కలిగినదో ఎట్టి ఆతురతతో మద్రాసు విడిచి వెళ్లుటకు ప్రయత్నించితినో నావలె తీవ్ర భక్తితో పూజచేయు శిష్యులకు మాత్రమే తెలియగలదు.

మేము ఏప్రియల్ 1 న బయలుదేరవలసి యుండెను. 30 వ తేది ఉదయము నా భర్త గొంతుకలో తీవ్రమైన బాధ కలిగినదని మొరపెట్టెను. ఆ సాయంకాలమునకు ఆ బాధ సహింపలేనట్టి స్థితికి వృద్ధియై మిక్కుటముగా జ్వరము తగిలినది. మేము మద్రాసులోనున్న E. N. T. స్పెషలిస్టుల సలహా తీసికొంటిమి. చికిత్సపొందినను మరురోజు ఉదయము వ్యక్తియొక్కస్థితి బాగుగ లేనియెడల ఋషీకేశ ప్రయాణము ఆపవలసివచ్చునని అతడు చెప్పెను. నా భర్తయొక్క జబ్బు వల్ల కలిగిన ఆదుర్దావల్లను గురుదేవుని చూచుటకు వీలు కలుగదేమోయను ఆదుర్దావల్లను ఆ రాత్రియంతయు నాకు నిద్రపట్టలేదు. మరియు ఆకాలమంతయు నా సమస్యలు సరి చేయుమని గురుదేవుని ప్రార్థించుచుంటిని.

మరుసటి ఉదయము నా భర్త గొంతుకలో నొక జబ్బువల్ల బాధపడుచుండెను. డాక్టరు గొంతు జబ్బులు చూచు డాక్టరువద్దకు వెళ్ళి మందు తీసికొని తనయొద్దకు రమ్మనమనెను. మరియు ఆ జబ్బు తగ్గినను జ్వరము తగ్గనిచో ప్రయాణము చేయుటకు వీలులేదనియు ఋషీకేశము ప్రయాణము మానుకొనుమనియు చెప్పెను.

గొంతుక డాక్టరువద్దకు వెళ్లితిమి. అచట ఒక అరగంట చాల ఆదుర్దాతో కూర్చుంటిని. కళ్లుమూసికొని గురుదేవుని ధ్యానించుచుంటిని. అపుడు డాక్టరు జబ్బు ప్రమాదమైనదికాదని చెప్పెను. ఆ సాయంత్రముననే నా భర్త బాధ తగ్గినది. జ్వరము తగ్గినది. మరునాజున మేము ఋషీకేశము బయలుదేరుటకు వీలయ్యెను. నా భర్తయొక్క

జబ్బు గురుదేవునియొక్క ఆధ్యాత్మిక శక్తివల్ల ఆశ్చర్యముగా నెమ్మది యయ్యెను.

ఆ ప్రకారము గురుదేవునియొక్క కటాక్షమువల్ల మేము ఆనందకుటీరము చేరితిమి. మేము అచ్చటికి చేరిన వెంటనే నాకు తోచిన అభిప్రాయమేమన ఆ స్థలము ప్రకృతి భూమిపై సృష్టించిన స్వర్గమనియే. ఈ స్థలము హిమవత్పర్వత చరియలయందలి అందమైనచోట నుండెను. ఆ చుట్టు కనిపించెడు కొండల దృశ్యములు ప్రకాశించెడు గంగానది నీరు ఎవరినైనను ఉత్తేజపరచును. ఆ యందమైన పురాతన సౌందర్యము చాల ఇంపుగా నుండెను. ఆధ్యాత్మిక స్పందనములతో నిండియున్న అచ్చటి పవిత్రమైన గాలి ఎవరి మనస్సుకైనను విశ్రాంతి కలుగజేయు శక్తిగలది.

శరీరము మనస్సుయొక్క ఆరోగ్యము వృద్ధిచేసికొనుటకును ఆదుర్దారహితమైన సెలవుదినములు గడుపుటకును అది సరియైన విశ్రాంతి స్థలము. అధ్యాత్మసంబంధము లేనివారికైనను అది సరియైన స్థలమే. ప్రతివ్యక్తియు దానియొక్క ఆధ్యాత్మిక వాతావరణము వలన ఉత్తేజితుడగును. ఒకవ్యక్తి ఆధ్యాత్మిక శాంతిసౌఖ్యము పొందుటకు అది నిర్దుష్టమైన స్థలము. శెలవుదినములు గడుపుట కచ్చటకు వెళ్లు వ్యక్తులు కూడ అచ్చట కొన్నిరోజులుండిన చాల లాభము పొందగలరు. అట్టివారు జీవితము సుఖముగా గడుపుకొనుటకు అనుకూలమగు మనోస్థితి వృద్ధిపొందించుకొనుటవల్ల జీవితముయొక్క నిజతత్త్వము తెలిసికొందురు.

మరియు మంచి విలువగల గుణములతో తిరిగి బస్తీకి చేరు దురు. ఇదిగాక ఆ ఆశ్రమము వివిధ కార్యకలాపముల తోడను ఆకర్షణతోడను కూడియుండును. మరియు అనేకు లకు అచ్చటనుండి సంతోషముగా కాలము గడుపుటకు అవకాశము గలుగజేయును. ఆశ్రమముతో సంబంధించిన ప్రతివ్యక్తియు దయ శాంతము తెలివితేటలతో నుండును. ఆ ఆశ్రమమునందు గలుగు ఆసక్తితోగూడిన ఆతిథ్యము తెలివితేటలు దీనత్వము సంస్కృతి ప్రతివ్యక్తికి ఆశ్చర్యము గలుగజేయును.

ఆశ్రమ కవాటమువద్ద స్వామి నిర్మలానందవారు మమ్ములను ఆహ్వానించిరి. మరియు మా అవసరములన్నియు తగు మనుష్యులద్వారా సరిపెట్టబడినవి. నేను అచ్చటనున్న స్వల్పకాలమందే ఆ క్రొత్తస్థలమునందు చాల ఆహ్లాదము నొందితిని. నాకు అది నా ఆధ్యాత్మిక గృహమయ్యెను. అచ్చటనుండువారందరు నా బంధువులైరి.

మాకు ఆహారము సమృద్ధిగా ఇవ్వబడెను. మాకు సరియైన కాలమందు రుచిగల భోజనము అమర్చబడెను.

అచ్చట నేనుండిన ప్రతినిమిషము దివ్యజీవనము నూతనత్వము ఉద్రేకములతో నన్ను చకితునిచేసెను. పవిత్రతచేయు ఆ గంగానది నీటిలో స్నానముచేయుటచే నా శరీరమును పులకరింపజేసెను. గంగామాయి వచ్చి కూర్చొని ప్రవహించిన నీటియొక్క ఓంకారధ్వనియొక్క లయలో ఊపిరితీసికొనుట ఆశీర్వాదము మిక్కుటమైన సంతోషమని చెప్పవచ్చును.

ఆ స్థలముయొక్క ముఖ్య ఆకర్షణ మనుష్యరూప ములోనున్న భగవానుడు శ్రీ శివానంద సరస్వతీస్వాముల వారు అక్కడనుండుటయే. ఆయన గుణములు వర్ణించుటకు మాటలు చాలవు. ఆయన దివ్యదృశ్యము తెలుపుటకు భాషలేదు. వారియెదుట అందరికంటె గొప్ప పురుషులు గూడ శూన్యస్థితిని పొందవలసినదే. అతడు మిక్కిలి ఆశ్చర్యమైన గొప్ప అంతులేని చెప్పనలవికాని వైభవ ముతో ప్రకాశించును. అతడు ఎల్లప్పుడు నిర్మలముగాను శాంతముగాను సంతోషముగాను నుండును. మరియు వాని దివ్యమైన అందమైన ముఖముచూచిన వ్యక్తికి వారిలో ప్రపంచములోనుండు సంతోషము ముఖమంతయు నుండు నట్లు అనుభవము కలుగును. వారు ఎక్కువగా మాట్లా డరు. కాని వారి మాటలకంటె పనులు ఎక్కువగా ప్రకటి తమగుచుండును. వాని మనోనుగ్రహము పద్ధతి మరియు శరీరము ప్రతివానిని ఆకర్షించుచుండును. మరియు వాని నిజమైన తెలివియొక్క శక్తివలన అనేకవిధముల మనో భావములలోనున్న వ్యక్తులయొక్క హృదయములు అతడు ఆకర్షించును. వాని ప్రేమ దయ నిస్వార్థత వర్ణింపనలవి కాదు. జ్ఞానసంభాషణ వానినుండి సంతోషముగా శక్తి తోను అందముతోను ప్రవహించుచుండును. వానియొక్క నిస్వార్థప్రేమద్వారా ప్రజల హృదయములు మార్చుటకు వానికి గలిగిన మాంత్రికశక్తి నమ్ముటకు కొన్నిరోజులు ఒకవ్యక్తి వానియొద్ద నివసించియుండవలెను. ఈ జీవిత మందలి వాని ఉద్దేశము స్థిరముగా లేనటువంటిన్ని భయ

ముతో కూడినటువంటిన్ని తృప్తిలేక అసౌఖ్యముగానుండు మనుజులకు బోధచేసి సహాయముచేసి ఉత్తేజము గలుగ జేయుటకును మరియు వారి స్వంత ఆత్మ లేక భగవంతుని కనుగొనుటవలనగలుగు నిజమైన సౌఖ్యము వెదకుటకు జ్ఞానము కోరినవారియందు ఉత్పన్నమగుటకును నైయున్నది. జీవితములో గలుగు అడ్డంకులన్నియు తాను గెలువగల ననియు పరమధ్యేయమును ఆత్మసాక్షాత్కారము పొంద గలననియు ఊహ ఒకవ్యక్తికి గలిగించెడు అపూర్వమైన మిక్కిలి విలువగల భగవత్కటాక్షము వానివద్ద ఉన్నది. ప్రతిమనుజుడు తన జీవితము బీదవారికి జబ్బుమనుష్యులకు సేవచేయుటకు ఉపయోగింపవలసినదిగా అతడు ఉద్బోధించెను.

ప్రపంచమంతటికి ఆధ్యాత్మికజ్ఞానము వెదజల్లు ముఖ్యోద్దేశముతో అతడు ఆశ్రమములో నివసించు చున్నాడు. అందుకు మూలాధారమైన ఏకత్వము తెలిసి కొనవలెనని అతడు కోరుచున్నాడు. మరియు ప్రపంచశాంతి మతముల ఐక్యత మరియు ఆధ్యాత్మిక పరిపూర్ణత వృద్ధి పొందుటకు వాని శక్తికొలది పనిచేయుచున్నాడు.

ఈ ఉద్దేశములతో అతడు దివ్యజీవనసమాజము మరియు యోగవేదాంత ఆరణ్యవిశ్వవిద్యాలయము స్థాపిం చెను. అతడు దివ్యజీవనసమాజము ఆత్మ లేక మూలా ధారము. మరియు ఈ ప్రపంచ ప్రఖ్యాతిగల సమాజము యొక్క పనులన్నియు నిజాన్వేషణముచేయు అన్నిరకము లగు మనుజులయొక్క ఆధ్యాత్మికవృద్ధి సహాయపరుచుటకై

ఉపయోగపడుచున్నవి. ఆశ్రమములోనుండు ఈ సంస్థ యొక్క వివిధభాగములు శిష్యులకు వారిరుచికి స్వభావమునకును తగినట్లు నిస్వార్థసేవచేయుటకు వీలైనంత అవకాశము ఇచ్చుచున్నవి.

స్వామిజీ ఆఫీసు ఉదయమువచ్చి నవ్వుముఖము మృదువైన నడతయు తెలివిగల హృదయమునుగల స్వామి పరమానందజీవారి సహాయముతో ఉత్తరప్రత్యుత్తరముల పని చూచుచుండెదరు. అతడు స్వామివారియొక్క కష్టమైన పని తగ్గించుటకు చాల కష్టపడుచు స్వామివారి భక్తులకు సహాయముచేయుటకు ఎల్లప్పుడు సిద్ధముగా నుండును.

విశ్వప్రఖ్యాతిగల ప్రేమస్వరూపుడగు గురుదేవుని దర్శించుటకు హిందూదేశమునుండియు విదేశములనుండియు అనేకవిధములుగా జీవితముగడుపు గొప్పగొప్ప మనుష్యుల యొక్క రాక చూచుటకు చాల ఉత్తేజకముగా నుండును. భాగ్యవంతులు ప్రాముఖ్యత అధికారముగల పురుషులు ఒక అదృశ్యమైన శక్తికి లోబడినట్లు వారికి సాష్టాంగప్రణామములు చేయుదురు. గొప్ప ఉద్యోగులు రాజకీయవేత్తలు తత్త్వజ్ఞానులు డాక్టర్లు ప్రొఫెసర్లు సంగీతపాఠకులు వారి యెదుట సంతోషము శాంతి అనుభవించుచు వారిని విడిచి వెళ్లుటకు ఇష్టపడక యుందురు. ఎవరియందైనను సందేహామేమైన నున్నయెడల (నిరీశ్వరవాదియైనను) దానిని నిర్మూలముచేయుట అతనికి తెలియును.

ఆఫీసులో కూర్చొని స్వామీజీ తనకొరకు వచ్చిన వారితో వ్యవహరించెడు పద్ధతి చూచుట చాల ఉత్తేజము గలిగించును. వారియొద్దకు వచ్చిన ప్రతివారి మనస్సునందుండెడి ఉద్దేశము వారు చెప్పకపోయినను తెలిసికొని వారికి తగు సలహా యిచ్చుచుందురు.

స్వామి గురుశరణానందజీ ఆఫీసులో వారి మాస్టరు గారికి దగ్గరగా కూర్చొని వారినుండి ప్రతిఫలించు శాంతి స్పందనములను అనుభవించుచు గురువుగారి పెదవులనుండి వచ్చు నీతిరత్నములను ఆస్వాదించుచుండును.

స్వామి సచ్చిదానందజీ జాగ్రత్తగా మౌనముతో ప్రక్కనఉండి జాగ్రత్తగా కాపలా కాయుచుండును. వాని యొక్క జీవితోద్దేశము యజమానికి పూర్ణమైన సౌఖ్యము గలుగజేసి చెడుసందర్భము లన్నింటినుండి వానిని రక్షించుటయే. స్వామి వేంకటేశానందజీ స్వామి మాధవానందజీ అప్పుడప్పుడు స్వామిజీ సలహా పుచ్చుకొనుటకు వచ్చుచుందురు. ఆప్రకారము వారి దర్శనముకూడ అగుచుండును.

దివ్యజీవనసమాజమునకు ముఖ్యసృష్టికర్త స్వామి వేంకటేశానందజీ. అతడు భక్తి బుద్ధియొక్క స్వరూపుడు. మరియు అతడు చేయుటకు పూను ఏపనియైనను వార్తా పత్రికలలో ప్రకటించుట నాటకములలో నటించుట మొదలగు పెట్టి పనియైనను చాల ప్రశస్తరీతిగా పనిచేయును.

వానియొక్క మృదువైననడత వాని తెలివి హాస్యము వానిని ప్రతిమనుజుడు ప్రేమించి మర్యాదయిచ్చునట్లు చేయును.

నెమ్మదియు కలుపుగోలుతనము లేకపోయినను దయతోగూడిన స్వామి మాధవానందజీ సంస్థకు కార్యదర్శియై వాని కర్తవ్యములు సౌమ్యముగాను గొప్ప తెలివి తేటలతోను జరుపుచుండును. వాని ప్రేమహృదయము వానిని అందరకు ప్రేమపాత్రునిగా చేయును.

ఆఫీసునుండి స్వామిజీ కుటీరమునకు వెళ్ళి తిరిగి సాయంత్రముమాత్రమే సత్సంగమునకు వచ్చును. ఇప్పుడు కూడ ప్రతిదినము సాయంత్రము వారిరాకకు సూచకముగ గంట వినుపించుచుండును. వారిరాకకు ప్రజలు నిశ్శబ్దముగా నిరీక్షించుచుందురు. గురువుగారు వచ్చినవెంటనే లేచెదరు. సత్సంగసమయమున అతడు పడకకుర్చీలో పరుండును. ఆసమయమందు వాని బాహ్యచక్షువులు మూసియుండినను అంతరచక్షువు అనంతత్వములోనికి చూచుచుండును. అతడు అప్పుడప్పుడు వాని భక్తులపై వాని కటాక్షము ప్రసరించుటకు అవి తెఱచుచుండును. సత్సంగసమయమందు దివ్యగానమును వింటు ఆ గొప్ప పావనపురుషునినుండి బయలు దేరు ఆధ్యాత్మిక ఆనంద కంపనములయొక్క ఆనందములో పూర్తిగా మునిగి స్థలము, కాలము, శరీరము మఱచియుండును. అట్టిసమయములయందు ప్రపంచ సౌఖ్యము

యొక్క ప్రమాదము చొరకదనము నేను గ్రహింపగలిగితిని. నేనప్పుడు తరచుగా ఈ శరీరమును విడిచి మత్తుగలుగ జేయు ప్రదేశముచేరి ఒక సౌఖ్యము గలుగజేయు సంతోష భావము నా నరములలో ప్రాకుచున్నట్లు నాకు అనుభవ మునకు వచ్చును.

అధిక కాంతులతోను, గాఢమైన మత ఉద్రేకము తోను, తన ఉద్దేశమును తెలుపు జ్యోతిర్మయానందుని బాహ్యబుద్ధితో కూడిన ప్రకాశపూర్ణమైన కండ్లు స్వామి తురీయానందచే ఇవ్వబడు ఉచ్చబుద్ధితో కూడిన ఉపన్యాస ములు పవిత్రమైన రామాయణము పఠించుటలో గలుగు స్వామి అంబికానందుని మృదుమధురమైన ధ్వనియు ఇంకను నా చెవులలో గింగురుమనుచున్నవి.

ఇంక ఎందుకు లేకపోయినను సత్సంగము ప్రారంభ మునందు, అంతమందు స్వామిజీవల్ల జరుపబడు ఆత్మో ద్ధారకమగు ప్రార్థనలు వినుటకును, మరియు అనంతశయనము జ్ఞాపకము వచ్చునట్లు స్వామివారు పడకకుర్చీలో పరుండు దివ్యపద్ధతి కన్నులకు ఆనందము కలిగించుటకును, సత్సంగ మునకు హాజరగుట అవసరము. తరచుగా ఆ పద్మనాభుడే గురుదేవుని మానురూపము పొందియున్నాడని నేను ఊహించితిని.

స్వామిజీ దివ్యజీవనసమాజపు పద్ధతుల ప్రకారము జీవితము గడుపుచున్నారు. "సేవింపుము, ప్రేమింపుము, ఇమ్ము, పవిత్రుడవుకమ్ము, ధ్యానింపుము, మరియు తరిం

పుము.'' వానియొక్క చర్యలు, సంభాషణలు, దివ్యజీవన సమాజముయొక్క మూలసూత్రములతో సంబంధము గలవిగానుండును. అతడు తనభుజములపైనుండు జవాబు దారి విషయములయందు ఆందోళన ఏమియు లేనట్లు జీవించును. తనద్వారా పనిచేయుచున్న దివ్యశక్తి విషయమై అతనికి పూర్ణమైన నమ్మకము గలదు.

స్వామిజీయొక్క అంతులేని ప్రేమ, మరియు సానుభూతి శివానంద ఉచిత వైద్యశాల రూపములో కర్మయోగ దేవాలయముగా ఉద్భవించినది. గొప్ప తెలివియు, నిస్వార్థత, ఓర్పు, తెలివితేటలుగల డాక్టరు శ్రీ K. C. రాయ్ గారి సహాయముతో స్వామిజీ చుట్టుప్రక్కలనుండు బీదలు, అసహాయులగు మనుజులకు అంతులేని నిస్వార్థసేవ చేయుచున్నారు. ఈ ఆసుపత్రియొక్క ఖ్యాతి దూరదేశములకు ప్రాకినది. మరియు తన భక్తులయొక్క సానుభూతితో స్వామివారు ఆసుపత్రిలో ''ఎక్స్‌రే'' పనిముట్లు, డయితెర్మి, అల్ట్రా వైలెట్ మరియు ఇన్‌ఫ్రా ఎఱ్ఱలాంపులు వగైరా పెట్టినారు. కండ్లజబ్బునందు ప్రత్యేక పరిశ్రమ చేయువారు, ఆడవారి జబ్బులయందు తర్ఫీదైనవారు ఈ ఆసుపత్రిలో పనిచేయుటకు, అవకాశమిచ్చుటకు కోరుచున్నారు. మరియు స్వామిజీ వీలైనప్పుడు వారు పనిచేయుటకు ఒప్పుకున్నారు.

యోగవేదాంత అడవి విశ్వవిద్యాలయము, ఉపన్యాసములు, సాధన పాఠములు మరియు వార్తాపత్రికల ద్వారా స్వామిజీ శిక్షణ ననుసరించి సాధకులను తర్ఫీదు చేయును.

స్వామి చిదానందజీ ఆ విశ్వవిద్యాలయమునకు వైసుచాన్సెలరు. అట్టి ప్రత్యేక వ్యక్తిని ఎవరును మరువజాలరు. వాని తెలివితోకూడిన దయార్ద్రహృదయముగల చూపు, వాని బైతుకస్థితి, వానికి స్వామిజీయందుగల అంతులేని భక్తి, విచారములో నున్నవారికి సహాయపడువాని ఆసక్తి ఇవి యన్నియు వానికి ఆకర్షణీయమగు శోభ కలుగజేయును. అతడు ప్రతి పనియు తీవ్రమైన ఉద్దేశముతో చేయును. మరియు ధ్యేయమును జేరుటకు ఎల్లప్పుడు కష్టపడుచుండును. స్వామి సదానంద రాజయోగపండితుడు, ఇంకొక మరపురాని వ్యక్తి. వానియొక్క విలువగల బోధాత్మకమైన ఉపన్యాసములు, వాని సౌమ్యమైన రూపము, అణకువ, తెలివి వారిని విశ్వవిద్యాలయమునకు నొక ఆస్తిగా చేసెను. వీరికితోడు బుద్ధికి, జ్ఞానమునకు, సిద్ధియగు స్వామి క్రిష్ణానందుని పేరు చేర్చిన విశ్వవిద్యాలయమున జరుగు దివ్యమైన పనియొక్క స్థితి తెలియగలదు. యోగ వేదాంత అడవి విశ్వవిద్యాలయ (మ్యూజియము) పశుప్రదర్శనశాల సామాన్యముగాను, ఎక్కువ బోధకముగాను ఉండును. మరియు అది చూడదగినదే.

ఛాయాపటములు తీయు విభాగము ఇంకొక ముఖ్యమైన ప్రకరణము. స్వామిజీని స్వయముగ కలిసికొనజాలని వ్యక్తులకు ఈ ఛాయాపట మూవీఫిల్ములద్వారా స్వామిజీయొక్క దివ్యకార్యములు తెలియబడుచున్నవి. స్వామి శారదానంద ఛాయాపటశక్తిద్వారా గురువును ఆరాధించుచున్నాడు. అతడు ఈ కళలో తన హృదయము, ఆత్మ

ఉపయోగించి నిస్వార్థకర్మ చేయుచున్నాడు. అతడు ఈ కళలో చాల ప్రసిద్ధికెక్కినను నిగర్వియై స్వామి వారి యొక్క అనేక భక్తులయొక్క ఫోటోగ్రాఫులు తీసి యున్నాడు. దీనియందు అతనికి గలిగిన పరిపూర్ణత శ్లాఘనీయము.

ప్రచురణశాఖవారు ఆధ్యాత్మికసాహిత్యము ముఖ్యమైన భాషలలో అచ్చువేయుచున్నారు. స్వామిజీయొక్క శైలి సామాన్యముగాను, ప్రోత్సహితముగాను, ఆకర్షణీయముగాను మిగుల బోధాత్మకముగాను ఉండును. వారి వ్రాతల వల్ల ఉత్తేజితులై మార్పుజెందినవారు లెక్కకు మీరి యుందురు. వారి వ్రాతలలోనుండు ఆధ్యాత్మికశక్తి చదువరి యొక్క హృదయాంతరమునకు తగిలి వాని బోధప్రకారము నడచుకొనుటకు బలవంతపఱచును. చాల పుస్తకములు భక్తులకు ఉచితముగా పంపబడును.

పవిత్రమైన విశ్వనాథదేవాలయము సామాన్యతలో ప్రత్యేకత గలది. భక్తిగల పూజారి అక్కడచేయు క్రమమైన పూజలు ఎవరినైనను భక్తిపరునిగా చేయును. ఆ దేవాలయముయొక్క శుభ్రత, పవిత్రత, ప్రతివ్యక్తిని ఉత్తేజితునిగా జేయును. అఖండనామము జరుగునప్పుడు భజనహాలులో కొన్నినిమిషములు కూర్చుండిన ప్రతి ఆత్మకు శాంతి, నమ్మకము కలుగజేయును.

ఆధ్యాత్మికజీవితము వృద్ధికి పూర్ణమైన ఆరోగ్యము అవసరమని స్వామివారు నొక్కిచెప్పును. ఆశ్రమములో

నుండువారికిని బయటనుండివచ్చి ఆసనములయందు ఆసక్తి చూపినవారికిని, యోగఆసన క్లాసుఒకటి ఏర్పాటుచేసిరి. దీనికి ముఖ్యఆచార్యులు స్వామి విష్ణుదేవానందజీ.

దివ్యచైతన్యము పొందుటకు సంకీర్తనయే సులభమైన మంచిమార్గమని వారు ఊహించి సంగీతశాఖ ఒకటి యేర్పాటుచేసి అది ఒక తెలివిగల స్వామికి అప్పగించిరి. అచ్చటికివచ్చు ప్రేక్షకులుకూడ ఇచ్చట వీలుగా సంగీతము నేర్చుకొనవచ్చును.

నిజముగా ఆశ్రమముయొక్క అన్నిపనులు మానవజాతియొక్క ఆధ్యాత్మిక ఉద్ధరణ అను సూత్రముపై ఆధారపడియున్నవి. అన్నపూర్ణాదేవి ఆనందకుటీరము అన్నక్షేత్రమునందు శాశ్వతనివాసము ఏర్పఱచుకొన్నట్లు కనుపించుచున్నది. అన్నక్షేత్రమునందు భుజించు జనమును చూచినప్పుడు ఎవరికైనను ఆశ్చర్యము కలుగును. స్వామిజీ ఇది దానములలో ముఖ్యమైనదని ఊహించును. మరియు మహాత్ములగు పురుషులకు, మరియు బీదవారికి ఈ ఆహారమిచ్చుచున్నందులకు సంతోషించుచుందురు.

ఆయుర్వేదశాఖవారు చాల మంచిమందులు తయారుచేయుదురు. నేను ఆమ్లానూనెయు, మరికొన్ని ఔషధములును వాడినాను. కాన ఆ మందులు బాగా పనిచేయు మందులని నేను నమ్మకముగా చెప్పగలను. ప్రపంచమందలి అన్ని భాగములవారికి ఈ మందులు వాడుటవల్ల ఉపయోగము

కలుగుచున్నది. మరియు ప్రతిదినము మందులు ఇతర చోట్లకు రవాణా చేయబడుచున్నవి.

అక్కడ ఏకాంతముగ నివసించునట్టియు వారి నిష్కామకర్మద్వారా వారి గొప్పదనము ప్రజలకు తెలియ బడినట్టియు స్వామిజీయొక్క గొప్ప శిష్యుల విషయమై వ్రాయనిదే ఆనందకుటీర విషయములు పూర్తిచేయ వీలులేదు.

వారిలో నొకడు ప్రసిద్ధికెక్కిన యువకుడు స్వామి ఓంకారానందజీ స్వతంత్రజ్ఞానముగల ప్రతిభాశాలి. అతడు వారి మంచి శక్తిగల ఆధ్యాత్మికవిద్యచే అనేకమందికి జ్ఞానో దయము కలిగించినారు. ఒకవ్యక్తికి వారి దర్శనముకాదు. వాని బాల్యమునుండి వారికి జ్ఞానోత్పత్తి కలిగించిన ఆ అనంతశక్తితో వారు ఏకాంతమందు తాదాత్మ్యము పొందుచుందురు.

ఇంకొక గొప్పస్వరూపుడు కర్మయోగిగ జన్మించిన స్వామి శాశ్వతానందజీ. వాని వినయము, సామాన్యత, స్వామియందుగల భక్తి నిస్వార్థ సేవాభావమువల్ల అతడు ఆనందకుటీరమందలి యొక విలువగల రత్నముగా నెన్నబడు చున్నాడు.

ఆనందకుటీరమందు జరుగు దివ్యజీవన కలాపములు మరియు అక్కడ నివసించుచుండు మహాపురుషులయొక్క పూర్తివిషయములు వ్రాయుటకు కొన్ని సంపుటములు కావలెను.

నా గురుదేవుడు ప్రపంచమందు నివసించు మహా పురుషులు మరియు ఉపాధ్యాయులలో చాల గొప్ప ఆశ్చర్యకరమైన వ్యక్తి. చాలదూరములోనుండు హిమవత్పర్వతము నుండి ప్రపంచమంతకును అతడు వెలుతురు, శాంతి, జ్ఞానము, ఆనందము, మరియు ప్రేమ వెదజల్లుచున్నాడు. వాని శరీరము భగవంతునియొక్క జీవించుచున్న దేవాలయము. మరియు అతడు తనలోనుండు దివ్యశక్తిని ఎల్లప్పుడు ప్రసరింపజేయుచున్నాడు. పరమాత్మయే ప్రపంచమును భయపెట్టించెడు శక్తులనుండి కాపాడుటకు వారిద్వారా ప్రకటనమగుచున్నాడు.

ఇది మన ప్రియమైన గురుమహారాజునకు ఆరోగ్యము, సౌఖ్యము, దీర్ఘాయువు ప్రసాదించుటకు భగవానుని ప్రార్థించుచు సమాప్తి చేయుచున్నాను.



# 10. కోపమును స్వాధీనపఱచుకొను విషయమై

ప్రారంభమందు నేను మంచి జీవితము గడుపుటకు కారకులగు నా గురుదేవులకు నా కృతజ్ఞతాపూర్వకమైన ప్రణామములు అర్పించుచున్నాను. నేను వారి శిష్యురాలినై వారి సలహాప్రకారము నమ్మకముగ నడుచుకొనిన పిమ్మట మానసిక సౌఖ్యము శాంతివిషయమై నేను పొందిన లాభములు లెక్కపెట్టజాలను. స్వాములవారు వారి సామాన్యమును, ఉత్తేజమును నైనవిధమున, నా దైనిక వ్యవహారములలో ఆధ్యాత్మిక సూత్రములు ఎట్లు ఉపయోగించవలయునో నేర్పిరి. వారు ప్రత్యక్ష విమర్శనద్వారా నాకు స్పష్టపర్చిన దేమన మన ఆదుర్దాలన్నియు మన భావోద్రేకములపై మనకు అధికారము లేకుండుటవల్ల గలుగుచున్నవనియు, మరియు దైనిక జీవితముయొక్క సమస్యలన్నియు ఆధ్యాత్మిక జీవితము జరుపుచుండిన అవి అన్నియు మనకు తృప్తికరముగా పరిష్కరింపబడుననియు.

నేను మనోశాస్త్రము విషయమై చాల పుస్తకములు చదివినాను. మరియు మనము పశు (హీన) భావములకు లోబడిన గలుగు చెడు ఫలితములు నాకు తెలియును. ఈ చెడు గుణములు పోవుటకు మార్గములు అనేకమంది వర్ణించియున్నారు. కాని నా గురుదేవునియొక్క దివ్యశక్తి వల్లనే నేను నాయందుండు అనవసరగుణములు పద్ధతులు

పోగొట్టుకొనుటకు ప్రయత్నించి అందు ఉత్తీర్ణురాల నైతిని. మనయొక్క వృద్ధికి నా గొప్ప యజమానివంటి భగవత్ సాక్షాత్కారము పొందిన గురువుయొక్క ఉచ్చ సహాయము దివ్యరక్షణ ముఖ్యముగ అవసరము. నాకు దైవసహాయము వచ్చుటకు నా గురుదేవుని రాత్రింబగళ్ళు తలంచు కొనుచుందును.

మనయందుండు చెడు సంస్కారములు మన స్వాధీనమునకు అతీతమని చాలమంది ఊహించెదరు. కాని అనుభవమువల్ల ఒక వ్యక్తి వాని లేక ఆమె సొంత కర్మవల్లనే బాధ్యుడగుచున్నాడు. పరిసరములు, పెంపకము, సాంఘిక స్థితి వగైరాలు మనుష్యుడుండు స్థితికి ముఖ్య కారణములు. కాని అది బాగుచేసికొనుట మన చేతిలోనే యున్నది. మన చెడు సంస్కారములన్నియు పోగొట్టుకొనుట మన సౌఖ్యము, ఆరోగ్యము, శక్తి వృద్ధిపొందించుకొనుట ప్రతి వ్యక్తియొక్క కర్తవ్యమై యున్నది. తాత్కాలిక చెడు భావములకు లోనుగాక వాటిని స్వాధీనపరచుకొన్న తదుపరి మనకు కలుగు సంతోషము స్వేచ్ఛయొక్క అనుభవము వానితో ప్రారంభమందు వాటిని ఎదుర్కొని పోరాడినందుకు గలుగు పూర్ణమగు బహుమతి అయియున్నది.

మనలో నుండెడి అపాయకరమగు చెడు సంస్కారములలో ముఖ్యమైనది కోపము. కోపము, శాంతము, జ్ఞానము, భక్తులకు చాల భయంకరమైన విరోధి. అని స్వామిజీ తెలిపియున్నారు. అది నరకమునకు తిన్నని

మార్గము. మన మనస్సులో నుండెడి ఈ ధ్వంసము చేయు విరోధిని మనము నిర్మూలము చేసి పవిత్రము కానియెడల దీర్ఘ ధ్యానములోనికి పోవుటకు వీలుండదు. మరియు మనకు కోపము కలిగిన ప్రతి అవసరమందు మనము మానసికము గాను, ప్రాకృతిక రూపముగాను, తగ్గిపోవుచుందుము.

మనలో చాలమందికి కోపము కలుగుట ఆంతరిక స్వభావముగా నుండును. అప్పుడప్పుడు స్వల్ప విషయము లయందు కూడ కోపము వచ్చును. కాని మనము మన మనస్సు ఎట్లు పనిచేయుచున్నదో ఆ విషయము తెలిసికొని మన భావములను మనము స్వాధీనపరచుకొనుట తెలిసి కొనినయెడల మన జీవితము మనము జీవింపతగినదిగా చేసి కొనగలము. మన కర్మలకు మనము జవాబుదారి వహింపక మన తప్పులకు ఇతరులను ఆక్షేపించుట ఈ ప్రపంచ జీవిత మందు సాధారణపద్ధతిగా పరిగణింపబడుచున్నది.

మనకు కోపము వచ్చుటకు గలుగు సందర్భము నిజా యితి కనిపెట్టిన మరియు మన మనోశోధనయందు మనము పూర్ణముగ నున్న చాల సందర్భములలో అట్టి పరిస్థితులు కలిగి ఇతరులలో ఉద్రేకము కలిగించుటకు మనమే జవాబు దారి యని తేలుచుండును. మన విషయమై మనము గ్రహిం చిన సంగతులకు మనకు ఆశ్చర్యము కలుగును. మన లోప ములు మనము నిజముగా తెలిసికొన్న మన దృక్పథము మారి ప్రపంచము మనకు సౌఖ్యముగ కనిపించును.

మన మనస్సుయొక్క, పనులయొక్క సరియైన జ్ఞానము మనకు కలిగిన ఎల్లప్పుడు విడువని నమ్మకమైన

ప్రయత్నముతో మనము కోపమును లోబరచుకొన వచ్చును. మరియు గుర్తుపట్టలేని విధమున మన జీవితమును మార్చుకొని వృద్ధి చేసికొనగలము.

మనస్సుయొక్క విచిత్రములు తెలిసికొనుటకు శక్తి లేనివారును, ఓపిక లేనివారును, ఇతరులును భగవత్ సాక్షాత్కారము పొందిన మా గురువునకు శరణాగతులై మరియు వారి బోధనప్రకారము సరిగా నడచుకొనినయెడల వృద్ధిపొందగలరు.

మన మనస్సు విశ్వమనస్సులో ఒక భాగము. మరియు ఒక మనస్సునకును, ఇంకొక మనస్సునకును సంబంధముండును. కాబట్టి మన ఊహలు ఇంకొకరికి తెలియ పఱచుటకును ఒకరినొకరు స్వాధీనపఱచుకొనుటకును వీలుండును. భగవత్ సాక్షాత్కారమైన గురువునకు విశ్వ మనస్సుతో సంబంధముండును. మనకు మన గురువునందు పూర్తి నమ్మకము భక్తి కలదు. మనము మన సంకుచిత మనస్సును, మన గురువుయొక్క విశాలమనస్సుతో ప్రత్యక్ష ఏకత్వముచేసికొనవచ్చును. ఈ పద్ధతిప్రకారము గురువు తనయొక్క, శిష్యులయొక్క మనస్సులు తెలిసికొనుటకును వారి మనస్సు, వారు స్వాధీనపరచుకొను శక్తి వారికిచ్చు టకును శక్తికలిగియుండును. అతడు తన శిష్యులయొక్క చిత్తములకు మంచిగుణములు అందజేయగలడు. గురువు నందు ఎక్కువ భక్తిగల శిష్యులు వారి ఊహాకంపనముల త్వరగా పొందగలుగుదురు. గురుదేవుని కటాక్షమువల్లను

వారు తెలిపిన మార్గముల ప్రకారము నడచుకొనుటవల్లను, నేను నా కోపము చాలవఱకు తగ్గించుకొనగలిగితిని. నేను ఏ ప్రకారము ఆ చెడు సంస్కారములు పోగొట్టగలిగితినో అవి ఈ దిగువను ఉదాహరించుచున్నాను.

1. నేను ఉదయముననే లేచిన వెంటనే ఈ రోజు నేను కోపమును పొందను అని దృఢముగా నిశ్చయించుకొందును. మనము ఆ ప్రకారము చేసికొను నిశ్చయము మన ప్రయత్నమునకు చాల ఉపయోగపడును. ఈ బుద్ధిగల మనస్సు దాని నిశ్చిత ఉద్దేశమును చిత్తమునకు పంపును. అది దాని స్వశక్తిమూలమున మన ఉద్దేశము మనము నెఱవేర్చుకొనుటకు అవసరమగు శక్తి కలుగుటలో సహాయము చేయును.

2. నేను ప్రతిదినము మూడుసార్లు తప్పక ధ్యానము చేయుదును. ఇది నన్ను నా గురుదేవునియొక్కయు, భగవానునియొక్కయు దివ్యశక్తితో కలుపును. అప్పుడు నాకు తెలియకుండగనే నేను కోపగించు సమయమున నన్ను అడ్డు పెట్టి చీవాట్లువేసి నన్ను శాంతపఱచును.

3. ప్రాణాయామము తప్పకుండ రోజుకు మూడు సార్లు జరిపిన నా మనస్సును నిర్మలపఱచుటకు సహాయపడును.

4. ఉదయము తప్పక వ్యాయామము చేయుటవలన సరిగా శాఖాహారము తినుటవలన నాకు ఆరోగ్యము బాగుపడును. మరియు నాకుండు కోపోద్రేకము తగ్గించును.

మనుష్యులు ఆరోగ్యముగా లేనప్పుడును విరేచనబద్ధకముగ నున్నప్పుడును కోపోద్రేకులగుదురు.

5. నాకెంతయు వీలైనంతవఱకు నా అంతరాత్మ విషయమై నేను తెలిసికొనిన సంగతులన్నియు తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనుచుందును. మరియు మనబుద్ధి ఇంద్రియములు వాని సంతోషము, శాంతి, తృప్తి మనలోనుండియే వచ్చు ననియు బయటనుండి కాదనియు జ్ఞాపకము ఉంచుకొనుటకు ప్రయత్నింతును. ఇది ఇతరుల మాటలు అభిప్రాయములవల్ల నేను చలించకుండనుండుటకు నాకు సహాయపడును.

6. మిక్కిలి అవసరమైనప్పుడు తప్ప సాధ్యమైనంత వరకు నా విషయమైగాని, ఇతరుల విషయమైగాని విను వారికి కోపోద్రేకము కలుగని స్థితిలో నుండునట్లు నేను మాట్లాడెదను. ఇష్టములేని మనుష్యుడు ఒకరిని స్తోత్రము చేయునపుడు వానికి కోపము కలుగుట నా అనుభవము నుండి నేను తెలిసికొంటిని. అతడు ఆ సమయమందు ఉద్రేకము చూపింపకపోయినను తరువాత ఎంత స్వల్పవిషయము కలిగినను అతడు కోపగించును.

7. నేను నా ఉద్దేశములు ఇతరులను ఒప్పుకొనుమని వారిని బలవంతపెట్టను. ఎప్పుడు వారికి చికాకుగా నున్నట్లు నాకు తోచునో అప్పుడు నేను వారితో చర్చ చేయుట మానివేసెదను.

8. ఎవరైనను నేను చేయు పనికి అయిష్టత కనుపఱచినప్పుడు నేను నా చేతకు తగిన కారణములు వారికి

బోధపఱచెదను. కాని వారు నా మాటలు గ్రహించెడిస్థితిలో లేక క్రోధోద్రేకముగ నున్నయెడల నేను వారితో చర్చించుట మానుకొనెదను. అట్టి స్థితిలో ఇంకను నేను నా ఉద్దేశము బలపఱచ ప్రయత్నించునెడల పరిస్థితి విషమించును. అతడు శాంతిని పొందిన పిమ్మట అతడు నేను చెప్పు విషయము చేయు పనులయొక్క సూటి తెలిసికొనగలడు.

9. నేను జరుపు సంభాషణయొక్క విషయము వానిని కలవరపెట్టుటకు కారణమగునప్పుడు నేను ఆ విషయము మార్చుటకు ప్రయత్నించెదను.

10. నేను నా వృత్తి పనులయందు గాని ఇతర ముఖ్యమైన పనియందు గాని నిమగ్నత నొందక పూర్వము కోప స్వభావముగల మనుజులతో సాధ్యమైనంతవఱకు కలియుట మానుకొందును. మరియు నాకు కోపము తెప్పించెడి పనియందు నేను కలుగజేసికొనను.

11. నేను కోపగించుటకు అవకాశము లేని సమయములందు కూడ ఒకప్పుడు కొన్ని సందర్భములు కలుగవచ్చును. కోప సమయములందు విషయములన్నియు తారుమారగును. ఆ సమయమందు మనము మాట్లాడకుండ నుండగలిగినయెడల ఆఅపాయమునుండి సులభముగ తప్పించుకొనగలము. కాన ఆ భావము నాకు కలిగిన వెంటనే నేను ఆ స్థలమునుండి అవతలకు వెళ్ళి కొన్ని దీర్ఘశ్వాసలు తీసికొని కండ్లు మూసికొని గురుదేవునిపై నా మనస్సు ధారణ చేయుదును. తరువాత మంత్రమును బిగ్గరగ పఠించెదను.

కొద్ది నిమిషములలో నాకు విశ్రాంతి గలుగును. తరువాత నేను నాకు కోపము కలుగజేసినవాని స్థితిలో నున్నట్లు ఆ పనిని ఊహించిన కొన్ని సందర్భములలో అట్టి ఉద్రేక స్థితి గలుగునని నాకు స్ఫురించును.

12. ఈ ముందు జాగ్రత్తలు కలిగియున్నను ఒకానొకప్పుడు కొన్ని నిమిషములు నాకు కోపము వచ్చుచుండును. అప్పుడు నేను నాకు స్వశిక్ష విధించుకొనుచు నా ప్రయత్నము ద్విగుణీకృతము చేసెదను. అది చాల కాలమువరకు నా జాగ్రత్తను విచలితము కాకుండ చేసి నన్ను రక్షించును.

కోపమువచ్చు సమయముల మధ్యకాలము క్రమశః హెచ్చుగుచుండుటకు నేను సంతోషించితిని. ఇట్లు చాల కాలము పరిశ్రమ చేసిన ఒక వ్యక్తి ఇందు ఉత్తీర్ణుడగును గనుక నాకు నిరాశ జనించలేదు. వరుసగా ఓటమి కలిగిన నా నిశ్చయము బలపడునని నాకు నమ్మకము. గురుదేవుని యొక్క ఆశీర్వాదము వల్లను నా నిజమైన ప్రయత్నము వల్లను నేను నియమితకాలములో ఉత్తీర్ణురాలను కాగలను.

గురుదేవునకు ఆరోగ్యము, సౌఖ్యము, దీర్ఘాయువు కలుగుటకును వారు నిరంతరము ప్రపంచమందలి అందరకును సౌఖ్యము గలుగజేయుటకు నిరంతరము ప్రయత్నించుటకును భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థించుచు ఇంతటితో సమాప్తి చేయుచున్నాను.

---

# 11. శివానందుడు నా జీవితము మార్చెను

ఆధ్యాత్మిక మార్గమందు ప్రతిసాధకునకు గురువు అవసరము. ఈ ఆధునిక ప్రపంచమందు మనమెంత చదువు కొన్నవారమైనను మనంతటమనము మన సందేహములు తీర్చుకొనజాలము. ప్రతిలోభములను జయింపజాలము. మరియు ఆధ్యాత్మిక మార్గమందుకలుగు కష్టములను నిర్వ హింపజాలము. మనకు ఒక ఉచ్చశక్తి అవసరము.

మనలో చాలమంది శిక్షణకు లోబడనందున శక్తి గలవారముకాము. మరియు మనలో చాలమంది మనలో ఉన్న లోట్లు బలహీనత గ్రహింపజాలము. చదువుకున్నటు వంటిన్ని, విద్యావిహీనులైనట్టిన్ని చాలమంది మనలో దివ్యఆత్మ ఉన్నదనికూడ తెలిసికొనజాలరు. గతజన్మల కర్మలు మనము స్వంతముగ అనుభవించుట చాలకష్టము. ప్రపంచకష్టములలో ప్రలోభములలో తాత్కాలిక జయ ములు, ఓటములలో మునిగియున్న మనము ఉచ్చజీవితము యొక్క నిజము తెలిసికొనజాలము. మన నిజజీవితము యొక్క రహస్యము, అర్థము మనకు తెలిపి మనకు బ్రహ్మ సాక్షాత్కారము పొందించగలవారు గురువుమాత్రమే. మనయొక్క రహస్యము మనకు బోధించగలవారు ఆధ్యా త్మిక గురువే.

## నిజమైన గురువెవరు ?

భగవత్ సాక్షాత్కారము అయిన గురువే సరియైన గురువు. అటువంటిగురువు. మనసా వాచా కర్మణా పవిత్ర

ముగానుండును. అతడు జితేంద్రియుడై యుండును. మతగ్రంథ ములజ్ఞానము కలిగియుండును. సామాన్యముగా దయ తోను, నిజాయితీగాను ఉండును. అట్టివానిని మనము సురక్షితముగ చేరవచ్చును. అట్టివాడు మనఅంతర్గతముగ దాగియుండు దివ్యశక్తిని మేలుకొలుపగలడు.

మనము గురువుకొరకు వెదకుచు వెళ్లనవసరము లేదు. మనకు భగవంతునియందు నమ్మకమైన భక్తియుండిన మనకు నిజమైన దీనత్వము మానవజాతియందు సరియైన ప్రేమ గలిగిన భగవంతుడు సరియైన కాలమందు ఆశ్చర్య మగు విధమున మనకు గురువును కనపఱచును. మనము వారిని స్థూలరూపమున చూడనవసరము లేదు. మనము వానిని ఆధ్యాత్మికముగా వాని పుస్తకములు చదువుట ద్వారాగాని వాని చిత్రము చూచుట ద్వారాగాని కలిసికొన గలుగుదుము.

పూర్వజన్మములో మనము మంచికర్మములు చేసి కొనిన యెడల ఇప్పుడుకూడ అట్టి కర్మలు చేయుచుండిన మరియు వారికొరకై మనకు తీవ్రమైన కోరికయుండిన మనము తప్పక నిజగురువును కలిసికొనగలము.

అట్టి సమావేశముయొక్క దివ్యఅనుభవము మనము ఎన్నడును మరువజాలము. అదిచాల ప్రసిద్ధ సమయము. మన అంతరచక్షువు తెరువబడు అనుభవము కలుగును. బ్రహ్మసాక్షాత్కారము పొందిన అట్టి గురువుయొక్క దివ్యశక్తి స్పందనములు ఆధ్యాత్మిక సంస్కారములుగల

మన అంతరాత్మను కలిసికొని మనకు దివ్యఆవేశము కలుగును. అటుతరువాత మనము కొన్నిసంవత్సరములనుండి వెదకుచున్నది చివరకు దొరికినదను ఆనందశాంతి గలుగును. ఇదిచాల హీనవర్ణన. అది వర్ణింపరాని అనుభవము.

## గురువు విషయమై నడుచుకొనవలసిన పద్ధతి

మనము గురువువలన పూర్తిలాభము పొందవలెననిన వారియందు పూర్ణమైన నమ్మకము నిజమైనభక్తి యుండవలెను. శిష్యుడు వాని గురువునందుగల నమ్మకమునుబట్టి ఫలితములు పొందుచుండును. ఆధ్యాత్మిక గురువే మనకు భగవంతునిచేరుటకు మార్గము చూపించును. కాబట్టివానిని భగవంతునివలె చూచుచు ప్రేమించవలెను. ఆధ్యాత్మిక రహస్యములు తెలియనటువంటి మాత్రగ్రంథములు ఎక్కువగా చదువనటునంటి మనలో కొందఱికి ఒక మానవుని భగవంతునిగా పూజించుట ప్రారంభమందు సులభముగా నుండదు. కాని సాధనలో కొంత వృద్ధిపొందిన తరువాత మన గురువు మానవరూపములోనుండు భగవంతుడేయని అనుభవము దానంతట అదియే కలుగును. మనము మన గురునియందు పూర్ణవిధేయతకలిగియుండవలెను. ఆధ్యాత్మిక సాధనలు మన హృదయమునందుగల మలినములను శుభ్రపఱచుటకు ఏర్పడినవి. ఒక్కొక్కప్పుడు గురువు ఏర్పఱచిన పద్ధతులు మనకు తక్షణము ఇష్టములేకపోవచ్చును. కాని అవి మన ఉపయోగనిమిత్త మేర్పడినవని గట్టినమ్మకముండవలయును. మన యొక్క తప్పులు, బలహీనత

గురువుగారికి చెప్పవలయును. పర్యవసానమునకు లెక్క చేయరాదు. ఇది మనలను సరియైన పద్ధతిలో వృద్ధిచేయుటకు వానికి శక్తికలిగించును.

గురువు కటాక్షము మన పై చూపుయొక్క మితి మన యొక్క ఆసక్తి, ప్రేమ, దీనత్వము, నమ్మకముపై ఆధారపడి యుండును. గురువువల్ల మనము అనుభవించు లాభములు పరస్పర శాంతి అంతులేనివిగా నుండును.

## సరియైనసద్గురువు

ఒక సరియైన సద్గురువువద్ద నేను శిష్యురాలుగా నుండు భాగ్యము నాకు గలిగినది. నాకు తెలిసినంతవరకు స్వామి శివానందజీ ప్రపంచమందు జీవించు గురువు లందరిలో గొప్ప గురువు. వారు ఎల్లప్పుడు నీరసులయెడ దయ గలిగి యుందురు. ప్రజలయొక్క స్వభావముల ప్రకారము వారికి సరియైన బోధ చేయుటకు మార్గములు వారికి తెలియును. వారు జ్ఞానసూర్యులుగా ప్రకాశించెదరు. మరియు వారికి శిష్యులైన వారందరు ఎట్లు శాంతియు, సౌఖ్యము ఎల్లప్పుడు కలుగునో నేర్చుకొందురు.

వారిలో కలిగిన ఆధ్యాత్మిక సంబంధము నా జీవిత పద్ధతియందు ఆకస్మికమైన మార్పు కలుగజేసెను. నాలో నొక ఆంతరిక పోరాటము బయలుదేరెను. మంత్రదండము

వలె అతడు నాలో ఉండు చీకటి మాపి నాకు ప్రకాశము కలుగజేసెను. నాలో నున్న యొక అజ్ఞానపటలము చింపి వేయబడి ఆధ్యాత్మిక ప్రకాశము అందు జొరబడునట్లు చేయబడెను.

నా గురువుగారివంటి బోధనలు ఇతర గొప్ప వ్యక్తుల పుస్తకములలో వ్రాసినవి చదివినాను. కాని అవి బహు స్వల్పకాలము మాత్రమే నాకు నచ్చినవి. నా దివ్య గురువును ఆకర్షణీయమైన వ్యక్తియు నగు వారి ప్రతి మాటయు నా అంతర్యములో జొరబడి వానికి విధేయతగా నుండవలయునను అడ్డంకిలేని కోరిక నాయందు వృద్ధిపొందెను. దీనితోపాటు పైన కనుపించు ప్రపంచ సౌఖ్యములయందు అతృప్తి ఉచ్చజీవితమందు తీవ్ర ఆసక్తి నాకు గలిగెను. క్రమశః ప్రపంచ సంబంధమైన ఆదుర్దాలన్నియు ఒకటి తరువాత నొకటి తగ్గిపోయి నాకు క్రొత్త దృక్పథము కలిగినది. ప్రపంచ సౌఖ్యములయందు నిజమైన సౌఖ్యము, శాంతి లేక తృప్తి లేదని నాకు అనుభవమునకు వచ్చినది. ఆధ్యాత్మిక జీవితము గడపవలెనను బలవత్తరమైన ప్రేరణ నాయందు వృద్ధి పొందినది. నేను ఇదివరకుకంటె ధైర్యము గాను, కరుణగలదానిగాను, ఇతరుల సహించు శక్తిగల దానిగాను తయారు అయితిని. దైనిక జీవితమందు ఎంత చిన్న తప్పు చేసినను అందులకు పశ్చాత్తాప పడుచుంటిని.

క్షుప్తముగా నా గురువుగారియొక్క కటాక్షముతో కూడిన దివ్యశక్తి నన్ను వేరు వ్యక్తిగా మార్చివేసినది.

## ఆధ్యాత్మిక అనుభవములు

నేను నా పూర్వ జన్మములందు జేసిన కర్మఫలితము వల్లను, నా బాల్యమునుండి నేను చేసిన క్రమమైన మనః పూర్వకమైన ప్రార్థనల ఫలితములవల్లను, నా గురుదేవుని కటాక్షమువల్లను నా సాధనయొక్క ప్రారంభమందే ఆధ్యాత్మిక అనుభవములు నాకు కలుగుచుండెను. మరియు ఈ సంఘటనలు నన్ను ఆధ్యాత్మిక జీవితము గడుపుటకు ప్రోత్సహించెను. ప్రారంభమందు నా గురువుగారు భగవత్ స్వరూపములో కనుపించుచుండిరి. కనుక వారి మానుష రూపము నా మనస్సునుండి అదృశ్యమయ్యెను. నాలో నుండు దివ్యరూపమే నాకు స్ఫురించెను.

ఇప్పుడు నాకు అవసరమైనప్పుడు సరిగా ఆ సమయమందు ఒక అదృశ్యమైన శక్తి నాకు సహాయము చేయుచున్నది. కనుపించని ఒక ఉచ్చశక్తి నా కనులలో నాకు మార్గదర్శిగా నున్నది. నేనును ఆదుర్దాల విషయమై గురువుగారికి ప్రార్థన చేయుట లేక వ్రాయుటవల్లనే నాకు ఆశ్చర్యకరమైన ఉపశమనము కలుగుచున్నది. వారియొద్దనుండి ఒక ఉత్తరము వచ్చిన నా విచారపు ఊహాలన్నియు అదృశ్యమగును. నిజముగా వారు నాకు మార్గము చూపించు వెలుతురుగా నున్నారు.

అంతయు తెలిసికొనువారి చక్షువులకు రహస్య మేమియు లేదు. కాబట్టి నన్ను సరిగా నడిపించుటకు మార్గము వారికి తెలియును. వారి ఆధ్యాత్మిక శక్తి అనేక విధములుగా నాకు సహాయము చేసినది. ఒక వ్యక్తికి గురువు యొక్క కటాక్షమున్న అసాధ్యపు పనులన్నియు సాధ్య మగును. నాకు గురువుగారు కనిపించనట్టియు, కనిపించు నట్టియు ఏకరూపమైరి. మరియు భగవంతుని కటాక్షము పొందుటకు వారు మిక్కిలి శక్తిగల మార్గమని నేను కనిపెట్టితిని.

ఆ నిరంకుశుడగు పరమాత్మ నా గురూజీకి దీర్ఘ మైన, ఆరోగ్యమైన, సుఖ జీవితము నిచ్చుగాక! వారు ప్రపంచ మంతటిలో నుండు జాతి, మతములయొక్క వివ క్షత లేనట్టి అనేక పురుషులకు, స్త్రీలకు ఆధ్యాత్మిక ఆవేశమునకు ఆధారము.

# 12. స్వామి శివానందులవారి మూర్తిమత్త్వము

"ఓం నమో భగవతే శివానందాయ"

నా ప్రియమైన గురుదేవుని మూర్తిమత్త్వము-విచారించదగిన యెంతమంచి విషయము! ఆ అమానుష ఆకర్షణీయమైన మూర్తిమత్త్వము నన్ను ఒక విచిత్రమైన ఆనంద ప్రదమైన స్థలమునకు నెత్తివేయుచున్నది. నేను మర్యాద, స్తోత్రము భక్తులతో అశక్తుడనగుచున్నాను. నాపూజ్యుడగు గురువుయొక్క విశ్వచైతన్యము దాని శాంతి గలుగజేయు ప్రకాశముతో చుట్టబడినట్లు కనబడుచున్నది.

భగవంతునితో తాదాత్మ్యము పొందదగిన మూర్తిమత్త్వమును నేను వర్ణించుటకు నాకు అశక్తత తోచుచున్నది. స్వామివారి యొక్క మూర్తిమత్త్వము భగవంతుని యొక్క రూపము మనుష్యరూపములో ప్రకటితమైన రూపము.

వారి ఎదుట మనము అనుభవించు గొప్పతనము వారి చుట్టునుండు నిర్మలత్వము, వారి దయతో కూడిన వాక్యములవల్ల మనకు గలుగు సౌఖ్యము వారు ఎల్లప్పుడు వెదజల్లు శాంతి, వారి నడతయొక్క ఆకర్షణీయమైన మంత్రశక్తి ఇవి అన్నియు వారియొక్క దేవత్వమును తెలియపఱచును. అతడు ఇతరులలో కలుగునట్లు చేయు భక్త్యుపాసన అతడు వాని సామీప్యతవల్ల మనకు కలుగజేయు మానసిక తృప్తి అతి వర్ణనాతీతమైన విచిత్రతతో కూడియుండును.

ఆ గొప్పపావన పురుషుడు వైభవము శక్తి మరియు అందములయొక్క గుర్తు. మరియు అతడు వాని భక్తుల చూపునకు, మనస్సునకు ఆత్మరూపము, సంతోషమునకు కారణమైయున్నాడు. వాని వైభవముతో కూడినరూపము, దివ్యఅందముతో కూడిన ముఖము, ప్రకాశము కరుణతో కూడిన కండ్లు, ఆకర్షణీయము, ప్రియమైన నవ్వు, కాళ్లు చేతులయొక్క అందమైన కదలిక, ఆత్మోత్తేజకరమైన కంఠధ్వని, వారియొక్క పవిత్ర ఊహాలు, నిరుపమానమైన నడత పూర్ణమైన వినయము, మరియు విశ్వప్రేమ వానిని ప్రపంచమంతటిలో గొప్ప ప్రఖ్యాతిగల మనుజునిగా చేయుచున్నవి.

విశ్వచైతన్యము వాని ఏకత్వము మన మానుష చైతన్యముపై సరిగా పనిచేయుటకు వానికి శక్తి కలుగ జేసినది. మరియు అతడు మన ఊహాలకు అతీతమైన విధ మున పనిచేయుచుండును. నేను చాల విచారములో నున్న ప్పుడు నాహృదయము కష్టములవల్ల బాధ చెందియున్న ప్పుడు నా మనస్సు సందేహములతో గూడునప్పుడు నా ఊహాలన్నియు వారికి తెలుపుటకు నాలో పొంగిపొరలు ఆసక్తితో వానియొద్దకు పరుగెత్తవలసివచ్చెను. కాని వాని యొక్క ప్రచండమైన మూర్తిమత్త్వముయొక్క ఉనికి నన్ను మూగనుచేసెను. మరియు ఏమియు పలుకకయే అతడు నాసందేహములన్నియు తీర్చి నాచైతన్యమందు శాంతి,తృప్తి తెలివి గలుగజేసెను. మరియు నేను క్రొత్త ఆనందము ఆశలతో నింపబడి వానినుండి తిరిగివచ్చితిని.

ఈ బలిష్ఠమైన మూర్తిమత్త్వముయొక్క గొప్ప రహస్యము అతడు ప్రతి మనుష్యుడు వానిలో నొక భాగమని ఊహింప జేయునట్టి శక్తి గలిగియుండుటయే. శ్రీ బి.ఎన్. కౌల్ ఐ.సి.ఎస్. హిందూదేశపు ముఖ్యమంత్రి యొక్క సెక్రెటరీ ఒక నెలరోజులు ఆశ్రమములోనుండి స్వామిజీ యొక్క మూర్తిమత్త్వముయొక్క పద్ధతిగా ఈ విధముగా గౌరవముతో తెలియపర్చెను. "స్వామిజీ! మన మత గ్రంథములలో గోపికలు అందఱు భగవాన్ కృష్ణునితో వారిని ఆశీర్వదించమని కోరినట్లు చదివియున్నాము. మరియు శ్రీ కృష్ణుడు వారి కోరికలు ఫలించునట్లు వాగ్దానము చేసియున్నాడు. సమయము వచ్చినప్పుడు ఆప్రభువు ఒక అమానుష కృత్యము చేసెను. అతడు అనేక రూపములు పొంది ప్రతి గోపికయు అతడు తన మనుష్యుడని ఊహించునట్లు చేసెను. ఇచ్చట స్వామిజీ! నీవు చేయునట్టి పనికూడ అట్టిదే. అనేకమంది అనేకసమస్యలు కోరికలతో నీకడకు వచ్చెదరు. నీవు వారందరను తృప్తిపరచెదవు. ప్రతి మనుష్యుడు తృప్తిపడును. మరియు ప్రతివ్యక్తియు నీవు ప్రత్యేకము అతని వాడవని ఊహించును. మరియు అది చాల ఆశ్చర్యకరమైన సంఘటన. ఇదియే నీదర్శనమునకు సత్సంగమునకు వచ్చుటకు ఆకర్షణ కలుగజేయుచున్నది."

స్వామిజీ విశ్వప్రేమ దయలయొక్క గౌరవమైన స్వరూపము. వానికి ప్రతివ్యక్తియు దేవునియొక్క ప్రకటిత రూపము. స్వలాభ లేశమైనను లేనట్టి వాని దివ్యప్రేమ యొక్క స్వాభావిక నిరంతర ప్రవాహము వానిని ప్రపంచ

మంతయు ప్రేమించు వానినిగా చేయుచున్నది. వానియొక్క ఉప్పొంగెడు ప్రేమ మరియు కరుణ వానిని స్తోత్రము చేయు వారియందును ద్వేషించువారి యందును కూడ కలుగు చున్నది. ఈ పూజ్యుడగు పావనపురుషునియందు ప్రతి నిమిషము ప్రపంచమందలి కోట్లకొలది హృదయములు ప్రేమ కృతజ్ఞతలతో నిండియుండును. ఎవరైన వాని యొక్క దయ ప్రేమ మాధుర్యము రుచిచూడనిచో అట్టి వాడు తన జీవితములో చాల విలువగలది కొంత నిజముగా పోగొట్టుకొనినట్లు ఎంచుకొనవలెను.

ఈగొప్ప ఆత్మయందు ప్రతీకారము మరియు ద్వేషముయొక్క కించిన్మాత్రము సూచనయైనను లేదు. వాని జీవితముయొక్క అడ్డంకి లేని హృదయస్థమగు మంచి కోరిక ఇతరులను సౌఖ్యపరచుటయే. వానియొక్క అంతు లేని దయ క్షమాపణయొక్క పరిమితి చాల ఆశ్చర్యచకిత మైనది. అతడు తన మంచిభక్తులయందు తనకు గల నమ్మ కము ఎట్టిదో అట్టి నమ్మకముతోనే విరోధుల సౌఖ్యము నకు కూడ ప్రార్థన చేయుచుండును.

వానివద్దకు వచ్చెడు ప్రతిమనుష్యునకు ఆహారము బస యెన్నడు నిరాకరింపబడదు. ప్రపంచమందు ఎచ్చటను పిచ్చివాండ్రను చెడుస్వభావముగల మనుష్యులను నిజమైన ప్రేమతోను మర్యాదతోడను ఆహ్వానించు ఆశ్రమము కని పించదు. అట్టి అయోగ్యులకు ఆతిథ్యమిచ్చుటయే కాక వారికి ఆత్మగౌరవము తృప్తి కలుగుటకు ఆశ్రమములో వారికి ఏదియో యొక పని ఏర్పాటుచేయును. మరియు వారు

కష్టముచేసి వారి ఆహారము సంపాదించుకొనునట్లు వారు అభిప్రాయపడునట్లు చేయును.

స్వామిజీ యొక్క సహనశక్తియొక్కయు క్షమాపణ శక్తియొక్కయు పరిమితి తెలిసికొనుట చాల కష్టము. ఇందుకు ఉదాహరణము: కొద్దిదినముల క్రిందట స్వామివారు దయతో చూచిన ఒకవ్యక్తి ఆశ్రమము తాలూకు ధర్మ పెట్టెనుండి కొంత సొమ్ము దొంగిలించి పరారీ అయ్యెను. మరు రోజు ఈవిషయము స్వామివారికి తెలియపర్చబడెను. స్వామిజీ నవ్వుచు నిట్లనెను. "ధర్మపెట్టెలో కొంత సొమ్ము విడిచి వెళ్ళినందుకు వానిని పొగడవలెను." మరియు స్వామి యిట్లనెను. "అతడు తాళములు దొంగతనముగా తీయు టలో నేర్పరి. కనుక వానికి అందుకు బిరుదుకూడ ఇవ్వ వలెను." ఇంకొక సమయమందు ఒక ఆశ్రమవాసి చాల సొమ్ముతో పరారి అయ్యెను. ఈవిషయమందుకూడ స్వామి వారు క్షమాపణ శాంతి కనుపర్చిరి. స్వామివారు అంతయు భగవానునికి అర్పించి ఆ పరమసత్యముయొక్క ఆంతరిక స్పృహాయందు ఎల్లప్పుడు నివసించుచుందురు. వారి అంద మైన ఉత్తేజమైన పాటలయందు వారియొక్క అమరస్థితి యొక్క నిజానుభవము ఇట్లు తెలియపర్చెను.

ఏదియును శాశ్వతముగా నిలిచియుండునది కాదు.

ఏదియును నాది కాదు.

నేను మనస్సును కాను; శరీరమును కాను.

నేను శాశ్వతమైన ఆత్మను.

నిష్కామ సేవయే వారి జీవితము యొక్క శ్వాస. రోజంతయు విశ్రాంతికి ఏర్పడిన కాలమునందు కూడ వారి మనస్సు మానవజాతికి సేవచేయుటకు క్రొత్త మంచి మార్గములు తెలిసికొనుటకు ఉపయోగపడుచుండును. ఆధ్యాత్మికముగా మానసికముగా స్థూలరూపముగా మనుష్యుల యొక్క బాధ తగ్గించుటకు మార్గములు విచారించుచుండును. వానియొక్క ఉత్తేజకరము ప్రజామోదముగల పుస్తకము 'శివగీత'యందు వానికి ఆంతరికముగాను అణచుటకు వీలు లేనిదిగాను నుండు ఉద్దేశము ఈవిధముగా తెలియపరచెను. "నేను నాయందుండెడి సేవాసక్తి అడంచలేను. సేవలేకుండ నేను బ్రదుకలేను. సేవలో నాకు అమితమైన సంతోషము గలుగును. సేవ నన్ను వృద్ధికి తెచ్చెను. సేవ నన్ను పవిత్రుని చేసెను."

ఏపనియైనను బాగుగాను సరిగాను నియమముగాను చేయుటలో గొప్ప గొప్ప అధికారులను రాజనీతిజ్ఞులను మించియుండును. ఈ ప్రపంచ ప్రఖ్యాతిగల గొప్ప దివ్య గురువును చూచుటలో నొకానొకప్పుడు నేను మంత్రముగ్ధుడనగుచుందును. వివిధమైన అనేక కర్తవ్యములు చేయుచు ఆశ్రమవాసులకు బయటనుండి వచ్చెడు అతిథులకు పండ్లు వగైరాలు పంచిపెట్టుటకూడ ఒక ముఖ్యమైన కర్తవ్యము గావించుకొనును. అతడు బల్లవద్ద కూర్చొని పనియందు నిమగ్నమైనప్పుడు కూడ అట్టి తీవ్రమైన శ్రద్ధతోనే యుండును. అతడు తలపెట్టినది పూర్తికానిదే ఎన్నడును విడిచిపెట్టడు. ఆ ప్రకారమే తన షుశ్యులనుకూడ చేయునట్లు

చూచుచుండును. వానియొక్క సూత్రము (D. I. N.) ఇపుడు అది చేయుము. అతడు దానిమీదనే జీవించును.

ఇతరులవద్ద పని తీసికొనుటలోకూడ స్వామిజీకి ప్రత్యేకత గలదు. ఆ అద్భుతమైన వ్యక్తి యితరులనుండి పని తీసికొనుటలో వాని ప్రేమ దయ హాస్యము ఉపయోగించి వానిద్వారా పని చేయుటకు వారికి ఆసక్తి పుట్టునట్లు చేయును. పనిలో నీరసస్థులనుగూడ అతడు శ్రద్ధతో చూచుచుండును. ఏ వ్యక్తియైనను సరియైన శిక్షణ దయ ప్రోత్సాహము ఇవ్వబడిన అట్టివాడు సంఘమునకు ఉపయోగపడు సభ్యుడు కాగలడని అతని నిశ్చయమైన నమ్మకము.

ఈ చాల శక్తివంతమగు వ్యక్తియొక్క దీనత్వమునందు విచిత్రము గలదు. వానియొక్క ప్రచండమైన మనుజశక్తియొక్క రహస్యము వాని దీనత్వములో నున్నదని నేను తరచు ఊహించెదను. వారియొక్క దీనత్వముయొక్క సరియైన అర్థము తెలిసికొనవలెననిన వారియొక్క జీవితము పరీక్షించి తెలిసికొనవలయును. వారియొక్క ప్రాకృతిక రూపము వారి నమ్రత యితరులతో మాట్లాడునప్పుడుండు మర్యాద ఇవి అన్నియు వారి దైన్యమును బయలుపర్చును. ప్రపంచమందలి కోట్లకొలది జనులు వారిని భగవదవతారముగ నెంచి పూజించుచున్నారు. కొంతమంది చదువుకున్నవారు ఆధ్యాత్మిక జ్ఞానము లేనివారు కేవలము విచిత్రరీత్యా వారిని చూచుటకు వచ్చెదరు. గొప్పవారమని చెప్పుకునే ఆ కొలది సాంఘికులు ఆ దివ్యమూర్తికి తలవంచి ప్రణామములు చేయుట వారి మర్యా

దకు లోటని యెంచెదరు. అట్టివారిని స్వామిజీ అపూర్వ మైనటువంటి ఆశ్చర్యమైనటువంటి విధమున మార్చుట ప్రతి వ్యక్తికి ఒక దివ్యబోధ యయ్యెను. ఈ ఆధ్యాత్మిక ప్రభువు తాను సౌఖ్యముగా కూర్చునియుండిన కుర్చీనుండి లేచి వారివద్దకు వచ్చి వారికి వంగి నమస్కారము చేసి వారికి పూలదండ వేయును. ఆ మనుష్యులు ఆ పవిత్ర గురువునందు గౌరవము భక్తి గలిగి కొద్ది రోజులలో వచ్చి స్వామివారి పాదములపై పడు దృశ్యము చూచుటకు చాల ఆశ్చర్యజనకమైనది.

వాని నానుభూతియు మనుష్యకోటియొక్క లోట్లు తప్పులు కనిపెట్టుటయు వానిని గొప్ప తత్త్వశాస్త్రజ్ఞునిగా చేసెను. వాని దివ్యముఖమునుండి నిరుత్సాహపు మాట ఎన్నడును వెలువడదు. స్తోత్రము తెలివి తేటలతో గూడిన ప్రోత్సాహమువల్ల వారికి శరణుజొచ్చిన వారి యందు దాగియుండు మంచి శక్తులు గుణములు బైటకు లాగి కొద్ది కాలములో వారిని ఇతరులు అనుసరించు ఆసక్తి గలవారినిగా మార్చివేయును. ఆశ్రమవాసులలో ఎవరైనను గొప్ప తప్పుచేసినయెడల అట్టివానిని చీవాట్లు వేసి బాగు చేయుటలో వానికి గల సాధారణమైన మృదువైన తత్త్వ సంబంధమైన పద్ధతి నిరుపమానము, గుణకరమైనది. స్వామి తప్పుచేసినవానిని పిలిచి అతడు వచ్చినవెంటనే వానికి కొన్ని బహుమతు లిచ్చును. అతడు ఆ బహుమతు లిచ్చుటకే తన్ను పిలిపించెనని మొదట అనుకొనును. తరువాత

సాధారణ పద్ధతిలో అతడు లోగడ చేసిన మంచి పని ఒకటి చెప్పి దాని విషయమై వానిని బాగా పొగడును. ఇందువల్ల అతడు తనకు కొంత మర్యాద కలిగినదని ఊహించును. తరువాత గొప్ప కీవితో అతడు చేసిన చెడ్డ పనిని గురించి వానిని చీవాట్లు పెట్టును. తక్షణం మంచి గుణములు పొగడును. వానికి స్వామిజీయొక్క స్తోత్రమునకును ఊహలకును తగినట్లు నడుచుకొనునట్లు కోరిక కలుగును. ఈ ప్రకారము అనేకమంది వ్యక్తులను మార్చి సంఘమునకు ఉపయోగకరమగు సభ్యులుగా చేసెను.

తన కున్నది ఇతరులతో పంచుకొనవలెనను ఊహ స్వామిజీయొక్క అంతర్గత సద్గుణము. అది తన నిత్య జీవితమందు ప్రత్యక్షముగా కనపరచి దానియొక్క ఉపయోగమును రుజువు పఱచును. అతడు ఎల్లప్పుడు ఇచ్చుచుండును. అతడు ఇచ్చుటకే జీవించుచున్నాడన్న అతిశయోక్తి కానేరదు! అతడు ఇతరులకు దానము చేయుటకు వీలగు వస్తువులు వారి చేతులతో తీసికొనునప్పుడు వారి పూజనీయమైన ముఖమందు సంతోషము తాండవమాడును. మరియు వారి బుట్టలో ఉన్న వస్తువులన్నియు ఇతరులకు ఇవ్వబడునప్పుడు వారికి పూర్ణమైన తృప్తి గలుగును. అది తెలిసికొనుట మానవబుద్ధికి అతీతము. అనేకసార్లు నా దివ్యగురువు తనకొరకు తయారుచేయబడిన ఆహారము కూడ ఇతరులకు ఇచ్చి తనకు ఈవియందు గల ఆతురతను తృప్తి పరచుకొనుచుండును.

స్వామిజీయొద్ద గొప్ప అమానుష దివ్యశక్తు లున్నను ప్రజామోదము ప్రఖ్యాతిని గోరి అవి యెన్నడు ప్రదర్శించరు. వారివల్ల బయటకు విడువబడిన దివ్య చైతన్యమువల్ల జరిగిన అమానుష కృత్యములకు అతడు భగవంతుని వైభవమును కొనియాడును. తన యందు అమానుష కృత్యములు చేయుశక్తి గలదని యెన్నడును ఒప్పుకొనడు. కాని హిందూదేశమందలి, విదేశ మందలి అనేక ప్రజలు వారి కంఠధ్వని వారు విన్నారనియు వారి రూపము కలలో కనిపించినదనియు, కష్టదశలో వారు సరియైన సమయమునకు సహాయము చేసిరనియు వారికి వారి ఉనికి అనుభవమైనదనియు—ఈ మొదలగు విషయ ములు చెప్పుదురు. స్వామిజీ, తానొక గొప్ప దేవునివలె చూడబడుటకు ఎన్నడును ఇష్టపడరు. పవిత్రతయందు చిన్న పిల్లలకు వారిని పోల్చదగును. అతడు అందరతో కలిసి వారితో ఏకముగా నుండును.

అతడు ఇతరులతో ఆటంకములు లేకుండ స్వేచ్ఛగా మాట్లాడుచుండినను అవసరమైనప్పుడు పర్వతమువలె స్థిర ముగా, మౌనముగ నుండగలరు. వారు కలతలేని మన స్సుతో స్తోత్రభాషణములను, దూషణభాషణములను వినుచుండును.

ఈ ప్రకాశమానమగు వ్యక్తియొక్క జ్ఞాపకశక్తి చాల అసాధారణమైనది. ఆశ్చర్యమైన సౌలభ్యము స్పష్ట

తతో స్వామిజీ తన చిన్నతనమునందు జరిగిన అతి స్వల్ప విషయములు తెలుపగలరు. మరియు అనేక సంవత్సరముల క్రిందట వారు చూచిన మనుష్యునియొక్క ముఖమును గుర్తుపట్టగలరు. ప్రతిదినము ప్రపంచమంతటను నుండు లెక్కలేని భక్తులకు వారు పంపు ఉచిత ఈవి పేకెట్టుల యొక్క చిరునామాలు వారు పరిశీలించుచుందురు. మరియు వారందరి చిరునామాలయొక్క తప్పిల్లు జ్ఞాపక ముంచుకొను శక్తి ప్రతి వ్యక్తికి ఆశ్చర్యము కలిగించును. ఈరోజు వరకు వైద్యసంబంధమైన చిక్కు మారుమూలమాటలు వారి జ్ఞప్తియం దుండును. ఇట్టి ప్రశస్తమైన జ్ఞాపకశక్తి చాల కాలమునకు వారి దర్శనము చేయు ప్రేక్షకుల హృదయముల ఆకర్షణ చేయును. స్వామిజీ ఒక వ్యక్తిని గుర్తుపట్టి వాని పేరు చెప్పినప్పుడు వారిని చూచుటకు వచ్చినవానికి సంతోషము గలుగును. ఆ దివ్యగురువునందు అతని హృదయములో నొక అదృశ్యమైన బంధన కలుగును.

ఈ ఆశ్చర్యకరమైన దైవము ఆధ్యాత్మిక అహంకారము పండితగర్వము ఏమియు లేక అందరకు మామూలు మనుష్యునివలనే కనపడుచు జీవించుచుండును. కాని వాని యొక్క ఆంతరిక ఆధిక్యత తెలిసికొనినవారికి అతడు ఉత్కృష్టుడైన పురుషుడనియు వానిలో నున్న ప్రతి గుణము వారిలోన నుండు దివ్యశక్తియొక్క ప్రకటన రూపమనియు తెలియబడుచున్నది.

ఆధ్యాత్మిక రాజ్యమందలి ఉచ్చస్థితియందుండి మనుష్య సంబంధమైన తెలివిచే ఆయన మానవజాతిని ఉపయోగకరమగు పద్ధతిలో నడపుచుండును. ఆత్మ కలతజేయు వ్యక్తిత్వముగల వారితోడి ఆధ్యాత్మిక కలయిక అనేక జాతుల మనుష్యులను, స్త్రీలను నాజూకు గలిగి భగవంతునియెడ భయముగలవారిగను, నెమ్మదిగలవారిగను, మంచి గుణములుగలవారిగను, సంస్కృతిబొందిన గౌరవనీయులుగను మార్చివేసినది.

ఆ ప్రకారము అతడు రాజకీయపద్ధతి నవలంబించు అందరు వ్యక్తులకంటె ఎక్కువగా శాంతి గలుగజేసెను.

ఈ గొప్పవ్యక్తి అన్నిజాతులవారు విశ్వభ్రాతృత్వము, శాంతి, ప్రేమ, సౌఖ్యములతో కూడియుండునట్లు చేయుటకు అనేకసంవత్సరములు జీవించుగాక.

---

# 13. పశ్చిమమున
# స్వామి శివానందజీ పలుకుబడి

నేను స్వామివారియొక్క పశ్చిమ ప్రాంత పలుకుబడి వ్రాయుటలో నామానుష మనస్సుయొక్క కించిజ్ఞత్వము తెలియపరచుచున్నాను. దివ్యత్వము కలిగినటువంటి, అంతటను వ్యాపించిన ఆత్మసాక్షాత్కారముయొక్క జీవిత ప్రతినిధి అయినటువంటి వారిని తెలిసిన వ్యక్తియే ఈగొప్ప పావనపురుషునకు తూరుపు, పడమరల వివక్షత లేదని తెలిసికొనగలడు. ప్రపంచమంతయు వాని దేశమే. మానవజాతి యంతయు వాని దేశస్థులే. వానికి ఒకటే మతముగలదు. అది ప్రేమ, సానుభూతి, సహనముయొక్క మతము.

నాప్రియమైన గురుదేవునియొక్క అసాధారణమైన గొప్ప పద్ధతులు వ్రాయుటకు కలము పుచ్చుకొన్నప్పుడు నేను, ప్రేమ అందము, మరియు సత్యములయొక్క విచిత్ర ప్రపంచములోనికి మారినట్లు నాకు కనుపించును. మరియు ఆకాలము నా జీవితమందలి చాల సౌఖ్యమైన కాలమై యుండును.

ఆధ్యాత్మిక పరిపూర్ణతయొక్క ప్రసిద్ధికెక్కిన ఉదాహరణ రూపము విదేశీయులకు గొప్పధనమును మానవ జాతికి అవసరమైన మార్గదర్శియు అయ్యెను. కారణబద్ధమై

నటువంటి మరియు అనుభవజ్ఞమైన నటువంటి పశ్చిమ వాసుల సూక్ష్మబుద్ధియొక్కయు, లోచూపు అంతరజ్ఞాన శక్తిగల తూర్పు దేశపు ప్రజలయొక్కయు గుణములు కలిగిన స్వామిజీ పశ్చిమ దేశమందేగాక, ప్రపంచ మంతటను ధ్యేయపురుషుడయ్యెను. వాని అమానుషమైన లోచూపుతో ఈఆశ్చర్యమైన పావనపురుషుడుఆధునిక ప్రపంచముయొక్క అంతర్య కోరికల తృప్తిపరచుటకు ముఖ్యఅవసరమైన విషయములు కనిపెట్టెను. పూర్ణజ్ఞానముగల ఈదివ్య పురుషుడు మాత్రమే లోకమందలి జనులందరు కోరు ముఖ్యమైన విషయమెట్టిదో కనిపెట్టెను.

"యోగిశివానంద" యను పుస్తకమునకు వ్రాయబడిన ఉపోద్ఘాతమునందు స్వామిజీ పడమర దేశీయుల హృదయములు ఆకర్షించుటలో వాని ఉత్తీర్ణతయొక్క రహస్యము వివరించియున్నారు. తూర్పు, పడమరలు భగవంతుని యొక్క రెండు పాదములు. మానవజాతి కూడ ఒక్కకుటుంబమే. అందరు జీవులు దేవునియొక్క పిల్లలే. ఈపూజనీయుడగు పావన పురుషుడు వాని ఊహలు, మాటలు కర్మలవల్ల వారు పైన చెప్పినమాటలు మర్యాదకొరకు చెప్పినమాటలు కావనియు అవి వాని హృదయము, ఆత్మ అంతర్గతమునుండి వచ్చినవనియు తెలియపఱచెను.

స్వామిజీయొక్క ఆత్మానుభవస్థితి ప్రపంచమందలి ప్రతిజీవితో ఏకత్వము పూర్తిగా తెలిసికొనుటకు శక్తిగలిగించెను. ఆయన పడమర నివాసులతో నున్నప్పుడు తాను

పడమర నివాసియనియే ఊహించును. ఇదిగాక వాని మర్యాద అణకువ, వాని వాక్కుయొక్క స్వేచ్ఛ, యూరోపియనుల జీవితమునకు సరిపడునట్లు వారి సొంత అవసరముల యొక్క తప్పీళ్లయందు ప్రత్యేక శ్రద్ధతీసికొనుట మొదలగు పనులు ఆశ్రమమునకు వచ్చిన నికృష్ట స్వభావముగల మనుష్యుని హృదయమందుకూడ ఆకర్షణ కలిగించెను. క్రైస్తవుల వలె క్రైస్తవపండుగల ఆడంబరముగ జరుపుటయు అప్పుడు వారు పూర్తిగా క్రైస్తవ భావము చూపించుటయు అతడు క్రైస్తుయొక్క అవతారమా అని అతనిని చూచు వ్యక్తికి ఆశ్చర్యము గలుగజేయును.

ఇట్టి అమరగురువునందు పశ్చిమదేశవాసులు దివ్యమానుష ఐక్యత కనిపెట్టిరి. విశ్రాంతి, సౌఖ్యము, ధనము విశేషభోగము పశ్చిమదేశమందలి అనేక దురదృష్టవ్యక్తులను నీరసము అసహాయతయొక్క రూపముగ మార్చివేసినది. మరియు వారు స్వామిజీని తల్లివంటి మృదువైన ప్రేమగల వానినిగాను దయార్ద్రహృదయుడగు స్నేహితునిగను ఆధ్యాత్మిక మార్గముచూపు పావనపురుషునిగను కనిపెట్టిరి. భగవంతునియందు నమ్మకము తోడి జనులయందు ప్రేమ-యివి స్వామిజీయొక్క ప్రియమైన శిష్యుడగుటకు అవసరమైన ముఖ్యగుణములు. అతడు వారి వ్యక్తిగత ఊహాలకు పూర్తి స్వేచ్ఛ ఇచ్చును. మరియు ప్రతివ్యక్తియు వాని ఉద్దేశములకు నిలిచియుండవచ్చును. వారు కోరు ముఖ్యవిషయము ఏమన మనుష్యులయందు ఆత్మయొక్క ఏకత్వము అనగా నిజము, ప్రేమ, సేవ, అందములయొక్క ఉత్సాహము.

ప్రపంచమంతయు ముఖ్యముగ పశ్చిమదేశవాసులు అనాలోచితమైన జడస్వభావమగు భ్రమలోమునిగి ఆత్మ యొక్క ముఖ్యమైన అవసరములను మరచిపోవుచున్నారు. క్రైస్తవమతము సందిగ్ధస్థితిలో నున్నది. పూర్వకాలమందు దానికిగల ఏకత్వము సహనశక్తి పోయినది. స్వామిజీ బోధవల్ల వారికి తిరిగి క్రైస్తవబోధయొక్క నిజమైన సారము తెలియపరచినారు. జడపదార్థ అనుయాయులగు పశ్చిమ దేశవాసులకు నిజమైన శాశ్వతమైన సౌఖ్యము వారి ఆధ్యాత్మిక విలువ, వారి ఆధ్యాత్మిక ఏకత్వము తెలిసికొనుటలో నున్నదను మూలసూత్రము తెలియజెప్పినారు. వారు వారి యొక్క హృదయ ఉత్తేజమును గలిగించు ఉపన్యాసముల వలనను, ప్రత్యక్ష పద్ధతులవల్లను శాస్త్రసంబంధమైన అనుసరణలు, ప్రాకృతిక సౌఖ్యములు, ప్రపంచముయొక్క బాహ్య ఏకత్వము తీసికొని రాగలరుగాని, నిజమైన స్థిరమైన, ఏకత్వము దివ్యశక్తితో అదృశ్యసంఘటనవల్లనే కలుగునని తెలియపఱచెను.

స్వామిజీ అన్నిమతములను మర్యాద, గౌరవముల తోను, పూర్తి వైరాగ్య నిష్పక్షపాతములతోను చూచును. అన్నిమతములలో నుండు నిజమైన దివ్యమూలమును అతడు ఆమోదించును. ఇట్టి తెలివియొక్క ఆధిక్యతవల్ల అతడు ప్రతిమతమును విమర్శించి దానియొక్క ముఖ్యమైన మంచి గుణములు చెడ్డగుణములు తెలిసికొని ఆధునిక ప్రపంచము త్వరగా వృద్ధిపొందుటకు వీలగు క్రొత్తపద్ధతిని బోధిం

చెను. కాబట్టి అనేకమంది పశ్చిమ దేశనివాసులు కూడి వానిని ఆశ్రయించుట ఆశ్చర్యమైన విషయముగాదు.

క్రైస్తు స్వామిజీల బోధలయొక్క కోరిక వారి జీవితములో అవి తన అనుభవములో పెట్టుకొనుట, అనేక పశ్చిమ నివాసుల మనస్సులలో ఈప్రపంచ ఆధునిక రక్షణకర్త యందు స్థిరమైన నమ్మకము గలుగజేసినది. మిక్కిలి చెడ్డ మనుష్యుల విషయమైకూడ అతడు ఓర్పు కనపఱచును. మరియుఅతడుచేసిన చెడ్డపనిని క్షమించును. మరియు వానిని అంతులేని ప్రేమతో చూచును. భగవంతుడు ప్రపంచమునుండి దూరముగ లేడనియు మరియు అతడు తూర్పునివాసియైనను, పడమరనివాసియైనను ప్రతిమనుజుని లోపలనున్నాడనియు స్పష్టపరచెను. మరియు వానిజీవితము ద్వారా వాని ఉత్తేజమగు సారస్వతము ద్వారాను హృదయమునందు విసుగు నీరసముగలవారికి తొందరగా క్రొత్త జీవిత పద్ధతిలో నడచుకొనదగు వీలైన మార్గమును చూపించెను.

చురుకైన జీవితమునకు అలవాటుపడిన పశ్చిమ నివాసులు స్వామిజీ సరియైన ఆధ్యాత్మిక గురువని తెలిసికొనిరి. పవిత్రత అనగా ఏకాంత వాసముచేయుచు ధ్యానములో కదలక జీవించుట అనుకొను చాలమంది సామాన్య పురుషుల వలె కాక ఈఉదారహృదయుడు అనుభవ పాత్రుడగు యోగి ధ్యానముతో పాటు నిష్కామ సేవ, ఆత్మ విధేయత ముఖ్యావసరమని నొక్కి చెప్పుచున్నాడు. దేవ

యందును అతి పనికి రాదనియు నిరాడంబరమగు పవిత్ర జీవితము గడుపవలయుననియు అన్ని సమయములయందును అనగా ఒకవ్యక్తి ప్రపంచ వ్యవహారములను చూచు నప్పుడు కూడ భగవంతుని ధ్యానించుచుండవలయుననియు అందరికి భగవంతుని ప్రకటితరూపములుగా సేవచేయు చుండవలయుననియు భగవంతుని సాక్షాత్కారమును అంతిమధ్యేయమునకు అందరు ప్రయత్నము చేయవలయు ననియు అతడు ప్రతివారు చేయవలసిన విషయము అని తెల్పెను. స్వామిజీ యొక్క బోధప్రకారము నడుచుకొను టకు పశ్చిమ దేశవాసులకును వారి ఆంతరిక స్వభావముల కును అడ్డంకి గలుగజేయునది ఏమియును లేదు.

మరియు పశ్చిమనివాసుల మతము సాంఘిక దృఢ త్వము మరియు అవసరమగు పరిస్థితులకు ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చుచున్నది. స్వామిజీయొక్క బోధ వారి యొక్క ధ్యేయములు వృద్ధిచేయుటకు సహాయకరముగ నున్నది. జయముతోకూడిన దివ్యజీవనము జరుపుటకు లేక ఏయోగాభ్యాసమైనను జయప్రదముగ జరుపుకొనుటకు వ్యక్తిగత మానుషత్వము సరిగా వృద్ధిపరచుకొనవలెనని ఈ గొప్ప పావనపురుషుడు నొక్కిచెప్పుచున్నాడు. మరియు మనకు తెలిసినంతవరకు ఒకజాతియందుగలుగు సామర్థ్యము ప్రయోజనముల జాతియందలి ప్రతివ్యక్తియొక్క సుగుణముల మీద ఆధారపడియుండును. కామము, క్రోధము, దురాశ, ద్వేషము మొదలగు చెడుగుణములు తీసివేయుట తోడివారి

సేవ భగవంతుని సేవగా ఊహించుట, ధ్యానముచే ఆత్మ యొక్క శాంతి, బలముపొందుట ఇవియన్నియు స్వామిజీ మానవజాతికి ఎల్లప్పుడు ఇచ్చు సలహాలు.

శివానందసారస్వతము పశ్చిమమున ప్రజలకు అనుసరణీయమైనది. మరియు అది ఇప్పుడు ఒక అవసరముగా కూడ పరిగణింపబడుచున్నది. వారు రచించిన పుస్తకములు నిరంతర జనసమ్మతములు. అనేక భాషలలో వానిని ప్రజలు కోరుటచే అనేక పశ్చిమభాషలకు ప్రేంచి, జర్మను, స్పానిష్, రష్యన్ వగైరా భాషలలో వారి పుస్తకములు అనేకము తర్జుమాచేయబడుచున్నవి.

దోషారోపణ లేనటువంటి అపూర్వమైనటువంటి స్వామిజీయొక్క జనసమ్మతి కారణమున హిందూదేశమునకు వచ్చిన అనేక విదేశీరాయబారులు దివ్యగురువును దర్శించి వారియందు ఎక్కువమర్యాద, ప్రేమ కనుపరచి తిరిగిపోవుచున్నారు.

ఈ గొప్ప గురువుయొక్క బోధలలోనుండి తత్త్వజ్ఞానమును గొప్పగా ఆమోదించి స్టాన్ఫోర్డు విశ్వవిద్యాలయమునకు చెందిన డాక్టరు ప్రెడరిక్ స్పెజిల్బర్గ్ స్వామిజీ పుస్తకములు వారి విశ్వవిద్యాలయములో పాఠ్యపుస్తకములుగా ఏర్పాటు చేసెను.

ఈ పూజింపదగిన పావనపురుషుడు పశ్చిమదేశమునకు ఒక గుప్తమగు దీపము అయ్యెను. శ్రీయోగిరాజ్, హారిడిక్మన్ అను ఆయన స్వామిజీయొక్క జర్మన్ దేశపు శిష్యుడు. అతడు ఈవిధముగా ఈ గొప్ప గురువుగారిని

పొగడెను. "ఈరోజులలో కూడ హఠ, రాజ, భక్తి, కర్మ, జ్ఞానయోగములందు పరిపూర్ణతగలిగిన ఆధ్యాత్మిక వీరుడు మనకు కలిగినందుకు భగవంతునికి నమోవాకములు. ఆ పరమహంస యూరోపియన్ శిష్యులయెడ నిర్లక్ష్యము చూపిన వాని ఆధిక్యత ఉపయోగపడకయుండెడిది. కాని స్వామిజీ తన హిందూశిష్యులందువలెనే ఉత్తరప్రత్యుత్తరములు, కరపత్రములు పుస్తకములు వగైరాద్వారా యూరోపియన్ శిష్యులయందుకూడ ప్రేమపూర్వకమైన శ్రద్ధ తీసికొనును. నిజముగా ఇప్పటివరకు యూరోపియనులకు యోగము చదువుకొనుటకు అవకాశము లేకయుండెను.

ఆధునిక ప్రపంచము అల్లరి, గందరగోళము, పోట్లాటలతో నిండియున్నదిగాన దానిని నిజమైన ఆధ్యాత్మిక ఏకత్వమునకు ప్రేమస్థితికి తీసికొనివచ్చుటకు స్వామిజీ వంటి పరమసాధువు అవసరము. జినీవా విశ్వవిద్యాలయ అధికారియగు శ్రీ జీన్ హెడ్‌బర్డు ప్రపంచశాంతి కలుగ జేయుటకు స్వామిజీ తగినవాడని అభిప్రాయపడుచున్నాడు. అతడు చెప్పినదేమన ప్రపంచముయొక్క శాంతి వృద్ధికి తోడ్పడు తూర్పుపడమర, కలయిక స్వామిజీవల్ల తప్పక కలుగగలదు. మరియు కొద్దిరోజుల క్రిందటివరకు పశ్చిమ నివాసులు అది ఒకవైపు చేరదగిన కర్మయని గర్వముతో నమ్మియుండిరి.

1953 సంవత్సరమున స్వామిజీ అన్నిమతముల సమావేశము ఏర్పఱచి ప్రపంచమందలి అన్ని మతములకు

మధ్య సానుభూతి, భ్రాతృత్వము, కలయిక, శాంతి కలుగ జేసినారు.

ఆ ప్రకారము స్వామిజీ తూర్పుకు, పడమరకు శాశ్వతమైన సంబంధము కలుగ జేసినారు. దివ్యజీవనసమాజము యొక్క బావుటా క్రింద మానవజాతికి సేవచేయు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన స్వామిజీ జాతులు, సంస్థలు, మతములయొక్క అడ్డంకులు పోగొట్టి ప్రపంచశాంతికి మూలకారణమగు ప్రపంచమతోద్ధరణ గలిగించినారు.

నా ప్రియమైన గురుదేవుడు ప్రజోపయోగమైన సాంఘిక ఆధ్యాత్మిక సేవ ప్రపంచమంతటికిని కలుగుటకు చేయుచున్నందున అది ఇంకను చేయుటకు శక్తిగలుగుటకు వానికి దీర్ఘాయువును ఆరోగ్యము ఇచ్చుటకు భగవంతుని ప్రార్థించుచున్నాను.



# 14. నా దేవునియొక్క అమానుషచర్య

మానవజాతిలో చాల భాగముగానుండు భ్రమతో గూడి తప్పుడు మార్గమున చరించు జీవులయొక్క స్థితి చాల శోచనీయము. వ్యక్తిగతమగు అధికారవాంఛలు కోరికల చిక్కులో బంధింపబడి ప్రజలకు నిజకర్తవ్య లేక అంతరాత్మ విషయమై విచారించుటకు ఉద్దేశముగాని కాలముగాని ఉండదు. ఇట్టి విషమస్థితియందు భగవానుడు వాని హద్దులేని కరుణచే మాయయొక్క పంజరమునుండి మనుజులను విడిపించుటకు నా ప్రియమైన గురుదేవుడు శివానందరూపమున భూమియందు అవతరించెను. ఇట్టి ఆకర్షణీయము విచిత్రమైన పావనపురుషుడు తన జీవితమంతయు ప్రజలను వారి ప్రాకృతిక నిద్రనుండి లేపి అంతిమధ్యేయమైన భగవత్ సాక్షాత్కారమునకు తీసికొని వెళ్ళుటకు ఉపయోగించెను.

వారితో కలియుటకు అదృష్టము గలిగిన ప్రజలను మార్పుచేయుటకు వారు ఉపయోగించిన తెలివిగలపద్ధతులకు లెక్కలేదు. కేవలము కొందరిని వాని వ్యక్తిత్వము వల్లనే మార్చివేసెను. మరికొందరిని జ్ఞానముయొక్క దివ్యవాక్కులవల్ల మార్చివేసెను. చాలమంది యొక్క పూర్తి స్వభావము వాని ఉత్తేజమైన సాహిత్యమువల్ల మార్చెను. కాని ఆధునికతరమునకు చెందిన చాలమంది కగపడెడు విషయములు కేవలము చర్చమీద ఆధారపడి ఉండినవి. అట్టివారు గొప్ప అనుభవము లేక అస్వాభావికమైన

సంఘటన చూచినగాని భగవంతునియందు నమ్మకము గలుగకుండెను.

స్వామిజీకి చాల అమానుష శక్తులున్నను స్వంత వైభవ ఆడంబరమునకుగాని పనిలేనివింత వ్యక్తపరచుటకు గాని అతడు ఎన్నడును అమానుష కార్యములు జరిపియుండ లేదు. కాని అవసరము గలిగినప్పుడు భ్రమతోనుండు జీవుని రక్షించుటకు లేక ఒక సందేహామైన మనస్సుగల వానిని మార్చుటకు ఆ దయగల ప్రభువు తన అమానుష శక్తులు బయటపెట్టును.

ఇప్పుడు స్వామిజీ ఏప్రకారము నీరసజీవితముగల నాయొక్క స్నేహితుని తన అమానుషశక్తిచే మార్చి వేసినది తెలియపఱచెదను.

శ్రీ X అనువాడు మంచి గుణములుగల గొప్ప ఉద్యోగి. కాని ఎల్లప్పుడు చెడువిషయములే గుణించు చుండును.

సర్వహిందూదేశపర్యటనమందు స్వామిజీ మద్రాసు వచ్చినప్పుడు శ్రీ X కూడ మద్రాసులో నుండెను.

ఆధ్యాత్మిక గురువు వచ్చినందుకు పట్టణమంతయు మిక్కిలి ఉత్తేజకముగా నుండెను. ప్రపంచప్రఖ్యాతినొందిన ఈ గొప్ప పావనపురుషుని దర్శనమునకు వేలకొలది జనులు ఆతురపడుచుండిరి. స్వామిజీయొక్క గొప్పతనము పట్టణ ములో చెప్పుకొనుటవల్ల ఆ మాటలనిజము తెలిసికొనుటకు శ్రీ X కూడ ఆ గొప్ప వ్యక్తిదర్శనముచేసికొని వారి గొప్ప తనముయొక్క నిజము తెలిసికొనుటకు ఊహించెను.

ఆపట్టణములో ఒకముఖ్యకేంద్రమందు స్వామిజీకి గొప్పఆహ్వానము జరుగునని తెలిసికొని శ్రీ X కూడ ఆ స్థలమునకు వెళ్లెను.

ఆ గొప్పహాలు తీవ్రమైన పాటలు ప్రార్థనల ధ్వనులతో ప్రతిధ్వనించుచుండెను. ప్రతివ్యక్తియు ఆపావన పురుషుని వంక ఆసక్తి గలిగిన చక్షువులతో చూచుచుండెను. ప్లాట్‌ఫారముమీద నిలుచుకొని వానిప్రియమైన హరేరామ కీర్తన ఆత్మోద్ధారణచేయు శంఖధ్వనితో పాడుచుండిన ఆకర్షణీయమగు స్వామిజీయొక్క రూపము అతడు చూచెను. ఆకీర్తన ముగించిన తరువాత స్వామిజీ శ్రీరామనామము యొక్క మహిమ పొగడ మొదలిడెను.

శ్రీ X కు నిరుత్సాహము కలిగెను. ఆ హిమాలయ ప్రాంతపు ప్రసిద్ధికెక్కిన పావనపురుషునివల్ల గొప్పవిషయములు తెలిసికొనుటకు అతడు ఆసించియుండెను. అతనికి ఉద్రేకము ఏమియు కలుగలేదు. ఆ స్వామిజీయొక్క ఉత్కృష్టమైన దివ్యగుణములయొక్క స్వభావము తెలిసికొను పక్వదశ అతనికి కలుగలేదు. అతడు తక్షణము నిరుత్సాహముతో హాలునుండి వెళ్ళిపోయెను.

అతడు ఇంటికి చేరిన తరువాత స్వామిజీయొక్క సర్వజ్ఞత్వము, సర్వవ్యాపకత్వము, వాని స్ఫురణకు వచ్చి అదివానిని కొన్నిరోజులవరకు బాధపెట్టసాగెను. చివరకు అతడు స్వామివారిని ఇంకొకసారి దర్శనము చేయుటకు నిశ్చయించుకొనెను. అప్పటికి స్వామిజీ సింహాళ ద్వీపము

నకు వెళ్ళియుండెను. అయినను ఈ అడ్డంకి వాని ఉద్దేశమును మార్పలేదు.

అతడు వారివెంట సింహాళమునకు వెళ్లెను. అచ్చట స్వామివారికి ఇవ్వబడిన గొప్పఆహ్వానమునకు అతడుకూడ వెళ్లెను. స్వామిజీ ప్లాట్ ఫారముమీద ఎక్కిన వెంటనే అతడు వాని మామూలు అత్యాకర్షణ రీతిని ముందు భజన ప్రారంభించెను. మద్రాసులో శ్రీరామ భజనచేసి రామనామము యొక్క ఆధిక్యత తెలుపుటకును, అప్పుడు జరుపు స్థితికిని వానికి సమాధానము కుదురలేదు. శ్రీ X ఆధ్యాత్మిక ఉత్తేజముయొక్క పూర్ణస్థితి తెలిసికొను స్థితికి ఇంకను రాలేదు. అతడు స్వామిజీయొక్క విశ్వస్వభావము తెలిసికో లేక పోయెను. వానియొక్క ఆక్షేపణతో కూడిన మనస్సు స్వామిజీ సింహాళ ప్రజల హృదయములు స్వాధీనపరచు కొనుటకు మురుగని భక్తుడుగా నటించుచున్నాడని ఊహించెను. కాబట్టి ఇంకొక సారి విరక్తితో అతడు హాలు నుండి వెడలిపోయెను.

పైన జెప్పిన అనుభవములు కలిగినను శ్రీ X స్వామిజీయొక్క జ్ఞప్తి వాని మనస్సునుండి తుడిచివేయ లేదు. కాని ఆ ఆర్షకమైన పావనపురుషుని విషయమై విమర్శింపజాలని కొన్ని ఊహలు వానిని ప్రతిదినము బాధించుచుండెను. చివరకు అతడు ఋషీకేశము వెళ్ళి అచ్చట ఆవిచిత్ర పురుషునియొక్క ఆధ్యాత్మిక గొప్పతనము స్వయముగా తెలిసికొనగోరెను.

ఆప్రకారము ఆకర్షణీయమగు ఆదివ్య వ్యక్తియగు స్వామిజీని చూచు ఆశతో అతడు ఆనంద కుటీరము చేరెను.

అశాంతితో కూడిన మనస్సుయొక్క సందేహములు తొందరగా తీర్చుకొని శాంతి పొందుటకు శ్రీ X స్వామిజీ దర్శనము చేసికొనుటకు వాని కుటీరమునకు వెళ్లెను. కాని అచ్చట తనకు ఇవ్వబడిన ఆహ్వానమునకు అతడు నిర్విణ్ణు డయ్యెను.

తన ఊహలకు వ్యతిరేకముగా అతడు ఒకఅందమైన సావిడి వరండా ప్రక్కన ఉండెను. తరువాత స్వామిజీ వానికి రుచికరమైన మిఠాయితో కూడిన పళ్లెము ఇచ్చెను. శ్రీ X ఆమిఠాయి ఆరోజున భక్తులెవరో స్వామిజీకి ఇచ్చి రను విషయము గ్రహింపజాలకపోయెను. వాని సందేహ ముతోకూడిన మనస్సునకు అతడు మిక్కిలి సౌఖ్యముతో కూడిన జీవితమును గడపుచున్నాడని ఊహించెను. కాబట్టి తన అయిష్టతకనపరచుటకు ఆమిఠాయి దినుసులు తాను ముట్టకుండ తనతో వచ్చిన నౌకరుకు ఇచ్చెను. ఇదిచూచి దయార్ద్రహృదయుడగు స్వామిజీ మిఠాయి వస్తువులతో నుండెడి ఇంకొక పళ్లెము ఇచ్చి అవి తినుమని పట్టుపట్టెను. మూడవమారు కూడ నిరుత్సాహముతో అతడు స్వామి వారినుండి వెళ్ళిపోయెను. శ్రీ X ఆశ్రమములో కొన్నిరోజు లుండెను. స్వామిజీ దయ, ప్రేమ, ఆతిథ్యమునందు ప్రేమ గల పావనపురుషుడనియు, మానవజాతిని ఉద్ధారణచేయు టకు పనిచేయుచున్నాడనియు తెలిసికొనెను. కాని వారి

యొక్క ఆధ్యాత్మిక పరిపూర్ణత విషయములో అతడు ఎంత మాత్రము నమ్మలేదు.

అతడు ఆశ్రమము విడిచి వెళ్ళవలసిన రోజున స్వామిజీ సెలవుతీసికొనుటకు వాని కుటీరమువద్దకు వెళ్ళెను. అప్పటికి స్వామిజీ కుటీరము విడిచి ఆఫీసుకువచ్చుచుండెను. ఆ ప్రకారము శ్రీ X స్వామిజీని త్రోవలో కలిసికొనెను. అతడు స్వామిజీతో వారి ఆతిథ్యసత్కారములకు ధన్యవాదములిచ్చి మామూలు శిరవితో వంగి ఆ స్థలమునుండి వెళ్ళిపోయెను. స్వామిజీకి సాష్టాంగప్రణామము చేయుటకు వానికి మనస్కరించలేదు. స్వామిజీ అందరకు చెప్పు ప్రకారము వానినికూడ తిరిగి ఇంకొకసారి ఆశ్రమమునకు వచ్చి ఇంతకంటె ఎక్కువ కాలము ఉండవలసినదిగా తెలిపెను. కాని శ్రీ X వానియొక్క నిరంతర ఆటంకపు అనుభవములవల్ల స్వామిజీకి సరియైన జవాబు చెప్పలేక పోయెను.

అన్నియు తెలిసిన ఆ దివ్యప్రభువు శ్రీ X యొక్క స్థితి తెలిసికొనెను. మరియు వాని దయార్ద్రహృదయము కరగెను. అతడు శ్రీ X యొక్క కష్టపడు ఆత్మకు సహాయముచేయుటకు నిశ్చయించెను. అంతట శ్రీ X వాని జీవితమందలి ప్రసిద్ధమైన తరుణము అనుభవించెను.

ఆత్మతేజముగలుగు ఆ స్థితియొక్క జ్ఞప్తి నన్ను పూర్తిగా జలదరింపజేయును. స్వామిజీ శ్రీ X వంక క్షణ

మాత్రము తదేకదృష్టితో చూచెను. ఆ ప్రకాశమానమైన దయ ప్రేమతో కూడి ఎల్లప్పుడు ఆధ్యాత్మిక ప్రకాశముతో ప్రకాశించునట్టి కండ్ల భాగ్యము చూచువారు మాత్రమే వాని చూపుయొక్క ఆత్మీయబలము ఆకర్షణశక్తి తెలిసికొనగలరు. అవును స్వామిజీ కేవలము చూచెను కాని అది శ్రీ X యొక్క జీవితమును శాశ్వతముగా మార్చివేసినది.

అతడు చెప్పినదేమన స్వామిజీ ఒక్క క్షణము మాత్రమే నావంక చూచిరి. తత్క్షణము నా హృదయము స్తబ్ధతనొందెను. అది ఒక్క ఊపిరితీసికొను దృశ్యము. అపుడు స్వామిజీయొక్క శరీరము ఒక్క విచిత్రమైన దివ్య వెలుతురుచే కప్పబడియుండెను. మరియు అతడు ఒక గొప్పశక్తి ఎదుట పొడుగుగా నిలుచుకొన్నట్లు వానికి తోచెను. ఒక ఆశ్చర్యమైన పద్ధతిగా భగవంతుడు మనుష్య రూపమున తననుచూచి దయతో నవ్వుచున్నట్లు వానికి కనిపించెను. మరియు అతడు కొన్ని నిమిషములు తెలిసికొనలేని ఆనందమైన స్థలమునకు ఎత్తబడినట్లు ఊహించెను. తిరిగి వానికి మామూలు స్పృహరాగా అతడు విచిత్రమైన శాంతి నిర్మలత్వము అనుభవించెను. మరియు వాని సందేహములన్నియు సూర్యుని ఎదుటి మంచువలె విడిపోయెను. మరునిమిషము ఒక తెలియని బలముగల శక్తిచే బలవంత పెట్టబడినట్లు అతడు స్వామిజీయొక్క కాళ్ళకు మ్రొక్కెను. మరియు వారి ఆశీర్వచనములు పొందెను.

ఆరోజు లగాయతు శ్రీ X స్వామిజీయొక్క ఆసక్తి గల భక్తుడయ్యెను. మరియు స్వామిజీ బోధించిన ప్రకారము దివ్యజీవనము వాని శక్తికొలది గడుపుచున్నాడు. ప్రతి సంవత్సరము స్వామిజీని చూచుటకు నిశ్చయించుకొనెను. తన గురుదేవునియొక్క ఆధ్యాత్మిక జ్ఞానము ప్రచారము చేయు ఆసక్తితో అవకాశము కలిగినప్పుడెల్ల స్వామిజీ యొక్క బోధనలు అచ్చువేయించి ఆకరపత్రములు ప్రజల ఉపయోగమునిమిత్తము ఉచితముగ పంచిపెట్టుచుండును.

నా ప్రియమైన గురుదేవునకు, ఇంకను అనేకమందికి, జీవితధ్యేయమగుదారి చూపుటకు వీలుగలుగునట్లును వారికి పూర్ణ ఆరోగ్యము, దీర్ఘజీవితము కలుగజేయునట్లును భగవంతుని నాపూర్ణ హృదయముతో ప్రార్థించుచున్నాను.

—o:o—

## రెండవ అధ్యాయము

# శిష్యురాలియొక్క ఉత్తరములు

డాక్టరు శివానంద చెల్లా శ్రీ స్వామీజీకి వ్రాసినవి

# 1. నా ఆత్మయొక్క తీవ్ర ఆసక్తి

నేను నా ఇంటిలోనే బెంగపెట్టుకొనునట్లు ఊహించుటకు ఇది మొదటిసారి. ఈరోజున నేను నా ఆసుపత్రిలో నున్న నీ విగ్రహము మెడకు పూలదండ వేయునప్పుడు నాకు చాల విచారము కలిగినది. అచ్చట నీవు స్థూలరూపమున నున్నావు కాని ఈ దురదృష్టజీవి నీ విగ్రహముతోనే తృప్తిపడవలసి వచ్చినది. కాని మరునిమిషము నా అంతర దృష్టితో నీవు నాదగ్గర ఉన్నట్లు చూచి అనుభవింపగలిగితిని. నీ దివ్యముఖముయొక్క వైఖరి నేను చూడగలిగితిని. అవును, పవిత్రమైన ఆ దివ్యప్రేమను దూరము భేదింపజాలదు. నేను ఎల్లప్పుడు నీతోనే యున్నాను. మరియు నీవు ఎల్లప్పుడు నాతోనే యున్నావు. ఈ ఊహయే నాకు ఉపశమనము మరియు ఆశ కలుగజేసినది.

దయయొక్క పూజ్యప్రభూ! నా మామూలు పనులు చేసికొనుటకు నాకు బలమునిమ్ము. ఇదివరకే నేను నిన్ను చూడవలెనని ఆసక్తితో నున్నాను. నేను ఇంకను పదునొకండు మాసములు వేచియుండవలెను. ఓ నా స్వామిజీ నీయొక్క ఉనికి ఇప్పుడు అనుభవించునట్లు నేను ఇదివరలో ఎప్పుడును అనుభవింపలేదు. నేను నీలోనే యున్నట్లు ఊహించుచున్నాను. అప్పుడప్పుడు నీవు చాల దగ్గరగా నున్నట్లు ఎంచుకొని నీతో బిగ్గరగా మాట్లాడుటకు కోరుచుందును. నా ఆత్మ ఎల్లప్పుడు తాదాత్మ్యము

పొందియున్నది. కాబట్టి నీవే నా రోగులకు మందు లిచ్చు చున్నావు. నేను ఏమి చేసినను నీ ఉత్తరవు ప్రకారమే చేయుచున్నాను.

నా ప్రభూ! నన్ను మీరు అక్కడ ఆహ్వానము చేసిన విధమునకు నేను ఎట్లు మీకు ధన్యవాదములు ఇవ్వగలను? నేను అన్ని విధముల చాల నీచజీవిని. కాని మీరు నన్ను మీదానినిగా మన్నించితిరి. మీరుచూపిన దయ నేను మరువ జాలను. అచ్చట నున్నప్పుడు నేను స్వర్గీయమైన ఆనంద కదలికలయందు తిరిగితిరిగి జీవించుచున్నాను.

దయచేసి నాకు ఆశాశ్వత ఆనందమునకు త్రోవ చూపుము. శాశ్వత ఆనందమునకు మార్గము నీయొద్దనే యున్నది. నీద్వారానే నేను భగవత్సాక్షాత్కారము పొందెదను. నాకొరకు ద్వారము తెరచి నా దేవునియొక్క నిజరూపమును, మరియు శాశ్వత ఆనందమును నన్ను అనుభ వింపనిమ్ము. ఎట్టిశక్తి నన్ను నీయొద్దకు లాగుచున్నదో నాకు తెలియదు. కనుపడనటువంటి చాల శక్తివంత మైనదారముచే నేను కట్టబడి లాగబడినట్లుగా నాకు అను భవము కలుగుచున్నది. మరియు నాకు ఎవ్వరును సహా యము లేనట్లు కనుపించుచున్నది. దయచేసి త్వరలో నాకు సహాయముచేసి నన్ను ధ్యేయమునకు తీసికొనిపొమ్ము. నేను ఆర్ద్రహృదయనై నీకు ఇట్లు వ్రాయుచున్నాను.

నేను పదిదినములు స్వర్గములో నున్నాను. నేను ఎప్పుడు తిరిగి నా భగవంతునియొక్క ఆత్మోద్ధరణమగు

కంఠధ్వని వినగలను? ఎప్పుడు తిరిగి నేను నీపాదములవద్ద కూర్చొని నీనుండివచ్చు నాలోదూరి నన్ను భూమి నుండి పైకి ఉద్ధరింపజేయుచు ప్రపంచవిషయములన్నిటిని మరపింపజేయు ఆనందము శాంతియొక్క పరంపరలు అనుభ వింపగలను? నేను అది స్వయముగా అనుభవించువరకు ఆ యనుభవమెట్టిదో చెప్పజాలను. నీవు మానవునివలె కనుపడుచున్నావు. అట్టిశక్తి ఎక్కడ దాచిపెట్టినావు? ఆహా! అది చాల ఆశ్చర్యకరము. వింతగొల్పునది. సత్సం గమునందు ప్రసాదము పంచిపెట్టునప్పుడు నన్ను మరువ కుము. నేను ప్రతిదినము అక్కడ నీకాళ్ళదగ్గరనే కూర్చుం దును. నీవు అక్కడనుండి ఒక చేతితో ఒక కన్ను మూసి కొనుచు ప్రపంచమునకు దూరముగా భగవంతునిలో నిమ గ్నుడవై యుందువు. అది యొక స్వర్గీయమైన దృశ్యము.

స్వామిజీ! దయచేసి నా ఉత్తరములు చదువుకొని నాకు జవాబు నిండు. మీ యుత్తరములే నాజీవితము. నేనిచట వానిబలముమీదనే నిలిచియున్నాను. అదిలేనిది నేనిక్కడ జీవింపజాలను. దయచేసి ఈ నిరాధార ఆత్మ యందు ప్రేమగలిగియుండుము. నీ దివ్యపాదములకు ప్రణా మములు చేయుచు నేను నిలిచిపోయెదను.

చెల్లా.

## 2. శివానందుడు నా ఆండవన్*

తమరు దయతో తొందరగా వ్రాసిన పవిత్రములగు ఉత్తరములకు నేను మీకు ధన్యవాదము లిచ్చుచున్నాను. నాకు ఎంతసుఖము ఆశ కలిగినదియో మీరు ఊహింపజాలరు.

నేను మీపై ధారణచేయునపుడు మీ హృదయము నుండి ప్రకాశమానమగు పళని ఆండవన్ రూపము నాకు కనిపించును. కాని నా ఆండవన్ యొక్క ముఖము మీ ముఖముగానే యున్నది. అవును నేను పళని ఆండవన్‌ను ధ్యానము చేయునపుడు మీ రూపముతో కనుపడమని కోరియున్నాను. అవును భగవంతుడు నేను పూజించురూపము లోనే కనిపింపనిమ్ము. మీరు కనిపించనప్పుడు నాకు బాధగా నుండుమాట వాస్తవమే. మిమ్ములనే జ్ఞప్తియందుంచు కొనుటవల్ల మిగతవిషయము లన్నిటియందు నా చూపు మసకగానే యుండును. ఆ ఖాళీ మాసములందు ఏమి చేయవలెనో నాకు తెలియకుండెను. ఇతరులవాక్కులు నేను పర ధ్యానముతో విందును. మిమ్ములను తెలిసికొనుసమయము నాకు జ్ఞప్తియందు లేదు. అక్కడ నేను అనుభవించిన ఆనంద నిమిషములు నా హృదయమందు నిలిచియున్నవి. వానిని నేను ధనమువలె కాపాడుచున్నాను. నాకు ఉన్న విలువ గల నగ 'ఓం'. అది యెల్లప్పుడు నా హృదయమువద్దనే

---

* తమిళ భాషలో ఆండవన్ అనగా (ఏలినవాడు) భగవంతుడు అని యర్థము.

యుండును. ధ్వనితోకూడిన ఈ పట్టణమందు అనేకమంది మధ్యనున్నను బాధాకరమగు ఏకాంతమందు ఉన్నట్లు ఊహించెదను. మరియు అట్టి కొన్నిసమయములందు హృదయమందు కత్తి గ్రుచ్చునంతబాధ కలుగును. అందరు నాయందు ప్రేమగలిగియుండుటకు నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. నేను వారితో ఆట్టేకాల ముండనని వారికి తెలిసినదా? నేను మీకు వ్రాయుట అను సంతోషములో పూర్తిగా మునిగియున్నాను. నేను మీకు నా మనస్సులోని సంగతులన్నియు తెలిపినతరువాత నాకు తేలికగానుండును. దయతో నన్ను క్షమించవలెను. నేను నాదాననుకాను.

నాయందు భగవంతునికి దయగలదని నేను చెప్పవలసియున్నది. ఒక్కరోజు తప్ప ప్రతిదినము మీ విషయమై కలవరించుచున్నాను. నా దృశ్యములు కలలు నాకు మానసికశాంతి కలిగించుచున్నంతవరకు వానియొక్క అద్భుతము అర్థము విషమై నాకు ఆలోచనలేదు.

నీయుత్తరమే నాకు శాంతి కలుగజేయునది. అది నా ఆహారము. పానీయము. నా జీవితముయొక్క ఊపిరి. అది లేనియెడల నేను చనిపోయెదను లేదా అది లేనందున పిచ్చి ఆసుపత్రిలో చేరుదును.

నేను ఇచ్చట ప్రాపంచికసౌఖ్యములతో చుట్టబడియుందును కాని వానిని అనుభవింపలేను. నాకు తుషారస్నానము కలిగినప్పుడు గంగామాయి నాకు కనిపించదు.

నేను మంచునీరు త్రాగునప్పుడు తీపితోకూడిన పవిత్ర గంగా జలము నాకు కనిపించదు. నేను పంకాక్రింద పరుండునప్పుడు ఋషీకేశములోని నా యింటివద్దనుండు తాజాగాలి నాకు కనిపించదు. నేను రేడియో వినునప్పుడు భజన యింటి యందలి సంగీతము మరచెదను. నేను పాండురంగ రికార్డు పెట్టుదును. ఆ రికార్డుయొక్క మాటలు చాల తీపిగా నుండును. అది నన్ను సౌఖ్యపరచును. అది నా ఆత్మ యొక్క అరపు.

గురునాథా! దినమందలి ప్రతి ఘడియయందును నేను నీతో తాదాత్మ్యము పొందుచున్నాను.

చెల్లా.



# 3. ఒకానొక భక్తుని మనఃపూర్వకమైన ప్రార్థన

గురుదేవా, మిక్కిలి ప్రేమింపబడిన ప్రభూ !

ప్రేమ విధేయతలతో నీదయగల పాదములకు సాష్టాంగ ప్రణామములు.

నా ప్రభూ ! మీరు నాయందు అంతదయచూపుటకు నేనుచేసిన సేవయేమున్నది ? నా ఆధ్యాత్మిక దినచర్యపై మీరు వ్రాసిన విమర్శ నిన్ననాకు చేరినది. నేను ఏమి చెప్పవలెనో నాకు తెలియదు. నాకు పూర్తిగా అనుభవమైనది. మీరు వ్రాసిన విషయములకు నాకు అర్హత లేదని నాకు తెలియును. కాని మీకు నాయందు అట్టి దయకలిగినందుకు నాకు పరమానందము కలిగినది. నేనేదైన మంచి చేయుచుండిన అట్లు మీరే నాచేత చేయించుచున్నారు. నాయంతట నేను విడిగా నుండలేను. నేను నాయందున్నదంతయు ఖాళీచేసి ఆస్థలమంతయు మీకొఱకు పవిత్రమైన దివ్యప్రేమతో నింపినాను. నేను మీకు పూర్తిగా శరణాగతులాలనైనాను. మరియు నేను ఇప్పుడు చేయునదంతయు మీరుచేసినదియే. మీరు వ్రాసిన సంగతి నాకు గర్వము కలిగింపలేదు. కాని మీరు ఆమోదించినపనులే చేయగల నాకోరికను బలపరచినది. ఓ భగవానుడా! నీవు నాలో ఎంత మార్పు తెచ్చినావు! నాకు ఇరువదినాలుగు గంటలు ఒకే ఊహ. భాగ్యము అధికారము మర్యాద

మరియు ప్రతివస్తువు నేను ప్రయత్నముచేయు వస్తువుతో పోల్చినయెడల అన్నియు చాల నీరసముగా స్వల్పముగా కనిపించుచున్నవి. నీవు సంతోషముగ ఆరోగ్యముగనుండుటయే నా యొక్క ప్రత్యేక ఊహ. భగవంతునికి నా ఏకప్రార్థన ఏమనగా నా హృదయపూర్వకముగా నిన్ను సేవించుటకు నాకు అవకాశమివ్వమనియు నీకు సంతోషము కలుగజేయు ఏపనియయినను చేయుటకు నాకు అవకాశములు ఇవ్వమనియు నీ మంచికొరకు నేను బాధపడుటకు అవకాశములు నాకు ఇవ్వమనియు. మరియు నీకేదైన జబ్బుగలిగేయెడల ఆ జబ్బు నాకు మార్చుమని భగవంతుని ప్రార్థించుచున్నాను. మీకుచేతనైన మీ అతిమాత్రవ్యాధి నాకు మార్చవలెను. భగవానుడు దానిని నాకు మార్చనిమ్ము. నేను ఆప్యాయముగా అందుకు ఒప్పుకొందును. అట్టి నిస్వార్థమైన పవిత్ర ఊహలు ఉన్నట్లు నాకెన్నడు తెలియదు. ఆ ప్రకారము ఊహించుటకుకూడ భగవంతుని కటాక్షముండవలెను. భగవంతుడు మీకు దీర్ఘాయుర్దాయము మరియు ఆరోగ్యము ఇచ్చుగాత! మీ ఉనికి అనేకమందికి కావలసియున్నది. నా జీవితముకూడ మీకు కలుపుకొనుడు. నా మరణము కొద్దిమందికిమాత్రమే బాధకలుగజేయును. ఇదియే నా మనఃపూర్వకమైన ప్రార్థన. నేను మీ కాళ్లకు సాష్టాంగపడుచున్నాను.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 4. ఆశ్చర్యకరమైన మార్పు

గురునాథా! నా ప్రియమైన ప్రభూ!

దివ్యప్రేమతోను మరియు మర్యాదతోను మీ పవిత్రపాదములకు ప్రణామము చేయుచున్నాను. 2 వ తేది గల మీ ఉత్తరమునకు మీకు ధన్యవాదములు.

తమదయకు నేను మీకు ఎంతని ధన్యవాదములు చేయగలను! మీరు దయకు తెలివికి సముద్రమువంటివారు. మీరు ఇతరుల బాధలు తగ్గించవలసివచ్చినపుడు మీ కష్టములు లెక్క చేయరు. భగవంతుడు మీదయకు నన్ను తగినదానినిగా చేయుగాక. నా మనస్సుయొక్క నిరంతర బాధ భగవంతుడు నాకు అపుడప్పుడు కలుగజేయు ఆనందముతో ప్రతిఫలమిచ్చుచుండును. నేను ఎల్లప్పుడు ఒకే మనుష్యుని విషయమై ఆలోచింతునని ఎన్నడును అనుకొనలేదు. కాని యిపుడు నేను నా భగవంతుని ఇరువది నాలుగుగంటలు తలచుకొనుచున్నాను. నా నిద్రలోకూడ అతడు నాకు మరపురాడు. కొన్నిసమయములందు ఈ ప్రపంచజీవితమునుండి తప్పించుకొనవలెనను కోరికలో నేను మునిగియుందును. నాకు ఇచ్చట భగవంతుడు ఏర్పాటుచేసినపని చేయుటకు నేను నా ఆత్మశక్తి అంతయు ఉపయోగింపవలసి వచ్చుచున్నది. నేను ఈశక్తినుండి తప్పించుకొనవలెనని అన్ని ప్రయత్నములు చేసితిని; సినీమాలు చూచుటకు వెళ్ళితిని. కాని అక్కడ జరుగుచున్న

డ్రామాకాక ఋషీకేశము డ్రామా నా కళ్ల యెదుట కనుపడుచుండెను. క్లబ్బుకు వెళ్ళుటకు ప్రయత్నించితిని. అచ్చట కూడ నాకు ఓటమియే తటస్థించెను. సాయంకాలములందు నేను ఒక్కపనియే చేయుటకు ఇష్టపడుచుంటిని. రేడియో పెట్టి భక్తిసంబంధమైన సంగీతము వినుచుందును. కాని అచ్చట సత్సంగమునకు హాజరైనట్లు ఊహించితిని. మరియు నా దేవునిపైననే ధారణచేయుచుంటిని. సాయంకాలము షికారు వెళ్ళుటకు ఇష్టములేనందున నాభర్తకు అసౌఖ్యము గలుగుచుండెను. కాని నేను ఏమిచేయగలను? అది భగవంతుని పని! నేను భగవంతునికి శరణాగతురాలనైతిని. ఆయన నేను చేయవలసినది చేయునట్లు చేయునిమ్ము. నేను అసహాయురాలనుగా నున్నాను.

స్వామిజీ! నేను ఏకత్వభావము వృద్ధిపొందించుకొనుటకు చాల ప్రయత్నము చేయుదును. కాని అది అంత సులభముగా లేదు. బహుశా అది అలవాటుపడుటకు చాల కాలముపట్టును. మీరు నన్ను చేయవలసినదిగా చెప్పినపని ఎంత కష్టమైనను సాధ్యమైనంతవరకు చేయుటకు ప్రయత్నించెదను. కాని తమరు ఇప్పటివలెనే నాయందు దయగలిగి యుండవలెను. అదియే నాకు బలమునిచ్చును. నేను మీ దయకు పాత్రురాలనైయున్నాను. నేను అణకువతో మిమ్ములను ఒకటి కోరుచున్నాను. నేను ఆటగా ఆధ్యాత్మిక జీవితము ప్రారంభించలేదు. అది నా జీవితముయొక్క ముఖ్యోద్దేశమైయున్నది. నేను ధ్యేయము చేరుటకు ఆసక్తితో

నున్నాను. అందుకొరకు మీకు అనేకవిషయములు - స్వంత ములు రహస్యమైనవి కూడ వ్రాయవలసివచ్చును.

నా ధ్యేయము నేను జేరుటకు నాకు త్రోవ మృదువుగా నుండుటకును తగిన శక్తిగలుగుటకును భగవంతుని ప్రార్థించుచున్నాను. మరియు త్వరగానో ఆలస్యముగానో అతడు నా ప్రార్థన వినక తప్పదు. సరియైనకాలము వానికి తెలియును. ఓ భగవానుడా! ఈ ఆధ్యాత్మిక జీవితము నా నెత్తురులో మాంసములో ఎముకలలో ఎట్లు చొరబడినదో నీకు తెలిసిన నీవు తప్పక నాయందు కరుణగలుగును. భగవంతుని మార్గములు చాల ఆశ్చర్యకరములు. నేను వారికి శరణాగతుడను. నేను దేనివిషయమై బాధపడుచుంటినో వారికి తెలియును. అతనికి నా ఉద్దేశముయొక్క పవిత్రత తెలియును. నా ఊహాలు నిస్వార్థములు. అట్టి స్థితిలో అతడు నన్ను ఎట్లు విడిచిపెట్టును? నాకు ఏదిమంచిదో అతనికి తెలియును.

ఈరోజులలో నేను దీర్ఘమైన ధ్యానములో నున్నప్పుడు నేను కొంతసేపు నా ఊపిరి దానంతట అది ఆగినప్పుడు నేను ఆ ఆనందస్థితిలోనికి వచ్చినప్పుడు నా గొంతుకలో నొక కితకితపెట్టు స్పృహగలిగి దగ్గువలెవచ్చి నేను వెళ్లిన ఉచ్ఛస్థితినుండి కదల్చి క్రిందకు దింపును. ఇది తప్పించుకొనుటకు నేను ఏమిచేయవలెనో దయచేసి నాకు తెలియపర్చుము. నేను ప్రార్థన జపము ధ్యానము 4 నుండి 5-30 వఱకు 4-30 నుండి 6 వరకు మరియు 10 నుండి

10-30 వఱకు చేయుదును. ఇది సరిగానున్నదా? నేను జప మాల ఉపయోగించను. ఎందువల్లననగా లెక్కపెట్టుటవల్ల నా ధారణకు ఆటంకము కలుగును. అది ఉపయోగించుట అవసరమా? నేను చేయు ప్రాణాయామము వృద్ధి చేయవలెనా?

గురూజీ! నన్ను క్షమించవలెను. నేను నీకు కొద్ది పాటిఉత్తరములు వ్రాయజాలను. నేను మరల ప్రయత్నించెదను.

ప్రతిదినము ఉదయము 8 గంటలకు నేను నీకు ఒక పూలహారము ఇచ్చెదను. ఇది నీవు అచ్చట స్వీకరించి ప్రతివిషయమందు నీమీద ఆధారపడుచున్న యీ దీనురాలిని ఆశీర్వదింపుము. నేను మీయొక్క ఆరోగ్యము విషయమై ప్రతిదినము ప్రార్థింతును.

మీ దివ్యపాదములకు పరమభక్తితో ప్రణామము చేయు,

చెల్లా.

———

# 5. ఆంతరిక మేలకువ

గురుదేవా, నా ప్రియమైన ప్రభూ!

నీ దివ్యచరణములకు గౌరవముతోను ప్రేమతోను మ్రొక్కుచున్నాను. 7 వ తేదీగలిగి దయతో వ్రాసిన నీ ఉత్తరమునకు ధన్యవాదములు.

1 వ తేదీ ఆదివారము కావున జనరల్ పోష్టాఫీసుకు తప్ప మిగతా ఆఫీసులకు సెలవు. కావున మీకు ఉత్తరము త్వరగా అందుటకు దానిని జనరల్ పోష్టాఫీసుకు తీసికొని వెళ్ళినాను.

దయగలప్రభూ! మీఉత్తరము నాకు చాల మన శ్శాంతిని గలుగజేసినది. మీరు ఏమిచెప్పిన అది తప్పక జరుగునని నాకు గట్టి నమ్మకముగలదు. నేను ఓపికతో వేచియుందును. నేను మీప్రక్కనుండి మీ ప్రతి మంచి పనియు ఆప్రకారముచేయుటకు నేర్చుకొనుటకు నాకు ఆసక్తి కలదు. మరియు ఆప్రకారము చేసి మీకు నిజమగు శిష్యు రాలను కాదలచుచున్నాను, నేను ఫోటోలో భగవానుని పోలు మీ ముఖము చూచునప్పుడు దానికి జీవము ఉన్నట్లు ఆశ్చర్యపడుచుండు దానను. మిక్కిలి గౌవరమైన జీవితము గడపగల ఉద్దేశములు మీరు నాకు చెవిలో చెప్పినట్లు ఊహించితిని. మరియు మీచిత్రమునుండి ఒక విధమగు ఆధ్యాత్మిక ప్రకాశము వ్యాపించుచున్నట్లు నాకు నమ్మకము తోచెను. అట్లుగాక ఆచిత్రము ద్వారా నా ఆత్మ

నీఆత్మను చేరినదా? నాధ్యేయము నేను చేరుటకు నాకు సహాయముచేయవలసినదని నాశక్తికొలది భగవంతునితో మాట్లాడుటకు శక్తిగలుగుటకు చాల ఆశ్చర్యము విచిత్ర మగుచున్నది. మరియు నానిర్మలమైన ప్రార్థన వారు తప్పక వినుదురని నాకు నమ్మకము. అప్పుడప్పుడు నాకు ఆసక్తి లేని విషయములందు ఆసక్తి ఉన్నట్లు నటించుట మరియు నాకు రుచించని సంభాషణను నేను విని దానిలో పాల్గొనుట జరిగినపుడు నేను విసుగుచెందిన దానివలె నుందును. ఈప్రకారముగా నేను ఎంతకాలము జరపగలను? బాహ్యమై అదృశ్యమై బలవంతమైన ఒత్తిడి నాహృదయమును పట్టు కొని. నన్ను తనయిష్టము వచ్చిన పనులు చేయించుచున్న ట్టియు, ఆఊహాలు నావికావని నేను ఊహించిన విషయ ములు ఆత్మవిశాలమై నాశరీరమునుండి వెడలి ఈవిచిత్ర మైన ఒత్తిడిని కలిసికొనదలచు విషయములు అట్టివి కొన్ని యున్నవి. అట్టి సమయములందు ప్రపంచమంతయు అబద్ధ ముగా కనిపించును. నాసొంత మనుష్యులే నాకు పరాయి వాండ్ర వలె కనిపింతురు. అప్పుడు నేను నాత్రోవ తప్పి యుంటిననియు నాస్వంతయిల్లు కాక క్రొత్తస్థలమునకు వచ్చితిననియు నాకు తోచును. మరియు అప్పుడు ఇచ్చట నుండి తప్పించుకొని నేను ఉండవలసిన చోటికి పారిపోవు టకు తీవ్రమైన కోరిక కలుగును. ఈసమస్య తీర్చుటకు నాకు భగవంతుడు సహాయము చేయునుగాక. మీకు నేనుపంపిన పార్సిలు ముట్టినట్లు మీవద్దనుండి ఉత్తరము వచ్చునని తో

యింకను వేచియున్నాను. అది మీకు అందుటకు ఇంత కాలము ఎందుకు పట్టినది?

నా ప్రభూ! దయచేసి మీరు మీ ఆరోగ్యము విషయమై జాగ్రత్తగా నుండుడు. ఇచ్చట వేసంగి ప్రారంభించినది. అక్కడ వేసవి యెక్కువ తీక్ష్ణముగా నుండియుండును. ఇప్పుడు మీకు విశ్రాంతి యెక్కువ కావలెను. మీరు భగవానులు. కాని యీ మనుష్య శరీరముతో కప్పబడియున్నంత వఱకు మిమ్ములను సంరక్షణ చేయుటకు మావంటి డాక్టర్లను మీరు అనుమతింపవలెను. మరియు మీరు మా మాట వినవలెను.

ఇప్పుడు మీ పాదములకు ప్రణామములు చేసి ఆగెదను. నేను మిమ్ములను మీ కరుణను ఎపుడును తలచుకొనుచుందును.

—చెల్లా.

# 6. శివానందులు-వారి మూర్తి మత్త్వము ఆధ్యాత్మిక అధికారము

నేను మీ పవిత్రపాదములకు దివ్య భక్తి ప్రేమలతో ప్రణామములు చేయుచున్నాను. దయతో గూడిన మీ శీఘ్రమగు జవాబునకు ధన్యవాదములు. దయతో గూడిన మీ ఉత్తరము చదువుట ఎంత ఉపశమనము!

ప్రభూ! ఓ నా పవిత్రగురూ! జీవించియుండు భగవంతునికి నేను ఉత్తరములు వ్రాసి జవాబు తెప్పించుకొనుట చాల ఆశ్చర్యమును ఆనందకరమును. నా కష్టములన్నియు తమ పాదములవద్ద తెలుపుకొని తక్షణము ఉపశమనము గలుగుట, అంతకాలము తమ ఆధ్యాత్మిక ప్రకాశముచే చుట్టబడియుండుట నాకు మిక్కిలి అవసరమైనపుడు నిర్మలత్వము గలుగజేయు ఉనికి, ప్రాకృతిక లాభమేమియు కోరక నా స్వంత తృప్తికొఱకు నిన్ను పూజించుట, తమరు పరిపూర్ణులు నన్ను రక్షించి మార్గము చూపగలరని నమ్మి మీకు పూర్ణముగా శరణాగతనగుట—ఇవియన్నియు ఆశ్చర్యకరమైనవి. ఆనందకరమైనవిషయములు. అట్టి ఆశ్చర్యకరమైన విషయములు అనుభవించవలసినవే కాని చెప్ప వీలుకానివి. నాకు మిక్కిలి గొప్ప గురువును ఇచ్చినందుకు భగవంతునకు మరి మరి ధన్యవాదములు సమర్పించుచున్నాను. తగిన శిష్యురాలని భగవంతుడు నన్ను దీవింపనిమ్ము. అప్పుడప్పుడు మిమ్ములను చూడవలెనని కలుగు తీవ్రమైన కోరికతప్ప

ఇప్పుడు నేను సంతోషముగానే యున్నాను. మీ పుస్తకములు చదువుమని మీరు నాకు చెప్పనవసరము లేదు. ఒకరోజుకూడ వానిని నేను చదువక విడుచుట లేదు. మీ పుస్తకములు నా వైద్యశాలకుకూడ తీసికొనిపోయెదను. గురుదేవా! మీరు ఎన్ని ఆకర్షణీయములగు పుస్తకములను వ్రాసినారు! మీ శిష్యులకందఱకు వానిని ఉచితముగా పంపుటకు మీకు ఎంత ఔదార్యము కలదు. వానిని చదువుట వల్ల మిక్కిలి గొప్ప సుఖము మనశ్శాంతియు గలుగును, మీరు నిజమైన దివ్యభాష ఉపయోగించితిరి. మీ ఆకర్షణ శక్తి మీ ఉత్తరములయందు మాటలయందు కలదు. నేను మీ పుస్తకములు చదువుచుంటిని. మీరు నాయెదుట నిలుచుకొని వానిలో వ్రాసినవిషయములు నాకు చెప్పు చున్నట్లు నాకు స్ఫురించినది. మీ వాక్యములయొక్క సారము లోనికిపోయి నా మనస్సుయొక్క ముఖ్యభాగమునకు స్పందనము కలుగజేసి మీ సలహాప్రకారము నడుచుకొను టకు పురికొల్పుచున్నది. ఆ మాటలు చాల శక్తివంతములు. నమ్మకమైనవి. ప్రార్థనపూర్వకముగా నుండును. కాని చాల సామాన్యపు మాటలు. అవి చదువుటచే మంత్రము పఠించిన లాభము కలుగును. ప్రపంచమందలి సౌఖ్యహీనులును, అజ్ఞానులును నగు అనేకజీవులు తమ్ము సరియైనమార్గమున నడుపువారు లేక బాధపడుచున్నపుడు మీరు వారిని ఉద్ధరించుటకు తీక్ష్ణమైన నమ్మకమైన ఆసక్తితో నుండుట ప్రతి వ్యక్తియు ఆమోదించును. మీ బోధలోని సూత్రము

లన్నియు కూర్చి ఒక పఠన గ్రంథముగా స్కూళ్ళలో ఏర్పాటుచేసిన పిల్లలకు చాల సహాయకారిగా ఉండును. నాకు చిన్నతనములో మీ గ్రంథములు చదువుటకు అవకాశముగలిగిన నేను తప్పక యిప్పటికి వేఱు మనిషినిగా అయియుందును. నేను వృధా పుచ్చిన 40 సంవత్సరముల విషయమై ఆలోచించిన నాకు చాల విచారముగా నున్నది. బహుశా ఇది నేను నా గతజన్మములో చేసినకర్మకు శిక్షయై యుండవచ్చును. ఇప్పుడు భగవంతుడు నాకు మీతో సాంగత్యము కలిపినాడు. మీ ఉత్తరములు అందుకొనుట నాకు చాల ఉపశమనము. మరియు కొన్నిరోజులు మీయొద్దకు వచ్చుటకు అనుజ్ఞ యిచ్చుట, అధమపక్షము నాయిల్లు చూచుట అచ్చట నాకు గలుగు ఆనందము తెలిసికొనుట నాకు చాల ఉపశమనముగా నున్నది.

చెల్లా.

# 7. దయతోగూడిన తమ అనుగ్రహము నన్ను రక్షించినది

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

భక్తితో దివ్యప్రేమతో మీ దివ్యపాదములకు సాష్టాంగప్రణామములు చేయుచున్నాను. మీరు దయతో వ్రాసిన ఉత్తరము నిన్న చేరినది, అందుకు మీకు ధన్యవాదములు. నేను 5-వ తేదీన వ్రాసినజాబు మీకు అంది యుండును.

అవును. భగవంతుడు నాయందు చాల దయగలిగి యుండెను. ఎందువల్లననగా ఆయన నాకు తెలివితేటలు, దయ, ప్రేమ సహనశక్తిగల గురువును దయచేసినాడు. అందులకు నేను ప్రతిదినము ధన్యవాదములు సమర్పించు చున్నాను. మిమ్ములను ఇదివరలో కలిసికొనకుండ భగవంతుడు ఎందుకు చేసినాడో యిప్పుడు నాకు తెలిసినది. మిమ్ములను నేను ఎప్పుడు కలిసికొనినను అప్పుడు గుర్తు పట్టగలనని ఆయనకు తెలియును. కాని నేను మిమ్ములను లోగడనే కలిసికొనిన నాపరిస్థితి వేరుగా నుండెడిది. అప్పుడు నేను మిమ్ములను మఱచిపోయియుందును. కాన నేను కొంత వృద్ధిపొంది మిమ్ములను సరియైనవిధముగా తెలిసికొనువరకు ఆయన నన్ను ఆపినాడు. భగవంతుడు నన్ను విడిచిపెట్టడు. నేను నా చిన్నతనమునుండి ఆయనను మనస్ఫూర్తిగ

ప్రేమించి ప్రార్థించుచున్నాను. ఆయన నాకు సౌఖ్యము ప్రేమ అయి యున్నాడు.

స్వామిజీ! మీరు నాకు ఇప్పుడు ఎట్లు సహాయము చేయుచున్నారో ఆప్రకారమే ముందుకూడ సహాయము చేయుచుండుడని కోరుచున్నాను. ఏది యెట్లు జరిగినను ఏదో ఒకదినమున నన్ను పరమధ్యేయమునకు తీసికొని వెళ్ళ గలరను ఆశతో నేనున్నాను. నేను మిమ్ములను ఎడబాసి ఉండుటకు నాకు కావలసిన బలము దయచేసి నాకు ఇవ్వ వలెను. మరియు నా ప్రపంచకర్తవ్యములుకూడ శ్రద్ధతో పూర్తిగా చేయుటకు కావలసిన శక్తికూడ దయచేయవలెను. ఆత్మ ఎల్లప్పుడు ఇంకొకచోట నుండవలసియుండుటకు ప్రయత్నించునప్పుడు శరీరమును ఇంకొకచోట నిలుపుట ఎంత కష్టమో మీరు గ్రహింపలేరా!

ఈ నా పోరాటము ఎప్పుడు పూర్తియగును? ఎట్లు ఎది ముగింపబడును? ఒక విషయముమాత్రము నిజము. ఇపుడు నాకు కలిగిన యీ పరిస్థితులలోనుండిన ఉచ్చమైన ఆధ్యాత్మికస్థితిని చేరుటకు సాధ్యముకాదు. నేను కొద్దిగా వృద్ధికావచ్చును. నావృద్ధిలో కొంత ఉచ్చస్థితి వచ్చువరకు ఆయన నాకు ఏర్పాటుచేసిన కర్తవ్యములు నేను పూర్తిగా నెఱవేర్చువరకు నేను ఇచ్చటనే యుండవలయునని భగ వంతుడు బహుశా ఊహించియుండవచ్చును. బహుశా నా శిక్షణ యింకను పూర్తికాలేదు కాబోలును. నేను ఏదో తప్పుచేసి యుండవచ్చును. లేనియెడల భగవంతుడు నాకు

మీకు ఎడబాటు గలిగించియుండదు. ఇదివరలో నేను మీతో తప్పక కలిసియుంటిని. నేను లోగడ ఎన్నడును లేనిచోట్ల మీతో నుంటినని నాకు అనేకమైన కలలు స్పష్టముగా కనిపించినవి. నేను మీ శిష్యురాలినై యుండవచ్చును. ఏది ఎట్లున్నను భగవంతుని ఆజ్ఞ ప్రకారము నేను మీకు శరణాగతనై యున్నాను. మరియు నన్ను సరిగా నడుపుట ఆ భగవంతునకే విడిచిపెట్టుచున్నాను. నా ప్రియమైన ప్రభూ! దయచేసి నాకొఱకై ప్రార్థింపుడు. అనగా తమరు భగవంతుని తాదాత్మ్యముపొంది నా సమస్య పరిష్కరింపుడు. నేను ఓపికతో వేచియుందును. మీద్వారా ఆయన నాకు తన యిష్టమువచ్చినప్పుడు ఇష్టమైనమార్గమున సహాయము చేయనిమ్ము. కాని నా కోరికలు కష్టములు అంతవరకు నేను సహించుటకు నాకు బలము ఇవ్వవలసినదిగా ప్రార్థింపుము.

ఈ అహము పోగొట్టుకొనుటకు నేను ఏమి చేయవలెనో దయయుంచి తెలియపరుపుము. నేను మీ నవుకరును. మీరు సలహా యిచ్చినట్లు నేను చేసెదను.

ఒక చెడుశక్తి నావృద్ధిని ఆపివేయుటకు ప్రయత్నించుచున్నదని నేను భయపడుచున్నాను. నాకు భయంకరమైన కల వచ్చినది. నే నొక నూతనగృహములో నుంటిని. మీతో కొంత సంభాషణ జరిగినపిమ్మట నేను మేడమీద ఒక గదిలో నిద్రపోవుచుంటిని. అదియొక పరాయిగృహము. నాగది మెట్లకు దగ్గరనున్నది. నేను నాపడకవద్దకు వెళ్లినప్పుడు రెండు నల్లని చిన్నరూపములు చేతులలో కత్తి

ఉంచుకొని నాకు కనిపించెను. నా గురువుగారి కృప నాయందున్నంతవరకు నన్నేమియు చేయలేరని నేను వారితో చెప్పితిని. అప్పుడు వారిద్దరు నా నెత్తిమీద చెరి యొక దెబ్బ కొట్టి యిట్లనిరి: 'ఇప్పుడు మీ గురువు నిన్నెట్లు రక్షించునో చూచెదము.' నేను ఒక విచిత్రమైన ఊహతో ఆ మెట్లమీదనుండి క్రిందకు దొర్లితిని. ధ్యానము ఉచ్ఛ స్థితిలో నున్నప్పుడు ఆధ్యాత్మికశక్తి ఎట్లు వృద్ధియగునో మీకే తెలియును. ఈ దెబ్బవల్ల అది క్రిందకు తగ్గిపోయి నట్లు నేను ఊహించితిని. కాని మెట్లక్రింద మీరు నన్ను చేతులతో ఎత్తితిరి. నేను సౌఖ్యముగా నుంటినికాని కొన్ని రోజులవరకు నేను ధ్యానము చేయలేకపోయితిని. కాని యిప్పుడు నేను కులాసాగా నున్నాను. ఏదయిన చేయవలసి యున్న యెడల దయచేసి దానిని చేయుడు. నేను కొంచెము బలహీనముగా నున్నాను.

చెల్లా.

# 8. ఒక ఆధ్యాత్మిక అనుభవము

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

భక్తితో దివ్యప్రేమతో మీ పావనపాదములకు సాష్టాంగములు. తమరు దయతో వ్రాసిన ఉత్తరము నిన్న అందినది. ఓ భగవంతుడా! మీరు ఎంతో సౌఖ్యమునకు ఆనందమునకు మూలము. మీరు వ్రాసిన ఉత్తరము చదివినతరువాత నేను వేరువ్యక్తిని అయినట్లు ఊహించుచున్నాను. నేను సంతోషముగను, రక్షింపబడినదానిగను, ఆదుర్దాలేని దానిగను అనుకొనుచున్నాను. మరియు ఈ ప్రపంచమందు ఎట్టి కష్టపరిస్థితి తటస్థించినను కష్టము కనిపించుటలేదు. ఆధ్యాత్మికజీవితములో పొందదగు దివ్యానందము ఈ నా మర్త్యజీవితముయొక్క అస్థిరత్వము ఈ రెండింటిపోరాటము నన్ను పరమ ధ్యేయమును చేరుటకు ప్రయత్నింపజేయుచున్నది. బహుశా భగవంతుడు నన్నిట్టి స్థితిలో నుంచియున్నాడు. ఎందువల్ల ననగా ఎడబాటులేని యెడల తనయందుండు భక్తిపారవశ్యము పూర్తిగా అనుభవమునకు రాదని ఆయనకు తెలియును. నేనుమటుకు నాకు ఏదో ఒక్కకర్తవ్యమే యున్న బాగుండునని కోరుదును. అట్టి కర్తవ్యము ఎల్లప్పుడు నా శాశ్వతభక్తి నా భగవానునికి ప్రవహింపజేయుటయే.

నా ప్రభూ! ఈ క్రూరమైన వేడిగాలి మిమ్ములను చాల అలసట చెందునట్లు చేయరాదని నేను ఆశించెదను.

ఓహో! మీరు ఎక్కువగ విశ్రాంతి తీసికొనుచున్నారని ఎల్లప్పుడు మీయందు భక్తిగల దయతోఁగూడిన శ్రీ సచ్చిదానందస్వామి మీ సౌఖ్యములు పరామర్శించుటకు అక్కడ నున్నారనియు తెలియుటచే నాకు చాల ఉపశాంతి కలుగుచున్నది.

అప్పుడప్పుడు నన్ను ఆకర్షించు ఈ ఆశ్చర్యకరమగు ఊహాలను అనుభవించిన తక్షణము నేను మీకు ఇది వ్రాయుచున్నాను. అపుడపుడు ఈసుఖము రోజుకు అనేక సార్లు కలుగును. ఇట్టి మామూలు అనుభవము ప్రతి సాధకునికి కలుగునది లేనిది దయచేసి తెలుపుడు. నేను దాని విషయమై అపుడపుడు అధైర్యపడుదును. అది ఆధ్యాత్మిక వృద్ధియొక్క గుర్తా లేక మానసిక అపభ్రంశముయొక్క గుర్తా? నేను దానిని ఉన్నదున్నట్లుగా వర్ణించెదను. అది నా హృదయములో ఒక జలదరింపుగా మొదట బయలు దేరును. తరువాత హృదయమందు ఒక ఆకర్షణీయమైన ఆనందముతోఁగూడిన ఆకర్షణ కలుగును. అందు నా దృష్టి అంతయు హృదయమువైపునకు లాగును. అవును. ఆ సరియైన స్థలముగూడ నేను చూడగలను. అది ఊపిరితిత్తుల మధ్య భాగమందు వెనుకవైపున నొకచోట కనిపించును. అప్పుడు ఏదియో యొక కారణము నన్ను కండ్లు మూసికొనునట్లు చేయును. కండ్లు వాటంతట అవి లోనికి ముడుచుకొనును. నేను నిలుచుండలేనని ఊహించెదను. నేను అసహాయురాల నని ఊహించెదను. అపుడు నేను పూర్తిగా కరుణరహిత

ముగా ఒక ఆశ్చర్యకరమైన శక్తికి స్వాధీనపడవలసి వచ్చును. నేను నా గుండెయొక్క ధ్వని వినగలుగుదును. అది శక్తివంతమైనను నెమ్మదిగా నుండును. నా ఊపిరికూడ తగ్గియే యుండును. నేను నాకు తెలియని ఒక ఆహ్లాదమైన శక్తికి సంబంధించియున్నట్లు ఊహించెదను.

నేను సరియైన స్థలములో నున్నయెడల తక్షణము ధ్యానమునకు కూర్చుండెదను. నేను అట్టి సమయమందు అనుభవించు మిక్కుటమైన సంతోషము ఎంతని వర్ణింపగలను? నా ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఇంకను నెమ్మదియగును. నేను తేలికయగుదును. కొన్ని క్షణములు నా ఊపిరి ఆగిపోవును. మరియు అపుడు నా గొంతుక అణచబడినట్లుండును. నాకు భయము కలుగును. మరియు నా మామూలు స్థితికి భావములకు తిరిగివచ్చెదను. ఒకానొకప్పుడు ఈ స్థితి రోజుకు అనేకసార్లు తటస్థించును. అపుడు నాకు కలిగిన వస్తువు లన్నిటియందు నాకు అతృప్తికలుగును. తెలియనివానిని (భగవంతుని) వెదకుటకు ఆటంకము లేని ఆసక్తి పొడమును. ప్రపంచ సంబంధమైన కర్తవ్యము లన్నియు విడుచుటకు కోరిక కలుగును. మరియు నా మిగిలిన జీవితమంతయు తన వైభవముతో నన్ను పిలుచుచున్న ఆ పరమశక్తిని వెదకుటలో నా జీవిత శేషమును ఉపయోగించుటకు కోరికకలుగును. నేను అట్టి సమయములందు ఇతరులతో నుండిన నాకు చాల అసౌఖ్యముగా నుండును. కండ్లు తెఱచుకొనియున్నను నేను చాలదూరము

నందున్నట్లు ఊహించెదను. ఇతరులు ఏమి మాట్లాడుకొను నది నేను గ్రహించలేను. మరియు నాచూపు చూడ సరిగా కనిపించదు. ఈ ఊహాలవిషయమై ఆదుర్దాపడవలసిన అవ సరమేమైన ఉన్నదా? దయచేసి నాకు సలహాయిండు. ఎట్టి ఆశ్చర్యమైన జీవితము?

స్వామిజీ నా ఆత్మతో మాట్లాడి దానిని నిజమైన తెలివియను వెలుతురులో నింపుడు. ఎల్లపుడు మీ దయతో నన్ను విశ్రమింపనిండు. నన్ను తిరిగి ఏదియు మీవద్దనుండి ఎడబాటుచేయకుండ చూడుడు. నేను ఎచ్చటనైనను దూర ముగా నుండవలసియున్నను, ఆధ్యాత్మికముగా ఎల్లప్పుడు మీతో సంబంధము గలదానినిగ నన్ను ఉండనిండు. నేను శాశ్వతముగా మీదానను.

దయచేసి నన్ను డాక్టరు అధ్వర్యునికి పరిచయము చేయుడు. మీరు ప్రేమించిన అందరను నేను తెలిసికొనవలసి యున్నది. మరియు మిమ్ము ప్రేమించినవారందరు నా నిజ మైన బంధువులు.

ఫారిస్టు యూనివర్సిటీ వారపత్రిక 'శివానంద డే టు డే' పంపినందులకు ధన్యవాదములు. తమ దివ్యపాదము లకు నేను సాష్టాంగముచేసి ఆగిపోవుదును.

శాశ్వతముగా నేను మీ దానను.

చెల్లా.

# 9. జీవించియుండు నా భగవానుడు

ఈ రోజున మీ ఫోటో అందినది. దయ జ్ఞానము గల నా ప్రభూ! మీరు నాకు చేసినపనులకు సరిపడునట్లు నేను మీకు ఎట్లు ధన్యవాదములు చేయగలను? ఫోటోవల్ల నాకు గలిగిన సౌఖ్యము, శాంతి ఎంతని మీకు తెల్పగలను? నేను ఆ చిత్రము ద్వారా ఎంతసేపు పూజచేసితినో చెప్ప లేను. నేను దానినుండి నా దృష్టిని మరలింపలేకపోయితిని. శక్తిగల సూదంటురాయితో ఇనుపరజము ఆకర్షింపబడినట్లు నా దృష్టి నిలిచినది. తరువాత నాకు గలిగిన ఆనందమును నేను వర్ణింపజాలను. నేను నిరుత్సాహముగ ఉన్నప్పుడు దానివంక చూచెదను. మీయొద్దనుండి ఉత్తరమునకు ఎదురు చూచుచున్నాను. ఈ రోజు అది నాకు వచ్చునా?

నా ఆత్మయొక్క ప్రియమైన ప్రభూ! గత కొన్ని దినములనుండి నన్ను భగవంతుని పాదములయందు విశ్రాంతి పొందుటకు పరుగెత్తకుండ నుంచుటకు నా ఆత్మశక్తి అంతయు ఉపయోగింపవలసి వచ్చినది. అవును. నాకు మీ కంటె ఇంకొక దేవుడు లేడు. వానిని మీలోను మీద్వారాను చూచుచున్నాను. గత కొన్నిదినములనుండి యిక్కడ ఈ ప్రపంచజీవితము నేను భరించలేకయున్నాను. నన్ను తెలిసి కొని నా భగవంతుని విషయమై మాట్లాడునటువంటివారి యొద్ద ఉండవలెనని కోరుచున్నాను. లేనియెడల నేను జీవిం చను. నేను వేంకటేశానందస్వామిజీ తండ్రిగారియొద్దకు వెళ్ళితిని. సుశీల అచ్యుతరామన్ గారి యింటికి వెళ్ళితిని.

కల్యాణసుందరము, మీనాక్షమ్మలను కలసికొంటిని. వారు నా సంగతి తెలిసికొనిరి. మరియు నేను నీవారితో మాట్లాడుట నాకు సౌఖ్యము కలుగజేసెను. రోజంతయు నేను ధ్యానములోనే యుంటిని. దీర్ఘధ్యానమందు మనకు తెలివి గలిగినట్లే రాత్రిళ్ళు మేలుకొంటిని. ఒకవ్యక్తి నిద్రలోకూడ ధ్యానము చేయుటకు వీలగునా? స్వామిజీ నాకు వ్రాయుట యందు అశ్రద్ధచేయకుడు. అదికూడ నిష్కామసేవక్రిందనే ఊహింపుడు. మీరు ఇతరుల సౌఖ్యముకొఱకే అన్నిపనులు చేయుచున్నారు. మీరు నాకు కొన్నిపంక్తులు వ్రాసిన అవి యితరము లన్నిటికంటె నాకు ఎక్కువ సౌఖ్యమిచ్చును. నేను రోజులు లెక్కపెట్టుచున్నాను. ఇంకను తొమ్మిది మాసములున్నవి. ఆ పిమ్మట మరల మిమ్ములను నేను కలసికొందును.

నేను ఇపుడు గాజులు ఎందుకు ధరించుట లేదని కొందఱు అడుగుచున్నారు. ఏ ఊహతో నేను వానిని తీసి నా దేవునికి అర్పించితినో వారు ఎట్లు తెలిసికొనగలరు? వారి లౌకిక నేత్రములు నేను ఇపుడు ధరించుచున్న కనుపింపక మెరసెడి విలువగల దివ్యకంకణములను ఎట్లు చూడగలుగును? ఇపుడు నావద్దనున్న ఎండిపోయిన పూలదండయొక్క సువాసన స్వచ్ఛత వారు ఎట్లు తెలిసికొనగలరు? లేరు. ఇవి తెలిసికొనుటకు భగవానుని కృప అవసరము. భగవానుడు నాయందు చాల దయగలిగియున్నాడు. ఆయన నాయందు కృపాకటాక్షము ఎల్లపుడు నిలుపుటకు ఆయనకు నా శక్తి

కొలది సేవ చేసెదను. మీకు వ్రాయుచున్న విధముననే అదృశ్యముగా నున్న భగవంతునితో నేను మాట్లాడు చున్నాను. కాని యిపుడు ఆయన జవాబుకొఱకు జీవించి యున్న భగవానుని చూపించియున్నాడు. అపుడు మీమాటలను నేను దైవముయొక్క మాటలవలె ఊహించెదను. ఆయన సందేశము నాకు మీ ద్వారా అందజేయునని నాకు తెలియును. ఆయనయందు నాకు పూర్ణమైన నమ్మకము గలదు. నాకు లోగడ ఆయన తఱచు దయతో సహాయము చేసియున్నాడు. ఆయన నన్ను విడువడు. నాకు ఆయనయందు గల ప్రేమ నమ్మకము ఆయనకు తెలియును.

నేను ఆశ్రమమునకు వచ్చి మీ పవిత్ర ప్రసాదము తినుట ప్రారంభించినతరువాత నా ఆరోగ్యము వృద్ధిపొందినది. నాకు మీ ప్రసాదము లభించుట లేదు. దానిని ఇతరులకు ఇచ్చునపుడు దయచేసి నన్ను మఱువకుడు. అపుడు నేను మీ దృష్టికి మాత్రము కనిపించుచు అచటనేఉందును.

మీ పవిత్ర పాదములకు వందనములతో

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

## 10. శివానంద సమతలము

గురూజీ! నా ప్రియమైన ప్రభూ!

విధేయతతోను దివ్యప్రేమతోను కృతజ్ఞతతోను తమ పాదములకు ప్రణామములు. మీరు వ్రాసిన ఉత్తరము నాకు నిన్న చేరినది. ధన్యవాదములు. మీదయకు కృతజ్ఞురాలను. మీయొక్క కటాక్షమే నాకు శాంతిని కలుగజేయును. మీదయతో నన్ను సుఖపెట్టగోరుచున్నాను.

గతవారమునుండి నేను ధ్యానములో సౌఖ్యముగానుంటిని. లోగడ ఎప్పుడు నాకు అట్టి ఆనందము కలుగలేదు. నేను ధ్యానసమయమునకు ఆతురతతో వేచియుందును. మరియు భగవంతుని కలిసికొనుటకు నేను నాప్రార్థనగదికి వెళ్లుదును. భగవానునియొక్క తమ దివ్యశక్తితో నాకు సంబంధము గలిగిన నిమిషమున నాకు గలుగు ఆనందముతో గూడిన శాంతి వెంటనే తెలియును. అట్టి స్థితిలో నన్ను ఎప్పుడు నుంచమని భగవంతుని ప్రార్థించుచున్నాను. తమ దయతో కూడిన మీదృష్టి యీ దయనీయ ఆత్మపై అప్పుడప్పుడు నిలువపలసినదిగా కోరుచున్నాను. మరియు మీ సాన్నిధ్యము ప్రస్తుతము గలిగినట్లుగా ఎల్లప్పుడు కలుగునట్లు అనుజ్ఞనిండు. మీ ఉద్దేశము తెలిసికొను శక్తి నాకు భగవంతుని ఇవ్వనిండు. మీదయకు తగిన జీవితము గడుపుటకు కూడ శక్తి నివ్వనిండు. నేను భూమికంటె పై భాగమున నున్నట్లు ఎంచుకొనుచున్నాను. అచ్చట శాంతి,

తృప్తి, ఆనందము గలదు. మరియు చుట్టును జరుగుచున్న దంతయు నాకు స్వల్పముగా కనిపించును.

ఇట్టి స్థితికి నన్ను తెచ్చినందుకు నేను మనస్ఫూర్తిగా మీకు ధన్యవాదము లొనర్చుచున్నాను. మీవల్లనే నేను ఈ ఆధ్యాత్మిక సౌఖ్యము తెలిసికొంటిని. నేను ఆ పరమ ధ్యేయమును జేరుటకు మనస్ఫూర్తిగా ప్రయత్నించెదను. నా ప్రయత్నమును ఏదియు ఆటంకపరుపజాలదు. మీరు నన్ను చేయుమని చెప్పిన పనులన్నియు చేయుచుందును. తరువాత నన్ను నడుపుటకు భగవంతునిమీద భారము వేసెదను. నా మార్గమునందు కలుగు కష్టములన్నియు తృణప్రాయముగా కనిపించు నిమిషములు గంటలు రోజులు గలవు. నేను కోరినపని చేయుటకు తీవ్రమైన కోరిక గలదు. ఈకోరిక ఉన్నప్పుడు నాకు అడ్డంకులు ఏమియు కన్పించవు. అంతవరకు నా పనులు చేసికొనుచు నా సాధన తీవ్రముగా చేసికొనుచు భగవంతుని నాకు సహాయము చేయుటకు వేడుకొనుచుందును. నాకు చెడు ఊహలు లేవు. నేను తప్పుడు పనులు చేయను. కాని నేను తప్పుగా ఆలోచించినను తప్పుడుపనులు చేయుచున్నను మరుత తక్షణము నన్ను సరియైన మార్గమున పెట్టుదు. ఇప్పటికి నేను మిమ్ములను సంతోషపెట్టుటకే ఈపనులు చేయుచున్నానని మీకు తెలిసియుండవచ్చును. మీకు నేను ఎప్పుడును విధేయతతో నున్నాను. మీ ఉత్తరముతో పంపిన కరపత్రమే నన్ను ఇట్లు వ్రాయుటకు ప్రేరేపించినది. నేను మీ ఫోటోపైపునకే ఎదురుచూచుచుందును.

నేను మరల మిమ్ములను కలిసికొను దినమునకై నిరీక్షించుచుందును. ఆ ఊహయే నేను ఇట్లు జీవితము గడపుటకు శక్తినిచ్చుచున్నది. నాకు మీయందుగల ఊహల నిజాయితీ ఆతురత పవిత్రత నిస్వార్థత తెలిసికొంటిరో లేదో నాకు తెలియదు. ఈరోజున కాకపోయినను ఏదో ఒక రోజున భగవంతుడు దానిని మీరు తెలిసికొనునట్లు చేయును. భగవంతుడు దయాళుడు. నా ప్రభూ! దయచేసి నాకు ఒక ఉపకారముచేయుడు. ఆఫీసుకు పోయి త్వరలో వెళ్ళి ఎండఎక్కక పూర్వమే కుటీరమునకు తిరిగిరండు. మీరు ఎండలో తిరుగుట ఊహించిన నాకు బాధకలుగును. ఇన్ని సంవత్సరములనుండి మీరు చాల పనిచేసినారు. ఇపుడు మీరు ఆరోగ్యము చూచుకొనవలెను. మరియు అవసరమైన మీ భక్తులకు మీదివ్య ఆధ్యాత్మికస్పందనములు అందజేయుడు.

ఇపుడు మీ దివ్యపాదములకు ప్రణామములుచేయుచు ఆపివేసెదను. నా ప్రియమైనప్రభూ! నన్ను దీవింపుడు.

ఎల్లపుడు నీదానను,

చెల్లా.

# 11. ఆంతర్యముగా హృషీకేశము వెళ్లుట

ఈ రోజు మరల మీకు వ్రాయుచున్నందులకు క్షమింపవలెను. తమ దివ్యపాదములకు ప్రణామములు.

గురూజీ! మిమ్ములను కలతపెట్టువిషయ మేమైన వ్రాసియుండిన క్షమించవలెను. మీరు నావిషయమై సరిగా తెలిసికొనలేదని ఊహించుట గొప్పతప్పు. మీరు నాకు చూపించిన దయకంటె హెచ్చుఉండదు. మీరు నా విషయమై తీసికొన్న శ్రమ నేను ఎన్నడును మరువజాలను. అట్టి విషయములూ మీకు వ్రాయుటకు కారణము నా పైపై మనస్సే. నా ప్రియమైన దేవా! నా హృదయాంతర్గతమున నేమియున్నది గ్రహింపుడు. మరియు అట్టి నాతప్పులు క్షమింపుడు. నేను నిలువలేకున్నాను. మీరు నన్ను ఇపుడు శిక్షించిన చనిపోయెదను.

స్వామిజీ! నేను ఏమిచేయవలెనో తెలుపుడు. నాకు భగవంతు డిచ్చినదానితో శాంతమైన తృప్తిగలిగియున్నా నన్నమాట సత్యమే కాని ప్రభూ! మిమ్ములను జూడవలెనను కోరిక నన్ను బాధపెట్టుచున్నది. గత సాయంత్రము అది మరల ప్రారంభించినది. నేను బయటకువెళ్ళుటకు నిరాకరించితిని. నేను ఏమియుచేయలేక పోయితిని. నాకు ఏకాంతము కావలసివచ్చెను. అవును, నేనొక తప్పుపని చేసితిని. నాకు జబ్బుగా నున్నదని మిష చెప్పి నేను ఒంటరిగానుంటిని. ఆ సమయమంతయు మీతోనే యుంటిని. అచ్చట సత్సంగము జరుగుచుండెను. మీరు అచ్చటకు వచ్చుట నాకు

స్ఫురించినది. నేను మీకు ప్రణామము చేసితిని. మీరు 'ఓం జయ గణేష్' వగైరా పాడుట వింటిని. వాని ప్రతి దృశ్యము అంతమువరకు చూచితిని. స్వామిజీ! నేను ఏదైన తప్పుచేయుచున్నానా? నేను అసహాయురాలను. నేను మీ దయకు పాత్రురాలను. మిమ్ములను తప్ప నేను ఇంకెవరిని నమ్మను. నా ఊహలయొక్క పవిత్రతయందు నాకు సందేహము లేదు. మామూలు ప్రకారము మీరు నా కలలో కనిపించి నన్ను సంతోషపరచితిరి. అవును, రాత్రిళ్ళు నాకు సంతోషసమయములందు నేను ఋషీకేశమునందుండి అచ్చట ఏదో ఒక దివ్యకార్యమందు పాల్గొనుచుందును. కలలు ఎంతయో స్పష్టముగా నుండును. అప్పుడప్పుడు ఏది కల? నా పగటిజీవితమా లేక రాత్రి జీవితమా అని సందేహించుచుందును. భగవంతునితో ఎల్లప్పుడు తాదాత్మ్యము పొందుచున్న మీరు నా పక్షమున నిలిచి నాకు సహాయము చేయుమనియు, మరియు తన్ను చేరుటకు సులభమైన మంచి మార్గము నాకు చూపుమనియు భగవంతునితో వాదించి చెప్పజాలరా?

ఇంతటితో నేను విరమించెదను. నాకు సంతోషము కలుగు జవాబు దయయుంచి తెలుపుడు.

మీ పవిత్రపాదములకు ప్రణామములతో,

ఎల్లపుడు మీ శాశ్వతమైన

చెల్లా.

# 12. గురూజీ - మీయందే నా శాంతి

నా దివ్యగురూజీ! మిక్కిలి ప్రేమించుప్రభూ!

మీ పవిత్రపాదములకు భక్తితోను ప్రేమతోను ప్రణామములు చేయుచున్నాను. నాకు నిన్న మీయొద్దనుండి అందిన దయగల ఉత్తరమునకును తంతివార్తకును ధన్యవాదములు. ఆహా! నా ఆనందమునకు నివాసము! నా దయాసముద్రము! మీ దయతోను జ్ఞానముతోను నన్ను ముంచివేయుచున్నారు. నా పూర్ణహృదయముతో మిమ్ము పూజించినందుకు నన్ను మీరు ఆక్షేపణచేయుదురా? ఇంకెవరైన అన్యథా చేయగలరా? నేను మీకు వ్రాయుటకు అవకాశము నిచ్చినారు. మీ ఉత్తరములకు నేను జవాబు వ్రాయవలెను. అవునా, కాదా? నాచేతలకు దయయుంచి నన్ను ఆక్షేపణ చేయకుడు. భగవంతుని ఆక్షేపింపుడు. అతడే నన్ను ఇట్లుచేయుటకు ప్రేరేపించెను. అప్పుడప్పుడు ఈ దీనజీవివిషయమై మీరు ఆలోచించుచున్నట్లు తెలిసికొనుట ఆనందముతో గూడిన ఉపశమనము తృప్తియైనది. మీరు ఆ ఉత్తరమున సంతకము చేయునపుడు, తంతివార్త పంపినపుడు నన్ను తలచియుందురు. భగవంతుడు నాకొఱకు చేయు పనులకు నేను ఆయనకు ధన్యవాదములు చేయుచున్నాను. మీయొద్దనుండి వచ్చిన దయగలమాట నా విచారమైన ఊహలను పోగొట్టి నన్ను నాకు తెలియని ఆనందముయొక్క ఉచ్ఛస్థితికి తీసికొనిపోవును. ప్రపంచము బహిర్గతమగుట ప్రపంచమందు వివిధరకములగు పనులు

జరుగుట గలుగుచుండినను భగవానుడు మార్పులేకుండ కాలాతీతుడుగానుండును. ఆప్రకారమే నామనస్సులో అనేక బాధలు కలిగినను నేను అనేక కర్తవ్యములు చేయుచుండినను నాకు మీయందుండు భక్తి మార్పు లేకుండ శాశ్వతముగా శక్తివంతముగా నుండును. మరియు ఆకాలమంతయు నేను తమ ఆత్మలో కలిసియుందును. కాని నేను బాహ్యావిషయములనుండి నా మనస్సు విడిపించుకొనినపుడు ఆ పవిత్రకలయిక యొక్క తీవ్రత నేను ఆమోదించగలుగుచున్నాను. కాని అనేక కార్యములలో మిళితమైయుండినను అది నాకు జ్ఞప్తియుండును. మరియు అదియే నాఆశను నిలువబెట్టుకొనుటకు నాకు బలమిచ్చును. స్వామిజీ! నా ప్రియమైన ప్రభూ! నేను చేపట్టుటకు చాల కష్టమగుదానిని పొందుటకు ప్రయత్నించుచున్నానని నాకు తెలియును. నేను భగవంతునితో ఐక్యముకావలెనని కోరుచున్నాను. కాని నా ఆత్మను మీ ఆత్మతో కలిపి ఆ రెంటిని పరమాత్మతో కలువనిండు. మీరు ఆయనతో తాదాత్మ్యము పొందిన చోటనే నన్నును ఆయనయందు ప్రవేశింపనిండు. నా ఊహలను మాటలలో పెట్టుట చాలకష్టము. కాని మీరు నన్ను గ్రహించియుందురు. నేను తప్పుడుత్రోవలో నున్న నన్ను దయతో చక్కదిద్దుడు. మానుషశక్తికి మించిన పనియందు నేను ప్రయత్నముచేయుచున్నానని నాకు తెలియును. కాని కపటములేని ప్రార్థనలు, ప్రయత్నము, ధారణ, నమ్మకము మొదలగువానివలన సమకూరని పని లేదు. నేను అనేకసంవ

త్సరములు వృథాచేసితిని. ఇపుడు అది కలిసివచ్చు టకు నేను ప్రయత్నము చేయుచున్నాను. నా బాల్యదినములు నేను మరువలేదు. 11 సంవత్సరములు దాటిన తరువాత 6 సంవత్సరములలో నేను 3 వ ఫారము చదువుచు నా చదువు మానివేసినను 8 మాసములు కష్టపడి చదివి సీనియరు కేంబ్రిడ్జిపరీక్ష 4 సబ్జెక్టలో యోగ్యతతో ఉత్తీర్ణురాలను కాగలిగితిని. నిరంతర కర్మమువలనను ప్రార్థనవలనను నా ఆధ్యాత్మికవృద్ధి పెంపొందింపగలిగితిని. అపుడు నాకు తెలిసిన ప్రతివ్యక్తియు నేను అసాధ్యమైన దానికి ప్రయత్నించుచుంటినని మరియు నాకు పిచ్చియెక్కెనని అనిరి. ఇప్పుడుకూడ అదే విషయము నాకు చెప్పుచున్నారు. నా ఆధ్యాత్మిక జీవితము విషయమై నేను ఎవరికిని చెప్పకుండనుండుటకు ప్రయత్నించినను నాయొక్క స్నేహితులు బంధువులలో కొందరు దానిని తెలిసికొని నేను పిచ్చిదానినని అనుకొనుచున్నారు. కాని నేను నాధైర్యము విడువలేదు. నాకు మీయొక్క బలము ప్రోత్సాహము ఉన్నంతవఱకు తీక్ష్ణమైన నమ్మకముతో నేను ప్రార్థనచేయుచుందును. భగవంతుడే సర్వఫలమును స్థిరపఱచును. నేను ప్రపంచవిషయములందు నిర్లక్ష్యముగా నున్నందుకు నన్ను ఆక్షేపించుచున్నారు. నేనేమి చేయగలను? ఇపుడు వానియందు సుకము సౌఖ్యము కనిపించదు. నన్ను ఓదార్చుటకు నాకు నా ప్రేమ ప్రభువులగు మీరేయున్నారు. ఆ కారణమువల్లనే మీరు నాయందు నిర్లక్ష్యముగా నున్నప్పుడు

నా మనస్సుయొక్క స్థిరత్వము చెడిపోవును. నా ప్రభూ! నన్ను ఎల్లప్పుడు మీ రక్షణలో నుంచుకొనుడు. నేను పూర్తిగా మీ చేతులలో నున్నాను. నేను మీ ప్రేమకు తగినపని యేమియు చేయలేదని నాకు తెలియును. కాని తమరు ఏపనిచేయు మని నన్ను అడిగిన ఆపని చేయుటకు సిద్ధముగా నున్నాను. మిమ్ము తలపని ఒక్కనిమిషముగూడ లేదు. నేను మిమ్ము తలంచినప్పుడు భగవంతునికూడ తలచు చుందును. మీరు భగవంతునియొక్క దృశ్యరూపము. గతరాత్రి నాకు ఉత్తేజితములగు కలలు వచ్చినవి. నా ప్రభూ! మీరు కొంచెము అలసినట్లు కనిపించితిరి. మీరు ఆరోగ్యముగా నున్నారని ఊహించెదను. మీరు నాతో మాట్లాడి నా సందేహములు తీర్చితిరి. అది ఒక కలయే. కాని ఈ ప్రపంచమంతయు సరిగా ఆలోచించిన నొక కలయే కదా! ఈరోజులలో నాకలలు నా మనస్సుయొక్క ఉపరిభాగము నుండి ఉద్భవించుటలేదు. అవి చాల ఉచ్చస్థలమందు పుట్టు చున్నవి. కనుక వానియందు నమ్మకముగలదు. నామాట సరియేనా?

నా ఉత్తరములతో మిమ్ములను ఎక్కువగా బాధ పెట్టుచున్నానని నాకు తెలియును. నేను ఆప్రకారము చేయకుండ నుండుటకు చాల ప్రయత్నము చేయుచున్నాను. కాని అందు ఉత్తీర్ణత నందలేకయున్నాను. నా ప్రియమైనప్రభూ! నన్ను మన్నింపుము. నన్ను మీరొక్కరే ఆశీర్వదింప శక్తి గలిగియున్నారు. కనుక ఆశీర్వదింపుడు. నేను ఇప్పుడు

మీ పవిత్రపాదములకు ప్రణామములుచేసి ఆపెదను. కాదు, గురుపూర్ణిమరోజున నాకు మీయొద్దనుండి వచ్చిన ప్రసాదమునకు మీకు ధన్యవాదములు. ఆ మధ్యాహ్నము నేను ఇచ్చట కూర్చొని మీరు అందరికి ప్రసాదము పెట్టుచున్నట్లు ఊహించుచుంటిని. నేను నా ఆత్మ దృష్టిలో ఇక్కడకూర్చొని మిమ్ములను చూచుట మీకు తెలియునా అని ఆశ్చర్యపడుచుంటిని. మీ దివ్యమైన ప్రియమైనచేతులతో పెట్టబడు ప్రసాదము అమృతముయొక్క రుచికలిగియుండును. నేను దానిని మీచేతినుండి పుచ్చుకొనుటకు చాల ఇష్టపడుదును. నామనస్సు భగవంతునకు తెలియును. నన్ను తృప్తిపఱచుటకు ప్రసాదపు ప్యాకెట్టు వచ్చినది. దయతోగూడిన మీయొక్క ప్రతిపనికి మీకు ధన్యవాదములు. ఓ భగవానుడా! నేను దీనిని ఎట్లు సహించగలను? స్వామిజీ మీరు నన్ను మీ పాదములదగ్గర చూడగలరా?

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 13. శివుని ఉత్తరమునందలి భావము

గురూజీ! నా ప్రియమైన ప్రభూ!

గౌరవముతోను ప్రేమతోను మీ పవిత్రపాదములకు ప్రణామములు. దేవాలయప్రసాదము తేయాకుపొట్లములు మీరు దయతో పంపినందులకు మీకు ధన్యవాదములు. ఇది ఆశ్చర్యకరమైన యీవి. నేను టీ తీసికొనునప్పుడుకూడ నా భగవంతుని నేను మరవకుండనుండుట నా ప్రభువుచేసిన ఏర్పాటు. ఆయనను నేను ఎన్నడును మరువను. స్వామిజీ నేను ఇక నిలువలేను. మీవద్దనుండి కొద్దివార్తయైనను తెలియవలెను. 4, 11, 13 తేదీలలో నేను వ్రాసిన ఉత్తరములకు జవాబులేదు. మీ ఆఖరు ఉత్తరము తారీఖు 6. మౌనముతో గత కొద్దిదినములలో మీరు నాకు కొన్ని పాఠములు నేర్పినారు. నేను మీవద్దనుండి ఏమియు వార్త విననప్పుడు పూర్తిగా ఏకాంతముగా నుందును. నా ప్రియమైన ప్రభూ! నన్ను విడిచిపెట్టుటకు తగిన పెద్దదానను కాలేదు. ఆధ్యాత్మిక కలయికమాత్రము సరిపోదు. మీ దయతోకూడిన ఉత్తేజమైన ఉత్తరములు నాకు కావలెను. అవి లేనియెడల నేను ఏకాంతస్థితిని అనుభవించెదను. మీరు వ్రాయునపుడు ప్రపంచమంతయు వేరు విధముగా నాకు చీకటిగా కనిపించును. అది భరించుటకు బలమిమ్ము. నాకు మీ ఉత్తరములు నా ప్రార్థనలు భగవంతుడు ఆమోదించినట్లు బయటికి కనబడు గుర్తులు. గత రెండుదినములనుండి నేను భగవంతుని మీ ద్వారా వ్రాయ

మని ప్రార్థించినాను. అతడు స్వప్నములద్వారా ఇపుడు నన్ను ఆశీర్వదించినాడు.

18-వ తేదీరాత్రి మీరు నాకు కలలో ఒక ఉత్తరము అందజేసినారు. అందులోని కొన్ని వాక్యములు ఇంకను నా కండ్లయెదుట కనిపించుచున్నవి. అది నాకు కొంత మనశ్శాంతి నిచ్చుచున్నది.

19-వ తేదీన తిరిగి మిమ్ముగురించి స్వప్నము వచ్చినది. మీరు కుటీరములో కూర్చొనియున్నారు. నేను మీ యెదుట ఒక పసుపు పచ్చ చీరకట్టుకొని నిలిచియున్నాను. నాకు గల అలంకారమంతయు నా మెడలోని నల్లపూసల దండ. మీరు నాతో మాట్లాడుటలేదు. నేను కండ్లు మూసికొని తలవంచుకొని ప్రపంచమంతయు మఱచి నిలుచుకొనియున్నాను. నా ఉనికి మీలోననై పోయి మీరు గ్రహించగలిగిన మౌనభాషతో నేను మీతో మాట్లాడుచుంటిని. ఓ ! ఎట్టి ఆశ్చర్యకరమైన అనుభవము. ఆవిధముగా ఎల్లప్పుడు నుండవలెనని కోరుచున్నాను. అది స్వర్గమువలె నుండెను. ఆ పూర్ణానందము మీకు నేను ఎట్లు తెలుపగలను ?

20-వ తేదీన మరల ఒక ఉత్తేజమైన కల వచ్చినది. ఋషీకేశములో సత్సంగము జరుగుచుండగా నేను అచ్చటకు చేరితిని. కాని మీరు కూర్చునే కుర్చీ ఖాళీగానున్నది. నేను ప్రశ్నించగా ఆరోజున మీరు బహుశా రారని తెలిసినది. నేను చాల విచారముగా నుంటిని. ఆవిషయము ఎవరి

కిని తెలియదు. నేను మీకుటీరమునకు పరుగెత్తితిని. మీ అయిష్టతకు బలియై పరుగెత్తితిని.

కుటీరపు తలుపులన్నియు తెరువబడియున్నవి. నేను మీగదిలో చూచితిని. అందులో మిణుకుమిణుకుమను దీప మొకటి యుండెను. మొదట నాకేమియు కనిపించలేదు. హఠాత్తుగా అందముగా బట్టలు ధరించిన పొడుగుపాటి స్త్రీ ఒకటి గదిలో నొకప్రక్క నావైపు వీపుపెట్టుకొని నిలుచుండెను. నాకు స్తబ్దత్వము కలిగెను. అపుడా స్త్రీ నెమ్మదిగా నావైపు తిరిగెను. నా హృదయము సంతోషపూరిత మయ్యెను. నేను చూచినది మీ దివ్యముఖము. మీరు దేవీరూపములో కనిపించుచుంటిరని ఊహించితిని. ఆదేవిని నేను కొన్నిరోజులనుండి పూజించుచున్నాను. మీరు నా కొఱకు వేచియున్నట్లు నాపైన దయార్ద్రహృదయముతో కూడిన దృష్టి ప్రసరింపజేసితిరి. నేను మీ పావనపాదములపై బడి ఆనందబాష్పములతో వానిని కడిగితిని. అపుడు మీరు నన్ను సత్సంగమునకు వెళ్లుదమా అని అడిగితిరి. మనము అచ్చటకు వెళ్ళితిమి. ఆ సమయమందు ఉదయము 4 గంటల అలారము కొట్టినది. నేను పూర్ణమైన ధ్యానము అనుభవించితిని. నేను మీతో మౌనముతోకూడిన తాదాత్మ్యమును పొందితిని. ఒక గంట కొన్నినిమిషములవలె గడచిపోయెను. పైన ఉదహరించిన కలలనుబట్టి నేను తమ దివ్యశక్తితో ఎట్లు తడుపబడితినో మరియు దయామయుడగు భగవానుడు మీరు నాకు వ్రాయుటకు వీలులేనపుడు ఎట్లు

నాకు సహాయము చేయునో తెలియుచున్నది. నేను వారిని ఎపుడు శాశ్వతముగ చేరగలనో!

నేను ఇంకొక పాఠము నేర్చుకొంటిని. నేను సుఖముగా నున్నాను. బహుశా గర్వముగానుంటిని. ఎందువల్ల ననగా గత మూడుమాసములనుండి నాకు కోపము గలుగుట లేదు. నిన్నటిదినము ఒక విషయము జరిగినది. నేను 5 నిమిష ములు కోపగించితిని. మాగజైనులో మీరు వ్రాసిన వ్యాస ములో కూడ తొందరగా ఉత్తీర్ణత కలుగునని నమ్మవద్దని సూచన యీయబడినది. ఓ ప్రభూ, ప్రతివిషయమునందును నన్ను క్షమింపుము. ప్రతిక్షణము నాకు మీ సహాయము కావలెను. అది లేనియెడల నేను శూన్యనే. ఓ భగవానుడా నేను ఏదయినా చేయగలిగితే మీకటాక్షమే నన్ను దానిని చేయునట్లు చేయుచున్నది. నామటుకు నేను ఎందుకు పనికి రానిదానను.

నేను మీకు వ్రాసినతరువాత ఇంకొక విషయము జరిగినది. నా ఉత్తరము మీకు అందినదినమున నా ఉత్త రములోని కొన్ని వాక్యములు నాకండ్లయెదుట వివిధభావ ములతో కనిపించును. ఒకానొకప్పుడు మీరు మీజాబు లలో ఆ వాక్యములు వ్రాయుదురు. ఇప్పుడు గత కొన్ని దినములనుండి 'నీ జీవితముయొక్క ఉద్దేశము నీకు తెలియ దా?' అని అడుగుచున్నట్లు నేను ఊహించుచుంటిని. గురు దేవా! మీరు నా హృదయములో ఏమియున్నది కనుగొన గలరు; చూడగలరు. ఆతురతగల నా జీవుడు ఎల్లప్పుడు

మీలో నుండుటకు కోరుచున్నట్లు మీకు తెలియదా? మరియు మీవద్దనుండి ఆధ్యాత్మిక ఆహారము కోరునట్లు మీకు తెలియదా? మీవద్దకంటె నేను ఎవరివద్ద దానిని పొందగలను? నా గమ్యస్థానము నాకు తెలియును. ఒకసారి మిమ్ములను కలిసికొని ఎల్లప్పుడు అచ్చటనున్న నా కర్తవ్యముకూడ నేను తెలిసికొనగలను. ఇపుడు నా కర్తవ్యమది యే. నేను తెలిసికొనగోరుచున్నాను. నా ప్రియమైన ప్రభూ! నా మనస్సుకు అది తోచినది. విడువకుండ మీకు తెలుపుచున్నాను. నాయొక్క శాశ్వతభక్తితో నను గ్రహింపుడు. మరియు నా ఉత్తరము సరియైనపద్ధతిలో తెలిసికొనుడు. మరియు ఎప్పుడైనను నేను తప్పుడుమార్గములో నుండిన నాకు సలహా యిండు. నేను మీకు పూర్తిగా శరణాగతనైనవిషయము మీకు తెలియదా?

16–వ తేదీనుండి నేను తీవ్రసాధన చేయుచున్నాను. నేను ప్రారంభించిన ఉదయము దయగల మిసస్ సాంబశివ రావు నాయింటికి మీబొమ్మ యెనామల్ లాకెట్టులో ఉంచబడి పసుపుపచ్చని దారమునకు కట్టబడినది తీసికొనివచ్చినది. నేను అపుడు పూజచేయుచున్న బొమ్మయెదుట కూర్చొనియుంటిని. మాతల్లిని ఆ లాకెట్టును నా మెడకు కట్టుమని అడిగితిని. ఆమె ఆప్రకారము కట్టినది. ఆమె 'ఓం'కార నాదముతో నాముఖమున కుంకుమకూడ పెట్టినది. ఆమె నీకుకూడ ఒకటి పంపెదనని చెప్పినది. ఉదయము సాయంత్రము నేను లలితాసహస్రనామము పఠించెదను.

నేను సరియైన ఆహారము మధ్యాహ్నము తీసికొనెదను. ఉదయము రాత్రి నేను కొద్దిప్రసాదము (అటుకులు సెనగలు కొబ్బరి ముక్కలు కొద్దిపాటి గుగ్గిళ్లు) తీసికొనెదను. మరియు ఒకగ్లాసు పాలు పుచ్చుకొందును. నేను లలితాసహస్ర నామము చూచి వ్రాసితిని. మంగళవారము దేవీపూజ యింటిలో రాత్రి 6–9 ఘంటలవరకు పురోహితునివలన వైదికపద్ధతిని జరుపబడును. తమరు దయయుంచి ఆధ్యాత్మికముగా కొన్ని నిమిషములు మమ్ములను ఆశీర్వదించుటకు ఇక్కడకు రండు. నేను మీలో దేవినికూడ పూజించెదను. ఓ ప్రభూ! నాకు ఇంకొక దేవుడు లేడు. మీ దివ్య పాదములకు ప్రణామములుచేసి దీనిని ఆపెదను.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 14. అంతర్గతపరిణామమును గురించిన అమానుషకృత్యము

నా మిక్కిలి ప్రియమైన గురుదేవా!

భక్తిప్రేమలతో మీ దివ్యపాదములకు ప్రణామములు. ఈ ఉదయము చాల ఆహ్లాదకరముగా నున్నది. నా చుట్టును దివ్యత్వము నేను అనుభవించుచుంటిని. ఇది చాల ఆశ్చర్యకరమైన తృప్తి. మీకు వ్రాయుటకూడ అనవసరమే. మీరు నాదగ్గరనేయున్నట్లు కనిపించుచున్నారు. నేను ఏమి వ్రాయదలచినను అది మీకు ఇదివరకే తెలియునని నేను ఊహించుచున్నాను. తియ్యని దివ్యశక్తి యొకటి నాగుండా ప్రవేశించుచున్నది. నేను శుభ్రముగాను సంతోషముగాను ఉన్నట్లు ఊహించుచున్నాను. ఇది కేవలము ఊహకాదు. అది ఏదియో చాల నిర్మలమైన ఉత్కృష్టవిషయము. నేను ఈస్థితిలో ఎల్లప్పుడు నుండగోరుదును. అది కేవలము స్వర్గములో నివసించుచున్నట్లుండును. కాని ఆభావము త్వరలో అదృశ్యమగునని నాకు తెలియును. ఈస్థితిలో ఎల్లప్పుడు నుండగలస్థితిని ఎప్పుడయినను నేను చేరగలనా? గురుదేవా! మీకు నేను ఎట్లు ధన్యవాదములు సమర్పింతును? మీరు నాలో ఎట్టిసౌఖ్యము నెలకొల్పుచున్నారో మీకు తెలియునా? మిమ్ములను ఎల్లప్పుడు సంతోషపెట్టుటకు భగవంతుడు నాకు సహాయకారిగా నుండుగాక!

మీరు నాకు ఒక బిరుదు నిచ్చినారని తెలిసికొనుట ఊహింపరాని మిక్కిలి సంతోషకరమైన వార్త. నా ప్రియమైన గురుదేవా! మీరు ఎంత దయాళురగు ఉదారపురుషులు! మీరు నాకు దయతోనిచ్చిన బిరుదునకు తగినట్లు నా జీవితమున ప్రతినిమిషము నడుచుకొనెదను. అచట నేను ఎల్లప్పుడు నున్నాను.

నేను ఇంటికి వచ్చునప్పటికి రాత్రి 1-30 గంటలయినది. ఎందువల్లననగా నేను మిసెస్ సాంబశివరావు కుమారుని చూచుటకు వెళ్ళియుంటిని. అతడు జ్వరముతో బాధపడుచుండెను. మందుతో పాటు మీ ప్రసాదము నేను వానినుదుట నుంచినాను. మరియు మిమ్ము మనస్సునందుంచుకొని 'త్ర్యంబకం' అను శ్లోకమును పఠింపుమని చెప్పినాను. అతనికి త్వరలో స్వస్థతగలుగునని నాకు నమ్మకము గలదు.

మీరు వ్రాసిన పవిత్రలేఖ నాకొరకు ఇంటియొద్ద వేచియున్నది. నేను ఎంతవరకు సరిగానుంటినో నాకు తెలియదు. కాని రాహుకాలమునందు నేను ఏ మంచిపనియైనను చేయుట మానుకొంటిని. అందులో ఏమయిన నిజమున్నదా! ఆ కాలమందు ఏపని చేయుటయు మంచిదికాదని చెప్పుదురు. నిన్నటిరోజు గురువారము. మధ్యాహ్నము 1–30 ఘంటలు మొదలు 3–00 ఘంటలవరకు రాహుకాలము. కనుక మీ ఉత్తరము 3 ఘంటల తరువాత చదువుటకు నిశ్చయించుకొంటిని. ఓ భగవంతుడా! అదియొక కష్టవిష

యమే! నాతండ్రియొక యుల్ సేటియన్ కుక్కను పెంచు చున్నారు. తినుటకు మిక్కిలి ఆసక్తికలిగించు ఆహారము దానిముందట పెట్టుదురు. కాని దానిని ముట్టుకొనగూడదని ఆజ్ఞాపింతురు. ఆ కుక్కస్థితి చూచుటకు చాలవిచార కరము. ఆహారము తినవలెనను కోరికయు ఉత్తరువుకొరకు యజమానివంక చూచుటయు చాల చెప్పదగినవి. నేను ఆ స్థితిలో అపరాహ్ణము 3 ఘంటలవరకు ఉంటిని. అటుతరు వాత నేను ఉత్తరము చదువుటకు ప్రారంభించితిని.

ఓ నా ప్రియమైనప్రభూ! నేను ఒంటరిగా నున్నందుకు నాకు సంతోషము. నా హృదయము కొద్దికాలము గబగబ కొట్టుకొని తరువాత ఆగినది. ఆ ప్రకారము నేను ఊహించితిని. నాకు ఊపిరి సలుపలేదు. కన్నీళ్ళు కాల్వలై పారెను. మరియు ఆశ్చర్యమైన మిక్కిలి అందమైన అనుభవముద్వారా నాకు ఏమియు తెలియలేదు. 'మూడు మామూలుమాటలు మిక్కిలి పవిత్రమైన మంత్రము.' ఆ మంత్రము అనేకసార్లు నా స్వప్నములలో పఠింపబడినది. ఆ మంత్రమే ఒక విచిత్రమైన తివాసిని కల్పించి దాని ద్వారా నన్ను ప్రపంచమునకు దూరముగా నుండు నొక స్థలమునకు తీసికొనిపోయినది. అట్టి అందమైన ఒడలు తెలియని స్థలమందు నా భగవంతుడు, ఆత్మకు ఆత్మ, జీవితమునకు జీవితమగు నా ప్రభువుతో కలియుటకు తీసికొనివెళ్ళినది. ఓ భగవంతుడా! అక్కడ నాకు జరిగిన విషయము నేను బాగుగా వర్ణింపజాలను. నేను జీవితమంతటిలో అట్టి అసా

ధారణమైన ఉచ్ఛ అనుభవము ఎన్నడును అనుభవింప లేదు. నేను మరల నా సామాన్యస్థితికి వచ్చినప్పుడు సౌఖ్యమైన నిర్మలమైన స్థితి నాకు గలిగినది. మరియు నా ఆదుర్దాలన్నియు పోయినట్లు నేను ఊహించితిని. నేను ప్రభువు సుబ్రహ్మణ్యస్వామికిని దేవికిని ధన్యవాదము లొనర్చితిని. నా నిర్దుష్టమైన ప్రార్థన వారు విన్నారు. ఓనా ప్రశస్తమైన ప్రభూ! నీవు నన్ను స్వర్గమున దించితివని నీకు తెలియునా? నేను ఎల్లప్పుడు అచ్చటనే యుండుటకు నా జీవితాంతము వరకు ప్రయత్నించెదను. అందరు క్లబ్బుకు వెళ్లియుండగా నీ వొక్కతవే యెట్లు ఇంట్లో నుండగలిగితివని జనులందరు నన్ను అడిగిరి. వారందరికి ఆశ్చర్యము కలిగెను. నేను జీవితసౌఖ్యములు పోగొట్టుకొనుచున్నానని వా రూహించుచుండిరి. ఓనాప్రియమైన ప్రభూ! నా సంగతి మీకు తెలియగలదు. నేను ఒంటరిగానున్న నిమిషమందు నా హృదయదేవాలయమున ప్రతిష్ఠితుడైన నాప్రియప్రభువు బయటికి వచ్చి నన్ను మీ సాన్నిధ్యమున నుంచుటయందు సాయపడును. అచ్చట మేము ఇరువురము కలిసి సంతోషముగా ఇతరులకు తెలియనటువంటిదియు విమర్శింపజాలనటువంటిదియు నగు పరమానందము అనుభవించుచుందుము. 'ఈ ఆనందముతో పాటు ఎల్లప్పుడు మంచిచేయుచుందుము' అని అతడు నాకు సలహాయిచ్చుచుండును. మరియు వానియొక్క స్నేహము నన్ను గౌరవముగా జీవితము గడుపుటకును ఇతరులకు సహాయము చేయుటకును చుట్టుపట్ల ఏమి జరుగు

చున్నను లక్ష్యపెట్టక సౌఖ్యమైన శాంతితోకూడిన జీవితము గడుపుటకు నన్ను ఉత్తేజపరచుచుండెను. నేను వాని స్నేహము వాని ప్రేమ తప్ప ఇతరసౌఖ్యమేమియు కోరను. మరియు భగవంతుడు అన్నియు తెలిసికొని గ్రహించి నాకు సహాయముచేయును. ఓనాప్రభూ! వానిని ప్రార్థింపుము. నేను ఎల్లప్పుడు నా ప్రభువునొద్దనుండులాగున నన్ను అతడు ఆశీర్వదింపనిమ్ము. మరియు ఇకముందు మాకు ఎడ బాటు ఎంతమాత్రము లేకుండనిమ్ము. నాకు ఇంతకంటె కావలసినది లేదు. ఆహా అదియే స్వర్గము!

మీరు దయతోపంపిన పుస్తకములు పార్సెలు అందినది. నేను నిన్న రిజిష్టరుపోష్టులో ఒకవ్యాసము పంపినాను. అది 'నా కోపము తగ్గించుకొనుటకు ప్రయత్నము' అనునది. మరియు అక్టోబరునెల ఆధ్యాత్మికదినచర్య కాగితము కూడ పంపినాను. మరియు వ్రాయబడిన మంత్రములు బుక్ పోష్టులో పంపినాను. నేను వ్రాసిన వ్యాసమును తమరు చదివి నాకు సలహా యివ్వగోరెదను.

నా ప్రియమైనస్వామిజీ! మార్చినెలలో నేనురోజులు లెక్కించుచున్నాను. నేను మిమ్ము చూడవలెనని కోరుచున్నాను. మీరు దయచేసి దీనికి ఏమియు ఆటంకములు రాకుండ చూడుడు. ఆ సౌఖ్యమును తలంచుకొనుచు నేను ఇచ్చట నివసించుచున్నాను.

నా యిరువురు అల్లుళ్ళకు పై అధికారములు వచ్చినవి. నాదగ్గరనున్న కుమార్తె అల్లుడు కోయంబత్తూరు, వెళ్ళు

చున్నారు. వానికి అక్కడ ఉద్యోగము నిర్ణయించినారు. నా పెద్ద అల్లుడు పద్మనాభన్ నాయర్ దివ్యజీవన సమాజపు సభ్యుడయినాడు. అతడు తమ పుస్తకములు నియమముగా చదువుచున్నాడు. నా రెండవకుమార్తె ప్రార్థనగృహమందు పెట్టుకొనుటకు తమ ఫోటో అడిగినది. ఆమె యిపుడు మిమ్ములను పూజించుచున్నది. నా కుమారుడు క్రమముగా ధ్యానము చేయుచున్నాడు. మరియు వాడిప్పుడు యోగాసనములు చాలవరకు అభ్యసించెను. వాని తండ్రికూడ క్రమముగా ధ్యానముచేయుచు ఆసనములు వేయుచున్నారు. దుర్గాపూజా సాధనలో నేను కొద్ది యోగఆసనములువేయుటకు ప్రయత్నించినాను. అవి నేను వేయగలిగినందులకు నాకే ఆశ్చర్యము గలుగుచున్నది. కావున నేనిపుడువానిని నియమముగా వేయుచున్నాను. నేను వానిలో కొన్ని వేయగలను కాని క్రమశః వృద్ధికాగలదు. నేను ఋషీకేశములో నుండగా దయాళుడగు కృష్ణానందస్వామి నేను పద్మాసనము వేయునట్లు ప్రయత్నించెను. కాని నేను దానిని వేయలేకపోయితిని. కాని ఇచ్చట దానిని వేయగలిగితిని. అంతయు తమ కటాక్షమే.

గురుదేవా! మీ పత్రిక 'ఆరోగ్యము మరియు దీర్ఘజీవితము' ప్రజలకు వరప్రసాదమువంటిది. ముఖ్యముగా వైద్యసంబంధమైన కష్టమైన మాటలు తెలియనివారికి అది చాల ఉపయోగకరము. మీరు అంతయు సామాన్యముగా ఉపయోగకరముగా చేసినారు. అందరు డాక్టర్లు దానికి చందా

దారులుగా నుండవలయునని నేను కోరుచున్నాను. అది వారికి చాల ఉపయోగకరము. నా సాంవత్సరిక చందా యీ నెలలో పంపుచున్నాను. నా గురుదేవా! మానవజాతికి ఉపయోగకరములగు అన్ని మార్గములు మీరు చూపించుచున్నారు. మీరు కేవలము భగవానులే. ఇంక మీ ఆనందకరమగు పాదములకు ప్రణామములతో ముగించుచున్నాను.

శాశ్వతముగా మీ స్వకీయను,

చెల్లా.

# 15. భూ సంబంధమైన ప్రత్యర్థిలేని సంబంధము

మీ విలువగల పాదములకు ప్రేమతోను గౌరవము తోను ప్రణామములు చేయుచున్నాను.

స్వామి సచ్చిదానందజీ సేలమునుండి యిచ్చటికి వచ్చిరి. ఈ ఉదయము ఋషీకేశమునకు వెడలిరి. వారి ద్వారా నేను ఒక డబ్బా జీడిపప్పు, బాదముపప్పు ఖర్జూ రపు పండ్లు పంపితిని. రేయింబవళ్లు మిమ్ములను పూజచేయు చున్న మీ శిష్యురాలు చెల్లాపంపిన దీనమైన కానుకలను దయతో స్వీకరింపుడు. స్వామి సచ్చిదానందజీ మీరు కాలేజీలో చదివినరోజులు వర్ణించినప్పుడు శరీరము గగు ర్పాటుచెందెను. ఓ ఆశ్చర్యకరమైన నా గురుదేవా! మీయందు నాకుగల భక్తికి అంతులేదు. అది దినదినము వృద్ధిపొందుచున్నది. మరియు అదియెట్లు అంతమగునో నాకు తెలియదు. ఆహా! ఆ ఆనందానుభవము ఈ రోజు లలో స్వర్గతుల్యమై యున్నది. నేను దాని ననుభవించుచు చాలగంటలు కాలము గడుపుచున్నాను. నేను ఎన్నడును ఒంటరిగాలేనని ఊహించుచుందును. నాకు ప్రాపంచిక స్నేహముగాని ప్రాపంచిక సంతోషముగాని అవసరము లేదు. అన్నియు నేను పూజించెడి ఆ ఒక్కనియందే

యున్నవి. నేను మీకు తగినట్లు ధన్యవాదములు సమర్పింప జాలను.

ప్రియమగుగురుదేవా! ప్రణామములు. మీయొద్దకు త్వరగా వచ్చుటకు నన్ను ఆశీర్వదింపుడు. డాక్టరు చెత్తర్ కూడ మిమ్ము కలిసికొనుటకు చాల ఆతురపడుచున్నది.

చెల్లా.

# 16. 'శివానంద - చెల్లి' యొక్క భావము

నా మిక్కిలి ప్రియమైన గురుదేవా!

మీ పవిత్రమైన పాదములకు గౌరవముతో ప్రేమతో ప్రణామములు.

నా ప్రియమైనప్రభూ! మీరు నాకు పంపిన ప్రసాదమునకు, బిరుదులకు నా హృదయపూర్వకములైన ధన్యవాదములు. అది నాకు అందలేదని మిసెస్ సాంబశివరావు మీకు వ్రాసినట్లు నాకు చెప్పినది. నేను దానివిషయమై ఆదుర్దా పడలేదు. ఎందువల్లననగా నాకు ఆధ్యాత్మికముగా ఇచ్చిన బిరుదులు పైకిఇచ్చిన బిరుదులకంటె ముఖ్యమైనవి. నా ప్రియమైన గురుదేవా! మీరు ఎల్లప్పుడు నా ఊహల యందుఉందురు. మరియు మీరు నన్ను 24 ఘంటలు నడుపుచు రక్షించుచుందురు.

నిన్నటి 8 వ తేది నెలలో పవిత్రమైనదినము. నేను కొన్ని పద్యములు వ్రాసితిని. వానిని మీకు ఇందులో పంపినాను. పద్యరచనయందలి లక్ష్యలక్షణములు నే నెఱుగను. అవి నా హృదయాంతర్గతములైన ఊహలు. నేను వ్రాసిన ఉద్దేశముతోనే వానిని మీరు అంగీకరింపుడు.

నేను నాయింటికి పదిమైళ్ళదూరములో నుండు వడపళని దేవాలయమునకు ఈ ఉదయము వెళ్ళితిని. మరియు సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి నా ధన్యవాదములు సమర్పించి

తిని. భగవంతుడు గుడిలోమాత్రమే కనిపించడని నాకు తెలియును. అయినను అపుడపుడు ఆ దివ్యస్థలములకు కొన్ని మైళ్లు ప్రయాణముచేసి వానిని అక్కడ పూజచేయుదును. నేను వానిని మనుష్యరూపములో పూజించుచున్నంతవరకు వానికి కొన్ని మానసిక భావములుకూడ కలిగియుండునట్లు ఊహింపనిమ్ము. ఒకవ్యక్తియొక్క హృదయము ప్రేమతో తొణికిపోవుచున్నను మరియు అది ఆధ్యాత్మికముగా ప్రకాశించుచున్నను కొంచెము బాహ్యప్రకటనలకు వ్యక్తి అపుడపుడు ఇష్టపడుచుండును. అది అటులేకాదా? కాబట్టి ఆయనను చూచుటకు ఆయన అర్చన అభిషేకము చూచుటకు కొన్నిమైళ్ళు నేను ప్రయాణము చేసినట్లు ఆయన ఊహింపవలయునని నేను కోరుచున్నాను. ఓహో! ఆయన చాల చాల మృదువైన ప్రేమస్వభావము గలవాడు. ఆయన లేనిది నాకు ఏదియు లేదు. ఆ సంగతి ఆయనకు తెలియును. అది యెట్టి ఆశ్చర్యకరమైన ఊహ! మీరు నాకు పవిత్రమైన 'శివానంద చెల్లా' అని నామకరణము చేసిన రోజున నేను దేవుని చూచుటకు వడపళని దేవాలయమునకు వెళ్ళితిని. ఆ పేరుతో అక్కడ అర్చనచేసితిని. నేను నాపేరు అక్కడ రిజిస్టరుచేసితిని. ఆయన ఇపుడువచ్చి మీలో నివసించెను. ఆయన మాట్లాడిన వినవలెనని నేను ఎట్లుకోరితినో ఆయనకు తెలియును. నేను ఎట్లు వారి ఉత్తరాలు పొందగోరితినో ఎట్లు వారిసలహా తీసికొనవలెనని కోరితినో ఆయనకు తెలియును. ఇటువంటి ప్రత్యక్షప్రకటనము కోరు

పిచ్చిభ్రమ నేను నెమ్మదిగా వృద్ధిపొందుటను తెలుపు చున్నది. కాని ఈ ఆనందము నాకు ఉండనిమ్ము. నేను ఆయ నను నా గురుదేవునియందు చూడనిమ్ము. ఆయనను నాప్రియ మైన పళనిఆండవర్ నందు చూచుటయందు నాకు ఆనందకర మైన భావము కలుగును. నేను మీకు మరల మరల ధన్యా వాదములు సమర్పించుచున్నాను.

మీ కటాక్షమువల్ల మిసెస్ సాంబశివరావు కుమా రుడు శివరాం క్షేమముగా నున్నాడని మీకు సంతోష ముతో తెలియపఱచుచున్నాను. ఆమె కొంచెము ఆదుర్దా పడినది. కాని తమ కటాక్షము మాయందు ఉన్నంతవఱకు మేము ఆదుర్దాపడ నవసరములేదు.

నిన్నటిరోజున దివ్యజీవనజ్యోతి శ్రీనివాసన్ గారి గృహమందు భజనకు హాజరైనాము. అక్కడకు డాక్టరు కృష్ణరావును ఆయన భార్యనుకూడ తీసికొనివెళ్ళినాను.

నా ప్రభూ! నేనింక ముగించెదను. నన్ను ఆనంద కరములగు మీ దివ్యపాదములను స్పృశింపనిమ్ము. మరియు నా ప్రభూ! నన్ను దీవింపుడు. ఓనాదేవా! నేను ఎట్లు నాయెదుట మిమ్ములను చూచుకొందును ?

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 17. నా దినచర్య

గురుదేవా! విలువగల నా ప్రియమైనప్రభూ!

ప్రేమతోను భక్తితోను మీ పవిత్రపాదములకు ప్రణామములు. దయతోకూడిన తమ ఉత్తరమునకు నా హృదయపూర్వక ధన్యవాదములు. అది నా కళంకితహృదయమునకు దివ్య అమృతమువలె పనిచేసినది. మీ విచిత్రమైన ఉత్తేజకరమగు పుస్తకము 'తత్త్వము—దానిబోధ' ఈ దినము అందినది. అందుపైన మీరు దయతో వ్రాసిన హస్తాక్షరము లున్నవి. ఓనాదివ్యగురూ! మీరు దయతో మీ చేతితో వ్రాసిన ఒక్కమాటయైనను నా హృదయమునకు మిక్కుటమైన సంతోషము కలుగజేయును.

నేను ఈరోజు నాప్రత్యేకపోస్టులో నాస్పిరిట్యుయిల్ డైరీ లిఖితజపమును పంపుచున్నాను. మరియు రిజిస్టర్ పోస్టులో పార్సెలులో 6 పౌనుల జీడిమామిడి గింజలను మీ ఉపయోగము నిమిత్తము పంపుచున్నాను. ఎందువల్లననగా మీరు వానిని మీ విటమినులని చెప్పియున్నారు. దయచేసి వానిని స్వీకరించవలెను. ఈ ఉత్తరము దయయుంచి జాగ్రత్తగా చదివి నాకు సలహా యివ్వవలెను.

ఇది నా ఆధ్యాత్మిక జీవితముయొక్క దినచర్య. నేను దీనిలో ఏమైన మార్పులు చేయవలెనో, నేను ఎచ్చటనైన తప్పుచేసితినో దయచేసి తెలియపఱచుడు.

ఉదయము 4—50 ప్రార్థన, ధ్యానము. 6—60 ఆసనము. నేను పద్మాసనము, పర్వతాసనము, భూమిమీద పరుండి పవనముక్తాసనము, సర్వాంగాసనము, మత్స్యాసనము రెండురకములు, శలభాసనము రెండురకములు, భుజంగాసనము, ధనురాసనము, వజ్రాసనము అభ్యసించుచుందును. అన్నియు ఎవరిసహాయము లేకుండ వేయగలను. కాని గతమాసము రోజులనుండియు ఎంత ప్రయత్నము చేసినను పశ్చిమోత్తరాసనము వేయలేకపోయితిని. గోరక్షాసనము కుడిచేయి వెనుకనున్నపుడు మాత్రమే వేయగలను. ఎడమచేయి వెనుకనుంచుకొని వేయుట కష్టమనిపించుచున్నది. పై ఆసనములు వేయుట చాలునేమో దయచేసి తెలియపఱుపుడు. ప్రతిదియు రెండుసార్లు వేయుచున్నాను. ప్రతి ఆసనమునకు చివర శవాసనము వేయవలెనా?

ఆసనములు ముగించినతరువాత పదినిమిషములకు ప్రాణాయామము నిరువదినాల్గుసార్లు చేసెదను. ఈమధ్య 36 నుండి 72 వఱకు హెచ్చుచేసినాను. తడవకు 24 చొప్పున 3 తడవలు చేయుచున్నాను. సాయంత్రము రాత్రి నా ప్రార్థనధ్యానముల తరువాత చేయుదును. పూరకమప్పుడు 3 ఓం ల వఱకు కుంభకమప్పుడు 12 ఓం ల వఱకు రేచకమప్పుడు 6 ఓం ల వఱకు నేను ఊపిరి నిలువబెట్టుదును. ఇంతవఱకు కష్టములేకుండ సౌఖ్యముగ చేయగలను. ఈ

రేటు వృద్ధిచేసిన కొంచెము కష్టమనిపించును. నేను చేయునది సరిపోవునా?

ఉదయము 8 లగాయతు 8-30 వఱకు గీతలో పది శ్లోకములు చదువుచుందును. మంత్రము వ్రాసి డైరీ పూర్తి చేయుదును.

మధ్యాహ్నము 1-30 లగాయతు 3-30 వఱకు వీలుగా నున్నప్పుడు మతగ్రంథములు చదువుదును. సాయంకాలము 4-30 లగాయతు 6 వఱకు రాత్రి 9-45 లగాయతు 10-30 వఱకు ప్రార్థన ధ్యానము ప్రాణాయామము వగైరా చేయుదును. శనివారము ఆదివారము ఏకాదశి ప్రతినెల 8-వ తేదీలలో సాయంత్రము భజనలో పాల్గొందును.

నేను మీరూపముమీద ధారణ చేయుదును కాని మిమ్ములను చేతిలో ఒక శూలము (Vel) తో చూచెదను. కాన మిమ్ములను పళనిఆండవర్ అనియే ధారణచేసి మీ మానుషరూపమును వీలైనంతవఱకు మఱచిపోవుదును. నేను సుబ్రహ్మణ్యమంత్రమును స్మరింతును కాని పూర్తిగా ధారణ చేయునప్పుడు రూపము కనిపించదు. ఏ రూపమును కనిపించకపోయినను మీకును నాకును కలిసియుండు ఆధ్యాత్మిక సంబంధవిషయమై ఆలోచింప ప్రయత్నించెదను. ఆ సంబంధముయొక్క అవిరామత్వము అనుభవము కలిగియుందును. నేను దానిని సరిగా సమన్వయము చేసికొనజాలను. మరియు సమస్తమును మఱచిపోయి తేలికనైవివరింపజాలని ఆనందమును అనుభవింతును. నేను తమ

ఆత్మలో తేలుచున్నట్లుండును. అది భగవంతునితో నొక విధమైన కలయికగా ఊహింతును; అపుడపుడు నాకు కలుగు కుదిలింపులు నన్ను చలింపజేయును కాని ఆభావన యందు నాకు సంతోషము కలుగును. అపుడు కొన్ని క్షణ ములు ఊపిరి ఆగిపోవును.

ఇంక నా మానసికస్థితివిషయమై నా ప్రియమైన ప్రభూ! నా ఉద్రేకములకు నాకు చాల విచారముగానుండును. అన్నిటిలో నేను మానసిక సమత్వము పొందితినికాని మీ విషయమైన సంబంధము కలిగినపుడు నేను దానిని నిలుపు కొనలేను. ఎందువల్లననగా మీరు నా జీవించు భగవా నులు. ప్రేమానందములయొక్క స్వరూపులరు. కొన్ని సమ యములందు నాకు విచారము ఎక్కువగా కలిగినపుడు నాకు బాధ కలుగును. కాని కొన్నిసమయములందు ఆ బాధ యందే ఆశ్చర్యకరమగు మాధుర్యముండును. అప్పుడప్పుడు బలహీనతను అణచవలెనని ఊహ కలుగును. మరియు కొన్ని సమయములందు మనకు అట్టి అవసరము లేదని అనుకొం దును. నేను పూజించు రూపమునందు నాకు తీవ్రమైన భక్తి లేనియెడల సాధన చేయవలయునను ఆసక్తి నమ్మకము నాకెందుకుండును? అది దివ్యవాంఛ. దానిని నేనెందుకు అణచవలయును? నేను నా సమస్తహృదయమును మీ యెదుట నెందుకు విప్పగూడదు? నేను రామకృష్ణ పరమ హంసప్రవచనమున చదివిన జ్ఞాపకము: ఇట్టి భావనను ఆయన తడితువాలు పిండుటతో పోల్చెను. అవును చాల

సరిగానున్నది. మాధుర్యమున్నది కాని దానితో సమాన మైన బాధ హృదయమును పిండునట్లున్నది. ఇట్టిభావమే నా హృదయమున గలిగి నేను నా ఆండవర్, నా ఆత్మప్రభువు నేను పూర్తిగా శరణాగతనైన ఏకైకభగవానుడు, హృదయపూర్వకముగా పూజింపబడు స్వామి, సమస్తవస్తువులలో నిమిడి నాకు ఆనందము కలిగించుప్రభువునగు మిమ్ములను చూడనియెడల హృదయము బ్రద్దలగునట్లుండును. ఓ ప్రభూ! ఇట్టి తీవ్రమైన ఆసక్తితోను పవిత్రతతోను పూజించుట మానవమాత్రులకు సాధ్యమగునని నేనెన్నడును తెలిసికొనలేదు. ఇది వర్ణించుటకు వీలుకానంత ఆశ్చర్యమైనది. నేను ఉత్తరము వ్రాయుటకు ప్రయత్నించితిని. కాని దానిని పోష్టులో వేయకుండగనే చించివేసితిని. ఆప్రకారము నేను నా హృదయమందలి అన్నిసంగతులు వ్రాసి, పోష్టులో వేయువఱకు ఆ స్థితి యుండెను. ఆ ఉత్తరము మీకు అంది మీరు చదువుదురని నా మనస్సుకు తెలిసినపుడే అది విశ్రాంతినందును: కాని నేను మీతో నా కమ్మని మౌన భాషలో మాట్లాడుచుండునట్టి సమయములు గలవు. మరియు మీరు దానిని విని నాకు జవాబు చెప్పుచున్నట్లు నాకు తోచినసమయములందు వ్రాయుట అనవసరము అనిపించును. ఇది నా ప్రస్తుతపు మానసికస్థితి. ఇందు ఎచట వృద్ధి అవసరమో నాకు దయచేసి సలహా యిండు. అన్నిటికిని నేను మీపై ఆధారపడియున్నాను. నా ప్రభూ! ఇక నన్ను విడువకుడు. ఎల్లప్పుడును దగ్గఱ ఉంచుకొని నేర్చుకొనవలసిన

దంతయు నేర్పుము. నా బలహీనత తప్పులు అన్నియు క్షమింపుడు. నేను ఎల్లప్పుడు నాతప్పులు సవరణ చేసికొనుటకు ఇష్టపడుదును. దానిని చేయుట నాకు ఎంత కష్టమైనను మిమ్ములను సంతోషపెట్టుటకు నేను అట్లు చేసెదను. ఓ ప్రభూ! నన్ను దీవింపుడు.

గురుదేవా! నేనిపుడు ఆపెదను. మీ ఆనందమిచ్చు పాదములకు నా ప్రణామములు. నేను నా దినచర్య పుస్తకము వగైరా రేపు పంపెదను. ఈరోజు ఆలస్యమైనది.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 18. మిమ్ము సేవించుటకై నా హృదయము తపించుచున్నది

తమ పవిత్రపాదములకు భక్తిప్రేమలతోఁగూడిన నా ప్రణామములు. దయతోఁగూడిన తమ ఉత్తరము నిన్న అందినది. అది నాకు అందుట అంతటి గొప్పదీవన! నేను అందుకొనుటకే వేచియున్నాను. నేను 27-వ తేదీనకూడ మీకు వ్రాసియున్నాను.

ఓ పూజ్యప్రభూ! మీరు నిజమైన అంతులేని ప్రేమ కరుణ మరియు జ్ఞానస్వరూపులు. మరియు మీదయతోఁ గూడిన మాటలు నా ప్రార్థనలకు జవాబులే కాని వేరు కావు. మీరు నా ప్రార్థనలు వినుచున్నారా అను ప్రశ్నకు మీ ఉత్తరము జవాబు నిచ్చినది. ఇపుడు నాకు అనుమానము లేదు. మీరు అది వినుచున్నారు. కొద్దిరోజులనుండి మీ ఊహలు నా మనస్సులో బాగా నిలిచియున్నవి. మరియు ధ్యేయము చేరుటకు నా ఆత్మకుగలిగిన తీవ్రమైన ఆసక్తి, మరియు అది ప్రేమించినదానితో శాశ్వతముగా కలిసిపోవలెనను కోరిక సాధారణముగా నేను సహించుటకు చాల కష్టమయ్యెను. నాకు నరములబాధ వచ్చినట్లు నాకు అనుభవము కలిగెను. నా శరీరము చాల వేడిగా నుండెను. నా దినచర్య పుస్తకములో కనపర్చినట్లు నేను రాత్రి చాల ప్రొద్దు పోవువరకు ప్రార్థించుచుంటిని. వారు అది వినుచుండిరి. నా మురుగన్ అంతులేని నా ప్రభువు, నాయందు

నిర్దయుడై యుండడు. తనయందు నాకుగల ప్రేమ ఆయన ఎఱుగును. నేను చెప్పుకొనువానికంటె నావిషయమై ఎక్కువ సంగతులు ఆయనకు తెలియును. కాని నా కర్మ ఫలితములన్నియు భస్మములగువఱకు నేను ఓపికతో వేచి యుండవలెను కాబోలును. ఓ ప్రియమైన ప్రభూ! నా అమూల్యమైన గురుదేవా! నా ఆత్మ నీలో కలిసినట్లు నాకు తెలిసినప్పుడు నేను ఎంత ఆనందము శాంతి కలిగియుందును! నేను ఎల్లప్పుడు ఈ ప్రకారము ఎందుకు ఉండలేను? నేను ఈ ఎడబాటు అనుభవించునట్లు నన్ను ఎందుకు చేయవలెను? తమకు అన్నియు తెలిసినవని నాకు స్ఫురించుట వలన నాకు చాల ఉపశమనము గలిగినది. తమ అంతులేని ఆత్మకు శరణాగతి అగుట మిక్కిలి చిత్రమైన సౌఖ్యము. మిమ్ములను కలియువరకు శరణాగత ఆనందమెట్టిదో నాకు తెలియదు. అది నేను విడమర్చి చెప్పలేనటువంటి మనోహరమైన భావన. ఈ వ్యక్తి ప్రతిదానికి మీపై ఆధారపడుట స్వర్గీయస్థితియై యున్నది. బలముకొఱకు మిమ్ములను ఎదురుచూచుట చాల ఆనందమైన విషయము. ఓ ప్రభూ! నన్ను ఎల్లప్పుడు మీ నవుకరుగా నుంచుకొనుడు. మధ్య ఏమియు రానీయకుడు.

గురుదేవా! నా ప్రియమైన ఆత్మస్వరూపా! మచ్చలేని నా పరమభక్తితో ఆ యంతులేని హృదయమందు ఇంకను లోపలికి దూరి దానితో ఖాయముగా ఒకటి అగువఱకు ప్రయత్నించెదను. నన్ను ఆ పవిత్రరక్తములో మునిగిపోనిమ్ము. దానినుండి నన్ను విడిగా నుంచుచున్న

అన్ని కర్మలఫలితమును దానిని కడిగివేయనిమ్ము. ఆ దివ్య హృదయముయొక్క ప్రతి సంకోచము నన్ను కేంద్రము వైపునకు దగ్గఱదగ్గఱగా త్రోసివేయనిమ్ము. నా ప్రతి హృదయస్పందన ధ్వనియు నన్ను ప్రాపంచిక ధ్వనులు వినకుండ చేయనిమ్ము. దాని సారమను అమృతము నన్ను త్రావనిమ్ము. ఓ ప్రియమైనస్వామీ! నన్ను అక్కడ శాశ్వతముగా ఉండనిమ్ము. అట్టి పవిత్రస్థలమున నుండుటకు తగినపని నేను ఏమియు చేయలేదు. ఆ పవిత్రస్థలమును చేరుటకు నాకు ఎట్టి అర్హతయు లేదు. అన్నివిధముల నా హీనత నాకు తెలియును. కాని నా ప్రతిఊపిరితోను నేను దానిని తీవ్రముగా కోరుచున్నాను. ఇతరము లన్నిటికంటె ఎక్కువగా దానిని కోరుచున్నాను. నేను అది చేయక తప్పదు. నేనేమి చేయుదును?

మీ ఆరోగ్యము బాగాఉన్నదని వినుటకు నాకు చాల సంతోషమైనది. ఒకవ్యక్తి తన శరీరముతో అనేక కార్యములు చేయవచ్చును. ఎందువల్లననగా అది ఆవ్యక్తి యొక్క కర్తవ్యమైయున్నది. కాని శరీరము వేలకొలది మైళ్లదూరమున నున్నను ఆత్మవల్ల చేయగలిగిన పనుల యొక్క రామణీయకత చాలా అద్భుతము. నా ఆత్మ ఎల్లప్పుడు మీ సేవయందే నిమగ్నమైయున్నది. మరియు అది మీకు తెలియని అనేక కార్యములు చేయుచున్నది. మానవుడు భగవంతుని సేవించుటయందు అనేకమార్గములు గలవు. మరియు నీవు మానుష దేహముతో నున్న నా భగవంతుడవై యున్నావు.

ఏప్రియల్ నెలలో అక్కడకు వచ్చుటకు నేను ఏర్పాట్లు అన్నియు చేసికొనుచున్నాను. గురుదేవా! నేను వచ్చుట అంత సులభముగాదు. అందుకు నేను చాలా ఆటంకములను జయింపవలయును. కాని మీ కృపాకటాక్షము వల్ల నేను ఉత్తీర్ణతపొందుచున్నాను. నేను త్వరలో మీలో నుండుటకు నన్ను ఆశీర్వదింపవలసినదిగా కోరుచున్నాను. మీరు కోరిన నాకెట్టి ఆటంకములు నుండవు. అందలినిజము నాకు బాగా తెలియును. మీ దివ్యఆత్మయొక్క తలంపే నా కండ్లకు కన్నీరు తెచ్చును. ఆహా! అది యెట్టి అద్భుతమైన దృశ్యము! నేను మిమ్ములను త్వరలో జేరుటకు నాకు సహాయపడుడు. అక్కడకువచ్చి పనిచేయు డాక్టరు అధ్వర్యునంతటి తెలివి నాకు లేకపోవచ్చును. నాయొద్దనున్న పనిముట్లు కూడ అంతమంచివి కావు. కాని నేను నామనస్సు హృదయము పనియందు నిమగ్నముచేసి నాశక్తికొలది పని చేసెదను. ఇందుకుకూడ తమ ఆశీర్వాదము నాకు కావలెను.

నేను చాల పెద్ద ఉత్తరములు వ్రాయుదును. వానిని చదువుటకు మీకు అవకాశమున్నదా? మీరు ఉత్తరమంతయు పూర్తిగా చదువుదురా? గురుదేవా! నావి ఉత్తరములు కావు. అవి నా హృదయమునుండి వెడలు భావ ప్రవాహములు. దయచేసి కొన్ని నిమిషముల కాలము పాడు చేసికొని వానిని పూర్తిగా చదువుడు. నేను ఇదివరలో నెన్నడును అట్టి ఉత్తరములు వ్రాయలేదు.

మీరు నా అల్లునికి చూపినదయకు మీకు ధన్యవాదములు. మీరు మా కుటుంబమునంతయు మీ రక్షణలోనికి తీసికొన్నారు. నిజమే, ప్రపంచమంతయు రక్షణసాధ్యములును ప్రేమపూరితములు నగు మీచేతులలోనే యున్నది. నేను ఎల్లప్పుడు మీ ఆరోగ్యము దీర్ఘజీవితమును గూర్చి ప్రార్థించుచున్నాను. భగవంతుడు తప్పక నా హృదయపూర్వకమైన ప్రార్థనలు వినును. ఆ ప్రార్థనలు నాహృదయకుహరమునుండి బయలుదేరినవి. తమ పవిత్ర పాదములకు ప్రణామములు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 19. ఓ ప్రభూ! నాకు మార్గము చూపుము

గురునాథా! నా మిక్కిలి ప్రియమైనప్రభూ!

భక్తితోను ప్రేమతోను తమ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. నిన్న నాకు అందిన మీ దయగల ఉత్తరమునకు మీకు అనేక ధన్యవాదములు. అట్టి ఉత్తరముల రాక నాకు చాల ఉపశమనము గలుగజేయును.

అట్టి విచిత్రమైన ఊహలు ఆధ్యాత్మికాభివృద్ధికి సూచనలు అని తెలిసికొనుట నాకు చాల ఉపశమనము. అవి నాకు రోజంతటిలో చాల సౌఖ్యమైన నిమిషములు. మరియు మీరు అట్టి ఉద్రేకము తగ్గించుకొనుమని చెప్పుదు రని భయము తోచుచున్నది. అవును అట్టి సమయములందు నేను నా భగవంతుని దగ్గఱగా నుండవలెను. లేనియెడల తరువాత నాకు ఆనందము కలుగనేరదు. నేను ఎల్లప్పుడు అచ్చటనే ఉండుటకు కోరుదును. ఆ దివ్యశక్తి నన్ను కప్పి నప్పుడు నాకు ఎక్కువ పరవశము కలుగును. ప్రపంచ సౌఖ్యములు ఆవేశములు కలుగుటకు స్థూలశరీరము అవ సరము. కాని నాకు శరీరము ఆటంకముగా నున్నది. నేను స్వేచ్ఛగా ఆ దివ్య ఆనందము ఎల్లప్పుడు పొందుటకు నా శరీరము లేకుండిన బాగుండునని నేను తఱచు ఊహించు చుందును. ఆ దివ్య ఆనందముతో పోల్చిన ప్రపంచసౌఖ్యము లన్నియు పైపైవిగాను అముఖ్యమైనవిగాను క్షణికములు గాను కనిపించును. ఈ క్రొత్త జీవనమునకు నాకు త్రోవ చూపించినందుకు మీకు ధన్యవాదము లీయకుండ ఎట్లుండ గలను? ఓ భగవంతుడా ఇది అంతయు ఆశ్చర్యముగా నున్నది. ఈ రోజులలో నేను ప్రాపంచిక కార్యములలో

నిమగ్నమైనప్పుడు నా అంతరాత్మ అచంచలముగా ఆ భగవంతునితో కలిసియుండును. నేను కండ్లు మూసికొని లోచూపు చూచుకొనిన నేను పూర్తిగా నా భగవంతునితో నుండి దివ్య ఆనందమును అనుభవించుచుందును. అట్టి దానిని అనుభవించినవారే దానిని తెలిసికొనగలరు.

ఓ ప్రభూ! నేను తిరిగి ఫిర్యాదుచేయను. శ్రీ కృష్ణ భగవానుడు చెప్పినది నిజము. నాకు ఆ సంగతి తెలియును. నేను ఓపికతో వేచియుండెదను. నేను ఆయనదానను.

'తత్త్వమసి' ఈ మూడుమాటలలో ప్రపంచమునందలి అన్నివిచిత్రము లున్నవి. మీ ఫోటో నేను మొదలు చూచినప్పుడు అది నాకు బోధించినది ఆ మూడుమాటలే. మరియు నాకు నూతనజీవితము కనుపించినది. నేను దాని అర్థము పూర్తిగా గ్రహించితిని. నేను మీకు అన్నివిషయములలో ధన్యవాదము లర్పించుచున్నాను.

నా మామూలు జపముగాక మీ ఆరోగ్యముకొరకు ప్రతిదినము మూడుమాలలు మృత్యుంజయ జపము చేయుచున్నాను. మీ ఆరోగ్యమునకు ప్రార్థించుట అనగా ప్రతి వ్యక్తివిషయమై ప్రార్థించుటయే. నాకు ఇపుడు ప్రత్యేక 'వ్యక్తిత్వము' లేక 'ఉనికి' లేదు.

శనివారము ఆదివారము రోజులలో నా ధ్యానసమయమందు నాకు గట్టిదృశ్యము కనిపించినది. నా స్వరూపమే నాయెదుట కనిపించినది. దానిని పోగొట్టుకొనుటకు నేను కండ్లు తెఱచితిని. కాని అది మరల కనిపించెను. దీని అర్థమేమి? అది అరిష్టమా? అయినచో దానికి విరుగుడు ఎట్టిది?

నేను మామూలు ప్రకారము నా భగవంతునియందు ధారణ చేయుచుంటిని. నేను ఆనందమైన ధ్యానములో మగ్నము కాగలిగితిని. దయచేసి నాకు సలహాయిమ్ము. నా రూపమే నాయెదుట నన్ను చూచునట్లుండుట నాకు చాల అసౌఖ్యముగా నున్నది.

ఓ ప్రభూ! నేను ముందునకు సాగిపోయెదను. భగవంతుని వెదకుటలో నన్ను ఏదియు ఆటంకపరుపజాలదు. నేను తప్పక ఆయనను చేరెదను. కొన్ని సంవత్సరముల ప్రయత్నము అవసరమైనను ఆ ప్రకారము చేసెదను. ఆయనను చేరుటకు చేయు ప్రయత్నము కూడ ఆనందమే. ఆయనతో కలిసియుండుట ఎట్టిదో తెలిసిన నేను ఆ పనిని ఇపుడు ఎట్లు విరమింపగలను? దయచేసి నాకు సలహా యిచ్చుచుండుడు. మరియు నాపని నేను చేసికొనుటకు బలము నివ్వకోరెదను.

ఇంతవఱకు దినచర్య పంపనందుకు క్షమింపవలెను. నా పురోవృద్ధికి నేను ఏమైన చేయవలసిన నాకు సలహా పంపుడు.

నేను మిమ్ములను చూడవలెననియున్నది. వీలుగా నున్నపుడు వచ్చెదను. మీరు నన్ను చూడగలరా? వినగలరా? మీ పాదపద్మములకు ప్రణామములతో నేను నిలిచెదను. స్వామీ నన్ను ఆశీర్వదింపుడు.

శాశ్వతముగా మీదానను,
చెల్లా.

# 20. భక్తుని హృదయము

ప్రేమతోను గౌరవముతోను మీ పవిత్రపాదము లకు ప్రణామములు.

నేను గింజలయొక్క రిజిస్టర్డు పార్శెలు నిన్న పంపి యున్నాను. నా దినచర్య యిందువెంట పంపియున్నాను. నేను ఈరోజున-(8వ తేదీన) నెలలో పవిత్రమగు ఈ దిన మున తమిళములో కొన్ని వాక్యములు వ్రాసి పంపినాను. దయచేసి వానిని చదువుడు.

ఓ నా ప్రియమైనప్రభూ! నేను మిమ్ములను ఈరోజు మధ్యాహ్నము స్పష్టముగా చూచినాను. మరియు నాకు సంతోషముగా నున్నది. మీ ఉత్తరము వచ్చినది లగా యతు నేను నిర్మలముగాను తృప్తికరముగాను ఉన్నాను. మీ దివ్యఆత్మ నాయొద్దనే యున్నట్లు నేను సదా భావన కలిగియున్నాను. అప్పుడప్పుడు నాకు మీ యెడబాటు ఊహ ఎందుకు కలుగవలెను? మీరు ఆ రోజులలో బాగా పనిలోనుండి నన్ను పూర్తిగా మరచిపోవుదురా? ఇపుడు నేను అనుభవించుచున్న తృప్తి ఆనందముగల స్థితి ఎట్లు నిలుపుకొందునో ఓ భగవానుడా నాకు దయచేసి తెలియ జేయుడు. నేను ఎడబాటును తీవ్రముగా అనుభవించునపుడు నేను ఆధ్యాత్మిక జీవితములో తగ్గిపోవుచున్నానా లేక అది ప్రతిమామూలు సాధకునకు గలుగు స్థితియా? గురుదేవా! అది దివ్యసంబంధమైన అనుభవము. అందు శరీరసంబంధము

లేదు. అది నేను ఎక్కువగా ధారణచేయుటకు సహాయ పడును. అయినను దీనివిషయమై మీ సలహా నాకు కావలెను. నేను అది తప్పించుకొనవలసియున్నయెడల దానికి ఉపాయము తెలియపఱచుడు. నేను నా సాధనయందు ఋజుమార్గముననే నడుచుచున్నాను. నేను వృద్ధినొందవలెనని తీవ్రమైన ఆసక్తితో నున్నాను. నాకు అన్నివిషయములందు సలహా నీయగోరెదను.

నేను యోగాసనములు నెలలో ప్రతిదినము వేయవచ్చునా?

నేను మార్చి నెలకొఱకు ఎదురుచూచుచున్నాను. నేను మిమ్ములను చూచుటకు కోరుచున్నాను. మరియు మీవద్ద ఈ శరీరరీత్యా ఆధ్యాత్మికరీత్యా నుండి స్వర్గీయ ఆనందమును అనుభవింపగోరుచున్నాను.

ఓ ప్రభూ! ప్రణామములు. వానిని దయతో స్వీకరింపుడు.

ఎల్లప్పుడు నీదానను,

చెల్లా.

# 21. ఎక్కువ జ్ఞానముగల గురువు

నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను మర్యాదతోను సౌఖ్యము గలుగజేయు మీ పాదములకు ప్రణామములు. దయతో మీరు వ్రాసిన ఉత్తరమునకు మీకు నేను సరిగా ధన్యవాదము లీయజాలను.

ఓ నా విచిత్రమైన ప్రభూ! దయాసముద్రుడా! ఆధ్యాత్మిక నిచ్చెన నెక్కుటకు ప్రయత్నించుచున్న నా మానవమనస్సును కనిపెట్టి ఆమోదించి దానికి సౌఖ్యము గలుగజేయుటకు మీ ఉచ్చస్థానమునుండి క్రిందకు మానవ స్థితికి దిగుటకు మీరు చాల దయతో స్వీకరించితిరి. మీవంటి నిర్దుష్టమైన గురువు దొరకుట నా అదృష్టము. ఆధ్యాత్మిక విద్యయందు ప్రథమ అభ్యాసకుడు చలించని నమ్మకము ఆశతో ఆధ్యాత్మికమార్గమందు నడుచుటకు ఓర్పు ఆసక్తి బలము ఎల్లపుడు కలిగియుండడు. కాని మీవంటి గొప్ప గురువు విషయమై తెలిసినవాడు అట్లుండడు. మీరు శిష్యుని యొక్క మనస్సునందలి తమోభావములు బాగుగ గ్రహించి వానిని ఆధ్యాత్మిక మార్గమందు సరియైన మార్గమున నడుపుదురు. శిష్యుడు పతనము కాకుండ మీదయగల రక్షణ హస్తములు వానిని రక్షించును. ప్రతిదినము గీతను చదివిన తరువాత 'ఇమిటేషన్ ఆఫ్ క్రైస్ట్' అను పుస్తకమునుండి ఒక అధ్యాయము చదువుచుందును. ఈ పుస్తకము చాల

ఉత్తేజకరముగను ఆహ్లాదముగను నుండును. అందులో నుండు బోధ మీబోధవలెనే యుండును. బాధపడుచున్న మానవజాతిని ఉద్ధరించుటకు మీరు మానుషశరీరముతో అవతరించితిరి. మీ మానుషశరీరమునకు ఆరోగ్యము దీర్ఘాయువు గలుగజేయుటకు నేను ప్రార్థించుచుందును.

నేను నిన్న ఉత్తరము పూర్తిచేయలేకపోయితిని. మిసెస్ కృష్ణారావు నన్ను చూచుటకువచ్చి నేను ఆసుపత్రి విడుచువఱకు నాతోనే యుండినది. మరియు నింటియొద్ద వ్రాయుటకు చాల అడ్డంకులు గలవు.

నేను తఱచు తెలిసికొనుచున్నాను. నేను మీకు ఉత్తరము వ్రాసిన వెంటనే నా ఆదుర్దాలన్నియు ఆశ్చర్యముగా అదృశ్యమగును. నిన్న సాయంత్రము 'ఓంజీ' నా యొద్దకు వచ్చినారు. అంతయు అనుకూలముగానే జరిగినది. నేను చాలకాలము ఆయనతో మాట్లాడితిని.

నేను మీకు లోగడ ఉత్తరములో వ్రాసిన ప్రకారము 20 వ తేదీన చాల నిరాశస్థితిలో నున్నాను. 21 వ తేది ఉదయము అన్నియు చాలవఱకు సరిపడినవి. అదిఅపుడు ఎట్లున్నదో తక్షణం నా నోటుబుక్కులో వ్రాసినాను. నాకు ఏమి జరిగినను మీకు వ్రాసిపంపుచున్నాను. అది మీరు విమర్శించి నన్ను సరియైనమార్గమున నడుపవలెను.

అది ఉదయము 9 గంటలకు ప్రారంభించినది. నేను ఆ ఆనందమయునియొక్క సాన్నిధ్యము అనుభవించుచుంటిని. నా హృదయతంతువుల ఆకర్షణ నేను ఆపుచేయలేకుంటిని. నేను నాపనిలో నిమగ్నురాలనై యున్నను ఈ

ఊహాలో నిమగ్నమైయుండవలదని మీరు నాకు జ్ఞాపకము చేయుచున్నను నేను పనిచేయునపుడు కూడ ఆయనను నా మనస్సులోనుండి తీసివేయలేనయితిని. ఆయన ఆనందప్రవాహములు నాకు ఆవేశము గలిగించుచుండెను. ఉదయము 10 ఘంటలగుసరికి నిలువలేకపోయితిని. అదృష్టవశాత్తు అప్పుడు రోగులు కొద్దిమందిమాత్రమే యున్నారు. కాబట్టి నేను వారిపని పూర్తిచేసి ధ్యానమునకు కూర్చుంటిని. నేను కండ్లుమూసికొని వానిని వెంటనే దీర్ఘధ్యాన నిమగ్నునైతిని. నా శరీరమందు వెన్నెముక ద్వారా ఒకవిధమైన స్పందనముకలిగెను. ఆనందపుఅలలో మునిగిపోయితిని. దివ్యశక్తి యొక్క సుడిగుండమువలె నేను ఆనందసముద్రములో గాఢముగా మునిగిపోయితిని. నేను మంత్రముగాని 'ఓం' గాని ఉచ్చరింపలేకపోయితిని. దివ్యశక్తి మాత్రము నా జ్ఞాపకమందుండెను. ఆ అనుభవము తెలుచు నాకు కలుగవలెనని నేను అనుకొనుచుందును. ఆ మౌనమ్మృదుభాష ఏ భాషలో వ్రాయుటకు వీలులేనంత సౌమ్యముగానుండెను. ఓ ఆనందమయప్రభూ! ఓ మురుగా! అన్నియు తెలిసిన ఓ ప్రభూ! ఓ గురుదేవా! అల్లకల్లోలము తదుపరి మీరు నాకు కలిగించిన ఆ శాంతికి మీ కుధన్యవాదములు. నిన్న అంతగా ఆందోళనపడిన వ్యక్తిని నేను కానేమోయని నేను ఈ రోజున ఊహించుచుంటిని. నేను ఈవిధముగా ఎందుకు ఉద్రేకము చెందవలెను? నా అనుభవము ఎట్టిది? అదియొక ఆవేశమా లేక ఆధ్యాత్మికవృద్ధియొక్క సూచనా? తదుపరి నాకు గలిగిన శాంతిని బట్టి అది ఆవేశము కాదనియే

నా నమ్మకము. అట్టి సమయములందు నేను ఏమిచేయ వలెనో మీరు దయచేసి సెలవిండు.

ఓ గురుదేవా! నా మిక్కిలి ప్రియమైనప్రభూ! నాకు తటస్థించు ఈ ఆశ్చర్య సంఘటనలు ఎట్టివి? నేను మీభక్తి యొక్క ఆనందములో నున్నప్పుడు మీ గొప్పతనము మరచిపోవుదును. మీ పవిత్ర పాదపద్మముల ధూళికి కూడ నేను సరిపోనను విషయము మఱచితిని. అట్టి ఉన్నతస్థితికి చేరుటకు ఇంకను చాలకృషి చేయవలసియున్నదను విష యము నేను మఱచితిని. ఈ స్థితిలో మీకు నాకు మధ్యగల భేదము మఱచితిని. అట్టి సమయములందు బహుశా బాహ్యావిషయములనుండి నేను విడివడియుందును. నా బయటి పొరలోనుండి దూరి లోనుండు దివ్య ఆత్మదగ్గఱ చేరుదును. మరియు అట్లు ఆ ప్రకారము దైవమగు మీకు దగ్గఱగా చేరుదును. అట్టి మధ్యభాగము విడిపోవుట విష యమై నాకుకూడ బహుశా తెలియదు. భగవంతునిలో నేను మీరు ఏకమును పవిత్రమునగు ప్రారంభస్థితిని చేరి యుంటిమి. అన్ని భేదములు అంతరించెను. కాని నాకు బాహ్యప్రపంచ స్మరణ కలిగి ప్రపంచవిషయములలో పాల్గొనునపుడు నేను మీకు అంత స్నేహముతో వ్రాయు టకు నాకు కలిగిన స్వేచ్ఛ స్నేహముల విషయమై ఆశ్చర్య పడుచుంటిని. కాని మరునిమిషమున అన్నియు గ్రహించ గల శక్తి తమకున్నదని నేను తెలిసికొందును. మరియు అంతయు సరియైన పద్ధతిలో మీరు ఆలోచించెదరని నేను

నమ్మియుండుదును. ఓ దయాస్వరూపా! నేను మిమ్ము పూజింతును.

తమ ఆరోగ్యము విషయమై దయచేసి వ్రాయుడు. సత్సంగమునుండి తిరిగి వచ్చునప్పుడు మీ తలకు వేడిగా నుండు ఆచ్ఛాదనము ఉంచుకొందురని నేను ఆశించుచున్నాను. ప్రేమతో దయార్ద్రహృదయుడగు శ్రీ సచ్చిదానందస్వామి మీ విషయము లన్నింటను జాగ్రత్తగా పరికించుచుండునని నాకు తెలియును. అయినను మీరు జాగ్రత్తగా నుండవలెనని నేను మిమ్ము ప్రార్థించుచున్నాను. నేను మీ విషయమునందు ఎక్కువ స్వాతంత్ర్యము తీసికొనుచున్నందులకు నన్ను దయచేసి క్షమింపుడు.

మీ దివ్యపాదములకు నన్ను ప్రణామములు చేయనిండు. ఓ ప్రభూ! నన్ను ఆశీర్వదింపుడు. నేను లోగడ మిమ్ములను బాధించుచున్నట్లుగా ముందు బాధింపకుండ, నాకు ప్రస్తుతము కలిగిన మనశ్శాంతి శాశ్వతముగా నుండునట్లుగా ఆశీర్వదింపుడు. గురుదేవా! మీరు అద్భుతమైన వారు! మీరు సచ్చిదానందస్వరూపులే! నేను మిమ్ములను ఎల్లప్పుడు పూజించెదను.

శాశ్వతముగా మీదానను,

చెల్లా

# 22. శివుని పుస్తకముయొక్క ఇంద్రజాలము

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

తమ పవిత్రపాదములకు గౌరవముతోను ప్రేమతోను ప్రణామములు చేయుచున్నాను. మీరు 22వ తేదీన వ్రాసిన ఉత్తరములో మీరు కనుపరచిన దయ, నా గుణగ్రహణము, సానుభూతి - వీనికి నా హృదయపూర్వకమైన ధన్యవాదములు.

ప్రియమైన గురుదేవా! రోజురోజు నేను మీదాన నగుచున్నట్లు నాకు కనిపించుచున్నది. మరియు నేను ఎక్కువ సురక్షితముగా సౌఖ్యముగా ఉన్నట్లు అనుభవమునకు వచ్చుచున్నది. నా ప్రభూ! నన్ను మీరు ఇక విడువవలదు. నేను నేర్చుకొనదగినదంతయు నాకు నేర్పి మీతో ఎల్లప్పుడు ఆనంద ఆధ్యాత్మిక కలయిక కలుగునట్లు చేయుడు. అది లేనప్పుడు నేను జీవించలేనట్లు ఊహించుచున్నాను. మీనుండి యింతదూరములో త్రోయబడుటకు పూర్వజన్మమందు నేనేమిచేసియున్నాను? నా ప్రారంభస్థితి పొందుటకు నేను ఎట్టితపస్సు చేయవలెను? ఓ నాప్రియమైన ప్రభూ! నన్ను ముట్టడించి మీరే నా ఆత్మకు మూలాధారమైనారు. మరియు నేను మీయందే విశ్రాంతి పొందగలను. ఇవి నేను వట్టి ఆవేశముతో చెప్పు మాటలుకావు. అంత

కంటె ఉత్కృష్టమైనవి. అది పవిత్రమైన దివ్యమైన నమ్మక ముతో కూడిన స్థిరమైన ఊహ! నాయొక్క ఆశలు ఊహాలు నేను మీకు స్పష్టముగా తెలుపలేను గాని నాకు మీయం దుండెడి భక్తి మీరు బాగుగా తెలిసికొంటిరని నాకు తెలియును.

అప్పుడప్పుడు నా తప్పులు నా అల్పత్వము మీ ఆధిక్యత – వీని స్పృహ గలిగినపుడు తమయొక్క దయకు పాసితినని ఊహింతును. అట్టి ఊహావల్ల నాకు ఊపిరిసలుపని యొకానొకస్థితి గలుగును. మురుగా! నా గురుదేవా! నేను ఆ ప్రకారము బాధపడునప్పుడు నన్ను విడిచిపెట్టకుము. ఎచ్చటనైనను సరియే మీయొద్దనే యుంచుకొనుడు. గురుదేవా! నాకు భక్తిసంగీతము వినుటయందు ఆసక్తి. ఆ దివ్యసంగీతముయొక్క మృదువైన గీతములు మీరు ఎట్టి భూమికలోనున్నను మీయొద్దకు నన్ను చేర్పగల అదృశ్య సేతువువలె కనిపించుచున్నవి. ఆ ప్రకారము నాకు అనుభవము కలుగుచున్నది. అయస్కాంతమువల్ల లాగబడినట్లు నా ఆత్మ మీయొద్దకు లాగబడుచున్నట్లు నాకు తోచును. గత సాయంత్రమంతయు నేను పూర్తిగా దయతోగూడిన మీ పాదములయొద్దనే ఉంటిని.

మీరు ఎంత ఆశ్చర్యకరమైన పుస్తకములు వ్రాయుచుందురు! అవి ఉత్తేజకరములు, బోధకరములు, ఆసక్తికరములుగ నుండును. ఈ కొద్దికాలములో అనేకమంది వ్రాసిన వివిధ పుస్తకములను నేను చదివినాను. వానిలో చాల

పుస్తకములందు నిజమైన భావము తెలిసికొనుటకు సగము కాలము ఉపయోగింపవలసివచ్చును. ఆ కారణమువలన మీ పుస్తకములు చదువుటలో నేను పొందు సంతోషకరమైన అదృశ్యరూపమగు ఆకర్షణస్పందనములు అందు కనిపించవు. మీ పుస్తకములయందలి మాటలు నాకు తెలియకుండగనే అన్ని దైనిక కర్మలందును నాకు ఉత్తేజము కలుగజేయును. మీరు మీ పారమార్థికమై ఆకర్షకమైన వ్రాతలలో జీవితముయొక్క అన్ని పద్ధతులు తెల్పి అవి వివిధ గుణములు గల వ్యక్తులయందు ఎట్లు సహాయపడునో తెల్పియున్నారు.

ఫారెస్టు విశ్వవిద్యాలయ వారపత్రికయందు పిల్లల సంబంధమైన విషయములు ఆ గొప్ప ఆత్మపురుషుడు స్వామి సచ్చిదానందజీ వ్రాసినందుకు వారికి నా ధన్యవాదములు. నా కుమారుడు అవి చదివి వానియందు శ్రద్ధవహించినాడు. నేను స్వామిజీయొక్క 'ఆరోగ్యము-దీర్ఘజీవితము' విషయములో ప్రార్థనచేయుచున్నాను. నాకు బాల్యములో నుండిన శక్తి నేను ఇపుడు కోరుచున్నాను. ఏది ఎట్లున్నను నా కుమారుడు ఆధ్యాత్మికస్థితిలో పెరుగుటకు నా శక్తికొలది ప్రయత్నము చేయుచున్నాను. ఇందుకు ఆవిధమైన పుస్తకములు చాల అవసరమగును.

స్వామి వేంకటేశానందజీ తండ్రి నా ఆసుపత్రికి నిన్న వచ్చినారు. తమ అమెరికా భక్తులు మద్రాసు వచ్చినట్లు చెప్పుటకు వచ్చినారు. శ్రీ శ్రీనివాసన్ మద్రాసులో

సౌఖ్యముగా నుండుటకు నాశక్తికొలది నేను సహాయము చేసెదను. నీయందు భక్తిగల ప్రతివ్యక్తియు నా బంధువుడే.

ప్రతిదియు చాల అద్భుతముగా నున్నది. కొన్ని రోజులనుండి నేను వరుసగా క్రీస్తువిషయమై ఆలోచించు చున్నాను. మరియు నాకు ఆయనయందుగల ప్రేమవల్ల కొన్ని క్రైస్తవమత ఆధ్యాత్మికగ్రంథములు చదువవలసి వచ్చినది. మరియు నేను ఒకదినము చర్చి (క్రైస్తవ ప్రార్థ నాలయము)కి వెళ్లవలెనని ఉన్నాను. డాక్టరు చెత్తక్ గారితో చెప్పియున్నాను. ఇపుడు నాకు ఆరహస్యము తెలి సినది. క్రైస్తవభక్తుల ఉపయోగమునిమిత్తము నా ప్రియ మైన ప్రభువు నా గురుదేవుడు క్రైస్తుయొక్క రూపము ధరించుచున్నాడు. డిసెంబరు 22-వ తేదీన ప్రచురింపబడిన ఫారస్టు విశ్వవిద్యాలయ వారపత్రికపైన చిత్రింపబడిన బొమ్మనుబట్టి నాకు ఈజ్ఞానము (ఊహ) కలిగినది. తమ ఆశ్చర్యమైనమార్గము తెలిసికొనుటకు నేను ఆ బొమ్మవంక చాలసేపు ఏకాగ్రదృష్టితో చూచితిని. నా ప్రభూ! మీరు ఎట్టివారు? మీయట్టి గొప్ప గురువును మేము ఎచ్చట కను గొనగలము? మీరు క్రైస్తవులకు క్రీస్తు, మహమ్మదీయులకు అల్లా. ఈప్రపంచమంతటిలో ప్రజలందరు ఆరాధించు సమస్త దేవతారూపములును మీరే!

శివానంద రాధ ధన్యురాలు. ఆమెకు మీయందుగల భక్తికి నేను ఆమెను ప్రేమించెదను. నేను ఆమెను ఎఱు గను. నాకు ఎరుక లేకపోయినను మిమ్ము సేవించు ప్రతి

వారిని నేను ప్రేమించగలను. ఆమెకు సంతోషకరమైన క్రిస్ట మసు చాల సౌఖ్యకరమైన నూతన సంవత్సరము కలుగు నట్లు మీరు నాతరఫున ఆమెను దీవింపుడు.

ఓ నా ఆత్మప్రభువా! నాకు కనబడుచున్న మురు గా! నా ప్రియమైనస్వామీ! మిమ్ములను మీ ఆశ్రమము లోనివారలను సంతోషకరమైన క్రొత్తసంవత్సరము అనుభ వించుటకు కోరుచున్నాను. క్రొత్తసంవత్సరమురోజు పూర్ణ ఆరోగ్యము దీర్ఘజీవితము జీవితమందలి అన్ని మంచివిషయ ములు ఇచ్చుటకొరకై నా మొదటిప్రార్థన. నేను ఉదయము నిద్రనుండి లేచిన తక్షణం మీముఖము చూచెదను. మీ దయ ఎల్లప్పుడు ఉండునట్లు ఆశీర్వాదింపుడు. నేను వేరొక విషయమేదియు ప్రార్థింప నవసరములేదు. తమకృప నాపై నున్నప్పుడు నా జీవితము సుఖముగా నుండుటకు కావలసిన వన్నియు నాకుండును.

నా ప్రభూ! ప్రేమతోగూడిన మీ పాదములకు ప్రణామములు.

నా ప్రియ ప్రభూ!

ఎల్లప్పుడు తమదాసను,

చెల్లా.

# 23. తమ అనుగ్రహమే నాకు కావలెను

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

గురుదేవా ప్రణామములు. తమ పవిత్రపాదములకు ప్రణామములు. ఇచట మీ పాదములకు సమస్తము సమర్పించుచున్నాను. నన్ను మీరు స్వీకరించి నా ధ్యేయమునకు నాకు త్రోవచూపుడు. నాకు బోధపఱపుడు. తమ సలహా ఎట్టిదైనను ఆ ప్రకారము నడుచుకొనుటకు నా జీవితము మీకు అర్పణచేయుచున్నాను. దినదినమునకు మీరు నాకు ఎక్కువ పవిత్రులగుచున్నారు. ఇంకేమియు కాదు. మరియు మిమ్ములను ప్రతిచోటను ప్రతివ్యక్తియందును చూచుచున్నాను. నేను ఎవరితోనైనను మాట్లాడుచున్నప్పుడు వానిద్వారా లేక ఆమెద్వారా నిన్ను చూచుచున్నట్లు వినుచున్నట్లు నాకు అనుభవమగుచున్నది. మరియు నాకు తెలియకుండగనే నేను ఆ మనిషిని అతడెవరైనదియు తెలియకపోయినను మర్యాదచేయ ప్రారంభించెదను. నాకు అపుడు చాల ఆనందముగా నుండును. మీ రెల్లప్పుడు నా యొద్దనే యున్నట్లు ఊహించెదను.

మీ విలువగల ఉత్తేజకరమైన ఉత్తరము (24వ తేదీ గలది) నాకు నిన్న అందినది. ఈ మధ్యాహ్నము మరల మీ దృశ్యము చాలకాలము కనిపించినది. గురుదేవా! అది ఎట్టి అద్భుతమైన అనుభవము! నేను మిమ్ము చాల స్పష్టముగా చూచితిని. నేను మిమ్ములను చూచినప్పుడు

మీకు తెలియదా? అది తప్పక కలకాదు. అది నాకు నిశ్చయమే. ఊహకూడ కాదు. భగవంతుడు గొప్పవాడు, దయాళువు.

మీ ప్రేమపూర్వక ఆదరణవాక్యములకు మీకు ధన్యవాదములు. మీ కటాక్షము నాకు కలిగిన ఈ ప్రపంచ మందు నాకు సంతోషము కలిగించు నింకొకవస్తువు నాకు అవసరములేదు. ఓ నా ప్రియమైనప్రభూ! మీరు నా సౌఖ్యమునకు చాల కూర్చియున్నారు. నాకు మీతో కలయిక కలిగినతరువాతనే జీవితములో నున్న సౌఖ్యము దాని నిజమైన అర్థము తెలిసికొంటిని. నేను ఏదైన మంచి చేసినయెడల అది మీకటాక్షమే. నాకు గలిగెడు మంచి అంతయు మీ కటాక్షమువల్లనే కలుగుచున్నది. ప్రపంచ ప్రేమవిషయమై నేను అనేకపుస్తకములు చదివితిని. అనేక పుస్తకములవిషయమై వింటిని. కాని ఆధ్యాత్మికప్రేమకంటె గొప్పది యేదియు లేదు. ఆ ఆధ్యాత్మిక కలయిక ఎంత పవిత్రమైనది! ఎంత ఉద్రేకము శాంతి గలిగించునది! ఇంక నేదియు అట్టి శాశ్వతకలయిక అట్టి నిరంతర ఆనంద ప్రవాహము గలిగియుండదు. భగవంతుడు నాకిచ్చిన అసాధారణమైన ఈవులకు ఆయనను లెక్కపెట్టలేనన్నిసార్లు తలంచుచున్నాను. నేను ఈప్రపంచములో నివసించుచు మీరు దానికి చాల పైగా నున్నట్లు ఊహించుట చాల ప్రియమైన ఊహ. ఇట్టి ఊహ నాకు కొన్ని సమయములయందే కలుగును. అవి ఖాయముగనుండిననే ప్రపంచమందు జీవించి

యున్న అందరిలోను చాలసౌఖ్యమైన జీవిని అగుదును. నా దైవమా! ఈ ప్రపంచమంతయు మీలో నిండియున్నదనియు నేనుకూడ అందులో నొకభాగమేయనియు నా అనుభవము నకు అపుడపుడు వచ్చినప్పుడు నాయొక్క ఉత్కృష్టమైన రుచితోకూడిన ఆనందానుభవము వర్ణించుటకు వీలులేదు. మరియు నేను చూచునది ఊహించునది అంతయు మీలో భాగమే. నేను తృప్తితో సంతోషముగా నుందును. మరియు నాపని నేను చేసికొనుటకు నాకు సంతోషముగాను ఆసక్తి గాను నుండును. నేను చేయవలసినపని ఎంత కష్టమైన దైనను ఎంత అసౌఖ్యమైనదైనను మీరు నావిషయమై సంతోషించుచుందురనియు నన్ను సరిగా గ్రహించుచుందు రనియు నాకు తెలిసినపుడు నాపని నేను చేయుదును. చాల సంతోషకరముగాను ఆసక్తికరముగాను నుందును. ప్రతి దినము ప్రతిక్షణము మీరు నా ఊహలోనేయుందురు. అది పవిత్రమైన ఊహ. నేను మిమ్ములను ఎల్లప్పుడు తెలిసి కొనియేయుందును. మరియు నేను ఎల్లప్పుడు మీయొద్దనే యుందును. ఈ నమ్మకము నాకు దినదినము వృద్ధియగు చున్నది. మరియు అది నాకు మనశ్శాంతి నిచ్చుచున్నది. ఉత్కృష్టధ్యేయముకొరకు పనిచేయుట శ్రమ అనిపించదు. నేను భగవంతునిలో శాశ్వతముగా కలియువఱకు విడువ కుండ పని చేయుచుందును. ఇదియే నా జీవితముయొక్క ఏకైక కోరికయైయున్నది. నాకు సమాధి యనగా మీ యొక్క స్పృహ యుండుటయే. అది అన్నివిధములగు

ద్వంద్వములను మించియుండును. ఈవిషయమును వర్ణించుటకు మానవభాష ఎందుకును పనికిరాదు.

మీ ప్రసాదమునకు (మిఠాయి) ధన్యవాదములు. అది చాల రుచికరముగా నున్నది. నేను మీనుండి ఈ శరీరమును దూరముగా ఎందుకుంచితిని?

నేను సుశీల అచ్యుతరామన్ ఇంట్లో కొన్ని ఆనందకరములగు దినములు గడిపితిని. అయిదురోజులు కన్నయ్యపంతులు ప్రతిసాయంకాలము 3–3½ గంటలు భజనలు ఉపన్యాసములు జరిపిరి. ఆమె యిల్లు మాయింటికి ఎనిమిది మైళ్ళదూరమున నున్నది. రాత్రి 7 గంటలతరువాత నన్ను మాతల్లి బయటికి వెళ్ళనిచ్చునది కాదు. అందువలన అడ్డంకి కలుగునని ఊహించితిని. కాని మీ కటాక్షమువల్ల నేను ప్రతిదినము వెళ్ళగలిగితిని. నేను మిసెస్ సాంబశివరావు కలిసి వెళ్లెడివారము. శ్రీమతి సుశీల ఇట్టి దివ్యగానము మాకు కలుగజేయుటకు ఆమెదయయే కారణము. భగవంతుడు ఆమెను మరియు వారికుటుంబమును దీవించునుగాక.

గురుదేవా! అనేక సాయంసమయములందు ఇతరులు క్లబ్బుకు వెళ్ళినతరువాత నేను ఇంటియొద్ద కూర్చొనియుంటిని. మరియు నా ఆత్మతో ఋషీకేశమునకువెళ్ళి తమ పాదములవద్ద కూర్చొని సత్సంగము అనుభవించితిని. ఎందువలననగా మీరు నన్ను అక్కడ ఈదినములో నెప్పుడు గుర్తుపట్టుదురు. నిస్సహాయియగు ఆత్మ మిమ్ములను చేరుటకు కష్టపడుచు మీ దివ్యగానము వినుటకు చెవులనిక్కబెట్టు



కొనుచున్న విషయము మీకెప్పుడైన పట్టినదా? మీరు పడకకుర్చీలో కూర్చొని చేయుగుర్తులన్నియు నాకు జ్ఞప్తి యందున్నవి. నేను నిజముగా భగవంతునికి శరణాగత నైతిని. కాని ఆయన నాయందు గలుగు సమస్తము తెలిసి కొనుచుండును. మరియు ఆయన సరియైన తరుణమందు నాకు సహాయముచేయును. అంతవరకు నేను ఓర్పుతో నిలిచి యుందును.

డాక్టరు కృష్ణారావుగారిని నన్ను చూచుటకు వెళ్ళ వలసినదిగా మీరు చెప్పుట మీకు నాయందుండు దయను తెలియపఱచుచున్నది. అతడు కొన్నిరోజులక్రిందట నా యొద్దకు వచ్చెను. తిరిగి తన భార్యతోకూడ వచ్చెదనని చెప్పెను. మీయందు వారికిగల భక్తి వారిని నా స్నేహి తులగా జేసినది. మిమ్ములను నమ్మకముగా ప్రేమించు వారితో మాట్లాడుట చాల సౌఖ్యము కలుగజేయును. అట్టి వారు నా నిజమైన స్నేహితులు బంధువులు.

ప్రతి ఆదివారము మరియు ఏకాదశీరోజున నేను రామకృష్ణ మిషనునకు వెళ్ళి అచ్చట భజనకు హాజరగుదును. ఆమఠములోనుండు కొందఱు స్వాములు బ్రహ్మచారులు నాయొద్దకు మందుకు వచ్చుచుందురు. మరియు అట్టి పవిత్ర ఆత్మలకు సేవచేయగలుగుట నొక దీవనయనియే నేను ఊహించెదను. నేను వారి కాషాయవస్త్రములను చూచి నపుడు మీవిషయమై ఎక్కువగా తలంచెదను. గురుదేవా! నేను ఎప్పుడు విడువకుండ మీ పాదములయొద్ద విశ్రమింతు

ను? దయయుంచి నావిషయమై ప్రార్థింపుడు. భగవంతునే నావిషయమై కోరుట అసంభవముగా నుండును. అయినను నేను అడుగక తప్పదు.

గురూజీ! మీ ఆరోగ్యవిషయమై మీ రేమియు తెలియపఱచుచుండుటలేదు. ఆవిషయమై తెలిసికొనుటకు నాకు హక్కు లేదా?

నేను ఇంతకంటె చిన్ని ఉత్తరము వ్రాయుటకు నాకు చేతకాదని తోచుచున్నది. దయచేసి క్షమింపుడు. నన్ను మీ దివ్యపాదములకు ప్రేమతోను గౌరవముతోను సాష్టాంగపడ ననుమతిండు.

శాశ్వతముగా మీ దానను,

చెల్లా.

# 24. మీయందు నేను భగవంతుని పూజింతును

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైనప్రభూ!

మీ పవిత్రపాదములకు గౌరవముతోను ప్రేమతోను నా ప్రణామములు చేయుచున్నాను. నా కుమార్తెకు మీరు పంపిన బొమ్మలకు 'శివానంద డేటు డే' అన్న ఉత్తరమునకు మెంబరు షిప్పు కార్డునకు నా హృదయపూర్వకమైన ధన్యవాదములు.

ప్రియమైనప్రభూ! నేను ఈరోజున మీయొద్దనుండి ఉత్తరము వచ్చునని ఆశించితిని. కాని రాలేదు. నన్ను ఆదుర్దాపడవద్దని మీరు సలహాయిచ్చితిరి. కాని మీ ఉత్తరము రానప్పుడు నాకు చాల నిరుత్సాహముగా నుండును. నేను ఏమిచేయగలను? ఈనాబలహీనతకు దయచేసిక్షమించవలెను. నేను మీతో పూర్తిగా లీనమైయున్నాను, ఓప్రభూ! మీరు నాపై ఆగ్రహింపవలదు. ఓ భగవానుడా! నాకు సహాయము ఎవరును లేరు.

కడచిన కొన్నిరోజులనుండి ధ్యానము చాల ఉత్తేజితముగా నున్నది. నేను కండ్లు మూసికొనికూర్చుండిన వెంటనే ఒక సౌఖ్యమైన ఆశ్చర్యకరమైనశక్తి నా ఆత్మనుబట్టి దానిని ఉత్తేజపఱచి విచిత్రమైన శాంతిలోనికి తీసికొనిపోవును. మరియు ఆ ఆనందమును నేను కొన్ని నిమిషములు అనుభవిం

తును. కాని అప్పుడప్పుడు ఒక క్షణకాలము నాకు శరీర స్పృహ గలుగుచుండును. మరియు తిరిగి మొదటిస్థితికివచ్చు చుండును. నాకు తిరిగి క్రిందిస్థితి రానియెడల నేను గొప్ప అనుభవము పొందుదును. ఆ ప్రకారము జరగకుండ చేయు టకు మార్గమేమైన నున్నదా ?

ఓ నా దివ్యమైనప్రభూ! ప్రతిదినము నా ఆసుపత్రి గదిలోనికి చేతిలో నొక పూలదండ తీసికొనివచ్చినపుడు మానసికముగా నేను ఋషీకేశమునకు మార్చబడి ఏప్రిల్ 4 వ తేదీన నేను మిమ్ములను చూచినట్లు మీ ఆఫీసుగదిలో ప్రవేశించినట్లు నాకు స్ఫురణగలుగును. మీరు ఉత్తేజమగు భగవత్ దృష్టితో అక్కడ కూర్చొని ఉన్నప్పుడు నేను ఆ పూలదండ మీ మెడలో వేసినట్లును ఊహించెదను. నా ప్రభూ! మీకు అది అందినట్లు జ్ఞాపకమున్నదా? లేక మీరు పనిలో నిమగ్నులైయుంటిరా?

28 వ తేదీన నేను చంద్రునివంక చూచుచుంటిని. అపుడు నేనొక పద్యము వ్రాసితిని. అది నేను ఇందులో పంపుచున్నాను. ఓ ప్రభూ! నేను మీకు ఉత్తరము వ్రాయ వలెనని నాకు గలిగిన ఆసక్తి ఆపుకొనుచున్నాను. అది తప్పుఅని ఊహించుచున్నాను. తిరిగి ఉత్తరము వ్రాసినతరు వాత శాంతి కలుగుచున్నది. ఓ నా ప్రియమైనప్రభూ! నేను నా ఉత్తరములతో మిమ్ములను శ్రమపెట్టుచున్నానా? దయ

చేసి తెలియపఱచుడు. నేను మీకు తఱచుగా వ్రాయు చుంటినేమో యని భయపడుచుంటిని. మీకు ఎట్టి శ్రమయు కలుగజేయుట నాకు ఇష్టములేదు. కాబట్టి వ్రాయుట ఆపుటకు ప్రయత్నించితిని. కాని మనస్సునకు అశాంతిగలిగెను. ఓ భగవానుడా నేను మీతో ఎల్లప్పుడు మాట్లాడు చున్నాను. దానిని మీరు వినగలిగితిరా? ఇది అతిశయోక్తి కాదు. ఇది నిజము. మీ విషయమై నేను ఆలోచనచేయని ఒక్క నిమిషముకూడ లేదు. నా దేవుడా! మీరే నా దైవము. నేను ఇపుడు పూజించుచున్నాను. భగవానుని మీయందు ఇముడ్చుకొనియున్నాను. అతడు సాక్షాదాత్మ స్వరూపుడని తెలియనంతవరకు అట్లు చేసెదను. ఆయనను మీయందే కనుగొనగలను. మరియు ఇంకొకరూపమున నేను పూజించుటకు నాకు ఇష్టములేదు.

ఇంక ఏ యితరరూపమునందును అంత స్వేచ్ఛా పూర్వకమైన భక్తి నాకు కలుగదు. ఓస్వామి! నేను ఎప్పుడైన తప్పుడుమార్గము త్రొక్కుచున్న నన్ను సరిచేయుడు. మీరు ఎల్లప్పుడు నాతోనుండుడు. నాజీవితముకంటె మీరు నాకు ఎక్కువ అవసరము. నేను ఉద్రేకపూరితనై యుండిన నది తప్పుగా మీకు తోచిన నన్ను వృద్ధిపఱచు మార్గము దయచేసి మీరే చూపుడు. నేను పూర్తిగా మీ చేతిలోని దానను.

ఈ నా ఉద్రేకమునకు క్షమింపుడు. నేను ఇంక ఆగ
దను. మీ పవిత్రపాదములకు ప్రేమపూర్వక కృతజ్ఞతకు
వందనములు.

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 25. హృదయమునుండి ప్రవహించు ఊహాలు

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

మీ పవిత్రమైన పాదములకు భక్తితోను ప్రేమతోను చేయు ప్రణామములు. మీరు నా ఆధ్యాత్మిక దిన చర్య కాగితము వగైరాలు ముట్టినట్లు వ్రాసిపంపిన రశీదు, దేవాలయప్రసాదము, తెలుపుచేసిన ఉత్తరములు మొదలగు వానికి నా ధన్యవాదములు.

గురుమహారాజ్! దయచేసి నన్ను క్షమింపవలెను. ఇది పెద్ద ఉత్తరము అని భయపడుచున్నాను. నాలో ఉబికి వచ్చు ఊహాలు నేను తెలుపదలచినాను. మరియు మీవిలువగల సమయములో కొన్ని నిమిషములు వృథా చేసికొని ఈ ఉత్తరము పూర్తిగా చదివి నా సందేహముల దీర్ప గోరెదను.

గురుభగవాన్! మీరు చాలకాలము మౌనముగా నుండుటవల్ల నాకు ఆదుర్దాగానున్నది. మీకు అసంతుష్టి గలుగజేయుటకు నేను ఏమిచేసితిని? మీరు కొన్ని వాక్యము లైన వ్రాసిపంపక పోవుటకు నేను మీకు ఎట్లు అసంతుష్టి కలిగించితిని? నేను విచారముతో బాధపడుచున్నాను. దయచేసి మీరు నాయందు అనుగ్రహము తప్పింపవలదు. అటుల జరిగిన నేను జీవింపలేను. మీ కటాక్షము లేనిదే

నేను ఈ జీవితమునందు ఎట్టి సౌఖ్యమును పొందలేను. మీకు కోపము కలుగజేయు పని ఏమైనను చేసినయెడల దయచేసి అది యేదియో తెలియజేయుడు. నా తప్పులు ఎట్టివో దయచేసి నాకు తెలియపఱచినయెడల నేను వానిని చక్కదిద్దుకొనెదను.

ఓ మురుగన్ ! నా గురుదేవునితో నుండువాడా! నన్ను ఇప్పుడు విడనాడవద్దు. నేను నా స్వబుద్ధితో ఎవరికిని వ్యతిరిక్తముగ ఏ పనియు చేసియుండలేదు. ప్రతిపని మీరు ఆమోదించిన తరువాత దానిని విమర్శించి చేయుచుందును. నా గురుదేవునకు ఇష్టమైనపనులే నేనుకూడ ఇష్టపడుటకు నేర్చుకొనుచున్నాను. నా మనోవికారము మాత్రమే నేను ఊహించునది. కాని నేను ఇంతవరకు చదివిన అన్ని పుస్తకములలోను భగవంతుడు, గురువు శిష్యుల మధ్య సంబంధము విషయమై గొప్పవారుకూడ ఉద్రేకము కలిగియున్నారని నాకు తెలిసినది. కాన ఆధ్యాత్మిక జీవితమునందు ప్రారంభకురాలనగు నన్ను మీరు క్షమింపలేరా? ప్రమాదకరమైన ఉద్రేకములేనంతవఱకు దానిని ఆపుటకు నేను నా శక్తి, ఆత్మశక్తి, వృథాచేయనవసరము లేదు: ఈ దివ్య ఉద్రేకము, భగవంతునికొఱకును కనులకు కనిపించు దేవుడగు నా గురుదేవునికొఱకును గల తీవ్రవాసక్తియు నన్ను గాఢ ధ్యానమందు చేరునట్లు సహాయము చేయుచున్నవి. మరియు ఒకసారి ఆ గాఢధ్యానమును చేరినచో నేను నిర్మలమైన ఆనందమును పొందెదను. మరియు ఉద్రేకమువలన

మతిభ్రమణము ఏ మాత్రము కలుగదు. గురుదేవా! మానవుడు సుఖదుఃఖములయందు మార్పుచెందక ఉండవలెనని మీరు చెప్పియున్నారు. కాని ఇది ప్రపంచసుఖములకు విచారములకు సంబంధించినది కాదా? గొప్ప పావన పురుషులు గూడ భగవంతుని నుండి ఎడబాయుటకు బాధపొంది విచారపడియున్నారు. ఆ ఎడబాటు భగవంతుని విషయమైన ప్రేమయైనప్పుడు వారు సమత్వము నిలుపుకొనలేకుండిరి. గొప్ప వ్యక్తులవలన రచింపబడిన భక్తికీర్తనలయందలి భావములు కూడ దీనిని తెలియజేయును. కావున భగవంతుని విషయమై, గురువు విషయమై గలుగు అనుభవములు మీకు ఎట్లు అసంతుష్టిగలుగజేయును? అట్టి స్థితిలో నాకు మీరు ఉత్తరములు వ్రాయకుండ మిమ్ములను ఏమి అడ్డగించుచున్నది? దివ్యమైన ప్రేమతో దయతో వ్రాయబడిన కొన్ని మాటలు విచారకరమైన నా ఊహలను పోగొట్టుచుండును. మీరు నాకు పంపిన పుస్తకములమీద వ్రాసిన కొన్ని దయార్ద్రహృదయ సూచకములగు మాటలు నా ఆత్మకు పూర్తి ఉపవాసము లేకుండ ఆపినవి. మీరు వ్రాసిన ఒక ఉత్తరములో మీ ఉత్తరములు అందకపోయినను ఆదుర్దాపడవద్దని వ్రాసియున్నారు. గత కొన్నిరోజులనుండి ఆ ఉత్తరము అనేకపార్లు చదివినాను. అది నాకు కొంత మానసిక సౌఖ్యము కలుగజేసెను. కాని ఈ రోజున నేను అసహాయురాలనుగానున్నట్లు తలంచుచున్నాను. కొన్ని సమయములందు నా హృదయమందు గలుగు అత్యంతబాధవల్ల నిశ్చేష్టురాల

నగుచున్నాను. ఆహా! భగవంతునినుండి ఎడబాటు అను ఈ భావము చాల భరింపరానిది. నేను ఎప్పుడు ఆయనతో శాశ్వతముగా నుండు అదృష్టము కలుగునో నాకు తెలియకున్నది. ఓ నా ప్రియమైన ప్రభూ! భక్తవత్సలా! కరుణాసాగరా! నేను ఏమి చేయవలెనో నాకు తెలియకున్నది. మీరు ఇంతవఱకు ఉన్నట్టు నాయెడ దయ, సానుభూతి గలిగియుండుడు. నేను నా నమ్మకమంతయు మీమీదనే ఉంచినాను. నేను అంతయు మీకు స్వాధీనము చేసియున్నాను. ఇప్పుడు నాకు ఇంకెక్కడను మనశ్శాంతి కలుగదు. నాకు ప్రస్తుతము కలిగిన కష్టస్థితిని మీరు మరువవలదని కోరుచున్నాను. నేను ఫిర్యాదు చేయుట కాదు. ఎందువల్లననగా మీ ఉత్తరములు నాకు చేరినచో ఏదియు నన్ను ఆదుర్దా పెట్టజాలదు. నన్ను రక్షించుటకు మీ కటాక్షము నాకు గలదని తెలిసినప్పుడు ప్రతి విషయమును ఎదుర్కొనగల శక్తి నాకు గలుగును. మరియు నా ఆధ్యాత్మిక జీవనమునకు గలుగు అడ్డంకి ఏదైనను నేను లెక్క చేయను. ఇప్పుడు నేను పతనమైనట్లు ఎంచుకొనుచున్నాను. జీవితము చాల కష్టముగా నున్నది. అది నిరాశతో కూడియున్నది. నా ఏడ్పును భగవంతుడే విననియెడల నేను ఎవరి సహాయము కోరుదును! ఓ దయగల ప్రభూ! నా హృదయపూర్వకమైన ప్రార్థనలు మీరు ఎందుకు వినుటలేదు? నేను భగవంతుని ఏమియు అడుగకూడదని నాకు తెలియును. కనుక నాకు మంచిదని మీకు తోచినపని మీరు చేయుటకు మీకు విడిచి

పెట్టితిని. నేను బాధపడుటవల్లనే నాకు మంచి కలుగునని మీకు తోచునెడల నన్ను ఇంకను ఎక్కువగా బాధపడనిండు. మీరు ఏది ఇచ్చినను దానిని సంతోషముగ స్వీకరించెదను. మీదయ మరల నాపై వర్షించువరకు నేను ఆ బాధను భరించెదను. నేను ఏమైన తప్పులు చేసిన యెడల దయయుంచి నా తప్పులన్నియు క్షమింపుడు. దయతో నాకు శక్తి కలుగజేయుడు. అది నాకు చాల అవసరము. నేను చాల కష్టములు దాటవలసియున్నది. అక్కడకు వచ్చిన 'ఓం జీ' మీకు ఇక్కడి సంగతులు చెప్పియుందురు. ఇతరులకు అతృప్తికలుగజేయు పనులు ఏమియు నేను చేయుటకు నాకు ఇష్టములేదు. ఎందువల్లననగా అది నా సాధనకు అడ్డము రాగలదు. నా ఊహాలకు అనుగుణముగా నా యిరుగుపొరుగును తీసికొనివచ్చుటకు నేను ప్రస్తుతము ప్రయత్నించుచున్నాను. మరియు నేను కొంత కృతార్థత పొందుచున్నాను. మీ యొక్కయు మురుగన్ యొక్కయు కటాక్షముతో అవి చాలవఱకు నా పక్షముగా మారునని నాకు ఆశ కలుగుచున్నది. నేను నా సాధనలో చాలకాలము వృథపుచ్చుచున్నానని నా స్నేహితులు చెప్పు స్వల్పఖండన తప్ప ఎవరును నా దైనికసాధనను తీవ్రముగా అడ్డగించుట లేదు. నేను ప్రస్తుతము తమ విషయములో ఎక్కువగా బాహ్యకర్మ చేయుటకు అశక్తురాలనగుటకు కారణము లున్నవి. కాని భగవంతుడు నన్ను ఈ స్థితిలో చాలకాలముంచడని నాకు తెలియును. అయినను నేను ఇపుడు ఈ ప్రకారము ఎందుకు బాధపడుచున్నాను?

ఓ మురుగా! నా ప్రియమైన మురుగా! నేను సహించుటకు నాకు బలమునిమ్ము. నా సహాయమునకు రమ్ము. దీనురాలగు ఈ వ్యక్తిని విడువకుము. దయయుంచుము. నేను తప్పు పని ఏమియు చేయలేదు. అది మీకు తెలియును. నేను రాత్రింబవళ్ళు గురుదేవుడగు మిమ్ములను ఆరాధించితిని. మీకొరకు ఏడ్చుటవల్ల నా కండ్లు ఎట్లు ఉబ్బినవో మీకు కనిపించుటలేదా? నన్ను సరిగా గురుదేవులు గ్రహించుచు వారిద్వారా మీ కటాక్షము నాకు కలుగుచున్నది. కాని యిపుడు వారుకూడ నా ఆందోళనతో కూడిన ఏడ్పులకు నిర్లక్ష్యముగా నున్నారు. అండవా! నా ప్రభూ! నావద్దకు రావలెను. మిమ్ములను చేరుటకు నాకు దారిచూపుము. మీ కటాక్షము పొందుటకు నేను ఎట్లుండవలెనో నాకు కన పర్చుము. నేను నా స్నేహితులను విడిచిపెట్టితిని. ఇంద్రియ సౌఖ్యములు విడిచిపెట్టితిని. మరియు ఈ నా ప్రస్తుతపరిస్థితిలో ఏమి విడిచిపెట్టగలనో అన్నియు విడిచిపెట్టితిని. నా సాధన యందు, పనియందు నేను క్రమముగా నడుచుచున్నాను. కాని మీరు ఎచ్చటనున్నారు? మీరు నాతో గురుదేవుని ద్వారా మాట్లాడుచుండెడివారే. ఇపుడు మీరు ఎచ్చట దాగియున్నారు. నేను ఎక్కువగా ఉద్రేకము, ఆనందము అనుభవించుచున్నానని మీకు తెలిసినదా? అవును నేను ప్రాపంచిక ఆదుర్దాలు ఏమియు లేకుండ కొన్ని నెలలు ఆనందము అనుభవించితిని. ఇపుడు ఏదియో చెడుశక్తి యొకటి నాకు విరుద్ధముగా పనిచేయుచున్నది. ప్రభూ! దానిని ఆపు

చేయుడు. లేనియెడల నన్ను తీసికొనిపోవుటకు మృత్యు దేవతను పంపుడు. అపుడు మీరు సంతోషించులాగున నాకు మంచి జీవితము కలుగును. మీ కటాక్షము లేనియెడల ఈ ప్రపంచము నరకముతో సమానమగును. నా ప్రాణ మును మీతో చేర్చుకొనుడు. ఎందుకును పనికిరాని యీ శరీరమును మనస్సును నశింపజేయుడు. అది మీ కటాక్షము పొందుటకు తగనియెడల దానిని దయతో నశింపచేయుడు. ఓ విచిత్రపురుషుడా! మీయొక్క నిజమైన స్వభావము నాకు తెలియపఱచుడు. మరియు నన్ను శాశ్వతముగా మీలో చేర్చుకొనుడు. మరల నన్ను విడదీయకుడు. ఓ ప్రభూ! నా గురుదేవునకు నేను కష్టకారణముగా ఉండునట్లు చేయకుడు. ఇంతకంటె నేను చెప్పదగినది ఏమియు లేదు.

నేను ఈ రోజున అన్న క్షేత్రమునకు రూ. 150 (నూటఏబది రూపాయలు) పంపినాను. దయచేసి వానిని తీసికొనుడు. మీ పాదములకు ప్రణామములు చేయుచు ఇక చాలించెదను.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 26. శివానందులు — దివ్యభాగ్యము

గురుదేవా! నాప్రియమైన ప్రభూ!

భక్తితోను ప్రేమతోను మీ దివ్యపాదారవిందము లకు ప్రణామములు చేయుచున్నాను.

మీరు నాయందుచూపిన దయకు మీకు ధన్యవాదములు. మీరు పంపినసూనె, మందు రెండును, మీ పుస్తకములును అందినవి. నేను నా చిన్నతనములో కూర్చిన తమిళపాట పుస్తకము అచ్చుపడునని నేను ఎప్పుడును ఊహించలేదు. నా హీనశక్తి మీరు లెక్కచేయుటలేదు. కాని నాకు మీయందుగల హృదయపూర్వకమైన తీవ్ర భక్తి మీరు గ్రహించితిరి. నేను భగవంతునికి నా చిన్న తనమునుండి అర్పించుచున్న ప్రార్థన నాణెములను కూడ బెట్టియున్నాను. వానినుండి శాశ్వతమైన విలువగల ప్రియ మైన గురుదేవునిరూపమున నా సౌఖ్యమునకు కావలసిన దంతయు ప్రపంచబ్యాంకునందు నిక్షిప్తము చేయుచున్నాను. నేను ధ్యానము అను చెక్కును భక్తియనెడు సిరాతో సంత కముచేసి పక్షిదూతచే దయార్ద్రభావతరంగముల ద్వారా పంపుదును. అది ఆ బ్యాంకును చేరినతక్షణమే నాకు కావ లసినదంతయు నాపేర నమోదుచేసి నాకు అవసరమైనపుడు కావలసినట్టియు కావలసినంతయు ధనము నా సహాయార్థము పెల్లుబుకును. అది విచిత్రమైన బ్యాంకుకదా!

ఆహా! మీ పుస్తకములు! అవి అత్యద్భుతములుగా

నున్నవి. ఈరోజులలో నేను వానిని చదువుటకు ప్రారంభించినపుడు ధ్యానతత్పరనై చదువుట మానివేయుదును. ఓ ఆకర్షణీయమైన గురుదేవా! అందలి ప్రతిమాట ఉత్తేజముగలుగజేయునదియే. అది హృదయమునకు హత్తుకొనును. ధ్యానము దానంతట అది కలిగినపుడు నాకు గలుగు ఆనందము నేను వర్ణించలేను. నేను అపుడు శాంతియు తృప్తియుగల దూరమైన స్థలమునకు ఒక విచిత్రమైన శక్తి వలన తీసికొనిపోబడుదును. అట్టి సమయములందు నేను కండ్లు మూసికొని సుబ్రహ్మణ్యమంత్రమును పఠించి తృప్తినొందెదను. ఆ ప్రకారము కొన్ని నిమిషములుండిన మీ రూపము కనిపించును. ఓనాప్రభూ! ధన్యవాదములు. గత కొన్ని దినములనుండి మిమ్ము తఱచుగా చూచుచున్నాను. ఆహా! నేను ఏమిచేయుదును? మీ దయతో నన్ను ముంచివేయుచున్నారు. దివ్యజీవనసమాజము వార్తాపత్రికలో నా దినచర్యవిషయమై మీరువ్రాసిన (రిమార్కు) విమర్శ నేను చూచితిని. నాకు ఆపత్రిక యింతవరకు అందలేదు కాని అయినావరములోనున్న సూర్యనారాయణయ్యరుగారు దానిని నాకు చూపినారు. భగవంతుడు నాయందు దయగలిగియున్నాడు. నేను రాత్రింబవళ్లు ఆయనకు ధన్యవాదములు సమర్పించుచున్నాను. నాకు ప్రపంచముతో అవసరము లేదు. కాని నేను మీకు పరిచయమై మీకటాక్షము గలుగుటయే కోరెదను.

స్వామీజీ! ఆశ్చర్యకరమైనవిషయము! మీ ఉత్త

రము నాకు అందకపూర్వమే నేను మీ ఉత్తరమునకు జవాబు వ్రాయుచుంటిని. మీరు అక్కడ తొందరపనులలో నున్నప్పుడు నా ఉత్తరముతో మిమ్ములను బాధపెట్టు చున్నాను. కావున మీ జవాబు రానిదే మీకు ఉత్తరము వ్రాయదలచుకొనలేదు. కాని నామనస్సు ఉత్తరము వ్రాయ మని కోరుచుండును. నేను ఒప్పుకొనుటలేదు. అపుడు ఏదో పద్యముల్రాయ సంకల్పించితిని. 18వ తేదీన ఒకటి, 21వ తేదీన మరియొకటి వ్రాసితిని. వానిని మీకు పంపుచున్నాను. నిన్న మరల వ్రాయుటకు ప్రారంభించితిని. పని తొందరవల్ల దానిని పూర్తిచేయలేదు. నేను ఇంటికివచ్చినతరువాత మీ ఉత్తరము అందినది. దానికి జవాబువ్రాయుట ఇదివరకే ప్రారంభించితిని. ఓ భగవానుడా! ఒక్కొక్కప్పుడు మీ భక్తి నేను లోన ఇముడ్చుకొనలేక వ్రాయుట ప్రారంభిం చెదను. ఆ ఊహ వర్ణించుటకు వీలులేనిది. అది ప్రపంచ ములో దేనికిని పోల్చరానిది. ఈ పవిత్రమైన ఆధ్యాత్మిక సమ్మేళనమును ఎట్టి బాహ్యశక్తియు ఆపుచేయలేదు. అది మిక్కిలి అందమైన అనుభవము. అది నా జీవితమును పరి పూర్ణము చేసినది. అది భగవానునికి ఇష్టమైనది. ప్రతి దాని విలువను వృద్ధిపఱచినది. అది శరీరసంబంధమైన కోరికకాదు. అది ఒక దివ్యఊహా. ఇది భగవంతునియందలి ప్రేమ. అది నాఆత్మపై నాశక్తినిచూపి ఆత్మను ద్రవీ భూతము గావించి నన్ను ఆనందసముద్రమున ముంచును. కాని నేను అచ్చట శాశ్వతముగ ఉండజాలను. నేను

పైకి తేలుచుందును. ఈ ఆశ్చర్యకరమైన సముద్రము నన్ను దాని అఘాతములో ఎన్నడు ముంచివేయును? అది నా జీవితములో కలుగునా? గురుదేవా! నాకు సహాయము చేయుము. నేను ఆయనను విడిచి జీవింపలేను. నేను కొన్నిసంవత్సరములు ఆయనతో స్నేహముగా మాట్లాడిన విషయము మీకు తెలియునా? నేను ఆధ్యాత్మికసాధన ప్రారంభింపక పూర్వము దీనిని ప్రారంభించితిని. ఆయన పళనిదేవాలయమునుండి బయటికి వచ్చి నన్ను ఆహ్వానము చేయుటకు కొండపైకి వచ్చెడువాడు. ఆయన ప్రకాశమైన రూపము, పసుపుపచ్చని బట్టలు, ముండనము చేసికొన్న తల, మెడలోని పూసలదండలు, శక్తిగల శూలము నన్ను వశముచేసికొన్నవి. నన్ను ఆహ్వానించుటకు ఆయన తన శూలమును తొలగించెడివాడు. నేను ఆయననుచూచి ఎన్నడును భయపడలేదు. నేను ఆయనతో నా కష్టములు అన్నియు చెప్పుచుంటిని. ఆయనకు నాకు మధ్య రహస్యములు లేవు. కాని ఆయన మాట్లాడుట నేను ఎప్పుడును వినలేదు. నా అంతరజ్ఞానము వల్ల అంతయు గ్రహించుచుంటిని. కాని ఆయన నాతో మాట్లాడుటకు, నాకు జాబులు వ్రాయుటకు, నాకు బోధచేయుటకు, తనలో శాశ్వతముగా చేరుటకు పూర్వము నేను ఎట్లు దివ్యజీవనము గడపవలెనో తెలుపుటకు ఆయన నాకడకు దిగివచ్చెను. ఈ జీవితముతో నాజన్మసరి. నా జీవితములో జరిగిన ఆశ్చర్యసంఘటనలు అన్నియు నేను ఈమధ్య తెలిసికొంటిని. ఆయన నాకు సహాయము చేయు

చుండెను. ఆయన నా పురోవృద్ధికి సహాయపడుచుండెను. ఆయన నా భర్తయొక్క ఆధిక్యత ఎరుగును. ఓ గురూజీ! నేను ఏమి వ్రాసినది నాకే తెలియదు. ఇది నేనొక ఆవేశములో వ్రాసితిని. నా శరీరము నాకు తెలియుటలేదు. నేను దానిని చదివి అది ఎట్లున్నదో ఆ ప్రకారమే మీకు పంపెదను. అప్పుడు నాప్రస్తుతపు స్థితి మీకు తెలియగలదు. దయచేసి మీరు క్షమింపదగిన విషయము ఏదైన ఉన్నచో క్షమింపుడు. నేను ఉన్నస్థితికంటె ఎక్కువగా వ్రాయలేదు; వ్రాయను. నా లోపములు, బలహీనత మీకు నేను తెలుపకోరినాను. మీరు నాకు సలహాయిచ్చి నన్ను సరియైన మార్గములో పెట్టవచ్చును. నేను రూ. 10-పదిరూపాయలు పంపినాను. అది 'ఆరోగ్యము - దీర్ఘజీవితము'నకు 'దివ్యజీవనము'నకు చందాగా స్వీకరింపుడు. మీ ఆనందకరములగు పాదములకు ప్రణామములు చేయుచు ఇంక ఆపెదను.

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 27. నా ఏకైక ప్రార్థన

గురూజీ! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

మీ దివ్యపాదములకు విధేయతతోను ప్రేమతోను ప్రణామములు చేయుచున్నాను. నా వెలలేని ప్రియమైన గురుదేవా! తమరు స్పష్టముగా ఆలోచనతో మృదువుగా ప్రేమతో వ్రాసిన ఉత్తరమునకు ధన్యవాదములు సమర్పించుచున్నాను. ఆ ఉత్తరము తారీఖు 21 అనగా నా కలతరువాతి రోజు. అది నాకు 27 వ తేదీన చేరినది.

గురూజీ! నా కండ్ల వెంట కారు ఆనందబాష్పములు మీరు చూడగలరా? మీదయతో గూడిన మాటలు నా యందు కల్గించిన మంత్రశక్తి మీరు చూడవలెనని నేను కోరుచున్నాను. మీతో నేను తాదాత్మ్యము పొందినపుడు అది ఆశ్చర్యకరముగా నుండెను. నాకు మీ ఉత్తరములు అందినపుడు అన్నిచోట్ల ఆనందము శాంతి వ్యాపించి యుండెను. మరియు నేను విశ్రాంతి రహితముగా పనిచేయుచుంటిని. నేను క్రొత్తజీవితముతో నిండియుంటిని. మరియు ఆదుర్దారహితముగా నుంటిని. నా ప్రియమైన స్వామి సుబ్రహ్మణ్యేశ్వరుడు, నా ప్రియమైన దేవిగారు నాయందు చాల దయగలిగియున్నారు. నా హృదయపూర్వకమైన ప్రార్థనలు వారు వినియున్నారు. నా ప్రార్థనల వెనుక స్వార్థ లాభముతోకూడిన ఉద్దేశము లేదని వారు గ్రహించినారు. ఓ సర్వశక్తిమంతుడవగు భగవంతుడా! నేను మిమ్ములను

కోరే యీ ఒక్క యీవి యిచ్చి దయతో నన్ను ఆశీర్వ దింపుడు. ఎల్లప్పుడు నాకు నా గురుదేవుల ఆశీర్వాదము కల్గునుగాక! వారికి సంతోషము కలుగజేయుపనులే నన్ను చేయనిండు. మరియు నా ప్రభూ! ఎల్లప్పుడు గురుదేవుల ద్వారా నాకు కనిపింపుడు. మీ విషయములో గురుదేవుల విషయములో నాకు ఏమియు భేదము లేకుండా నుండనిండు. నా గురుదేవునివలెనే నేను ఎల్లప్పుడు మంచినే చేయుటకు గురుదేవునివలె నన్ను మరి ఎవరును ప్రోత్సహించలేదు. ఆయనకు దీర్ఘజీవితమును మంచి ఆరోగ్యమును ఇండు.

ఓ ప్రభూ! దయచేసి యీ ప్రార్థనవినుడు, ఇది నా హృదయాంతరాళమునుండి వచ్చినది. నేను ఎల్లప్పుడు మిమ్ము లను ప్రేమించియుండెదను. నాశక్తికొలది తమ బిడ్డలనంద రను ప్రేమించుటకు, సహాయముచేయుటకు ప్రయత్నించు చుండెదను. కాని నా ప్రార్థనలు దయయుంచి వినుచుండ వలెను: ఇదియొక వ్యాపారముక్రింద చూడకుడు. అది ఆ ప్రకారము ఊహింపబడలేదు. నా గురువులవారి కటాక్షము లేనియెడల నాకు సంతోషమెన్నటికిని లేదు. ఈ సంగతి తరచుగా తెలియుచున్నది.

అవును, నాప్రభూ! మీరు నన్ను ఏపనిచేయుమనిన నేను ఆపనిని చేసెదను. నేను మీ ఆజ్ఞప్రకారము నడుచుకొను టకును, మిమ్ములను సంతోషపెట్టుటకును జీవించియున్నాను. నాశరీరముయొక్క ప్రతి అణువును నా నెత్తురుయొక్క ప్రతి బొట్టును, నామనస్సు, బుద్ధియొక్క ప్రతిస్పందనమును, నా ఆత్మయంతయు మీరు ఉపయోగించుకొనుటకు మీకు అర్పి

తము చేయబడినవి. నేను మీకు అన్నివిధముల సేవచేయుచు మీపనిలో సహాయముచేయుటకు సిద్ధముగానున్నాను. ఆహా! మీరు నాయందు ఎంతమార్పు కలుగజేయుదురు! ఇప్పుడు చాలపనులు జరుగుచున్నవి. లోగడ నామనస్సు కాంచెడు అనేకవిషయములు అసౌఖ్యములను గలిగించెడు విషయములు. ఇప్పుడు మీదివ్యశక్తితో విశ్రాంతిచెంది మీ దివ్యస్పందనములవల్ల సౌఖ్యముపొంది మీ దివ్యప్రకాశమువల్ల చుట్టబడి వేనివలనను బాధనొందక నిర్మలముగా నుండగలిగితిని. నేను అంతర్ముఖనై మీతో కలిసికొందును; మరియు మీరు ఎల్లప్పుడు నన్ను సౌఖ్యపెట్టుటకు సిద్ధముగా నుందురు. మరియు నన్ను ఆదరింతురు. ప్రతిదియు స్వల్పముగా అగును.

మీరు ఎల్లప్పుడు నాకు సౌఖ్యముకలుగజేసి నన్ను ఓదార్చుటకు సిద్ధముగా నున్నప్పుడు ప్రతిది స్వల్పముగానే యుండును. మామూలు ప్రపంచసౌఖ్యములకై లేక స్థూల వస్తువులకై నాలో ఇపుడు ఆసక్తిలేదు. కాని నాప్రభువు యొక్క కటాక్షమునకై నాలో తీవ్రమైన కోరికకలదు. అట్లు కోరుట తప్పా?

నా ప్రభూ! గతజన్మలో నేను ఎట్టిగొప్పతప్పు చేసితినో నాకు తెలియదు. కాని దానివల్ల నాకు విచారము కలుగుటలేదు. నేను తిరిగి నాప్రభువును చేరుటకు తగినస్థితి కలుగువరకు నేను పవిత్రురాలనయ్యెదను. ఇప్పుడిదియే నా జీవితమునందు ముఖ్యోద్దేశమైయున్నది. దీనినిబట్టి నేను ప్రపంచకర్తవ్యములు అలక్ష్యముతో చూచుచున్నానని

అర్థము కాదు. నేను విరక్తిమార్గమున నాకర్తవ్యమును చేయుచున్నాను. కాని సమస్తమును నా శక్తిలోపము లేకుండ చేయుచున్నాను.

గురుదేవా! నాకు మీరు సలహాయిచ్చుచుండవలెను. నేను మీ స్థితికి వచ్చి పరిపూర్ణత్వము పొందువరకు నన్ను సరియైన మార్గములో పెట్టుడు. మరియు నన్ను నా దేవుని నుండి తిరిగి విడదీయవలదు. ఇట్లు అనేక విలువగల సంవత్సరములు వృథాయైనవి.

మీనాతుమ్మ, పట్టు 22 వ తేదీన వచ్చునట్లు నాకు వర్తమానము వచ్చినది. ఆ మధ్యాహ్నమే వారిని చూచుటకు వెళ్ళినాను. మరియు మీ దివ్యలీలలు వినుచు అచ్చట రెండుగంటల కాలము గడపినాను. జన్మదినమహోత్సవము నాడు తీయబడిన అనేక ఛాయాపటములు నేను చూచి నాను. అందు మీ ఫోటో ఒకటి యున్నది. అది జీవకళతో నున్నది. అందులో మీరు నేను ఖుషీకేశము విడిచిన ఉదయమున నాయందు ఎట్టిదయతో చూచితిరో సరిగా ఆప్రకారమే మీ చూపు ఉన్నది. శ్రీ కల్యాణ సుందరముగారు నాకు దాని నిచ్చిరి. నేను దానిని తీసి కొంటిని. అది యిపుడు నాయొద్దనే యున్నది. నేను దాని వైపు చూచునపుడు మీరు నా యెదుటనున్నట్లు ఊహించెదను. నేను శారదానందజీని నా హృదయపూర్వకముగా ప్రార్థించెదను. తమయొక్క అనుగ్రహమైన ఫోటో తీసినందుకువారికిభగవంతుడు ఆరోగ్యముసౌఖ్యముదీర్ఘజీవితము కలుగజేయుగాక. అది జీవకళతో నున్న ఛాయా చిత్రము.

డాక్టరు కృష్ణారావు. ఆయన భార్య నన్ను చూచుటకు వచ్చిరి. మేము ఒకగంటకాలము ఆధ్యాత్మికప్రసంగము నడిపితిమి. అతడు నమ్మకముగల సాధకుడు. మిసెస్ సాంబశివరావుకూడ తరచుగా నాయొద్దకు వచ్చును. మీరు అట్టి మంచి స్నేహితులతో సాంగత్యము కలిపినందు కు మీకు ధన్యవాదములు.

గురుదేవా! ఈ రోజులలో సత్సంగసమయమున ఎందుకు పరుండెదరు? మీరు దయచేసి యింక విశ్రాంతి తీసికొనుడు. మీ శరీరము మామూలు మనుష్య శరీరము కాదు. అది పవిత్రమైన దేవాలయము. దాని ద్వారా భక్తులమైన మాకు భగవంతుడు తన్ను ప్రకటించుకొనుచున్నాడు. మరియు ఆ కారణమున దానిని అన్నివిధముల మేము సంరక్షించుటకు మాకు హక్కుగలదు. మీ ఫోటో వల్ల మీరు అమితముగా పనిచేయుచున్నట్లు తెలియుచున్నది. మీ ఆరోగ్యము విషయమై జాగ్రత్తగా నుండవలసినదిగా నేను మిమ్ములను ప్రార్థించుచున్నాను. డాక్టరు కృష్ణారావుగారు మీకు పంపిన టానిక్కుమందు మీరు తీసికొనుచున్నారా? దయచేసి మీ ఆరోగ్యముయొక్క వివరములు వ్రాసిపంపుడు. నా దైనికప్రార్థనలను భగవంతుడు వినునని నమ్ముచున్నాను.

గురుదేవా! నేను ఇంక ఆపెదను. నన్ను మీ పవిత్ర పాదములను స్మరింపనిండు. నన్ను ఆశీర్వదింపుడు. నా ప్రియమైన ప్రభూ! శాశ్వతముగా మీదానను.

చెల్లా.

# 28. మీరు నాకు శాంతి సౌఖ్యముల నిచ్చియున్నారు

గురుదేవా! నా ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను భక్తితోను కృతజ్ఞతతోను మీ పవిత్ర పాదములకు ప్రణామములు చేయుచున్నాను.

నేను ఆసుపత్రిలో నున్నాను. రోగులెవ్వరును లేరు. ఇప్పుడు 10–30 A.M. అయినది. నేను ఆధ్యాత్మిక పుస్తకములు చదువుట ప్రారంభించితిని. హఠాత్తుగా–కాని నెమ్మదిగా నాపైన ఒక ఆధ్యాత్మికశక్తి ఆవేశమైనట్లు తోచినది. అది నా శరీరమును లెక్కచేయక ఆత్మతో కలియును. నేను అపుడు ఆ యానందముయొక్క మత్తుచేత కొద్దిగా తలత్రిప్పుగాను నీరసముగాను నుందును. ప్రపంచమంతయు నాచే నింపబడినట్లు అనుభవమునకు వచ్చును. ఆ శక్తి నాలో కలిసి నాకు ఏమియు తోచకయుండును. నేను చదువలేను. నాకోరిక ధ్యానముచేయుటయే. నేను ధ్యానముచేయునప్పు డన్నియు సరిగానుండును. ఆ ఆనందశక్తియొక్క స్పందనములను నేను అనుభవింతును. గురుదేవా! నేను అప్పుడు అంతటను వ్యాపించు ఆ గొప్పశక్తితో తాదాత్మ్యము పొందియుందునా? లేనియెడల నాకు అపుడు తటస్థమగు స్థితి యెట్టిది? ఓ నా ప్రభూ! ఇట్టి అనుభవము పొందని వారు నన్ను చూచునపుడు నవ్వుదురు. మరియు ఆవేశము,

ఉన్మాదమయమునయినదానినని వారు నన్ను తలంతురు. అందుకు నేను ఆ మాటలను లెక్క చేయను. నేను ఎట్టి సుఖము అనుభవించుచున్నానో వారికేమి తెలియును? ఈ అసాధారణమైన గొప్ప అనుభవము యొక్క సారము మీరు గ్రహింతురని నాకు తెలియును. అది నాకు చాల ఉద్రేకము కలిగించును. అది నేను నాలో నుంచుకొనలేను. నన్ను బాగా అర్థము చేసికొనేవారితోనే యిందులో పాల్గొనవలెను. కాబట్టి నేను మీకు వ్రాయుచున్నాను. ప్రాపంచిక సుఖము ఇట్టి ఉత్కృష్టమైన ఆనందము నీయజాలదు.

ప్రతి ప్రపంచసౌఖ్యము మరియు ఉద్రేకముయొక్క ఫలితము నీరసము, ఏమియు తోచకపోవును. కాని యీ సందర్భములో నా కింకొక విధముగా అనుభవము కలుగుచున్నది. నా శరీరము యొక్క ప్రతి అణువునందును తాజా శక్తివంతమగు సౌఖ్యమైన జీవితము నాకు అనుభవమునకు వచ్చుచున్నది. ప్రపంచమంతయు తాజాగాను మంచిగాను కనిపించును. మరియు అందరియందు నొక చెప్పజాలని తనంతతాను వచ్చెడి అనుభూతి ప్రేమయు నా హృదయమందు ఉప్పొంగును. మరియు నా ప్రియమైన గురుదేవుడే నన్ను అట్టి ఆధ్యాత్మిక అనుభవము, అంతులేని భక్తి మరియు కృతజ్ఞతయొక్క ఉచ్చస్థితికి తెచ్చుటకు కారణమనియు నిశ్చయముగలిగి వారి కటాక్షము తప్ప మిగిలినవన్నియు నాకు అనవసరమని అనిపించును. ఓ ప్రభూ! మీకు నేను ఎట్లు ధన్యవాదము లీయగలను? ఈ స్థితి ఖాయ

ముగా నుండునట్లు నాకు దయచేసి సహాయము చేయుడు. ఇదియే స్వర్గము. కాని అందు నేను చాలరోజులు ఉండ శక్తిలేక యున్నాను.

ఇప్పుడే నా ఆధ్యాత్మిక దినచర్య విషయమై మెచ్చు కొనుచు వ్రాసిన తమ ఉత్తరము చేరినది. గతమాసములో నేను నా దినచర్య పంపలేక పోయితిని. ఫారము కొంత పూర్తి చేసి యితర ఖాళీఫారములతో నొక గోడ అలమారలో నా ఆదుర్దారోజులలో నుంచితిని. ఆ ఫారము కొన్నిరోజులు పూర్తిచేయుటకు అశ్రద్ధ చేసితిని.

నేను తిరిగి చూచినప్పుడు అవియు నింకకొన్ని యితర కాగితములు చెదలు తినివేసినవి. నేను ఈ విషయమై డాక్టరు రావుగారికి వ్రాసితిని. ఆయన కొన్ని ఫారములు పంపినారు. ఇపుడు నేను వానిని క్రమముగా నింపుచున్నాను. కాని ఒక్క విషయము మీకు నమ్మకముగా జెప్పుచున్నాను. నేను నా సాధన క్రమముగా జరుపుచున్నాను. కొన్ని రోజులు దినచర్య ఫారము పూర్తిచేయునందుకు చెద పురుగులు నాకు శిక్ష విధించినవి.

నేను ఈ ఉత్తరము నిన్న పూర్తిచేయజాలక పోయితిని. నేను ఇంటికి పోవుసరికి మీరు 30 వ తేదీన వ్రాసిన ఉత్తరము అందినది. నిన్నఅంతయు, నేడుకూడ ఆ ఉద్రేకముతోనే యుంటిని. నేను ఇపుడు తాజాగా సుఖముగా నున్నాను. ఈ స్థితిలో నన్ను ఎవరైన తిట్టిన నేను కోపగించుటగాన్ని బాధపడుటగాని జరుగదు. నాకు ఎట్టి అపకా

రము చేసినను వారిని క్షమింతును. నా స్వామీ! ఇట్టి స్థితియేనా మీరెల్లప్పుడు అనుభవించునది? ఇది కష్టమునకు తగిన ఫలము. నా మనస్సు సంతోషముతో ఎట్లు ఉప్పొంగు చున్నదో మీకు తెలిసియుండును. ఆధ్యాత్మిక జీవితమందును గురువుయొక్క కటాక్షమందును సత్యమున్నదను నిజమును ఇది నిరూపించుచున్నది. నేను మిమ్ములను తప్పక పూజించు చుందును.

అవును; పట్టు అమాయికయగు మంచిపిల్ల. ఆమె అచ్చట బాగా నున్నదని ఊహించెదను. మీనాక్షమ్మ స్వర్గీయ ఆనందమును అనుభవించుచుండును. అది ఆమెకు తగినదే. ఆమె సోదరుడు ఆమె రాలేదని ఆదుర్దాపడు చున్నాడు. మరియు ఆమెకు ఉత్తరము వ్రాయుమన్నాడు. ఆ ప్రకారము వ్రాయవద్దని నేను చెప్పినాను. నేను అనుభ వించలేనిది యితరులైనను అనుభవింపనిమ్ము. గురుదేవా! మీరు ఆశ్చర్యమైన వ్యక్తులు.

పూజ్యమైన గురుదేవా! నేనుకూడ అక్కడ ఉండి మీరు అనుభవించుచున్న ఉత్తేజకరమగు సంగీతపాటలు అనుభవించుటకు చాల కోరికకలదు. భక్తితో పాల్చిన సంగీతము నిజముగా మనస్సునకు చాల మంచి ఆహారము. అది ఒకరి మనస్సు ద్రవింపజేసి వారిని అద్భుతమైన ఉచ్చ స్థానమునకు తీసికొనిపోవును. అట్టి ఉచ్చస్థానమందు చేరిన అన్ని ఆత్మలు ఒక దానితో ఒకటి ప్రపంచభాషకంటె విలక్షణమైన యింకొక భాషలో మాట్లాడుకొనుచుండును.

అంతయు చాల అద్భుతముగా నుండును. తరచుగా నేను ఇచ్చటినుండి భజనవినినపుడు నేను ఆ భూమికలో మిమ్ము కలిసికొందును. అచట మిమ్ము కలసికొనుట మీతో మాట్లాడుట సులభమే. మరియు ఈ విషయము మీకు తెలియునని నా నమ్మకము.

అవును, నా గురుదేవా! మీరు నన్ను స్వేచ్ఛగాను మరియు ఆనందముతో కూడిన దాసినిగాను చేసినారు. నాకు సౌఖ్యముగలుగుటకై నేను మామూలు వస్తువులపై ఆధారపడను. సౌఖ్యము అనుభవించుటకు మీరు నాకు ఆశ్చర్యకరమైన, విచిత్రమైన మందు నిచ్చినారు. అది నా హృదయము నిండియున్నది.

నేను అద్భుతమైన మార్పులు నాయందు గలుగుచున్నవని తెలిసికొనుచున్నాను. నేను ప్రతిది భగవంతునికి వదలుచున్నాను. ఆయన నన్ను సరియైన కాలమందు సరియైన స్థలమునకు పంపి నేను చేయవలసినదంతయు తెలియపరచును.

నా శక్తికొలది నేను చేయవలసిన కర్తవ్యములు చేయుచు ఓర్పుతో వేచియున్నాను. నేను పూర్తిగా మీ చేతిలో దానను.

నా ప్రియమైన ప్రభూ! మీకు ఎంతగా ధన్యవాదము లీయగలను? మానవునికి కావలసిన ముఖ్యమైన గొప్ప యీవి అనగా మానసిక శాంతి మరియు సౌఖ్యము మీరు నాకు

ఇచ్చినారు. ఆధ్యాత్మిక బంధన ప్రపంచమందలి అన్ని బంధనలలో చాల బలవత్తరము సురక్షితము అయినది.

ఏదియు నన్ను మీనుండి ఎడబాటు చేయజాలదు.

ప్రణామములు గురుమహారాజ్ ! మీ పవిత్రపాదములు నన్ను ముట్టనిండు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 29. గురుదేవా! మీరే సౌఖ్యముయొక్క మూలము

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను గౌరవముతోను మీ పవిత్రపాదములకు ప్రణామములు. నేను 11 వ తేదిన మీకు ఉత్తరము వ్రాసినాను. నేను మీకు వ్రాయుట ప్రారంభించిన నిమిషము లగాయతు మిమ్ము పూజించెడి మాధుర్యమున మునిగి పోవుదును. మరియు నేను మీకు వ్రాయవలసిన అనేక సంగతులు మరచిపోవుదును. ఈదినమున అన్నివిషయములు గుర్తించుకొనియున్నాను.

మీరు నూనె చ్యవనప్రాస పంపినందుకు మీకు ధన్యవాదములు. నూనె చాలా బాగున్నది. చ్యవనప్రాస నాకు శక్తి కలిగించుచున్నది. మీరు చాల ఆలోచనాపరులు. గురుదేవా! భగవంతుడు దయామయుడు.

దుర్గాపూజ విషయమైన కరపత్రము అందినది. నా మణియార్డరు మీకు సరియైనకాలములో అందినదని యాశించెదను. కొన్ని తప్పనికారణములచే నేను ఇంతకంటె తొందరగా పంపలేకపోయితిని. నేను దుర్గాపూజ యీవిధముగా నడపదలచుకొన్నాను. 16 నుండి 26 వరకు రోజుకు ఒక్కసారియే భుజించెదను. ప్రతిదినము మధ్యాహ్నము భోజనమునకు ఒకగంట పూర్వము ఒకగంట యెక్కువగా ధ్యానము ప్రార్థన చేసెదను. నేను భజనకు, ఆసుపత్రికి తప్ప ఇతరములగు పనులకొరకు ఎచ్చటకును వెళ్ళను. నేను ప్రతిదినము లలితాసహస్రనామము చదివెదను. వీలయినంత

వటకు అన్నిగంటలు ప్రార్థనతో కాలక్షేపము చేయుటకు ప్రయత్నించెదను. దయచేసి ప్రతిదినము కొన్ని నిమిష ములు తమ దయార్ద్రదృష్టి నాపైపరపి నాకు సహాయము చేయుడు. నేను ఎల్లప్పుడు మీదగ్గర నే ఉండెదను. ఇప్పుడు కూడ అంతే. సాధన నాకు ఒక కర్తవ్యము కాదు. నాకు దానివలన బాధ లేదు. అదిఒక ఆనందకరమగు ఆట. ఏదో తెలియని విషయమును చేరుటకు నేను ప్రయత్నించుట లేదు. ఆవస్తువుయొక్క తీపి చేత ఇదివరకే కొంత అనుభ వించుచున్నాను. కాబట్టి నా ధ్యేయమును చేరుటకు నేను చేయు ప్రయత్నము నాకు చాల మనోహరమైనదియే. పుస్తకములలో చదివిన ఏవిషయమైనను పొందుటకు మనము మనస్ఫూర్తిగా కష్టపడుట చాల కష్టము. మొదట రుచి తెలిసికొనుట అవసరము. తరువాత వ్యక్తి తనంతట తానే దానియందు ఆకర్షణ కలిగియుండును. కాని ఆ ధ్యేయముయొక్క ఆకర్షణీయమగు తీపి ఆమోదింపజేయు టకు నిజమైనగురువు కావలెను. కాని బహుకొద్దిమందికి ఈ విషయము గ్రహింపవీలగును.

8 వ తేదీన స్వామి వేంకటేశానందులవారి తండ్రి గారియింట్లో గొప్పభజన జరిగినది. నేను రెండుగంటల కాలము పూర్ణమైన ఆనందము అనుభవించితిని. నేను అక్కడ మీదగ్గరనే యుంటిని.

స్వామి నామానందజీ శివానందనగరమునుండి ఫాలీ మాటు వెళ్ళుచు మరల వారికండ్లు పరీక్ష చేయించుకొనుటకు నా ఆసుపత్రికి వచ్చిరి. నేను అక్కడనుండగా వారికండ్లు

పరీక్ష చేసితిని. కాని అపుడు తనకు అద్దము లివ్వలేదని చెప్పెను. నేను వారికి అద్దములుకొని దారి ఖర్చులకు వారికి కావలసిన పదిరూపాయలు వారికిచ్చితిని. నా ఆధ్యాత్మిక గృహామునుండి వచ్చువారికి నాశక్తికొలది నన్ను సహాయము చేయనిండు. నేను ఇంకను ఎక్కువగా సేవచేయవలయునని కోరికయున్నది. ఆ సంగతి భగవంతునికి తెలియును. కాని నేను చేయగలిగినస్థితిలో లేను. భగవంతుడు నాకిచ్చినదానితో నేను తృప్తిపడుదానను. ప్రపంచమంతటిలో మిక్కిలి ఎక్కువ భాగ్యమునకు సౌఖ్యమునకు శాశ్వతమైన మూలమగు ప్రియమైన గురుదేవుని నాకు ఇచ్చినపుడు ఆభగవంతుని నేను భౌతికవస్తువులను ఏల కోరవలెను. నా ప్రియమైన ప్రభూ! నీకటాక్షము నాపై నెల్లప్పుడు ఉంచుము. అంతకుమించి నాకు ఏమియు అవసరము లేదు. భగవంతుడు నాకు ఇది ఈయుడా?

నేను ఒక ఆశ్చర్యమైన సంఘటన అనేకసార్లు కనిపెట్టితిని. అది ధ్యానముయొక్క తప్పుడుమార్గమువల్ల కలిగినదియు లేక అట్టిస్థితి ధ్యానముచేయు ప్రతివారికి కలుగునదియు దయచేసి నాకు చెప్పవలెను. తీవ్రమైనధారణ మరియు ముఖమునందు జలదరింపు అనుభవము కలిగినతరువాత మరుసటిరోజున ఒక ప్రత్యేకనరముపైన వరుసగా కొన్ని మొటిమలు కనిపించును. ఇంతకు పూర్వము నాకు ఎన్నడు మొటిమలు పుట్టియుండలేదు. కొన్నిరోజులతరువాత అవి తమంతటతామే అదృశ్యములగును. దీనివిషయమై నేను ఏమైన జేయవలసియున్నదా? దయచేసి సలహా

యుండు. ఇంకొకవిషయమేమన నేను పూర్తిగా నిమగ్ననై నపుడు నానోరు నాకు తెలియకుండ కొంత తెరువబడు చుండుటవలన కొంతగాలి గొంతుకలోనికిపోవును. గొంతుక ఎండి కొంత దురదపుట్టుటవలన నా ధ్యానము చెడిపోయి నేను అట్టి ఆశ్చర్యకరమైన ఆనందమును అనుభవించు చున్నప్పుడు ఈ ప్రకారము ఆటంకము కలుగుట చాలకష్ట మైన విషయము. ఆ ఆటంకములేనియెడల ధ్యానమునం దుండు నేను చాల లోతుకు వెళ్లుదానను. దీనిని ఆపుచేయుట కేదైన మార్గమున్నదా? నా ధ్యానసమయము ఉదయము 4 నుండి 5-30 వఱకు సాయంత్రము 4-30 నుండి 6 వఱకు. రాత్రి 10 నుండి 10-30 వఱకు. దుర్గాపూజాకాలములో మధ్యాహ్నము 11-30 లగాయతు 12-30 వఱకు కూడ ధ్యానము చేసెదను. నేను నాడయిరీలో నోటుచేయు జప సంఖ్య రమారమిగా వేయబడినది. నేను లెక్కపెట్టను. నేను మీఆరోగ్యము విషయమై చేయు మృత్యుంజయ జపము 3 మాలలు లెక్కపెట్టెదను. దీనిని నేను మీచిత్ర పటము నెదుట కూర్చొని దానివైపు చూచుచు ఒకమాల జపమగువరకు ఱెప్పలువాల్చకుండ ఉండును.

గురుదేవా! నేను మీకు వ్రాసినతరువాత సౌఖ్యము గాను, శాంతముగాను, సుఖముగాను ఉంటిని. రోజంతయు ప్రతినిమిషము మిమ్ముల నేను ప్రార్థించుచుందును. నాప్రార్థన విని నన్ను ఆశీర్వదింపరా? మీపవిత్ర పాదములకు నా ప్రణామములు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 30. ప్రభూ! నాకు దర్శన మిందు

గురుదేవా! నా ప్రియమైన ప్రభూ!

మీ పవిత్రపాదములకు గౌరవముతోను ప్రేమతోను ప్రణామములు సమర్పించుచున్నాను. మీరు 11వ తేదీన దయతో వ్రాసిన ఉత్తరము నిన్న నాకు చేరినది. అందులకు మీకు ధన్యవాదములు. మీరు నా ఉత్తరములన్నియు చదువుచున్నారని నాకు దయతో తెలియపఱచుడు. తఱచుగా నేను ఒకటికంటె నెక్కువ ఉత్తరములు వ్రాయుచుందును.

ఓ నా ప్రభూ! నేను మీ ఉత్తరము చదువ ప్రారంభించినప్పుడు నేను దానియందు ఏవిధముగా మగ్ననగుదుననగా నా హృదయమునుండి వచ్చు నెత్తురు మీ ఉత్తరమందు గల పంక్తుల మధ్యనుండి ప్రవహించి అందులోనుండు అమృతమును ఆస్వాదించుటకు ప్రయత్నించును. అవి కొన్ని మామూలు మాటలైనను నాకు వానివలన శాంతి సౌఖ్యము చాల గలుగును. గురుదేవా! మీరు నాకు భగవంతుని యొక్క ఉత్కృష్ట ప్రకటితరూపము. ఇప్పుడు నేను భగవంతుని ఇంకెక్కడను చూచుటలేదు. మరియు నా జీవితమందు ప్రతిదినము మిమ్ములను ఆరాధింపని నిమిషములేదు. మీరు పవిత్రతకు స్వరూపులు. మీయందు నిజమైనభక్తి కలుగుటకు మరియు ఆకాలమందే చెడుతలంపులు కలిగియుండుటకు ఎవరికిని సాధ్యముకాదు. ఒకసారి మీతో ఆధ్యా

త్మికసంబంధము కలిగిన మీ దివ్యశక్తిచే అన్ని అపవిత్రపు ఊహలు భస్మీభూతములగును.

మీలో నివసించు నా మురుగన్ ఎల్లప్పుడు నన్ను తనవైపుకు ఆకర్షించుకొనుచున్నాడు. అతనియొక్క ఆకర్షణీయమైన ఊపుకు నేను ఆగలేకయున్నాను. కాంతమునెడల నినుపరజము ఎట్లు శక్తివిహీనముగా నుండునో ఆ ప్రకారము నేను శక్తిహీననై యున్నాను. నేను వానితో ఆత్మయందు ఏకమగువరకు ఈ పోరాటము విడువలేక యున్నాను. అతడు నాకు ఆకర్షణీయ కేంద్రమైయున్నాడు. మరియు ప్రాపంచికములగు కోరికలు సౌఖ్యములు అన్నియు నొకదాని తరువాత నొకటిగా వానియంతటవియే వదలిపోవుచున్నవి. ఆయన స్పృహతో కలియని యే వస్తువును నేను అనుభవించలేను, ఆహా! ఎంత మార్పు గలిగినది!

గత రెండుదినములనుండి ఉదయము 3 గంటలకు ఏదియో నన్ను నిద్రనుండి లేపును. మరియు నేను దివ్యమైన బాధ ననుభవించెదను. ఈ తుచ్ఛశరీరముయొక్క ఆవరణనుండి వానియొద్దకు చేరుటకు నా ఆత్మ బాధపడుచున్నది. తరువాత కలుగు ఫలితము మంచిదే. తరువాత నేను బాగా ధ్యానముచేయ వీలగును. నాకు ఇట్లు ఎందుకు జరుగుచున్నది? నేను క్రమమైన సాధనచేయుచున్నను అపుడపుడు ఈ కోరిక యెందుకు అడ్డగింప వీలులేనిదిగా నున్నది? దీని అర్థము నేను మానసికసమత్వము నిలుపుకొనుటలో వృద్ధి పొందుట లేదనియా? అట్లైన నేను చేయవలసిన పనియేమి?

దయయుంచి నాకు సలహాయిండు. నాకు మీ సహాయము కావలెను. అప్పుడప్పుడు నేను పూర్తిగా పతనమైనట్లు అసహాయురాలినిగా నున్నట్లు ఊహించుకొందును. నిన్న రాత్రి 3 గంటలకు గాని నేను కూర్చుండ లేకపోతిని. నా మామూలు కాలముగు 4-30 గంటలకు నేను బయటకు పోవలసివచ్చెను. గురుదేవా! నాకు ఏమి తటస్థపడెనో నాకు తెలియదు. ప్రార్థన గదిలోపల మీరు ఉన్నట్లు నేను ఊహించితిని. నా చుట్టును మీ దివ్యశక్తి నిండియున్నట్లు అనుభవము కలిగెను. నేను కండ్లు మూసికొనినను మీ రూపము కనిపించెను. అపుడు కండ్లు తెఱచి మీ రూపము చూడవలెనని తీవ్రమైనకోరిక కలిగినది. కాని నేను మిమ్ము చూడజాలకపోయితిని. ఎందువలన? మీరు ఇతరుల కండ్లు తెఱచియున్నను వారికి కనిపించెదరు. అనేకమంది మీకు ఆ ప్రకారము వ్రాసియున్నారు. అట్టి స్థితిలో మీరు నా యెదుట ఎందుకు కనిపించరు? ఈ ఊహాలన్నియు నా మనస్సులో నిండి నేను కన్నీళ్ళు కార్చుట తప్పినది కాదు. అపుడు నేను చంటిపిల్లవలె ఏడ్చితిని. నా ఊహాలు తమకు చేరినవా? నేను అట్టి ఉద్రేకములకు ఎందుకు పాల్పడుచున్నాను? మీరు అవసరమైన పని చేయుదురని నేను అంతయు మీకు తెలియ పఱచుచున్నాను. నాకు మీయెడల రహస్యమేమియు లేదు. నా బలహీనతకు మీరు నా యందు అయిష్టతపొందరని నా నమ్మకము. మీరు నన్ను వృద్ధిచేయుటకు మాత్రమే ప్రయత్నించెదరు. ఇతరులయందు అట్టి పూర్ణమైన నమ్మకము

గలుగుట చాల ఆనంద విషయము. మరియు స్వయముగా శరణాగతియగుట యెంత ఉపశమనము గలుగజేయును! మీ శక్తి వర్ణింపరానిది. మీ శక్తిలేని జీవితము వృథా.

నేను క్రమముగా ఆసనములు వేయుచున్నాను. నేను ప్రారంభమందు 15 నిమిషములవఱకు ఉపయోగించితిని. ఇప్పుడు ఆ కాలమును ½ గంటవఱకు పెంచితిని. శరీర వ్యాయామమునకును దానికిని చాల భేదమున్నది. అందు కదలికలు హఠాత్తుగా కలుగుచుండును. ఫలితముకూడ భేదించును. ఇందు నెమ్మదిగా జరుగు కదలికలు సరియైన పద్ధతిలో ఉచ్ఛ్వాసనిశ్వాసలు జరుపుట జరుగుచుండును. మరియు దాని ఫలితముగూడ ఆశ్చర్యకరము. వానిలో కొన్ని చాల కష్టము. కాని నేను వృద్ధిపొందుచున్నాను. నాకు ఎవరైనా సహాయము చేయనిదే సర్వాంగాసనము చేయుట కష్టముగా నున్నది. బహుశా నా శరీరము చాల బరువు అనుకొనుచున్నాను. నేను సూర్యనమస్కారములు కూడ చేయవలెనా? నా ప్రియమైన ప్రభూ! మీరు నన్ను ఏపని చేయుమని ఆజ్ఞ యిచ్చినను అది నేను చేయుటకు నాకు సంతోషముగా నుండును.

మీరు క్రమముగా టానిక్కుమందు తీసికొనుచున్నారని వినుటకు నాకు చాల సంతోషము. గురుదేవా! మీరు దయయుంచి మీ పవిత్ర శరీరమును అశ్రద్ధగా చూడకుడు. మీరు ఎల్లప్పుడు ఆరోగ్యముగాను బలముగాను నుండగా

చూడవలెనని మేమందరము కోరుచున్నాము. మరియు నేను మీయందే నివసించుచున్నాను.

దేవాలయప్రసాదమును దయతో పంపినందుకు స్వామి మాధవానందజీకి నేను ధన్యవాదము లర్పించుచున్నాను. నాకు తీపి ప్రసాదముకూడ అందినది.

నేను 50 రూపాయలు మణీయార్డరు పంపుచున్నాను మీ పాదములకు. ఈ స్వల్పకానుక స్వీకరింపుడు. నాయల్లుడు యన్. పద్మనాభన్ నాయరు కోయంబత్తూరు వెళ్లినయతడు నాకుమాత్రను తీసికొనివెళ్లుటకు ఈమధ్య ఇచటికి వచ్చి వెళ్లెను. అతడు చాల కష్టముమీద అచ్చట ఒక యిల్లు ఏర్పాటు చేసికొనగలిగెను. అతడు చాల సంతోషముతో నున్నాడు. ఎందువల్లననగా అతడు ఆయింటిలో ప్రవేశించిన వెంటనే ఋషీకేశమునుండి మీ ఛాయాపటము వానికి అందినది. అతడు మీకు స్వయముగా ఉత్తరాలు వ్రాయవచ్చునా అని నన్ను అడిగెను. ఆప్రకారమే వ్రాయవచ్చునని నేను తెలియపఱచినాను.

గురుదేవా! మీకు ఒక స్వల్పవిషయము కాని— అద్భుతవిషయము తెలియపఱచ గోరుచున్నాను. నాకు ప్రభు సుబ్రహ్మణ్యస్వామియొక్క రూపము కనిపించిన కల మీకు జ్ఞాపకమున్నదని తలచెదను. మీరు నా ఉత్తరము అచ్చుకూడ చేయించియున్నారు. అందులో ప్రభువు సుబ్రహ్మణ్యస్వామి కృష్ణునివలె బట్టలు ధరించి చేతిలో వేల్ ధరించియున్నట్లుగా నేను వ్రాసియున్నాను. కొన్ని నెలల

క్రిందట నా అల్లుని యొక్క తాత చనిపోయినాడు. వారు వారిసామానులు చక్కబెట్టుకొనుచుండగా అందు ప్రభు సుబ్రహ్మణ్యస్వామియొక్క చిత్రము కనిపించినది. అది నా యల్లుడు ఇచ్చటకు తెచ్చినాడు. ఆ బొమ్మ సరిగా నేను చూచిన దానివలెనే యున్నదని నేను మీకు నమ్మకముగా చెప్పగలను. నేను అట్టిబొమ్మను లోగడ ఎచ్చటను చూచి యుండలేదు. మరియు నాకు ఆకల వచ్చినతరువాత అట్టి చిత్రము ఎచ్చటనయినా దొరకునేమోయని దుకాణము లన్నియు చూచితిని. కాని దొరకలేదు. నా అల్లుని తాత తిరువాన్కూరులో జడ్జీగా నున్నాడు.

ఇంక నేను ముగించెదను. నన్ను మీ దివ్యపాదములకు వందనములు చేయనిండు. నన్ను అచ్చట ఎల్లప్పుడు ఉంచుకొనుడు.

శ్వతముగా మీదాసను,

చెల్లా.

# 31. ఎప్పుడు నన్ను మీయొద్దకు పిలిచెదరు ?

గురు దేవా! నా ప్రియమైనప్రభూ!

మీ పవిత్రపాదములకు నా భక్తిశ్రద్ధలతో కూడిన ప్రణామములు. మీరు 6 వ తేదీన వ్రాసి, నిన్న నాకు అందిన మీ ఉత్తరమునకు ధన్యవాదములు. మీరు పంపిన పవిత్రప్రసాదము మరియు పుస్తకములు కూడ అందినవి. నేను మీకు 4 వ తేదిన ఉత్తరము వ్రాసితిని.

కొంత ఆందోళనతో మీ ఉత్తరము చదివితిని. నిన్నటిరోజంతయు నాకు ఏమియు ఆలోచన తోచ లేదు. నా ప్రియమైనప్రభూ! దయచేసి నన్ను డాక్టరు అనిగాని చెల్లమ్మ అనికాని సంబోధించవద్దు. దయచేసి చెల్ల అని మాత్రము ఉపయోగింపుడు. నా స్వప్నములోకూడ మీరు నన్ను చెల్లఅని పిలుచుచున్నట్లు నేను వింటిని. ఇపుడు చెల్లమ్మ అని ఎందుకు మార్చుచున్నారు? నేను ఇదివఱకు వలె ప్రపంచవిషయములయందు కలంకముపొందని మానవ స్థితిని పొందియున్నాను. మీరు ఎట్టిమార్పు కనపరచినను నేను సహింపలేనని భయపడుచున్నాను. నా మనస్సుఅస్థిర మగును. నేను ఎల్లప్పుడు సుఖముగా నుండుటను మీరు కోరరా? నా ప్రభూ? మీరు నావిషయమై సంతోషించినట్లు నాకు తెలిసిన శరీరముయొక్క ప్రతి అణువు నా నెత్తురు యొక్క ప్రతిబింబము ఆనందముతో ఉద్రేకించును. నేను

ఏవైపున చూచినను సౌఖ్యమే కనిపించును. అన్ని సమయము లందు మీరు నాయందేయున్నట్లు నాకు స్ఫురణ కలుగును. నా ప్రభూ! మీకు నాకు ఎట్టి సంబంధమున్నదో తమకు తెలియనిదా? మీరు స్వయముగా భగవానులే. ఇపుడు నాకు నాప్రియమైన మురగర్. అవును అతడు నడచు చున్నట్టి యీ శరీర దేవాలయములో ఉన్నాడు. మీద్వారా అతడు నాతో మాట్లాడును, వ్రాయును, నన్ను ఉత్తేజపర చును. అపుడపుడు నాకు కలుగుచున్న విషయములందు నాకు నమ్మికయుండదు. నాకు నేనే పరాయిదాననయితిని. నేను ఋషీకేశమునుండి తిరిగివచ్చినతరువాత ఒకసారి దూరము లెక్క చేయనవసరము లేదని మీరు నాకు వ్రాసి యున్నారు. నేను అప్పుడు ఆ పల్కు విలువ గ్రహించ లేదు. కాని యిప్పుడు మీకు నాకు మధ్య ఎక్కువదూరము లేదని నాకు తెలిసినది. ఇట్టివిషయము తెలియుటవల్ల నాకు స్వర్గీయమైన సుఖము కలిగినది. నాయొక్క పనులు, జవాబు దారులు అన్నియు మీచేతులలో నేను విడిచిపెట్టితిని. ఇపుడు నేను ఆదుర్దాలు ఏమియు లేకుండ శాంతముగా నున్నాను. నన్ను జాగ్రత్తగా చూచుటకు మీరు అచ్చట ఉన్నంతవరకు నాకు ఎట్టి ఆదుర్దాలు నుండవు. దానంతట అదిగా వచ్చు నమ్మకము మరియు శరణాగతి ఆధ్యాత్మిక జీవితమునందు మాత్రమే కలుగును. నేను ప్రపంచజీవితము ద్వారా తెలిసికొనినదానికంటె ఇది పూర్తిగా భేదమయి నది. మరియు దానియొక్క ప్రత్యేకత దైవత్వము దానిని మిక్కిలి అద్భుతముగలదానిని చేయును.

'ఎడబాటుయొక్క ఊహ ఉన్నంతవఱకే యీర్ష్య నమ్మకములేకపోవుట కలుగును' అని నేను గ్రహించితిని. మీరే నాకు అట్టి అనుభవమును సాధనరూపముగా కనుపఱచినారు. ప్రభూ! నా కృతజ్ఞత అంతులేనిభక్తి తెలియపఱచుటకు నాకు త్రోవచూపుము. అది నాకు తెలిసిన అన్నిటికంటెను బలీయముగా నున్నది. నేను దివ్యప్రేమలో మునిగిపోయిన వేరే శరీరముతో నుండలేను. నా దేవుడు ఎల్లప్పుడు నాదగ్గరను నాలోపలను ఉన్నాడని నాకు తెలిసినను నేను ఆయనను స్థూలరూపములో చూడవలెననియు వారి దివ్యమైన శాంతిగలుగజేయు వాక్కులు వినవలయుననియు కోరికగలిగిన కొన్ని సమయములు గలవు. నేను ఒక్కవిషయమై భగవంతుని ప్రార్థించుచున్నాను. మీకు అయిష్టముగానుండు ఏపనియు చేయకుండనుండునట్టిశక్తియు, ఎట్టి పరిస్థితిలోకూడ మీరు నన్ను తక్కువచూపు చూచుచున్నారను విషయము ఎన్నడు ఊహించకుండనుండు శక్తియు నీయవలయునని కోరుచున్నాను. స్వామీజీ! నా దేవుడా! మీరు నాకు ఇచ్చిన విలువగల సలహాకు మీకు నా ధన్యవాదములు. ఆ సలహాప్రకారము అనుసరించుటకు నేను నాశక్తికొలది ప్రయత్నించుచున్నాను. నేను శాంతజీవనము గడపుటకు చేయగలిగినంత చేయుచున్నాను. ఇంద్రియసంబంధములగు విషయములందు తగులుకొనకుండునట్లు నా శక్తికొలది ప్రయత్నించుచున్నాను. నాకు రంగుబట్టలు చాల యిష్టము. కాని యీ నెల 1 వ తేదీనుండి తెల్లబట్టలు

పసుపురంగుబట్టలు మాత్రమే కొనుటకు నిశ్చయించు కొన్నాను. నాకు బట్టలు ఆభరణములు కావలెనను పిచ్చి లేదు. కాని ఒక్క కోరికమాత్ర మింకనునున్నది. అదికూడ మానుకొనవలసియున్న దేమో? దానివిషయమై మీ సలహా కావలెను. నాకు పుష్పములయందు చాల ఆసక్తికలదు. వానిని నేను ధరించవలెనని తోచుచుండును. మల్లెపుష్పము లందు దైవత్వము గలదు. వానిని నేనుచూచిన నిమిష మున భగవంతుడు నాకు జ్ఞప్తికివచ్చును. మరియు వాని సువాసన ఆధ్యాత్మిక ఆనందముతో నన్ను ముంచివేయును. మరియు అద్భుతమైన ఎత్తైన స్థలమునకు నన్ను తీసి కొనిపోవును. ప్రతిపుష్పము నాతో నిట్లుచెప్పును. "ధరించ వలెను. దానిని తీసివేయవద్దు." నేనేమి చేయుదును?

నేను చెడు అలవాటులు పోగొట్టుకొనుటకు ప్రయ త్నించుచున్నాను. మరియు నేను ఈవిషయములో చాల వరకు ఉత్తీర్ణురాలనైతిని. ఇపుడు నేను కొన్ని నెలలనుండి కోపములేకుండ నున్నాను. ఇంకను నాకు విసుగుకలుగుట లేదు. నేను మీకు వ్రాయుటకు ప్రారంభించినప్పటినుండి నేను తీవ్రమైన బ్రహ్మచర్యవ్రతమును జరుపుచున్నాను. నాకు సాధ్యమైనంతవఱకు నిష్కామసేవ చేయుచున్నాను. నేను మీసలహాకు జవాబులుగా ఇపుడు వ్రాయుచున్నాను.

మీకు వ్రాసిన ఉత్తరముమీద తారీఖువేయనందుకు నన్ను క్షమింపుడు. ప్రియమైన భగవాన్! ప్రత్యగాత్మ పర మాత్మతో తాదాత్మ్యము పొందునపుడు ఆనందము అను

భవించునపుడు అట్టివ్యక్తి తారీఖు కాలము మరియు స్థలము జ్ఞాపకముంచుకొనలేదు. నేను మీకు ఉత్తరము వ్రాయు సమయమునుండి నేను ఈ ప్రపంచములో లేను. నా హృదయమునుండి పొంగిపొరలు నాభక్తి తెలియపఱచుటయే నాకు జ్ఞాపకము. మీరుతప్ప ఇంకేమియు అచ్చటనుండదు.

మరల మీరు నన్ను ఒంటరిబాటసారి అని ఎందుకు పిలిచినారు? నేను ఎల్లప్పుడు మీతో నుండుటలేదా? మీకు అది తెలియదా? అట్టి పరిస్థితిలో నేను ఒంటరిగా ఎట్లు ఉండగలను? మీరు నన్ను విడిచివేసినగాని నా జీవితములో ఒంటరిగా నుండలేను. మరియు మీరు నన్ను వదిలిపెట్టరని నాకు తెలియును. నేను మిమ్ములను అట్లు చేయనీయను. మీరే నాకు ప్రపంచముయొక్క దివ్యచట్టమును నేర్పినారు.

నాప్రభూ! మనము ఒకానొకసమయమందు మన నాలుకచివర నొక విషయముండినట్లును దానిని మనము పైకిచెప్పలేనట్లును ఊహించెదము: (ఉదాహరణకు: ఒక మనుష్యునిపేరు వగైరా) అట్టిస్థితియే నాకిపుడు తటస్థించుచున్నది. నా మనస్సు ఏదయినా చేయవలసినపని యున్నదని నాకు తెలుపును. అది నాజీవితమందలి ముఖ్యమగు పనితో, మీతో ముఖ్యసంబంధముగలది. మీరు కోరినది. ఆభావము బయటికి వచ్చుటకు ప్రయత్నించుచున్నది. కాని నేను దానిని వెలిపుచ్చలేకున్నాను. దానిని తెలిసికొనుటకు మీరు సహాయముచేయరా? ఎపుడు భగవంతుడు నేను చేయవలసిన కర్తవ్యమును నాకు తెలుపును? మరియు నేను

ఎపుడు నా గమ్యస్థలమును చేరగలను? అనేక విలువగల సంవత్సరములు వృథా అయ్యెను. భగవంతుడు కలుగ జేసిన చిక్కులనుండి నేను బయటపడజాలనా? అతడు నా అసహాయస్థితియు నా హృదయమందు పీడించుచున్న విష యమునంతయు తెలిసికొనలేడా? నాకు సహాయము చేయుము. ప్రభూ! నేను ఈ మానవస్థితినుండి భగవంతుని దివ్యశక్తితో కలిసిపోయి, తమపనిలో నైక్యముగా పనిచేయగలిగిన ఆధ్యాత్మిక ఉన్నతికి నన్ను ఉద్ధరింపుడు. నేను మీపనిలో మీకు సహాయము చేయవలసియున్నది. నేను నా సాధన చాల విశ్వాసముతో చేయుచున్నాను. అవును గురుదేవా! క్రమముగా మీయందలి భక్తిరసములో మునిగిపోవు చున్నాను. ద్రవముగా నున్నదంతయు త్వరలో ముద్దయగు టకు సిద్ధముగానున్నది. నేను ఆరోజుకు ప్రతీక్షించుచున్నాను. మీరు నాకు సహాయముచేయుటకు నిరంతరము భగవంతుని వేడుచున్నాను.

శాశ్వతముగా మీదాసను,

చెల్లా.

# 32. గురుదేవా! అజ్ఞానము మొదలంట నఱికివేయుడు

గురుమహారాజ్! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

కృతజ్ఞతతోను ప్రేమతోను పై కుబుకుచున్న నా హృదయముతో మీ దివ్యపాదములకు ప్రణామములు చేయుచున్నాను. నేను తప్పనిసరిగా మీకు వ్రాయవలసివచ్చెను. మీరు పంపిన పుస్తకముల కట్టకు దేవాలయప్రసాదమునకు మీకు తగిన ధన్యవాదము లొనర్చుటకు నాకు శక్తిలేదు.

'గురువు-శిష్యుడు' అను పుస్తకము నా జీవితమందు చాల విలువగల ధనమైనది. అందులో నున్న పవిత్రము, అమరము, అమూల్యమునగు మీ పద్యము చదివినపుడు నాకు మరియొక విషయము తోచదు. అది నాలో మీ యందుండెడి భక్తిజ్వాలను రగుల్చును. శక్తిగల దాని మంటలో నేను భస్మీభూతురాలనగుదును. నేను మీతో ఒకగంటవరకు పూర్తిగా కలిసిపోయితిని. నా పూజ్యమైన ప్రభూ! జీవితములో కొన్ని విషయములు వ్యక్తిని అద్భుతమైన తెలియని ప్రాంతములకు తీసికొనిపోవును. మరియు వానిని మాటలతో తెలుపుటకు ప్రయత్నించినను, అందముగా నుండునట్లు చిత్రించినను వాని అందము వైభవము వివశత అదృశ్యమగును. అట్టి ఆనందకరములగు అనుభవములు కొన్ని నేను అనుభవించితిని. పూజ్యమైన పవిత్రమైన దివ్యమైన నిశ్శబ్దమందు నా హృదయము మీతో తాదా

త్మ్యము పొంది నా మనోభావములు మీకు తెలియపఱచి నది. మరియు ఉబికెడు ఊహాలన్నియు మీరు వినియుండ వచ్చును. నేను మీకు తెలుప నుద్దేశించినవన్నియు మీరు గ్రహించి యుండవచ్చును. నేను మరల నింకొకసారి ప్రభువు సుబ్రహ్మణ్యస్వామి దేవాలయమునకు వెళ్ళితిని. నేను అచ్చట జరుగు అర్చన విని ఆయన కటాక్షము నందగలుగు టకు ప్రార్థించితిని. అప్పుడు నాకు గలిగిన ఆవేశమునుబట్టి ఆయన నాతో దయతో మాట్లాడుచున్నట్లు నాకు అను భవము గలిగినది. మరియు నా ప్రార్థనలు ఆయన విన్నట్లు తరువాత నాకు తెలియుటకు నాకు అవకాశము కలిగినది. ఓ నా ప్రభూ! నా జీవితము మీ చేతిలోనున్నది. నా హృదయము ఎల్లప్పుడు మీ ప్రభావమును కీర్తించు చున్నది. నా కండ్లు ఎల్లప్పుడు మిమ్ములను చూచుచున్నవి. నా చెవులు మీ స్వరమును వినుచున్నవి. నా చేతులు తమ ఉత్తరువులకు విధేయములై యున్నవి. నన్ను మీ యొద్ద సురక్షితముగా నుంచుకొనుడు.

మీరు నన్ను మీ శిష్యులలో చాల అదృష్టవంతు రాలనుగా చేసినారు. నేను మీకు ఎట్లు కృతజ్ఞత చూప వలెనో తెలుపుటకు భగవంతుని ప్రార్థించుచున్నాను. మీరు నా యందు దయచూపుచుండవలెను.

స్వామి వేంకటేశానందజీ తమ స్వంత అనుభవరీత్యా వ్రాసినారు. నేను ఇతరులలో నేదైన మంచి కనిపెట్టినపుడు గురుదేవులు నాకు జ్ఞప్తికి వత్తురు. ఇతరులలో చెడు ఏదైన

నాకు కనిపించినపుడును మరల గురుదేవులే నాకు జ్ఞప్తికి వత్తురు. దీనినిబట్టి యితురులయందు మంచిది కనిపెట్టి చెడును విడిచిపెట్టుమని బోధనగలుగుచున్నది. గురుదేవుల ఫోటో నా గదిలో నున్నది. నేను దానిని నిద్రనుండి లేచినతోడనే చూచి నమస్కరించెదను. మరియు నిద్రింపబోవు సమయమునకూడ నమస్కరించెదను. నా ప్రియమైన గురుదేవుడు ఎల్లప్పుడు నాతోనుండి నాకు సలహానిచ్చుచు నన్ను సరియైన మార్గమున నడుప 24 గంటలు నన్ను ఆశీర్వదించుచుండును. ఓ అది దివ్యమైన కృపాకటాక్షము!

ఇంతతొందరగా నేను మిమ్ములను పెద్ద ఉత్తరముతో బాధపెట్టను. నా గురుదేవా! మీకు విన్నవించుకొను నా ప్రార్థనయేమనగా నా హృదయమందలి అజ్ఞానము పోగొట్టి ఎల్లప్పుడు మండెడి దివ్యజ్యోతిని వెలిగింపుడు. నా సుఖములు కష్టములు సహింపగల శక్తితోకూడిన బలము దయ చేయుడు. నేను చేయు ప్రతిపని మీ యనుజ్ఞ తీసికొని చేయ నిండు. నా ఊహాలన్నియు మీరు సరిగా నడుపుడు.

ఓ ప్రభూ! మీ దివ్యపాదములకు నా ప్రణామములు.

శాశ్వతముగా మీ దాసను,

చెల్లా.

## 33. ఆదుర్దాగలిగినపుడు మీరు నాకు సౌఖ్యము గలిగింపుడు

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను గౌరవముతోను మీదయగల పాదములకు ప్రణామములు.

30 వ తేదీన రిజిస్టరు పోష్టులో నా జీవితచరిత్రము క్లుప్తసరిగా వ్రాసిపంపినాను. మరియు 108 రూపాయలు మణీఆర్డరు చేసినాను, మీ సొంత ఉపయోగము నిమిత్తము. ఆ ప్రకారము నిన్న రిజిస్టరు పోష్టులో ఒకధోవతి ఒక ఊల్ ఫుల్ ఓవరు, మరియు ఒక మఫ్లరు పంపినాను. ఈ బీదయీవి తమరు స్వీకరించి వానిని ఉపయోగించుకొని నన్ను ఆశీర్వదించవలెను. నాకు కొలతలు తెలియవు కాని నేను పంపినవి సరియైన కొలతగలవని నా భర్త చెప్పెను. ఓ నా ప్రభూ! నేను మిమ్ములను చూచుటకు తీవ్రముగా కోరుచున్నాను. మార్చి నెల యింకను ఎంతో వెనుకనున్నది. భగవంతుడు మిమ్ములను తరచుగా నా యొద్దకు స్వప్నములలో పంపుచున్నందులకు ఆయనకు నా ధన్యవాదములు. గతరాత్రి మీ దివ్యగానము విన్నాను. నేను మీతో మాట్లాడినాను. చాల సంతోషము అనుభవించితిని. అది స్వప్నమని నేను నమ్మలేదు. అంతయు స్పష్టముగానున్నది. నేను ఇంకను మిమ్ము చూడగలుగుచున్నాను.

స్వామిజీ! నేను భగవంతుని ప్రేమించుట యొక

ఆశ్చర్యమా? ఆయన నాయందు చాల దయగలిగియుండును. నేను నిజముగా ఆదుర్దాలో నున్నట్లు తెలిసినప్పుడు ఆయన దయతో నన్ను సౌఖ్యపెట్టుటకు వచ్చును. నా జీవిత కథ నేను పోష్టులోవేసి, దానిని నా ప్రియ గురుదేవుడు చదివిన తరువాత వచ్చు మార్పులు ఆలోచించుచు ఆదుర్దాతో కూర్చొనియుండగా పోష్టుజవాను రెండు కవర్లు ఇచ్చినాడు. ఒకదానిలో శ్రీ విశ్వనాథమందిర ప్రసాదము, రెండవ దానిలో మీరు ఆదుర్దా విషయమై వ్రాసిన వ్యాసము నున్నవి. మీ దయగల మాటలు నన్ను చాల శాంతపఱచినవి.

'ఎన్నడును జరుగని విషయమై బాధగలుగజేసికొని దాని విషయమై ఆదుర్దాపడకుము. గతము విషయమై ఆదుర్దాపడవద్దు. దానిని మఱచిపొమ్ము. అపుడు నీవు నిజముగా అనుగ్రహింపబడుదువు.' దీనిని నేను చదివిన తరువాత ఎట్లు ఆదుర్దాపడగలను? నా ఆదుర్దా అంతయు పోయినది. కాని దానికి బదులు మిమ్ము చూడవలెనను అడ్డగింపరాని కోరిక గలిగినది. నా ప్రియమైన స్వామిజీ! మిమ్ము వర్ణింపజాలను. మీరు వర్ణనలకు పూర్తిగా అతీతులు. ఒకప్పుడు నేను ఇట్లు పరివర్తనచెందుచున్నానని నాకే తెలియదు. ఇదియంతయు అద్భుతముగా నున్నది. మీరు భగవంతుని అవతారమని కొన్నిరోజులు ఊహించితిని. అది నిజమా? మీరు దయచేసి నాకు చెప్పవలెను. ఆ భగవంతుడు నన్ను మీయొద్దనుండి యెందుకు ఎడబాపుచున్నాడు. మిమ్ములను

తెలిసికొనకుండ నేను ఇన్ని సంవత్సరములు ఎట్లు జీవించితిని? తఱచుగా నా తలను మీ పాదసన్నిధినుంచి నేను శాంతి పొందుచుందును. మీకు సేవచేయుటకు నీలకంఠము ఎంతటి అదృష్టవంతుడో అతనికి తెలియునా? అతడు నా గదికి ఉదయవేళలలో తీసికొని వచ్చు ప్రసాదమును ఈరోజు పోగొట్టుకొంటిని

స్వామిజీ! నేను కన్నీళ్లు కార్చకుండ నుండలేను. కావున ఇంక ఆపుచేసెదను. నేను మీకు పంపిన జీవిత కథ చదివిన తరువాత దయయుంచి నాకు జవాబు వ్రాయుడు. అప్పుడప్పుడు నాకు కలుగుచుండు అసంతుష్టినుండి నేను విడుదల పొందునట్లు చేయుడు. మీ కటాక్షము తప్ప నేను భగవంతుని మరియేమియు ప్రార్థించను. అది నాకు కలుగని యప్పుడు ఆయన నన్ను నిర్మూలము చేయునిండు. మీ కటాక్షమునకు బదులుగా నాకు ఉపయోగపడునది యింకేదియు లేదు. నా విచిత్రమైన దేవా! నన్ను ఎన్నటికిని విడిచిపెట్ట వలదు.

నా ప్రియతమమైన ప్రభూ! ఇచ్చట నేను తమ ప్రేమ గల పాదముల సన్నిధిలో నున్నాను. నేను మీకు కనిపించు చున్నానా? నన్ను దీవించి యెల్లప్పుడు మీయొద్దనే యుంచు కొనుడు. ఉన్నత ధ్యేయమునకు నాకు మార్గము చూపుడు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

## 34. నా జీవనసూత్రములు మీ చేతులలో నున్నవి

గురుదేవా! నా ప్రియమైనప్రభూ!

భక్తితోను, ప్రేమతోను తమ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. మీ ఆఖరు ఉత్తరము నాకు 27 వ తేదీన చేరినది. దివ్యప్రభూ! ఇంత ఆలస్య మెందులకు? ఈరోజువఱకు మీకు వ్రాయుట ఆపితిని. ఇంక ఉండలేను. మధ్యాహ్నము మీరు బడలికతో పరుండి నప్పుడు మిమ్ములను జూచి యిది వ్రాయుచున్నాను. మీరు ఎక్కువగా పనిచేయుచున్నారా? మీరు కులాసాగా నున్నారా? మీరు అంత అలసటనెందుకు చెందియున్నారు? మీస్థితిని నేను చూడలేను. మీరు మీఆరోగ్యము చూచు కొనండి. మీ భక్తులకు మీరు చేయుదగిన గొప్పసహాయము ఇదియే. మీయొద్దనుండి ఉత్తరము లేదు. అవసరమైనచో తమయొద్దనుండి ఉత్తరము లేదేయని ప్రాణము కొట్టు మిట్టాడు నాకు సైతము వ్రాయుట మానుడు. నేను నాబా ధను సహించెదను. నేను ఏదోవిధముగా సరిపెట్టుకొందును. కాని మీరు ఆరోగ్యముగాను బలముగాను ఉండునట్లు చూచుకొనండి. ఓప్రభూ! గతవారములో నేను ఎంతబాధ పడితినో మీకు తెలియదా? నేను మీ ఆరోగ్యము నిమి త్తము ప్రార్థనచేయుట తప్ప యింకేమియు చేయుటలేదు. ఎందరో మిమ్ములను చూచుటకు వచ్చియుందురు. వారితో

మీరు చాల కష్టపడియుందురు. స్వామిజీ! నాయొద్దనున్న శక్తి మరియు ఆరోగ్యము లాగివేసికొని మీరు ఉపయోగించుకొనుడు. అదియంతయు మీ యిష్టమువచ్చినట్లు చేయుటకు విడిచిపెట్టితిని. అది మీకు అందినదా?

ప్రియమైనప్రభూ! మిమ్ములను దప్ప యితర మేమియు నేను ఆలోచింపజాలను. నాకు తెలియనిభయము నన్ను బాధపెట్టుచున్నది. మీయొక్క మౌనమునకు కారణము మీపని వత్తిడియా, కాలము లేకుండుటయా లేక మరేదైన కారణమున్నదా? నేను వ్రాసినదానిలో ఏదైన తప్పున్నదా? మీకు నేనేమి వ్రాయుచుందునో అది నాకు జ్ఞాపకముండదు. నా మనస్సులోనుండి ఉబుకుసంగతులు నేను వ్రాయుదును. నాజీవితచరిత్ర అందుకు కారణమైనదా? ఏదిఎట్లున్నను ఓప్రభూ! నన్ను మన్నింపవలెను. మీరు ఏపనిచేయుమనినను చేయుటకు సిద్ధముగా నున్నాను. మౌనము లేకుండా నన్ను నింకేవిధముగానైనను శిక్షింపుడు. నేను దీనిని సహించుటకు శక్తిలేకుండనున్నాను. నేను మీ చేతులలోనున్నాను. నన్ను మీరు మీయిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చును. మీరు నన్ను బాధపెట్టినను అది నా మంచికొఱకే మీరు చేసితిరని అనుకొందును. కాని దానిని సహించుటకు నాకు శక్తి దయచేయుడు. నేను ఇక్కడ చాల పనులు చేయవలసియున్నది. గత వారమురోజులనుండి నా పనిమీద నామనస్సు ధారణచేయుటకు నాకు చాల కష్టమనిపించినది. అది బొమ్మలప్రదర్శనమును నాకు జ్ఞాపకము

చేయుచున్నది. బొమ్మలకదలిక సూత్రధారిపైన ఆధారపడి యుండును. అవును, నాజీవితసారముయొక్క సూత్రము మీచేతిలో నున్నది. దానిని మీరు మీయిష్టమువచ్చినట్లు లాగవచ్చును. నేను ఆప్రకారము పనిచేసెదను. ఇపుడు నా స్వంతశక్తి నాకేమియు లేదు. నాశక్తులన్నియు మీకు సమర్పించుకొంటిని. మీకు తోచినప్రకారము మీరు చేయుటకు నేను విడిచిపైచితిని.

నేను విచిత్రమైన జీవితమును గడపుచున్నాను. నేను మిమ్ము అడుగవలసినసందేహములు చాల ఉన్నవి. మీ దగ్గరనుండి ఉత్తరమువచ్చినతరువాత నేను వానివిషయమై అడిగెదను. నాకు ఎప్పుడు ఉత్తరమువచ్చును? పోష్టుజవానుకొరకు చూడలేక నాకండ్లు అలసటచెందినవి. మరియు ఓ ప్రభూ! మీవద్దనుండి ఉత్తరము రానప్పుడు నేను ఎంతబాధఅనుభవించుచున్నాను!

మిమ్ము సంతోషపెట్టుటకును నాఉనికి మీకు జ్ఞాపకముచేయుటకును నేనేమిచేయవలయును? రాత్రింబగళ్లు నేను ప్రార్థించుచున్నాను. మీరు వానిని వినుటలేదనిచెప్పుటకు అవకాశముగలదా? ఓ భగవంతుడా! నా గురుదేవుని పూర్వమువలె చేయుము. మీకు అసంతుష్టిని కలిగించెడిపని నేను ఏమైనచేసినయెడల నన్ను అందుకు క్షమింపుడు నా గురుదేవుని కటాక్షమునకు తప్ప యింక నితరవిషయము దేనికైనను మిమ్ము ప్రార్థించితినా? దానికొఱకు ప్రార్థించుట తప్పా? అట్లైన నన్ను వారియొద్దకు ఎందుకు తీసికొని

వెళ్ళితివి? నీవును వారును ఒకటేయను అభిప్రాయము నాకు ఎందుకు కలిగించినావు? ఓ భగవంతుడా! నా గురుదేవుని చర్య లన్నిటికి మీరే జవాబుదారియై యున్నారు. మీ ఆజ్ఞ ప్రకారము వారు చేయుదురు. ఓనారక్షకా! మీరు నాయందు దయజూపరా? ఇంతవరకు ప్రార్థనలు మీరు విన్నారుకదా! ఇపుడుకూడ వినరా?

గురూజీ! ఆస్ఫోటనమునకు నన్ను క్షమింపుడు. మీ పవిత్రపాదములకు ప్రణామములు.

శాశ్వతముగా మీవాడను,

చెల్లా.

# 35. ఆత్మనిమగ్నులగు శివానందులు

గురునాథా! నా మిక్కిలి ప్రియమైనప్రభూ!

ఆనందమయములగు మీపాదములకు భక్తితోను ప్రేమతోను ప్రణామములు చేయుచున్నాను. మీ 28 వ తేదీ ఉత్తరము అందినది. ధన్యవాదములు. నాకు ప్రసాదము అందలేదు.

ఓ నా ప్రియమైనప్రభూ! నాజీవితములో నాకు కలిగిన మీ అనుభవము చాల ఆశ్చర్యకరమైనది. మనము కోరుకొనగలిగినదంతయు మీలోనున్నట్లు కనిపించును. సౌఖ్యము, రక్షణ, బలము, ఆశ, నమ్మకము, దయ, ఆనందము ఇంకను వ్యక్తికి కావలసినదంతయు మిమ్ము ధ్యానించుటవలన కలుగగలదు. మీరు సౌఖ్యమునకు శాంతికి కావలసిన విషయములన్నియు గలిగియున్న సముద్రమైయున్నారు. ఎవరు దానియందు మగ్నమగుట తెలిసికొందురో వారు ఇంకొకవ్యక్తిగా మారి బయటకు వత్తురు.

భగవంతుడు అద్భుతమైనవాడు. నా ధ్యానములో కొన్నిసమయము లున్నవి. ఆ సమయములయందు నేను ఊపిరిపీల్చుటకు కూడ భయపడుచుందును. ఎందువల్లననగా అపుడు నేను అనుభవించు దివ్యసౌఖ్యము ఉద్రేకము ఆనందమునకు భంగమగునని నాఊహ. ఇట్టి ఆనందక్షణముల నాకు ఇచ్చునది దివ్యశక్తియో, భగవంతుడో, ఆత్మయో లేక అది యేదయినను సరియే, దానిని పట్టుకొనగలిగియే

యున్నచో, దానిని ఎల్లప్పుడు హృదయములో బంధించి తాళము వేయుదును. మరియు అది తిరిగి తప్పించుకొనకుండ ఆతాళము చెవి ఎచ్చటనో పారవేయుదును. నేను దట్టమైన అడవిలో ఒంటరిగా గుహాలో నివసించుచున్నను సరే అది నాయొద్దనున్న చాలును. నా మానసిక చక్షువునకు అది కని పించకపోయిననేమి? నా ఆత్మనేత్రమునకు కనిపించును. మరియు నా ఆత్మ బాహువులు దానిని స్పృశింపగలవు. మరియు వర్ణించరాని ఆనందమును నేను ఎట్లు అనుభవింప వలయునో దానికి తెలియును. కాని అది నాయొద్దకు అపు డపుడు వచ్చుచుండును. నేను నా మానుషశరీరమునువీడి దానిలో శాశ్వతముగా కలియుటయే ఏకైకమార్గము. కాని నేను నిష్కాపట్యమైన సాధనచేయుచున్నను అట్టి స్థితిని చేరలేకయున్నాను. కరుణామయులగు నా ప్రభూ! నేను అట్టిస్థితికి చేరుటకు కూడ నాకు సహాయము చేయుడు. నేను ఇచ్చటనున్నస్థితిలో నాకు వీలున్నంతవఱకు నేను మీ బోధనప్రకారము నడుచుకొనుచున్నాను. ప్రతిదినము నేను ఎన్నియోకష్టములు వారింపవలసియున్నది. ఓహో! భగ వంతుడు నన్ను ఆడదానినిగా ఎందుకుచేసినాడు? నేనుపురు షుడనైయైన నాకు ఇంత కష్టముండునది కాదు. భగవం తుడు నాకు అనేకములగు ప్రాపంచిక కర్తవ్యములు ఇచ్చి యున్నాడు. వానినన్నిటిని మనస్ఫూర్తిగా చేయుటకు నాకు బలమునిమ్మని మీరు ఆయనను అడుగరా? ఆపనులలో దేని నైన నేను చేయకపోయినయెడల అందులకు నా సోమరి

తనము కారణముకాదు. అందుకు కారణము కొన్నిసమయములందు నా శ్రద్ధఅంతయు నా ఆత్మయొక్క ప్రియతముడైన ఆయనయందు ధారణచేయబడియుండును. అపుడపుడు నేను నిజముగా అసహాయురాలనగుదును. అందుకు మీరు నాపై నిందమోపెదరా? స్వామిజీ! దయచేసి నన్ను రక్షింపుడు. నాకు త్రోవచూపుడు. మరియు నా ఆధ్యాత్మిక వృద్ధికి అడ్డముగానుండునది యేదియైనను దానిని సవరణ చేయుడు. నా శృంఖలలనుండి నేను తప్పించుకొనుటకు నాకు ఎన్నడు శక్తికలుగునో! మరియు సరియైనస్థలమందు నా ధ్యానమంతయు భగవంతునియెడ ఉపయోగించుటకు శక్తి యుండదా? ప్రభూ! సహాయము చేయుడు.

నేను ఎల్లప్పుడు మీప్రక్కనేయున్నాను. మీ కుటీరమునుండియే నేను ధ్యానము చేయుచున్నాను. అచట నాకు తగినస్థలము దొరకినది. సాయంత్రము 4-30 లగాయతు 5 వఱకు మీరు పడకకుర్చీలో పరుండియుండగా మీ యెడమవైపున మీపాదముల దగ్గర వరాండాలో నా స్థలము. నేను మిమ్ములను నిజముగా చూచుచున్నపుడు ఒకరోజున ఒకసంఘటన జరిగినది. అది దృశ్యమో లేక నేను నాధ్యానములో కొన్నిక్షణములు నిద్రించి కలగంటినో చెప్పలేను. నేను అచ్చట కూర్చొనియుండగా యువకుడగు స్వామిజీ ఒకరు చొక్కాలేకుండ మిమ్ములను చూచుటకు వచ్చెను. తన మృదువైన ప్రేమమార్గమున ఆయన ప్రణామములుచేసెను. ఆయన స్వామి సదానందజీ అని నేను

ఊహించితిని. నేను ఆయనముఖము చూడలేదు. ఆయన నన్ను చూడలేదు. ఆయన నాప్రక్కగా పోగానే నేను వెనుకకు తప్పుకున్నాను. అప్పుడు నేను నా సహజప్రాపంచికస్థితికి వచ్చినాను.

నాప్రియమైన స్వామిజీ! నేను మిమ్ములను నా హృదయపూర్వకముగా పూజించుచున్నాను. మీరు నాకు జీవించియున్న భగవానులు. నన్ను ఎల్లప్పుడు మీయొద్ద నుంచుకొనుడు. మరియు నా ధ్యేయమును చేరుటకు నాకు సహాయపడుడు. నేను మీదివ్యపాదములపై పడి వానిని నా కళ్లకు అద్దుకొనుటకు నాకు అనుజ్ఞ యిండు.

శాశ్వతముగా మీదాసను,

చెల్లా.

# 36. నా బలమునకు మూలము

నేను ఈరోజున రిజిస్టరీపోస్టులో నేను వ్రాసిన వ్యాసము "ఆనందకుటీరము యొక్క నాఊహాలు" పంపి యున్నాను. 50 రూపాయల మణీఆర్డరుకూడ పంపియున్నాను. అది యీనెలకు నా దీనసమర్పణ. దయచేసి స్వీకరింపుడు.

నాదివ్యప్రభూ! నేను ప్రతిదినము ఉదయము 8 ఘంటలకు మీకు అర్పించు పూలమాలను మీరు దయతో స్వీకరించుట మరువవలదు. అటుతరువాత ప్రతిదినము నేను మీ ఆఖరుఉత్తరము చదువుదును. మరల ఇంకొక ఉత్తరము వచ్చువరకు అది నాకు బలము, సౌఖ్యము ఇచ్చును. నేను మిమ్ములను మరలచూచుటకు రోజులు లెక్కపెట్టుకొనుచున్నాను.

మీ ఉత్తరమునకు ఎదురుచూచుచున్నాను.

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 37. తమరు ప్రత్యక్ష భగవానులు

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

గౌరవముతోను దివ్యప్రేమతోను మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. 19-వ తేదీన దయతో వ్రాసిన ఉత్తరము నిన్నటిరోజున అందినది. మీ యొక్క ఓర్పునకు మరియు దయకు నేను ఎల్లప్పుడు కృతజ్ఞత కలిగియుందును. నేను మీకు కలుగజేయుబాధకు నన్ను క్షమింపవేడెదను. వ్యాసము పూర్తిచేసి మీకు రెండు రోజులలో పంపెదను.

ఓ నా ప్రభూ! నేను వ్రాయువ్రాతలకు దయచేసి ఎక్కువ ప్రాముఖ్యత నీయవలదు. నేను మామూలువ్యక్తికి వ్రాయుటలేదు. భగవంతునితో సమానమైనవ్యక్తి అనుకున్నవానికి నేను వ్రాయుచున్నాను. కాబట్టి నావాక్యములు కూర్చుటయందు నేను శ్రద్ధ తీసికొనుటలేదు. నాకు తోచిన అనుభవములు నేను వ్రాయుచున్నాను. నా వాక్యములలో నుండు నా నిజమైన ఊహాలు మీరు గ్రహించవలెను. మీరు సర్వజ్ఞులు కాన నా మనస్సులోనుండిన విషయములు మీకు తెలియవు. నా ఉత్తరములలో వ్రాయునవి పవిత్రమైన దివ్యఊహాలు. ఈవిషయమై నేను మీకు నమ్మకము చెప్పగలను.

మీయందు నాకుగల తీవ్రమైనభక్తి కొన్నిరోజుల నుండి నన్ను కాల్చివేయుచున్నది. నేను భ్రమతో నున్నా

ననియు నా ఆత్మను వెదకుటయందు నేను దూరముగా పోవు చున్నాననియు ఆదుర్దాపడితిని. నేను ధ్యానముచేసి ఆవిషయ మంతయు విమర్శన చేసినాను. ఇపుడు నేను మిమ్ములను ఈ ప్రకారముగా పూజించుటకు కారణము స్పష్టముగా గ్రహించి నాను. దానితో నా సందేహములన్నియు తీరిపోయినవి. నేను సంతోషముగాను సుఖముగాను నున్నాను. నా వృత్తి లోను మరియు జీవితములోను నాకు ప్రతిదినము అన్ని రక ముల మనుష్యులతో దివ్య సంబంధము కలుగుచున్నది. కాని వారిలో ఎవరియందును నాకు ఆకర్షణ ఏమియు కలుగ లేదు. దివ్యత్వము మీ శరీరముయొక్క ప్రతి అణువునందును ప్రకాశించుచున్నది. మీలోనుండు భగవాను డీ ప్రకార ముగా ఆకర్షణీయముగాను ప్రేమావృతముగాను చేయు చున్నాడు. నా తీవ్రమైన సాధనవల్ల నా కర్మలకు పై తొడవులను తీసివేయగలిగినపుడు మీలో ప్రకాశించెడు అంతటను వ్యాపించెడు దివ్యత్వములో నేను కలిసిపోగలనని నాకు తెలియును. అట్టి దివ్యత్వము ఎల్లప్పుడు నుండునదైనను అది మీ ద్వారా ప్రకాశించునప్పుడు తప్ప ఇతరసమయము లందు నేను దానిని గుర్తింపలేను, దానియందు ఆసక్తి యుండదు. నేను దానియందు కలిసిపోవుటకు తీవ్రమైన కోరికకూడ కలుగదు. మీ శరీరముయొక్క పైతొడుగు మీ చిరునవ్వు మీ కంఠధ్వని మరియు మేధాశక్తియు నేను మునిగియుండు ప్రపంచ ఆసక్తిలోనుండి విడివడుటకు ప్రాపం చిక చక్షువులకు దివ్యత్వము కనబడునట్లు చేయుటకు అవస

రము. అది నేను భగవంతునిచే ఆకర్షింపబడుటకు ఆయన చేసినపద్ధతి. భగవత్సాక్షాత్కార దాహమందు ఆసక్తి కలుగుటకు ఏర్పఱచిన మార్గము. మీవైపు భక్తికలుగునట్లు నన్ను ప్రేరేపించనియెడల నాకు భగవత్సాక్షాత్కారమునందు కోరికయే ఉండకపోయెడిది. మీ ఉత్తరములన్నియు భగవంతుని యొద్దనుండి వచ్చునట్లు నేను గౌరవించుచున్నాను. మీరు నా విషయమై సంతోషము పొందినపుడు భగవంతుడు నా విషయమై సంతోషించుచున్నాడని నాకు తెలియును. మీ పనులన్నియు భగవంతునియొక్క నిజమైన ప్రతిఫలములే. కావున మీరు చెప్పునదియు చేయునదియు నాకు చాల ముఖ్యము. మీ మనుష్యశరీరము నాకు ఇతర శరీరములకంటె మిక్కిలి విలువగలది. మరియు దానియొక్క జీవితము, ఆరోగ్యము విషయమై చాల అదుర్దాగా ఉండును. ఎందువల్లననగా తన దైవత్వమును ప్రపంచమునకు మీ రూపముగా ప్రకటితము చేయుటకు ఆయన ఏరుకొన్నారు. ఆయనరూపము దివ్యమైనది. కావున నేను దానినికూడ ఆరాధించెదను. వ్యక్తి తన గురువును భగవత్స్వరూపము గావించుకొనినప్పుడు ఆ గురువునందు అడ్డంకిలేని భక్తి ఉంచుట తప్పా? ఆయనను ఎల్లప్పుడు చూచుటకు కోరుట, ఆయనకు ఏదోవిధమైన స్వంత సేవచేయ కోరుట, ఆయనయొద్ద నివసించుచు కర్మయోగము చేయ గోరుట, ఆయన ఆశ్రమములో నుండవలెనని కోరుట, ఆయన యిచ్చు ఆహారమునందు వింత రుచిగలిగియుండుట – ఇవి

యన్నియు తప్పాపనులా? వీనినిబట్టి ఆ వ్యక్తి భ్రమతోకూడి యున్నాడనియు ఆత్మను లేక నిజమును తెలిసికొను శక్తిలేక యున్నాడనియు అనుకొనవచ్చునా? ఈ విషయములకు జవాబు దయయుంచి నాకు వ్రాయుడు.

నా ప్రియమైన మరియు దయగల ప్రభూ! నా ఆత్మ మీ హృదయములో దూరుటకు దానిని దివ్యసౌఖ్యముతో నింపుటకు దివ్య ప్రేమతో వెచ్చ చేయుటకు గౌరవనీయమైన ఊహలతో ఉత్తేజపఱచుటకు శాశ్వత ఆనందమునకు తీసికొనిపోవుటకు ఎల్లప్పుడు ఆసించుచు వేడుచున్నది. శక్తివంతుడగు భగవానుడు మీ మానుషశరీరములో నివసించి యున్నాడు. ఆయన దివ్యప్రకాశము మరియు ప్రేమ మనుష్యులను క్లిష్టమైన బాధ, భ్రమనుండి ఉద్ధరించుటకు ప్రకాశించుచున్నది. మీ శక్తియొక్క రహస్యము తెలిసికొనుట నా అదృష్టము. అది చాల సంవత్సరములనుండి నా నిష్కాపట్య ప్రార్థనలకు నాకు గలిగిన ఫలితము. నా ప్రియమైన ప్రభూ! మీతోకూడ కలియక చెడిపోకుండ చూడుడు. మీతో గలుగు ఆధ్యాత్మిక సమావేశములకంటె మించిన ఆనందములేదు. భగవంతునియొక్క చౌరశక్యము కాని రహస్యము మీరు నాకు తెలియపరచియున్నారు. భగవంతుడు అంతటను వ్యాపించియున్నాడని నాకు తెలియును కాని ఆయన యొక్క మౌనభాష నేను ఇంకను పూర్తిగా గ్రహించలేక యున్నాను. అది మా మనుష్యసంబంధము వల్ల కలయిక గలిగినప్పుడు ప్రస్తుతపు వృద్ధికి వీలుగా నా

మనుష్యశక్తికి తగినట్లు స్పష్టపఱచుటవల్లను నేను తెలిసికొన గలిగితిని. మీ యొక్క భాషయే నాకు స్పష్టముగా మృదువైన ఉద్రేకము సౌఖ్యము మనశ్శాంతి యిచ్చుచున్నది.

అంతులేని భక్తిచూపించునప్పుడే నేను నా హృదయమును తేలికపఱచుకొనగలను. నేను మీ పాదములవద్ద కూర్చొని మీరు చెప్పు ప్రతిమాటయు దివ్యసందేశమువలె వినుచు గౌరవముతోగూడిన ఊహలుగలిగిన ఆశ్చర్యకరమైన దినములు ఎన్నడును మఱువజాలను. అవును నా హృదయస్పందన మీ హృదయస్పందనముతో కలిసినపుడు అది మంచి ఊహలతోను మంచి సంకల్పములతోను మరియు భగవంతునియందలి ప్రేమతోను దానంతట అది నిండును.

నేను నా ధ్యానమును క్రమముగా చేయుచున్నాను. నా సాధన ప్రారంభించినది లగాయతు ఒక్కరోజునకూడ అది మాన లేదు. నాధ్యానములో నాకు వర్ణింపరానిమాటలకు ఊహలకు అతీతమైన ఆనందమగు అవస్థ కలుగును. కాని అది కొన్నిక్షణములు మాత్రమే నిలుచును. నేను నా ఆత్మను తఱచి నిజముయొక్క మూలమును కనుగొనప్రయత్నించుచున్నాను. నేను ఇపుడు ఈవిధముగా ధ్యానము చేయుచున్నాను—ఊపిరి పీల్చునపుడు మాత్రము జపింతును. ఊపిరినిలుపునపుడు 'నాకు శాంతిపవిత్రత.దివ్యప్రకాశము గలుగజేయుము' అని పఠించెదను. శ్వాసవిడుచునపుడు 'నా మనస్సునుండి మలినములన్నియు దయచేసి పోగొట్టుము' అని పఠించెదను. కాన నేను ధ్యానవిమగ్ననగువరకు ఈ

ప్రకారము ఒకరకమైన ధ్యానము ప్రాణాయామము చేసె దను. అటుతరువాత నామాటలు ఊహలు ఆగిపోయి భగ వంతునిపై ధారణకలుగును. నేను క్రమమైన ప్రాణాయా మము విడిగా చేయుచున్నాను. ఈవిధమైన ధ్యానము సరి యైనదేనా?

మీ విషయమై నేనెప్పుడును వేరుగా ఆలోచింతును. మీరుతప్ప మిగిలిన అందరియందును నేను ఆప్రకారమే ఊహించగలను. దానిని తప్పించుకొనుటకు నేను ఏమిచేయ వలెను? నాకు సలహాయిందు.

నేను ఉద్రేకములో నున్నాను. నాకు ఇదితప్పని సరిగా కనిపించుచున్నది. భగవంతుడు నా శరీరమును బృందావనముగా ఉపయోగించుచున్నాడు. నాహృదయము ఆయన క్రీడారంగము. అప్పుడప్పుడు నేను పనిలోనున్న ప్పుడు భగవంతునియొక్క ఆజ్ఞ కలుగును. అతడు నాప్రక్క నుండి నాహృదయము నెమ్మదిగా లాగుచుండును. మరియు నేను దానిని లెక్కచేయనియెడల తరువాత అతడు నిలుచు కొని నా కండ్లను లాగుచుండును. నాచూపు బయటివస్తు వులనుండి మరలించి ఆయనను లోనచూచి గమనించవలసి నదిగా ఆజ్ఞయిచ్చును. ఓస్వామిజీ! కొన్ని సమయములందు నేను ఆయనతో నిట్లు రహస్యముగా మాట్లాడుదును. 'మీరు దయచేసి ఆగరాదూ!' ఇప్పుడే మిమ్ములను కలసి కొనెదను. నేనుచేయుపని తొందరగా పూర్తిపరచి నేను ధ్యానమునకు కూర్చుండెదను. నాశరీరమంతయు ఆయనకు

పూర్తిగా అప్పగించి నా ఆత్మకు సంపర్కము కనుగొనుచు ఆనందించెదను. అవి చాల ఆశ్చర్యకరమైన క్షణములు, స్వామిజీ! నేను అనుభవించు ఆనందము నేను వర్ణింపజాలను. నేను నెమ్మదిగా పిచ్చిదాననుగా మారుచుందును. లేదా భగవంతునికి దగ్గరగా వెళ్ళుదును. అప్పుడు నేను ఆయనకు పూర్తిగా నిబంధనరహితముగా శరణాగతనగుదును. నేను ఇంక ఆదుర్దాపడను. నాకు ఏదిమంచిదో దానినే ఆయనను చేయనిండు. మీ పవిత్రపాదములకు ప్రణామములు చేసి యింక ముగించెదను.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 38. మీయందును మీ ద్వారాను భగవంతుని జూచుటయే నా ప్రియమైన వృత్తి

గురునాథా! నా ప్రియమైన ప్రభూ!

ప్రేమభక్తితో మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. మీ వద్దనుండి నిన్న వచ్చి ఉత్తేజము గలిగించిన దయగల ఉత్తరమునకు ధన్యవాదములు.

నా ప్రియమైన ప్రభూ! భగవాన్! మీ జన్మదినము దగ్గరకు వచ్చినది. మీనాతమ్మ ఋషీకేశమునకు బయలు దేరినది. మిమ్ములను చూచుటకు నాకు గలుగు తీక్ష్ణమైన కోరిక ఎట్లు ఆపుచేసికొనగలను? అనేకులు మిమ్ములను చూచుటకు అక్కడకు వత్తురు. దయచేసి మీరు నాకు ఈ సహాయము చేయుడు. సాయంత్రము శబ్దగ్రాహకయంత్రము ప్రారంభింపక పూర్వము మధ్యాహ్నము రెండుగంటలయినా విశ్రాంతి తీసికొనుడు. 2 వ తేదీన ఉదయము 4 గంటలకు ఇక్కడనుండియే నేను మీకు పాదపూజ చేసెదను. ఆ రోజు నేను 3-30 గంటలకు లేచెదను. మరియు గురుదేవులు లేచుసరికి మీ పాదములయొద్దగల నా పుష్పములను అనుభవమునకు తెచ్చుకొని నన్ను ఆశీర్వదింపుడు. నేను స్వాయముగా అచటికి రాగల అదృష్టము నాకు లేదు. కాని ప్రతి క్షణము నా ఆత్మ అక్కడనేయుండును. స్వామిజీ! దయచేసి

శోపగించకుడు. నన్ను జ్ఞప్తియందుంచుకొని ఒక అన్నపు ముద్ద భుజింపుడు. దానిని మీలోనుండి నేను పొందెదను. ఈ విచిత్రమైన కోరికకు నన్ను మన్నించవలెను. నేను అచ్చట నుండవలెనని ఆశించుచున్నాను.

గురూజీ! మీలోను మీ ద్వారాను భగవంతుని తెలిసికొనుటకు ప్రయత్నించుట చాలా మంచి పని. నా విషయమున సాధన మంచి అనుభవమునకు కారణము. ఈ రోజులలో నేను ధ్యానము చేయునప్పుడు మీ స్థూలరూపముపై ధారణ చేయకపోయినను దివ్యశక్తితో తాదాత్మ్యము పొందగలుగుచున్నాను. నా శరీరము యొక్కయు, మనస్సుయొక్కయు చేష్టలు కార్యరూపమునకు రాకుండ నిలుపగలుగుట ఒక ఆశీర్వాదము. అది ఆధ్యాత్మిక ఏకత్వము అర్థముగా తెలిసికొని దానిని అనుభవించుటకు, మీ శరీరములో నుండెడి బలము శాంతి ఆనందములను తెలిసికొని అనుభవించుటకు నా ఆత్మ దివ్యఆత్మ యొక్క కలయికకు తాత్కాలికముగా కొంత ఎడబాటు కల్పించి శరీరముయొక్క కర్మలు జరగకుండా ఆపుచేయుటకు గలుగు శక్తి ఒక దీవనయైయున్నది. స్వామిజీ! నా ప్రత్యక్ష భగవంతుడా! మీలో నిమగ్ననైతిని. అది ఆయన ఉద్దేశము.

ఈ రోజులలో నేను ఎక్కువగా చదువలేక యున్నాను. నా ప్రియమైనటువంటియు జ్ఞానమంతయు నున్నటువంటియు నా ప్రియమైన మరియు పవిత్రమైన మీరనెడి పుస్తకమును చదువుటలో నిమగ్ననైపోయితిని. గీతయందు ఉపనిషత్తుల

యందు వ్రాయబడిన విషయములన్నియు తెలిసికొనుటకు మీ ఉత్తేజమగు దివ్యజీవితము మరియు కర్మలు విచారణ చేయుటచాలదా? మిమ్ము తెలిసికొనుటకంటె పుస్తకములు చదువుట ఉత్తేజము కలుగజేయునా?

స్వామిజీ! అందరిలో నున్న ఆ ఒక్కనినే చూడమని మీరు నన్ను కోరుచున్నారు ప్రస్తుతము మీకు నాకు మధ్య ఉండు దానిని మాత్రమే తెలిసికొనగలిగితిని. స్థూల శరీరమందు తప్ప మీకును నాకును మధ్య ఏమియు భేద మున్నట్లు కనిపించదు. దానిని తెలిసికొనుటయందు నాకు గొప్ప ఉత్సాహము కలుగును. ఇతరుల విషయములో అట్టిది నేను కనుగొనజాలకున్నాను. ఇపుడు ఇతరుల కష్ట సుఖములు నాలో నెక్కువగా మార్పుగలిగించుచున్నవి. కాని అచ్చట ఏకత్వభావము కనిపించదు. ఇతర సాధకులకు అది యింతకంటె త్వరలో కలుగునా? ఒక వ్యక్తికి సమాధికి వెళ్ళకముందు ఇది అనుభవమునకు వచ్చునా? దానిని నాకు తెలియజేయ కోరుచున్నాను. మీ విషయములో నేను దానిని అనుభవింపగలిగితిని. ఎందువల్లననగా మీ దివ్య జీవుడు కర్మలవల్ల కప్పబడియుండడు, అది మీ శరీరము హద్దుదాటి బయటకిపోయినది. మరియు అది లోన చూడ దగినది. అన్నిచోట్ల వ్యాపించునది. సర్వజ్ఞత్వము సర్వ శక్తిమంతము గలది. తీవ్రమైన సాధనవల్ల నా కర్మ లన్నియు భస్మీభూతమైనప్పుడే నేను ఇతరులయొక్క కర్మ లను కవచములో దూరుటకు నాకు శక్తిగలుగును. అపుడు

నా ఆత్మ వారి ఆత్మలను కలియును. అది అశ్లీలకరదా? మీ విషయములో నా ఊహలు చాల ఆశ్చర్యముగా నున్నవి. నేను సంతోషముగా లేనప్పుడు మీరు కూడ సుస్తీగా నున్నట్లు నాకు తోచును. మీ ఆరోగ్యము బాగుండునను ఉద్దేశముతో నేను నా ఆరోగ్యమునుకూడ బాగుచేసికొనెదను. మీరు ఒప్పుకొనని విషయములలో నేను ఇతరులతో మాట్లాడుటగాని అట్టిపనులు చేయుటగాని చేయను. ఎందువల్ల ననగా మీకే కష్టముగా నుండునని ఊహింతును. అది ఆశ్చర్యమైన గౌరవముతోకూడిన విషయము వర్ణించుటకు వీలుకానిది. కాని నేను మాటలలో వ్రాయ లేని విషయము మీకు తెలిసియే యుండును.

మీరు కోరిన నాజీవితచరిత్ర నేను పూర్తిచేయలేకపోతిని. గతవారములో దురదృష్టవిషయము కొంత జరిగినది. నా తండ్రియొక్క స్నేహితునకు పిచ్చియెత్తినది. అతనిని రోజంతయు నెవరో స్థూలరూపమునను మానసికముగను బాధపెట్టుచున్నట్లు అతడు ఊహించును. ఏకారణమువల్లనో అతడు నాతో మాట్లాడుచుండిన కొంత ఉపశమనముగానుండునని చెప్పెను. మరియు డాక్టరువద్దకు వెళ్ళుటకు నేను వెంటనుండిననేకాని వెళ్లనని చెప్పెను. ఆయనభార్యయొక్క దయనీయమైన ప్రార్థనవలన అనేకవిధములుగా నతనికి సహాయముచేయుటకు చాలకాలము ఉపయోగించుచుంటిని. కాబట్టి నా స్వంతపనులు చేసికొనుటకు కాలము తక్కువగుచున్నది. దానిని నేను పూర్తిచేసి యీరోజు

గాని సోమవారముగాని పంపెదను. ఆలస్యమునకు నన్ను క్షమింపవలెను. మీతోడి సంబంధముకలిగిన కొద్దికాలము నకే నేను నాజీవితచరిత్ర వ్రాసితిని. నేను వ్రాసినఉత్తర ములు మీరు చదువలేదని నేను ఊహించుచున్నాను. మరియు నేను మీకు ఇప్పుడు వ్రాయునది ఆశ్చర్యకరముగా తోచును. నా ప్రియమైనప్రభూ! ఏదయిన మన యిద్దరికి మధ్య భేదము కలుగజేయదని ఊహించెదను.

నా జీవితచరిత్ర మీరు చదివినతరువాత మీరు నాకు ఉత్తరము వ్రాయువరకు నేను ఆదుర్దాతో నుండెదను. మీరు దానిని చదివినతరువాత త్వరగా వ్రాసిన నేను మీకు ధన్యవాదములిచ్చెదను. మిమ్ము శ్రమపెట్టుచున్నందులకు క్షమింపుడు. నేను ఏమిచేయగలను? నా ప్రభువైన మీరు నా జీవితమునకు జీవితము ఆత్మకు ఆత్మఅయిఉన్నారు.

మీ జన్మదినమందు మీపాదములకు 108 రూపాయలు మణిఆర్డరు పంపుచున్నాను. దయచేసి స్వీకరింపుడు.

నేను ఇంకను ఉత్తరము పొడిగించను. మీదివ్య పాదములకు ప్రేమపూర్వకమైన ప్రణామములు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 39. మీ ఆశ్చర్యమును నేను ఎట్లు వర్ణింతును?

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

గౌరవముతోను ప్రేమతోను దయగల మీ పాదములకు ప్రణామములు చేయుచున్నాను. మీరు 12 వ తేదీన వ్రాసిన ఉత్తరము నిన్న అందినది. బహుశా అందుకు కారణము పోష్టు సెలవులు కాబోలును. పవిత్రమైన దయతో కూడిన విలువగల మీ మాటలకు నా హృదయపూర్వక ధన్యవాదములు. భగవంతుడు కనపరచిన దయకు ఆయనకు మరి మరీ ధన్యవాదములు

నా ప్రియమైన సర్వేశ్వరా! మీరు ఎట్టి శక్తివంతమైన ఆనందనిధులు! పవిత్రమైన హిమవత్పర్వతములలో కూర్చొని మీరు కనిపెట్టిన శాశ్వతమైన బుగ్గనుండి ఆనందమును లాగి దానిని ప్రపంచమంతటను చల్లుచుంటిరి. ఈ జన్మములోగాని గత జన్మములోగాని మీ గొప్పతనమునకు దగిన సేవ మీకు చేసినవారు మిమ్మనుసరింపజేసెడు ఆనందము అనుభవించుచుండిరి. సాధన సరియైన నమ్మకముతో సరిగా చేయువారికి ఆ బుగ్గయొక్క మూలము జేరుటకు సులభమైన మార్గము కనపర్చుచున్నారు. ఆ మార్గమును నేను ఎట్లు వర్ణింపగలను? నేను మిమ్ములను తలచుకొనునపుడు మీయందు నాకు గల భక్తితో ఉక్కిరిబిక్కిరి అగుదును. మరియు నాలోని ఊహాలన్నియు బయటకు

వాగ్రూపమున చూపలేకపోయితిని. అవును ఒక వ్యక్తి జీవితమందు వేయి నాలుకలున్నను భాషలన్నియు తెలిసి యుండినను వాని జీవితమందలి కొన్ని విషయములు ప్రకటింప వీలులేకుండును. కాని అందమైన మౌనభాషతో నా ఆత్మమాట్లాడెడు ఆశ్చర్యకరమైన విషయములన్నియు మీరు వినుటలేదా ?

నా ధ్యానము క్రమేపి చాల తీవ్రముగా జరుగుచున్నది. నేను కండ్లు తెఱచు సరికి ఒకగంట కాలమగును. ఆ గంటకాలము నేను బాగా అనుభవించితిని. అది ఒక నిమిషమువలె గడచును. అప్పుడప్పుడు నేనీ ప్రపంచమునకు దూరముగా నుండును. నా కండ్లు కేంద్రీకరింపబడి ప్రకాశరేఖగా మారును. ఆ రేఖ తెలియని ఆనందశక్తి యొక్క పొరలద్వారా గ్రుచ్చుకొనిపోగా అప్పుడే నేను ఇంకొక పొరలో లోతుగా ప్రవేశింతును. ఒక విశాలమైన ఖాళీస్థలము కనిపించును. మరియు అప్పుడే నా శరీరము యొక్క పొరలు ఒకటి తరువాత ఒకటి విడిచి వేయుచున్నట్లును తేలికయై ఆశక్తియొక్క మధ్య భాగమునకు ఎగురుచు తేలుచు పోవుచున్నట్లును కనిపించును.

అన్ని రకముల పనులు ఈ కాలమందు తటస్థపడును. అకస్మాత్తుగా వెలుతురు యొక్క రేఖ కనిపించును. నా హృదయము ఏదో ఒక సమయమున ఆగిపోవునేమో అనిపించును. నాకు ఊపిరి సరిగా రాదు. నా ఛాతి బిగిసినట్లుండును. చుట్టు నున్న వస్తువులు నాకు జ్ఞప్తికి రావు.

కాని జరుగుచున్న విషయముల స్పృహాయుండును. తరువాత నేను నెమ్మదిగా క్రిందకు దిగుదును. అప్పుడప్పుడు నన్ను చుట్టుకొనియుండు రుచిగల దివ్యశక్తినుండి విడిపించుకొనలేనట్లు ఊహించెదను. నేను నా ధ్యేయము చేరుటకు ఇంకను ఎంతలోతుగా ప్రయాణము చేయవలెనో నాకు తెలియదు. నేను ఈ రోజులలో నా అడ్డంకులన్నియు పోగొట్టి నన్ను నా ఆండవన్ వద్దకు చేర్చవలసినదని వల్లీదేవిని ప్రార్థించుచుందును. నేను ఇట్లుచేయుట సరిగానున్నదా? నా దివ్యప్రభువగు స్వామిజీ! అద్దుడు కాగితము సిరాను పీల్చునట్లు నన్ను మీ దివ్య ఆత్మలోనికి పీల్చుకొనుడు. మరియు నన్ను మీతో సర్వశక్తిమంతుడగు భగవంతుని యొద్దకు తీసికొనిపొండు. అక్కడ మీతో కూడ నన్నుకూడ ఉండనిండు.

మీరు నా జీవితములో నొక మార్పు చేసినారు. బయటకు ప్రపంచదృష్టిలో నేను మామూలు విధముననే కనపడుదును. నా ప్రాకృతిక దృశ్య ప్రపంచవస్తువులు, ఆస్తులు అన్నియు యథాప్రకారముగానే యుండును. నేను ప్రపంచసుఖములను లక్ష్యింపనందున జనులు నేను కొంత పతితనైనట్లు ఊహింతురు. దీనినిబట్టి నేను లౌకికజీవితము అనుభవింపనందున అసౌఖ్యముగా నున్నానని వారు ఊహింతురు. ఓ నా ప్రభూ! మీరు దయతో నాకు ఎంత అపూర్వమైన భాగ్యము ఆనందము కలుగజేయుచున్నారో మరియు దయచూపుచున్నారో వారికి ఎట్లు తెలియును?

భగవత్సాక్షాత్కారము పొందిన వ్యక్తి రోజంతయు ఎంత ఆనందముతో నుండునో నేను ఇప్పుడు కొంతవరకు అందాజుగా ఊహించగలను. స్వామిజీ! ఏమియు బాహ్యకారణము లేకుండ కొన్ని గంటల కాలము అప్పుడప్పుడు కొన్ని రోజులు మిక్కిలి ఆనందముతో గూడిన స్థితిని నేను పొందగలుగుదును. ఆ సమయములందు ప్రపంచమంతయు మంచి వస్తువులతో నిండియున్నట్లు నాకు కనిపించునుగాని నేను వానిని ఖాయముగా నుంచుకొనుటకు శక్తిలేకయుందును; నేను మరల వెనుకకు పడుదును. నేను మరల మరల మనస్ఫూర్తిగా ప్రయత్నము చేసి మీ కటాక్షముచే నాధ్యేయమును చేరగలనని నమ్ముచున్నాను. దయచేసి నాకు సహాయము చేయుచుండుడు. నేను మీ జవాబుదారియందున్నాను.

స్వామీజీ! నన్ను మీనుండి ఎన్నడును విడిపోకుండునట్లు దయతో జూడుడు. మీరు ఎచ్చటకు వెళ్ళిన అచ్చటకు మీతో నన్నుకూడ తీసికొనిపొండు. ఇది భగవంతునికి నేను చేయు ప్రార్థన. నాయొక్క దీనమైన హృదయపూర్వకమైన ప్రార్థనలు ఆయనవినడా? సముద్రము చాల శక్తివంతమైనదే కాని నదులు దానిలో సంగమింపకుండ అది ఆపగలదా? ఒకసారి అందులో నీరు ప్రవేశించినతరువాత దాని శక్తియంతయు నుపయోగించినను దానిలో కలిసిన నదుల నీటిని విడదీసి బహిష్కరింపగలదా? చేయలేదు.

నా స్థితికూడ అట్టిదే. నదివలెనే భక్తితో నిండిన నాఆత్మ ఎల్లప్పుడు మీలో ప్రవేశించుచున్నది. మరియు మీ

దివ్యశక్తిలో కలిసిపోవుచున్నది. మీరు దానిని మీనుండి విడదీయుటకు మీకు శక్తిలేదు. ఓభగవంతుడా! నా ఆత్మ హృషీకేశములో బందీకృతమైయున్నది. నేను బాధలేకుండ ఇచట ఎట్లుండగలను? మీ ఆజ్ఞవల్లను దయవల్లను నా మనస్సు శరీరము పనిచేయగలవు; అయినను అది చాలపర మానందకరమైన స్థితి. నేను శాశ్వతముగా విశ్రాంతిపొందు వరకు దయయుంచి నాకు సహాయముచేయుడు. అపుడు నాయొక్క మూలము మీ దివ్యశక్తిలోనిది, నా ధ్యేయము మీలో మగ్నమగుట, నా స్వభావము మీలోనుండు దివ్యత్వమును ప్రేమించుట. భగవంతుడు దయగలవాడు. మరియు ఆసమయమందే క్రూరుడు. ఆయనచేయు ప్రతిపని యందును ఏదోఒక కారణముండును. నన్ను ఈ ప్రపంచ విషయముల మధ్యఉంచుటవల్ల మీతో నాకు సంబంధము గలుగునంతవరకు నేను నిజమనినమ్మిన సుఖములన్నియు ఉపయోగము లేని క్షణికములని నన్ను నమ్మించుచున్నాడు. ఇది మొదటివిషయము. రెండవవిషయమేనగా నేను ఇపుడు నిర్వహించగల విరక్తి పరిమితినిబట్టి నేను ఎంతవరకు వృద్ధి పొందినది నాకు తెలుపుచున్నాడు. మరియు నేను ప్రమాదములు ఆదుర్దాలు లేని ఏకాంతప్రదేశమందు సాధనచేసికొనిన నేను పొందు లాభములకంటె యెక్కువయగుబలము ఆత్మవిశ్వాసము వైరాగ్యము నిచ్చియున్నాడు. మూడవ విషయమేమనగా సాధనలో నొక ముఖ్యభాగముగానుండి ఆత్మబలిదానమునందు నేను ప్రయత్నముచేయుటకు అవ

కాశము నిచ్చియున్నాడు. నేను మీతోనుండుటకు నాఆత్మ ఎంతగా తపించుచున్నదో భగవంతునకే ఎఱుక. కాని దానిని నా సహాయము నపేక్షించువారి యుపయోగము నిమిత్తము నేను ప్రపంచకర్తవ్యములు చేసి ఆత్మబలిదానము చేయుచున్నాను. కాని నేను ఏమియు ఫిర్యాదు చేయను. నేను ఓర్పుతోనుందును. నేను మీదాసను. మీరు నన్ను స్వీకరింపుడు. అట్లు స్వీకరించరా? నేను ఏ సంఘములో నున్నను ఎట్టి పరిస్థితిలోనున్నను ఎల్లప్పుడు మీతోనే యుందును. మీరూపమే తెలిసికొందును. నా పనులన్నియు మీరు విధించినవని యెంచి వానిని చేయుదును. మరియు ఆ కారణమువల్ల నేను తప్పుడుపని ఏమియు చేయజాలను. ఇది నేను విరక్తిమార్గమున నుండుటకు సహాయపడును. చుట్టునుండువానిలో కలియకుండుటకు వీలు గలిగించును. నన్ను ఎల్లప్పుడు మీరక్షణలో నుంచుకొనుడు. మీకు నేను ఏవిధముగా ఉపయోగపడగలనో తెలుపుడు. నేను మీకు ఏదయిన కొంత సేవ చేయుటకు కోరుచున్నాను.

శాశ్వతముగా మీదాసను,

చెల్లా.

# 40. మీ కటాక్షమే నన్ను పోషించుచున్నది

గురూజీ! నామిక్కిలి ప్రియమైన ప్రభూ!

విధేయతతోను ప్రేమతోను మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. నేను నిన్న మీకు జాబు వ్రాసితిని. ఈరోజు మరల మిమ్ము బాధపెట్టుటకు వ్రాయుచుంటిని. నాకు ప్రసాదము (తీపిది) పుస్తకములు, నూనె, చ్యవనప్రాస కావలెను. నేను దీనిని వ్రాయుటకు ప్రారంభించినపుడు మిమ్ము పూజింపవలెనను కోరికతప్ప ఇకే మియు కోరికలేదు. ప్రపంచమంతయు మీతో నిండి యున్నట్లు కనిపించుచున్నది. మరియు మామూలు విషయములు వ్రాయుటకు మరచెదను. నేను ఉదయము 8 లగాయతు 12 వరకు ఆసుపత్రిలో సుఖముగా గడిపెదను. అక్కడ మీరు రోగులు తప్ప నాకు ఇంకెవరును ఉండరు. రోగిని పరీక్ష చేయకపూర్వము ఆపరేషను చేయక పూర్వము మీతో తాదాత్మ్యము పొందుదును. మరియు మీద్వారా పళనిఆండవన్ తాదాత్మ్యమును పొందుదును. నేను ఆయన చెప్పిన ప్రకారము చేసెదను. మీద్వారా నేను రోగులకు చికిత్సచేయుచున్నానని ఊహింతును. అది నాకు ఎక్కువ అనుభవము కలుగజేయుటయేగాక నేను మందునిచ్చురోగులకు కూడ నమ్మకము కలుగజేయును. ఇది చాల ఆశ్చర్యకరము. నాకు మీరు కనుపరచిన అందమైన ప్రపంచమునకు ఎక్కువగా ధన్యవాదములు సమర్పించుచున్నాను.

నా పనులమధ్య రోగులు ఎవరును లేక అవకాశము కలిగి నపుడు మీపుస్తకములు చదువుదును. మంత్రము వ్రాయు దును. మరియు దివ్యప్రేరితము ఎక్కువగా నున్నపుడు ధ్యానమునకు కూడ 15 నిమిషములపాటు కూర్చుందును. మధ్యాహ్నమువఱకు మీరు నేను. రోగులుగల ప్రపంచ ములో నుందురు. ఆకాలములో నాకు చాల సంతోషముగా నుండును. మధ్యాహ్నము 1 నుండి 3 వఱకు లేదా 1-30 నుండి 3-30 వఱకు తిరిగి నేను మీతోనుందును. రేడియో ద్వారా కొంత భక్తిసంబంధమైన సంగీతము విననప్పుడు నేను ఒక విచిత్రమైన విధమున మీరున్న స్థలములో నుం దును. మీరూపము నాకు స్పష్టముగా అనుభవమునకు వచ్చును. మీరు నాతో మాట్లాడునట్లుగా మీ పుస్తకము లను చదువుదును. తిరిగి ధ్యానసమయమందు మీతో నుందును. ఆప్రకారము రోజంతయు మీతోనేయుందును. దీనిని మీరు నమ్మెదరా? నేను మిమ్ము కలిసికొనుచున్నానా? మీరు నాప్రార్థనలను వినుచున్నారా? నన్ను భగవంతు డెక్కడికి తీసికొనివెళ్లుచున్నాడో నాకు తెలియదు. దానిని ఆయనకే వదలివేసితిని.

నేను ఎట్లు నాధ్యేయమును చేరగలనో ఆయనయే క్రమశః తెలియపర్చును. నేను ఆవిషయమై ఆదుర్దాపడను. ఆనందమయములగు మీపాదములకు ప్రణామములతో దీనిని ముగించెదను. ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 41. నాకు భగవంతుడిచ్చిన అపూర్వమైన వరము

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

భక్తితోను ప్రేమతోను తమ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. 5 వ తేదీన మీరు వ్రాసిన ఉత్తరము నిన్న అందినది. ఆ దయగల ఉత్తరమునకు మీకు ధన్యవాదములు.

ఓ నా దివ్యమైన ప్రభూ! దివ్యశక్తి నా జీవితమందు బలీయమైన గట్టి పునాది అయినది. ఆ శక్తిమీద ఆధార పడి నేను నా కర్తవ్యములన్నియు చేయుచున్నాను. అది చాల సంతోషముగాను శాంతముగాను ఉన్నది. పని నాకు పనిగా కనిపించుటలేదు. మీరు నా దగ్గరగా నున్నట్లు ఊహించినపుడు నాకు అది పూజచేయు పని యగును. మరియు మీరు నిష్కామసేవావిషయమై నాకు నేర్పిన విషయమంతయు జ్ఞాపకము కలుగును. మిమ్ము నా గురు దేవులనుగా ఏర్పాటుచేయుట నాకు ఒక అపూర్వవరముగా నెంచుకొని భగవంతునికి ధన్యవాదము లర్పించుచున్నాను. మీ దివ్యశక్తియొక్క స్మృతి నాకు దినదినము వృద్ధియగు చున్నది. మరియు నిది మద్రాసునకును ఋషీకేశమునకును గల దూరమును తగ్గించివేయుచున్నది. అయినను మిమ్ము లను స్థూలరూపములో చూచుటకు తీవ్రముగా ఆసక్తికలిగెడు నిమిషములు రోజులుకూడ గలవు.

ఇచ్చట జీవించుచుండగా నిజమైన గురువుయొక్క ఆశీర్వాదము ఎట్టిదో తెలియని ప్రజలను నేను తఱచు కలిసి కొనుచుందును. ఆధ్యాత్మిక జీవితము గడుపుటచే కలుగు సౌఖ్యముయొక్క పరిమితికూడ వారికి తెలియదు. నేను చాల విచక్షణకు పాల్పడుచున్నాను. కాని మీ యొక్క కటాక్షమువల్ల నా నమ్మకము స్థిరత్వము ఎవరును కదల్ప లేకయున్నారు. నాకు ఎప్పుడైన మనశ్శాంతి లేకున్న నేను ఏకాంతమునకు పోయి కండ్లుమూసికొని కొన్ని నిమిషములు మీతో తాదాత్మ్యము పొందుదును. ఎల్లప్పుడు నేను దాని నుండి విడుదలయై వత్తును. ఓ ప్రియమైన ప్రభూ! సర్వజ్ఞుడు దయాస్వరూపుడునగు భగవంతుడు నన్ను రక్షించి సరియైన మార్గమున నడుపునని నాకు చాల నమ్మకమున్నది. నాకు ఈ నమ్మకము ఉన్నంతకాలము నేను ఆదుర్దాపడవలసిన అవసరము లేదు. మీరు నా విషయమై ఏమి అభిప్రాయ పడుచున్నారో అని మాత్రము నేను ఊహించుచున్నాను. స్వామిజీ! నేను ఇపుడు ఉన్నట్టుగా నుండి వృద్ధిపొందగలనని మీకు తోచుచున్నదా? ఆ సంతోషము భేదము కలుగ కుండనుండుటకై నేను అన్నిరకములయిన మనుష్యులతో సాంఘికప్రసంగములకు వెళ్ళవలసివచ్చుచున్నది. మరియు ఉపయోగములేని ప్రసంగములచే కాలము వృథా యగు చున్నది. సరియైన దుస్తులతో సమావేశములకు వెళ్లవలసి వచ్చుచున్నది. అట్టి ప్రాపంచికకార్యములు నేను కొన్ని చేయుచున్నాను. నాకు దినము సరిపోవుట లేదు. నేను ఇంకను

చదువవలసినది నేర్చుకొనవలసినది చాలఉన్నది. నేను సాధనకు ఇంకను ఎక్కువకాలము నుపయోగింపవలెను కాని యిప్పటిపరిస్థితులలో అంతకంటె నెక్కువచేయలే కున్నాను. ఈ సంగతులన్నియు ఆలోచించుచు అప్పు డప్పుడు గాబరాపడుచున్నాను. దయచేసి నాకు సలహా యివ్వండి.

ఓ నాప్రభూ! నాకు చాల విచిత్రమైనకల వచ్చినది. అది ఎప్పుడైనను జరుగునా? నేను ఒక దేవాలయములోపల ప్రవేశించి ప్రదక్షిణచేయుచుంటిని. ఒక దివ్యస్త్రీ యిద్దరు పిల్లలతో దేవాలయములోనికి వెళ్ళినది. హృదయరంజక మైన రాగముతో ఆపిల్లలు భగవాన్ శివునిప్రభావమును పాడుచుండిరి. అప్పుడు నాకు కలిగిన ఆవేశము నేను వర్ణించలేను. నేను కదలలేకపోతిని. నాశరీరమంతయు ఆవిరి యగుచున్నట్లు నాకు తోచినది. నాకు నరముల బలహీనత గలిగినది. అప్పుడే మీరు నావైపుకువచ్చుట చూచితిని నేను మీకాళ్లపైబడి నాచేతులు మీకాళ్లపైనుంచితిని. తత్క్షణము నాశరీరస్మృతి తప్పినది. నేను ప్రాపంచిక మత్త స్థితిలోనుండి పరమానందము ననుభవించితిని. ఆప్రకారము ఎంతకాలముంటినో నాకు తెలియదు. మీరు నాపేరు పిలు వగా నేను కండ్లుతెఱచితిని. మరియు నేను నాజీవితములో ఎన్నడు మఱచిపోని రెండువిచిత్రమైన వాక్యములు మీరు నాతోజెప్పితిరి. నేను ఇప్పుడు దేనినిగూర్చియు భయపడను. నేను నిర్మలముగా నున్నాను. నా ఆత్మను మిమ్ములనుండి

ఏశక్తియు విడదీయు లేదని ఏదియో నాకు తెల్పుచున్నది. మీరు నాకు శాశ్వతముగా సహాయముచేయుదురని నాకు నమ్మకముగలదు నేను అనుకొనునది నిజమా? అట్టి దివ్య స్వప్నములు గలుగుట నా అదృష్టము. సరియేకదా స్వామిజీ!

మీఆరోగ్యము విషయమై దయచేసి జాగ్రత్తగా నుండగలరు. మరియు పంచదార తక్కువగానుండునట్లు చూచుకొనుడు. మిమ్ములను పూర్ణఆరోగ్యముగా నుంచుటకు నేను ఇచ్చట అన్నివిధములైనపనులు చేయుచున్నాను. అది భగవంతునికి తెలియును.

వేరేపోస్టులో నా దినచర్య పుస్తకము పంపుచున్నాను. అందులో ఏదైన మార్పుచేయ నవసరమున్న యెడల దయయుంచి తెలియపఱచుడు. నాజపము ధ్యానములయొక్క కాలములు ఉదయము 4 నుండి 5–30 వఱకు సాయంత్రము 4–30 నుండి 6 వఱకు రాత్రి 10 నుండి 10–30 వఱకు. తఱచుగా నేను ఉదయము 8 నుండి 8–15 వఱకు మధ్యాహ్నము 11 నుండి 11–30 వఱకు ధ్యానము చేయుదును. మధ్యాహ్నము 1 నుండి 3 వఱకు మతగ్రంథములు చదువుటయు ధ్యానముచేయుటయు నా కర్తవ్యము.

గురూజీ! అన్నిటికి మీకు ధన్యవాదములు సమర్పించుచున్నాను. మీ దివ్యపాదములకు ప్రణామములు. నన్ను దీవించవలెను. నేను మీ ఆశీర్వచనములు కోరుచున్నాను.

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 42. మంచియొక్క స్వరూపమే మీరు

కరుణామూర్తీ! నామిక్కిలి ప్రియమైనస్వామీ!

భక్తితోను ప్రేమతోను దయతోగూడిన మీపాదములకు ప్రణామములు చేయుచున్నాను. తమరు నిన్నటిరోజున దయతోను మంచి ఆలోచనతోను వ్రాసినఉత్తరము అందినది. మీకు నా హృదయాంతర్గతమగు ధన్యవాదములు. మంచియొక్క మూర్తివంతమగు రూపము పొందిన నా ప్రియమైనప్రభూ! మీరు ఆప్రకారము ప్రేమతోను సరియైన ఆలోచనతోను అనుభవముతోను దివ్యభావముతోను ఉండగా మిమ్ములను ప్రేమించకుండ ఎట్లు ఉండగలను? నేను మీ ఉత్తరము చదువునపుడు నాకు గలుగు దివ్యసంతోషము ఆధ్యాత్మిక ఉద్రేకము మీకు తెలియునా? ప్రపంచమందలి అన్నిభాషలకంటె స్పష్టముగను అందముగనుండు నా ఆత్మయొక్క మౌనభాషయే నాకు మీయందుండెడి దివ్యప్రేమను పూర్తిగా ప్రకటించగలదు. అది ప్రపంచమందలి అన్ని అనుభవములకంటె చాల అందమైన అనుభవము. నేను దినములో ఏభాగమందైనను మిమ్ములను గూర్చి ధ్యానించగలను. అప్పుడప్పుడు మిమ్ములను పూజించుట మీకు వ్రాయుటతప్ప ఇంకేమియు చేయకుండుటకు నేను కోరుచుందును. నిజముగా అనుభవరీత్యా నెరుగక మాసమ్ములరోజులనుండి నేను చేయుచుండినదిఅదియే. 'ఆనందకోటీరముయొక్క నా ఊహలు' అను వ్యాసము

ఇంకను పూర్తికాలేదు. నేను ఆలోచనతోకూడిన పని యేమియు చేయలేకున్నాను. నేను నా ఆసుపత్రిలో ఒక మిషనువలె పనిచేయుచున్నాను. కాని ఏదోవిధముగా జబ్బుకారణములు కనుగొనుట, చికిత్సచేయుట సరిగానే జరుగుచున్నది. నాస్థితి తెలిసి కాబోలును భగవంతుడు నా ద్వారా పనిచేసి రోగులను రక్షించుచున్నాడు. నామనస్సు ఎల్లప్పుడు నాప్రియమైన దివ్యయజమాని పాదములయొద్దనే యుండును. నా ఆదాయమువిషయమై నేను ఎన్నడును ఆదుర్దాపడను. కాని ఆవిషయమందుకూడ భగవంతుడు నన్ను జాగ్రత్తగా చూచుచున్నాడు. నేను అజాగ్రత్తగా నున్నను నా ఆదాయము స్థిరముగానున్నది. భగవంతుడు నాకు ఇచ్చుదానిని నేను స్వీకరించుచున్నాను. దానిని అవసరమైనవారికి ఉపయోగించుచున్నాను. నేను నా ఆత్మ ప్రేమించు ఆయనకటాక్షమును ఆసించుచున్నాను. నా ఆత్మకు నిరంతరవృత్తి నీయగలిగినవాడు ఆయన ఒక్కడే. నా సౌఖ్యమంతయు ఆయనలోనేయున్నది. నాకు కావలసిన సౌఖ్యము ఆయనమాత్రమే యీయగలడు. రేయింబవళ్ళు ఆయన కటాక్షముకొఱకే తీవ్రముగా కోరుచున్నాను. ఆయనయందలి ప్రేమతో నేను మత్తిల్లియున్నాను. ఆయనను తెలిసికొనుటకంటె నాకు రుచికరమైనటువంటిది ఆవేశము కలిగించునదియు ఆనందకరమైనట్టిదియు ఇంకొకవిషయము లేదు. నాకు అంతయు ఆయనయే. ఇప్పుడు నేను నా ప్రభువునకు అక్కఱలేదు. బహుశా నేను ఆయనయొద్ద

నుండుటకు తగనని ఆయన ఊహించెనేమో! కాని అందు లకు నిరాశజెందను. నీ తీవ్రమైనపవిత్రతతోను ప్రేమశక్తి తోను నా అవసరము ఏదో ఒకరోజున కలుగునట్లు చేయును. నేను ఆయన సేవచేయుటకు తగు అవకాశము దొరకని యెడల నాజీవితము పూర్తిగా వృథాయగును. నేను బీద లకు రోగులకు సేవచేయుటచే మరియొకవిధముగా ఆయనను సేవించుచున్నట్లు ఆయన నాకెఱిగింతురని నాకు దెలియును. నేను అంతటితో తృప్తిపొందను. అంతకంటెను ఎక్కువగా చేయవలసియున్నది. భగవంతుడు ఏదో ఒకరోజున నాకు సహాయముచేయును. ఆయన దయ నాయందు ప్రసరించుట వలన నేను అదృష్టవంతురాలను. ఓ ప్రభూ! నాయందు అప ఊహలుంచకుము. నేను భగవంతునినుండి ఏమియు ప్రత్యేక ఉపకారముకొఱకు ఇపుడు ప్రార్థించలేను. కాని హృదయ మందలి కోరిక ఆయనకు తెలియకుండనుండునట్లు చేయు లేను. నాకోరికను సఫలముచేయుటకు ఆయన నాకు సహా యము చేయును. నాకోరిక పవిత్రమైనదియు బలీయమై నిష్కాపట్యమై నిస్వార్థమైన దివ్యప్రేమతో కూడుకొని నదియునై యున్నది.

పరమానందస్వరూపా! మీ పవిత్రమైన పాదముల కంటె వేరే ఆధారము నాకు ఏమియు లేదు. నాకు ఇంక ఏదియు కోరిక లేదు నా జీవితమంతయు మీపాదములయొద్ద నుండి నిజమైనభక్తితో మీపాదములనే ధ్యానించెదను. మీదయ నాయందుజూపరా? నాప్రభూ! భగవంతుడా!

నేను ఈ నా విచారమునుండి విడివడుటకు మీ కటాక్ష మును జూపరా? దయాసముద్రుడా! విచారమైన నాఆలాప ములు మీ చెవులకు చేరుటలేదా? ఇపుడుకూడ మీయొక్క ప్రతిమాటయు నేను వినగలుగుచున్నాను. మీరు తమిళ ములో దయతో మాట్లాడు ప్రతిమాటయు నాకు తెలియు చున్నది. నాఆత్మ మీలోనేయున్నది. నాభగవానుడా! నాబీదఆత్మను మరువవలదు. స్వామిజీ! యీ నా ఆత్మను దయతో చూచి మీదివ్యమైన చేతులుచాచి నన్ను ఉద్ధ రింపుడు.

స్వామిజీ! మీరు నా ఉత్తరములన్నియు చదువు చున్నారా? అవి కేవలము ఉత్తరములుకావు. అందు నా ఆత్మయొక్క సారము కలదు. వానిని నిర్లక్ష్యము చేయు వద్దు. మీరు వ్రాయు ప్రతిఉత్తరమందును విలువగల మణుల వలె నేను విలువ కనుపర్చు కొన్ని మాటలున్నవి. మరల మీ ఉత్తరము వచ్చువరకు వానినే తలచుకొనుచుందును. స్వామిజీ? మీరు నాపేరు మఱచితిరా?

నాప్రియమైన గురూజీ! నేను ప్రతివస్తువునుండి సంబం ధము వదలుకొని నా దేవుడవగు మీపాదములనే అంటిపట్టు కొనియున్నాను. మీరు నాయందు నిర్లక్ష్యముగానున్న నేను ఎట్లు సహించగలను? నేను ఎల్లప్పుడు మీ ఆధ్యాత్మిక కల యిక కోరుచుండెదను. మీ ఉత్తరములు నాకు అవసరము. మీరు ఉత్తరములు వ్రాయుటలో ఆలస్యమైనచో ఏదియో తెలియని భయము నన్ను బాధించును. నేను ఇచ్చట ఎట్టి

అసహాయస్థితిలో నుంటినో మీరు తెలిసికొనవలసినదని మిమ్ములను ప్రార్థించుచున్నాను. మరియు మీదయ ఎల్లప్పుడు నాయందుంచమని కోరుచున్నాను. నేను ఒకప్పుడు మీదానను. ఇపుడు మరల మీదాననగుదును. అందుకు నేను ఎంతకాలము వేచియుండవలసినను లెక్క చేయను. నేను అందువిషయమై ఎంత పరిశ్రమచేయవలసినను ఎంత బాధ సహించవలసినను లెక్క చేయను. నేను భగవంతునకు శరణాగతురాలను. నాకు మంచి ఏదియో దానిని ఆయనయే చేయగలడు.

నా ప్రభూ! మీరు ఆరోగ్యముగా నున్నారని ఆశించుచున్నాను. గురుపూర్ణిమరోజున మీకు ఎక్కువగా పరిశ్రమ కలుగును. నేను ఆరోజు మీకు పాదపూజచేసితిని. పది మాలల జపముచేసి ప్రతిదానికి ఒక్కొక్క పూవు మీ పాదముల మీద నుంచితిని. నా ఆరోగ్యము మీకు మార్చితిని. మీరు కళ్ళుమూసికొని కళ్ళజోడు పెట్టుకొని తీయించుకున్న ఫోటోకు నేను పాదపూజ చేసితిని. ఆ చిత్రమందు నేను మీ దగ్గరగా నున్నట్లు అనుభవముతో నుంటిని.

నేను మీకు పెద్ద ఉత్తరములు వ్రాయుచుందునేని మీరు నన్ను చీవాట్లు వేయుదురని భయముగా నున్నది. కలము ఆగుటకు ఇష్టపడుట లేదు. ఓ నా ప్రభూ! మీరు ఎంతటి అద్భుతస్వరూపులు! మీరు ఆనందసముద్రులు. నేను మిమ్ము ఎట్లు వర్ణించగలను?

ఇపుడు నేను ప్రాణాయామము చేయనా! ఇపుడు చాల వేడిగా లేదు. ఇపుడు నేను కులాసాగా నుండుటకు ప్రయత్నించుచున్నాను.

ఒక మధ్యాహ్నము మిమ్ములను నేను స్వప్నదర్శనములో చాలకాలము చూచినాను. మీరు పరుపుమీద పరుండియున్నారు; ఏదియో చదువుచున్నారు. అది నిజమైన దృశ్యమా? పరుండినప్పుడు మీరు చదువవలసి వచ్చిన యెడల ఇంకను కొన్నిదిండ్లు తలక్రింద పెట్టుకొనవలెను. అటుల చేయనియెడల అది మీ కంటికి ఎక్కువ బాధను కలిగించును. అది ఉత్తేజవంతమైన దృశ్యము. మీ ముఖము నేను దగ్గరగా చూడగలిగితిని. మీ దివ్యపాదములకు ప్రణమిల్లి ఇంతటితో ఆపెదను.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 43. ఓ ప్రభూ! మీరే నా పూర్ణమైన శరణాగతి

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను మర్యాదతోను మీ పాదకమలములకు ప్రణామములు చేయుచున్నాను.

నా ప్రియమైన ప్రభూ! గత రెండు దినముల నుండియు నాలో ఏదియో జరుగుచున్నది. నా అనుభవములో నున్న ఆనందముతో గూడిన విచిత్రమైన ఉద్రేశములతో పాటు మీతో నుండవలెనను ఆసక్తియొక్క తీవ్రతకూడ వృద్ధియగుచున్నది. మరియు నిరాశ కలుగుచున్నది. రెండు రోజులనుండి నేను ఋషీకేశము విడిచిన రోజుకు పూర్వము నాకు కలిగిన విధముగా నున్నది. మిమ్ములను చూడని యెడల మీ ఆత్మోత్తేజకరమైన మాట విననియెడల హృదయము ఛేదించునట్లున్నది. నా ప్రియమైన ప్రభూ! నాకొరకు దయచేసి ప్రార్థింపుడు. నాకు అంతయు మీరే. ఇచ్చట నేను మీ పాదములయొద్ద నున్నాను. నా కండ్ల ద్వారా నా హృదయరక్తము ప్రవహించుచున్నది. నేను మీరు తప్ప ఇతరమైన ఏ విషయమును ఆలోచింపలేను. నేను దీనిని ఎట్లు జయింపగలను? నేను మీ చేతిలో నున్నాను. నాకు దయచేసి బలమునిమ్ము. అది నన్ను ముక్కలు ముక్కలుగా చీల్చుచున్నది. నేను ఏపనియు చేయలేను. నేను భుజించుటకు ఇష్టము లేదు.

నిద్రపోలేను. నాకు దయచేసి సహాయముచేయుడు. పోష్టు జవాను నాకు ఉత్తరము ఇచ్చినతరువాత నాకు కొంత శాంతిగలుగునని యనుకొంటిని కాని లేదు. అది మామూలు ఉత్తరముకాదు. అది మంచి దయతో గూడిన ఉత్తరమే. కాని నేను దానిలో దస్కతుమాత్రము చూచినాను. మిగతా నాకు అంతముఖ్యముగాదు. ఎందువల్ల? నా ప్రియమైన ప్రభూ! నాకు వ్రాయుట ఎందుకు మానుకున్నారు? నేను మీకు తఱచు వ్రాయుచున్నందుకు కోపగించితిరా? నాభగవానుడా! దయగలప్రభూ! మీ పవిత్రమై ప్రేమమయమైన చేతులతో కొన్నిపంక్తులు వ్రాసిన అవి స్వర్గమునకు లేవతీయును. ఇచ్చట నాకు మనశ్శాంతి నిచ్చునవి అవియే. నేను వానిబలముమీద జీవించెదను. నేను మీ ఉత్తరము చదువునప్పుడు నాఆత్మ ఆపంక్తులవెంట ప్రయాణముచేసి అక్కడనుండు ప్రతి మాటయొక్క ఆనందము ఆస్వాదించుచు నేను ప్రతిఅక్షరము చూడకుండ చెప్పగలను. మీరు ఈ బీద అసహాయురాలగు చెల్లఎల్లప్పుడు ప్రతిఊపిరితో మిమ్ములను తలచుకొనుచుండెడిదియు, హృదయముయొక్క ప్రతిధ్వనితో మీనామమును కంపనముచేయుచుండునదియు ఐనట్టి నాకు నా దేవా! మామూలుప్రకారము వ్రాయకూడదా? అవును; ఎప్పుడు నేను భగవంతుడా అని స్మరించినను అది మీకే చెందును. ఇప్పుడు నేను ఇంకొక దేవుని ఎఱుగను. నా దేవుడు మీలోనే నివసించియున్నాడు. మీరు నా దేవునికి ఉత్తేజమై అందమై తగిన బాహ్యాకవచమువంటి

వారు. భగవంతునియొక్క ఏ ఇతరరూపమును ఇంతగా ఆకర్షించుటలేదు. మరియు ఏరూపము నాకు ఇంత భక్తి కలుగజేయలేదు. నేను ఎల్లప్పుడు మిమ్ములను మీ రూపములోనున్న భగవంతుని ప్రార్థించెదను. మీరు నాకు ఏమి వ్రాసినను అవి సరిగా ఆ భగవంతునిదగ్గరనుండి వచ్చు మాటలని నేను ఊహించెదను. ధ్యానములో మీరూపము మీదనే ధారణచేసెదను. ఎందువల్లననగా నేను ఏకాగ్రతకు ఇప్పుడు ఎక్కువగా కష్టపడనక్కరలేదు. కొంతసేపు బలీయమైన అయస్కాంతమువలె ఆకర్షణకలుగును. తరువాత మీరూపము మీజీవితముయొక్క దృశ్యములు చేష్టలు నామనస్సుకు తట్టును. అప్పుడు చుట్టుఉన్న వస్తువులు ప్రపంచము మఱచెదను. నాధ్యానము తీవ్రమైనప్పుడు మీ రూపము అదృశ్యమగును. మంత్రము మఱచిపోవుదును. మనస్సు ఖాళీయగును. శరీరము తేలికయగును. విశాలమైన ఖాళీస్థలమం దుందును. అచ్చట బహుశా దివ్యశక్తి లేక మీలో నున్నటువంటియు అంతటను నిండియున్నటువంటియు భగవంతునితో కలియుదును. అప్పుడు ఆనందానుభవము కలుగును. అప్పటి ఉద్రేకమును నేను ఎట్లు వర్ణింతును! అది నాశరీరముయొక్క ప్రతి అణువులోను ఆత్మలోను ప్రవేశించును. అప్పుడప్పుడు కొన్ని నిమిషములు నాశరీరస్పృహ తప్పును. కాని దురదృష్టవశాత్తు తక్షణము నేను ఉక్కిరిబిక్కిరి యగుదును. మరియు నాకు శరీరస్మృతి కలుగును. తరువాత కొంతసేపు నేను చాల సంతోషము పొందుదును.

అటుపిమ్మట నా దేవుడగు మీతో శాశ్వతముగా నుండవలె నను సహించరానికోరిక కలుగును. నా ప్రభూ! నాకీసంగతి చెప్పుడు. ఒకవ్యక్తి తనచావును తాను కోరుకొనుటతప్పా? మరణసమయమున ఎట్టి యూహాలుండునో ఆ ఊహాలప్రకారము తిరిగి జన్మవచ్చునని చెప్పుదురు. నేను మీతో నుండవలెనను ఊహతప్ప నాకు వేరొక ఊహ లేదు. కాన తిరిగి ఋషీకేశములో మీయొద్ద పుట్టగల వీలున్నది. మరియు ఆప్రకారము నేను మీయొద్ద జీవించగలను. ఇంతకంటె నాకు వేరుమార్గము కనిపించుట లేదు. నేను ఇందుకు ప్రార్థించనా? మీరు నాకు సహాయము చేసెదరా?

స్వామిజీ! ఇది విపరీతముగా ధ్వనించవచ్చును కాని తరచుగా నా ఆత్మ శరీరములోనుండి బయటకు తప్పించుకొనుటకు తీవ్రప్రయత్నముచేయుట నా అనుభవములో నున్నది. అది ఒకసారి బయటకు వచ్చిన అది పురుషుడు కాదు. స్త్రీ కాదు. లింగరహితము. అది దాని దివ్యమూలము యొక్క మొదటి పవిత్రతతో ప్రకాశించును. అందువల్ల అది స్వేచ్ఛ నిర్భయము కలిగి వెలుతురుయొక్క వేగముతో నడిచి అల్పబుద్ధిగలవారికి కనుపించక భగవంతుని చేరును. ఆయనకు వేడిగానున్నప్పుడు అది విసరును. ఆయనకాళ్లు పట్టును. తన బుగ్గలను ఆ భగవంతుని అలసట చెందిన పాదముల మడమలకు దిండుగాజేసి విశ్రాంతి కలిగించును. దాని శరీరము ఆయనకు చాపవలె నుపయోగపడును. అది ఆయనకు అన్నివిధముల సేవ చేయును. నా

దేవునకీ విషయము తెలియునా? దానికి ఒకటే కోరిక కలదు: ఆయనకు సౌఖ్యము గలుగుటకు అవసరమగు ప్రతి పని చేయుటయే. అవసరమైన ఎట్టి బాధనైన సహించుటకు సిద్ధపడును. ఆ బాధవల్ల ఆయనకు ఏ మాత్రము సుఖము కలిగినను చాలును. దానికి ఎట్టి సుఖమును అవసరము లేదు. ఇది ఆశ్చర్యమైనది విచిత్రమైనది దివ్యమైనది కాదా? ఓ దేవా! ఎప్పుడు నా ఆత్మ పూర్తిగా భగవంతునిలో కలిసి పోవునాయని నేను చాల ఆసక్తితో ప్రయత్నము చేయు చున్నాను. నేను ఈ విధముగా చాలకాలము ఉండలేను.

నేను మీ ఆరోగ్యముకొఱకు ప్రతిదినమును ప్రార్థించు చున్నాను. ఇప్పుడు నాకు ఆత్మలయొక్క ఏకత్వము ధారణ యొక్క ప్రచండశక్తి తెలిసినది గనుక నా పని సులభముగా జరుగును. నెత్తురు (ఇతరులకు) ఇచ్చుటకు బదులు నా ధారణాశక్తి ద్వారా మీకు నా ఆరోగ్యము, జీవనశక్తి నిచ్చెదను. ప్రతిదినము నా ఆరోగ్యమును మీ లోనికి ప్రవహింపజేసెదను. తరువాత నాకు కొంత అలసట కలిగి మీరు నా ఆరోగ్యమును అనుభవించుచున్నారన్న అను భవము విశ్వాసము కలుగుటచే నాకు గొప్ప సౌఖ్యము కలుగును. దయచేసి యీనా పొడుగుపాటి ఉత్తరమునకు నన్ను క్షమింపుడు. నాకిట్లు వ్రాయుట తప్పినదికాదు.

నా సోదరి శివానంద మార్గరిట వ్రాసిన పుస్తకము 'టవరింగు సెయింట్ ఆఫ్ ది హిమాలయాస్' పంపినందుకు ధన్యవాదములు. ఆహా! ఆమె అద్భుతమైన పుణ్యాత్మ. ఆమె

మీకు ఇప్పుడు సహాయము చేయుచున్నట్లు ముందుకూడ చేయుటకు ఆమెకు ఆరోగ్యము దీర్ఘాయుర్దాయము గలుగుటకు భగవంతుని ప్రార్థించుచున్నాను. ఆమె ఒక్కతే మీకు అట్లు సహాయము చేయగలదు. ఆమె త్వరలో వచ్చి మిమ్ము దర్శించుటకు భగవంతుడు ఆమెను దీవించునుగాక. ఆమె అభిప్రాయములు నాకంటె ఎక్కువగా ఇంకెవరికిని తెలియవు. నా ఉత్తరములు ఆమె ఉత్తరములవలె నుండునని మీరు నాతో ఒకసారి చెప్పితిరి. అపుడు నేను వానిని చదివినప్పుడు వానిని నేనే వ్రాసితినని భ్రమించితిని. మా అభిప్రాయములు సమానములు. కాని ముఖ్యమైన భేదమేమనగా నేను హిందూ మార్గములకు అలవాటుపడినందున నా ఆంతరిక ఊహలు కొన్ని కప్పిపుచ్చుకొందును. కాని దానియొక్క పర్యవసానము అపుడపుడు అది బయటపడును. కాని ఆమె స్వేచ్ఛగ ఉన్న విషయములన్నియు తెలియపఱచును.

నా ప్రియమైన ప్రభూ! గురుపూర్ణిమ దినమగు 5వ తారీఖున మీ పాదములకు సమర్పించుటకు నేను 108 రూపాయలు ఇపుడు పంపుచున్నాను. దయచేసి స్వీకరింపుడు. ఆ రోజున పగలు 11 ఘంటలకు నేను మానసికముగా పాదపూజ చేయుచుందును. మృత్యుంజయ మంత్రము 10 మాలలు జపించెదను. ప్రతి మంత్రముతో మీ పాదములకు పుష్పములు సమర్పించెదను. ఆ సమయమందు దయచేసి కొన్ని క్షణములు నా విషయమై ఆలోచింపుడు. 5వ తేదిన

తమయింట ఉత్సవము చూచుటకు స్వామి వేంకటేశానందజీ నన్ను పిలుచుటకు వచ్చియుండెను. నేను అక్కడకు వెళ్ళి శరీరమును అచ్చటవదలి ఆత్మతో మీ దగ్గరకు వచ్చెదను.

మిసెస్ సీతారాం ఇపుడు ఇచట నున్నది. ఆమెను కలసికొంటిని. మరియు మిసెస్ సాంబశివరావును తరచుగా కలిసికొనుచుందును. నన్ను చూడమని మీరు వారికి చెప్పి నందుకు మీకు ధన్యవాదములు. 5 వ తేదీ ఉత్సవమునకు వారినికూడ తీసికొని వెళ్లెదను.

నా కుమార్తె ఆనందవల్లి మీ పాదముల సన్నిధికి 10 రూపాయలు పంపుచున్నది. దయచేసి స్వీకరింపుడు.

స్వామిజీ! రోజంతయు నేను వ్రాయగలుగుదును. కాని యిపుడు ఆపెదను. దయచేసి నా ఉత్తరములు చదువుడు. నేను మీకు మూడు ఉత్తరములు పంపినాను. నాకు మీకంటె ఎవ్వరును లేరు. మీ పవిత్రపాదములకు ప్రణామములు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 44. ఆనందమయమగు దివ్యనామము

గురూజీ! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

భక్తితో మరియు ప్రేమతోను మీ దివ్యపాదములకు వందనములు చేయుచున్నాను.

మే నెల తాలూకు నా దినచర్య దీనితో పంపుచున్నాను. ఆలస్యమునకు క్షమింపగోరుచున్నాను. స్వామిజీ! నేను ఏమి చేయగలను? ఈరోజులలో నేను ఒంటరిగాను మరియు పతితనుగాను ఉన్నాను. నేను మీకు ఫిర్యాదు చేయుటకాదు. కాని నాకు ఈ ఊహ పోవుటకు మీరు దయ చేసి, యేదైన సలహా యివ్వరా? నేను దానిని ప్రత్యేక ఉద్దేశముతో చేయుదును. నేను భగవంతునిదగ్గర లేకున్నాను. నేను ప్రభువు సుబ్రహ్మణ్యుని ఆరాధించుచున్నాను. కాని ఆయన నడతలో శ్రీకృష్ణునివలె నడుచుకొనుచున్నాడు. ఆయన అకాలములందు కనబడి తన మృదువైన రూపమును కనుపరచి నాకు ఉద్రేకము ఆనందము కలుగజేసి తన దివ్య ప్రేమనుచూపి, నేను మనస్ఫూర్తిగా తన్ను కోరు సమయమున హఠాత్తుగా అదృశ్యమగును. నన్ను హేళన చేయుటలో ఆయన ఆనందించును. బహుశా తాను నివసించుటకు నా హృదయము ఇంకను పరిపక్వము కాలేదని ఊహించును కాబోలు. కాబట్టి యిప్పుడు నేను ఆయన శాశ్వతముగా నివసించుటకు వీలుగా నా హృదయకుహరమును శుభ్రపరుచుటయందు శ్రద్ధవహించి ఆపని చేయుచున్నాను. అవును

స్వామిజీ! నేను ఇప్పుడు ఆయనను ఎక్కువగా కోరుచున్నాను. వారు లేని ప్రతివిషయము నేను సహించలేకయున్నాను. నా మనస్సును నేను విడుచుటలేదు. అది నన్ను మోసపుచ్చుటకు ప్రయత్నించునప్పుడు లేక నా అంతరాత్మకు అవిధేయత కనపడుచినప్పుడు నేను దానితో పోరాడుచున్నాను. ఓ స్వామీ! భగవంతుడు నాయందు ఎప్పుడు దయ చూపించును? నేను చేసియుండిన చేష్టలకు ఆయన నన్ను ఎప్పుడు క్షమించును? నేను నా జీవితమంతయు ఈప్రకారము కష్టపడవలసియున్నను ఆయనను విడువను. నేను ఆయనను తప్పక చేరెదను.

ప్రభూ! దయచేసి ఈప్రకారము తలచుచుగా వ్రాయుచున్నందుకు నన్ను క్షమింపుడు. నా జీవితమున నాకు శాంతిని కలుగజేయువారు మీరే. ప్రపంచసంబంధముగా నాకు సంతోషము సౌఖ్యము కలుగజేయు వస్తువులన్నియు ఉన్నవి. కాని అన్నిటికంటె ముఖ్యముగా నుండవలసిన అవసరమగు వస్తువు దూరముగానున్నది. దయచేసి నేను మీకు ఇచ్చు శ్రమకు నన్ను క్షమింపుడు. తమ పవిత్రపాదములకు ప్రణామములు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 45. మీరు నా ఆత్మను ఉద్ధరించితిరి

ప్రేమతోను భక్తితోను మీ పవిత్ర పాదములకు చేయు దీనమైన ప్రణామములు దయతో స్వీకరింపుడు. రెండు రోజులనుండి మీ ఉత్తరము వచ్చునని నిరీక్షించు చుంటిని. కాని నిరుత్సాహము పొందితిని. నేను వ్రాసిన 3 ఉత్తరములు, నా ఆధ్యాత్మిక దినచర్య, నా లిఖితజపము, వేరుసెనగగింజల పొట్లము మీకు అందియుండునని ఆశించె దను. ఇపుడు నాకు సంతోషముగా నున్నది. వారమునకు ఒకసారి నా హృదయములో నున్న విషయములన్నియు తెలియపఱచుటచే నేను ఇదివరకుకంటె బాగా ధారణ చేయగలుగుదు ననుకొనుచున్నాను. నేను అట్లు చేయ గలనా? నేను మీకు బాధకలుగ జేయుచుండిన ఆ విషయము నాకు తక్షణము తెలుపవలెను. మిమ్ములను ఏ విధముగా కూడ బాధపెట్టకుండుటయే నా ప్రత్యేక వాంఛ.

ఓ నా దివ్యగురూ! మీకు ఏదియో ఒకటి చేయు చుండవలయును. మీయొద్దనుండి ఉత్తరము రాకపోయినను నేను మీతో కలిసియున్నట్లుగా నాకు తోచుచున్నది. మరియు ఇప్పుడు నేను నిర్మలమైన మనస్సుతో నుండగలిగి తిని. ఈ ప్రకారము నేను ఎంతవరకు నుండగలనో నాకు తెలియదు. కాని నా శక్తికొలది ప్రయత్నము చేయు చున్నాను. గురుదేవా! నేను ప్రపంచసౌఖ్యములు కీర్తి అధికారము మర్యాద భాగ్యము కోరను. మీ దగ్గరనుండి

క్రమముగా కొన్ని దయగల మాటలతో నా మనస్సు పూర్ణమైన సంతోషముతో కూడిన తృప్తిగల స్థితిలో నుంచుటయే కోరుకొనుచుందును. ఓ మహారాజా! నేను ఎక్కువగా కోరుచుంటినా? నేను అందులకు అర్హురాలను కానా? మీకు నా హృదయము తెలియదా? మిమ్ములను భగవంతుని యొక్క ప్రకటితరూపమని నేను చేయునదంతయు నాకు తెలియును. మీరు నేను బాధపడునట్లు చేసినను అది నా మంచికొరకే జరుగును. నేను బాధపడవలసినయెడల నేను ఆ ప్రకారము చేయుట మీ ఆజ్ఞప్రకారము మీకు సంతోషము కలుగుటకు జరిగినయెడల అదికూడ మీరు నాకు ఇచ్చు దీవనయే. కాని అట్టి సమయములందు నేను బాధ అనుభవించుటకు తగిన బలమునిచ్చి సహాయము చేయుడు. అట్టి శక్తిని మీరు నాకు పంపగలరని నాకు నమ్మకము గలదు. మీ పాదముల దగ్గర శరణాగతనైన నన్ను దయచేసి నిర్లక్ష్యము చేయకుడు. నేను ఏదైన తప్పుచేసిన నా తప్పులు నాకు కనపఱచుడు. కాని నన్ను హీనముగా శిక్షించవద్దు. మిమ్ములను ప్రార్థించుచున్నాను. అది నా మనస్సుకు బాధకలిగించి నా సాధనకు ఆటంకము కలిగించును. నేను నా గురుదేవునకు నా లోటుపాట్లు అన్నియు వ్రాసి తెలియపఱచుటకు నాకు స్వేచ్ఛగలదని ఊహించుచున్నాను. ఆ ప్రకారము చేయకూడనియెడల ఆ విషయమై నాకు తెలుపగోరుదును. మీ ఆజ్ఞలను శిరసావహించుటకు ఎల్లప్పుడు సిద్ధముగా నున్నాను. రోజంతయు నా ప్రభువు

వద్దకు చేరుటకు తగినస్థితి గలుగుటకు ప్రయత్నము చేయు చున్నాను. ఓ ఆనందస్వరూపా! మీ రక్షణలోను శిక్షణ లోను నన్ను ఉంచుకొనుడు. నా తప్పులన్నియు మన్నిం పుడు. నా ఆత్మశక్తి మీలో ఎల్లప్పుడు కలిగియుండునట్లు చేయుడు. ఇపుడు మీ దివ్యశక్తిలో పళని ఆండవన్‌ను నేను ప్రత్యక్షముగా చూచి గుర్తుపెట్టుకొనుచున్నాను. ఆయనయే మీ కండ్ల ద్వారా నన్ను చూచుచున్నాడు. ముఖము ద్వారా నాతో మాట్లాడుచున్నాడు. మీ చేతుల ద్వారా నాకు వ్రాయుచున్నాడు. అయస్కాంతమువలె నా ఆత్మను నా శరీరమునుండి లాగుచున్నాడు. ఆయన నా శరీరములోకూడ నున్నట్లు నాకు తెలియును. కాని నేను ఆయనను నాలో చూచి తృప్తిపడునట్టి ఉచ్చస్థితికిరాలేదు. నేను ఆ ప్రకారము ధ్యానముచేయునపుడు అట్టి తీవ్రమగు భక్తి నాకు గలుగుటలేదు. నన్ను మీలో ఆయనను చూడ నిండు. మీలోనే పూజింపనిండు. మీలో ఆయనతో నిమగ్నము కానిండు. మిమ్ములను పూజించుటచే నేను ఆయనను అనుభవమునకు తెచ్చుకొని తరింపలేనా? నేను వ్రాసిన విషయములకు దయచేసి జవాబు వ్రాసి నా సందే హములు తీర్చండి. ధ్యానసమయమందు నా ఆత్మ పైకి లేచునపుడు మీ శక్తియొక్క ఆకర్షణను నేను కనిపెట్టు దును. మరియు నన్ను పైమెట్టుకు తీసికొనిపోవుటలో సహాయపడు తమ దివ్యశక్తిని చేరుటకు నా ఆత్మ తీవ్రముగా కోరుచుండును. నేను విశ్వదివ్యశక్తితో కలియుట మీ శక్తిద్వారానే కలుగునని ఊహించుచున్నాను.

నేను ఏదయిన మంచిపని చేయునపుడు లేక యితరులకు సహాయము చేయునపుడు మీరు నాకు సహాయము చేయుచున్నట్లు నాకు తెలియును. మరియు అందుకు మీకు కృతజ్ఞతతో ధన్యవాదము లర్పించుచున్నాను. ఈరోజులలో నాకు గలుగు నిర్మలమైనభక్తి చాల ఉత్కృష్టమైనది. అది వర్ణనాతీతము. ప్రపంచసౌఖ్యము, పదవి మరియు భాగ్యము లేకుండ ఈప్రపంచములో నేను ఎట్లు సౌఖ్యముపొందగలనో దానిని నాకు మీరు బోధించితిరి. నేను మీయందు తక్కువ భక్తిని ఎట్లు కలిగియుందును? నేను ఎక్కడకు వెళ్లినను ఏది చూచినను ఏది అనుభవించినను అవి అన్నియు మీకు సంబంధించినవిగానే నాకు కనిపించుచున్నవి. నేను ఎల్లప్పుడు మీదగ్గరనే తిరుగుచు అన్ని పనులయందు మీసలహా ప్రకారము చేయుచున్నట్లు నాకు కనిపించుచున్నది. తరచు మీ చర్యలు నేను స్మృహకు తెచ్చుకొనునప్పుడు చుట్టునుండు విషయములన్నియు మరచి పూర్తిగా మీయందే మగ్నమై కూర్చొందును. నిజముగా గొప్ప శక్తివంతమయిన దివ్య అయస్కాంతమే మీరు. మీ ఆశ్చర్యమైన సంపుటీకరణ దివ్యశక్తి నాశనముచేయు స్వభావముగల ఆటంబాంబు శక్తికంటెను చాల బలవత్తరమైనది. ఓ దివ్యగురూ! నా ప్రియమైన ప్రభూ! మీలో నా మురుగనును పూజించుటకు నేను విసుగుచెందను. నాకు ఆయన మీరు ఏకమైతిరి. మరియు నేను నాశక్తిని మీలో కలుపగోరుచుంటిని. అది దివ్యమనోరథముగదా! అది సరియైనకోరిక కాదా? నేను

దాపరికము లేకుండ నా ఊహాలన్నియు మీకు తెలియజెప్పి తిని. నా ఉద్దేశములు ఏవైన తప్పుగానున్న దయచేసి నన్ను చక్క-దిద్దుడు.

16-వ తేది స్వామి వేంకటేశానందజీ జన్మదినమను సంగతి చాల ఆలస్యముగ నాకు తెలిసినది. అయినను వారి తండ్రి వారి నిజమైన జన్మదినము వచ్చే నెల 12-వ తేదీన అని నన్ను ఓదార్చిరి. ఓ గురుదేవా! వారు నిరాడంబర ప్రేమకు వినయమునకు స్వరూపమువంటివారు. తమ గొప్ప గురువును అనుసరించుట ఆయన బాగా నేర్చుకొనినారు. మీకటాక్షము ఎల్లప్పుడు అందుటకు భగవంతుడు ఆశీర్వ దించునుగాక! మరియు దీర్ఘాయువు, మంచి ఆరోగ్యము సంపద మరియు తమ గురువువలె ప్రత్యేకజీవితము గడప గలశక్తిని భగవంతుడు వారికి ప్రసాదించునుగాక! ఇదియే నా హృదయపూర్వకమైన ప్రార్థన. దయచేసి యీ నా ఉద్దేశమును వారికి దయతో తెలియజేయుడు.

నేను చాల పెద్ద ఉత్తరము వ్రాసినానని నాకు తెలి యును. కాని నేను వ్రాయక తప్పినది కాదు. దయచేసి నా ప్రశ్నలన్నిటికి సవివరమగు జవాబులు పంపగోరుచున్నాను.

నేను సేలం దివ్యజీవనసమాజ సమావేశమునకు వెళ్ల వలెనని ఊహించుచున్నాను. కాని చివరినిమిషమందు ఆ కోరిక విడిచిపెట్టవలసివచ్చినది. మాహినుండివచ్చిన కేసులో నేను ఆపరేషను చేసిన గ్రుడ్డికన్ను ఇంకను దురద పెట్టుచున్నది. మరియు నేను మూడురోజులవరకు గ్రామ

ములో నుండనని తెలిసి వారు చాల ఆదుర్దాపడుచున్నారు. కనుక కాన్ఫరెన్సుకు వెళ్లుటకంటె నారోగిని చూచుట యెక్కువ ముఖ్యమైన కర్తవ్యమని నాకు తోచినది. కాబట్టి నేను వెళ్లలేదు. నేను సరియైనపని చేసినానని ఊహించుచున్నాను.

ఇంక తమ దివ్యపాదములకు ప్రణామములు చేయుచు ఆపివేసెదను. నాకు క్రమముగా జవాబులు వ్రాయుచుండుడు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 46. నేను తమకు బాధ్యురాలను

ప్రియమైన గురుదేవా! నా విలువగల ప్రభూ! నా ప్రత్యక్ష మురుగా! నేను మీకు ఈరోజున-సంవత్సరాది రోజున-వ్రాయక తప్పినదికాదు. నాహృదయము నిండి యున్నది. నేను మిమ్ము ఎల్లప్పుడు తలచుచుందును. గత సంవత్సరములో మీరు నాకు చేసిన మేలున కంతటికిని సంతోషము, కృతజ్ఞత-వీనివలని ఆనందబాష్పములు నా కన్నులనుండి ప్రవహించుచున్నవి. నిండువిచారముతో కూడిన కన్నీళ్లుకూడ కారుచున్నవి. ఎందువల్ల ననగా నేను మిమ్ములను చూడవలెనని కోరుచున్నాను. ఈరోజున ఆ ఎడబాటు బాధ ఎక్కువగా నున్నది. ఈ అసహాయ ఆత్మ చేయకలిగినదంతయు మిమ్ములను ధ్యానము చేయుటయు మీకు పూర్ణమైన ఆరోగ్యము సంతోషము సంపద దీర్ఘాయువు తక్కిన సమస్త సత్సంపద కలుగునట్లు ప్రార్థించుటయు మాత్రమే. గతరాత్రి నేను అర్ధరాత్రి (12 గంటల) వరకు ధ్యానము చేసితిని. ఆ కాలమంతయు నేను మీదగ్గర నే యుంటిని.

ఆస్ట్రేలియా దేశపు భక్తుడగు డాక్టరు వర్థర్ గారు ఇచ్చటనే యున్నారు. శ్రీనివాసజీ దయతో ఆయనను నా ఆసుపత్రికి వారు వచ్చినరోజుననే తీసికొనివచ్చినారు. శ్రీని వాసజీ వారికి సంతోషము కలుగునట్లు నిస్వార్థభావముతో పనిచేయుచున్నారు. వారికంటె ఆప్రకారము చేయువారు

ఇంకొకరులేరు. దీనినిబట్టి వారియొక్క గౌరవస్వభావము మీయందుగలభక్తి తెలియుచున్నది. ఇది నాకు వారియందుండు గౌరవమును వృద్ధిపరచినది.

నేనును వారు సంతోషముగానుండుటకు నేను చేయగలిగినంత చేయుచున్నాను. డాక్టరు చెట్టన్ కూడ తమ కటాక్షమువలన తాము చేయుదగినసాయము చేయుచున్నారు. డాక్టరు వర్థర్‌గారికి మీయందుగల భక్తి అద్భుతము. ఈకారణమువల్ల నేను వారిని నాబంధువువలె ప్రేమించుచున్నాను. మా జీవనవృత్తి ముగిసినతరువాత మేమును మా పాతకారును వారి యిష్టప్రకారము ఉపయోగించుకొనుటకు తయారుగా నున్నాము. మొదటిదినము శ్రీనివాసజీ మమ్ములను శ్రీ రాధాకృష్ణన్ యొక్క ఉపన్యాసము వినుటకు తీసికొనివెళ్లినారు. తరువాత వారు అక్షయాదు తియసాఫిక్‌లాడ్జికి వెళ్లవలెనని కోరినందున వారిని అక్కడికి తీసికొనివెళ్లినాము. మరుదినము సాయంత్రము వారిని నా ముఖ్యస్నేహితులు భక్తులు (శ్రీనివాసజీ వారి భార్య, డాక్టరు కృష్ణారావువారి భార్య, మిసెస్ సాంబశివరావు, శ్రీ సూర్యనారాయణ అయ్యరువారి కుటుంబము) కలసి భజన, కర్ణాటకసంగీతము తేనీటివిందు-వీనికి తీసికొనివెళ్ళితిమి. అయినావరము దివ్యజీవనసమాజ అధినేతయగు శ్రీ సూర్యనారాయణ అయ్యరుగారు ఆ సంగీతసమావేశము ఏర్పాటుచేయుటలో చాల సహాయపడిరి. వారికుమార్తె సంగీతపరీక్షలో ఉత్తీర్ణురాలయినది. ఆమె తగుహాంగులతో

పాడినది. సంగీతసభ జరుగుచుండగా నేను భక్తితో పూజ నిమిత్తము ఉంచిన తమ చిత్రమును డాక్టరు వెర్ థర్ గారు చాల గౌరవముతో చూచుచుండిరి. నేను వారికి ఇచ్చిన భారతీయ ఫలాహారములు వారు ఆరగించిరి. తరువాత తాము శ్రీరంగ రామానుజ అయ్యంగారి యింటియందు ఏర్పాటు చేసిన వీణకచ్చేరికి శ్రీనివాసజీ మమ్ములను తీసికొని వెళ్లిరి. నిన్న వారు బజారుపని చూచుకొనవలెనని కోరుట వలన వారిని అందుకొరకు తీసికొని వెళ్లితిని. వారు ఒకానొక హిందూ కాఫీహౌసునకు వెళ్లవలయునని కోరిరి. వారిని అచ్చటికిగూడ తీసికొని వెళ్లితిని. ఈ ఉదయము మిసెస్ సాంబశివరావు వారిని మీ భక్తులు కొందరిని పూజనిమిత్తము తమయింటికి తీసికొని వెళ్లెను. అచ్చట పూజ భజన లేకాక తినుటకు సమృద్ధియైన తినుబండారములు పెట్టిరి. తరువాత డాక్టర్ వర్ థర్ తమకండ్లు పరీక్ష చేయవలసినదిగా నన్ను కోరిరి. నేను పరీక్ష చేసి వారికి అవసరమగు అద్దములు పురమాయించితిని. వారిదృష్టి మామూలుగ నుండవలసిన స్థితిలో లేదు. ఎందువల్లననగా రెండుకండ్లలో పువ్వులు వేసియున్నవి. మధ్యాహ్నము నేను హిందూఫలాహారము పెట్టితిని, అందులకు వారు సంతోషించిరి. సాయంత్రము ఆయన పుదుచ్చేరికి వెళ్లనైయున్నాడు. ఋషీకేశములోను మద్రాసులోను అతడు తనయింట నున్నట్లే సంతోషించెను. ఋషీకేశములో కొంతభాగము మద్రాసులో నున్నదికదా! ఓ గురుదేవా! మీరు ఆశ్చర్యకరమైనవారు. విచిత్రపురు

షులు. నాకు ఆండవర్ (భగవంతుడు) ఇచ్చిన బహుమతియే మీరు. ఆయన మీద్వారా నన్ను కటాక్షించుచున్నాడు. నేను మిమ్ములను వెదకుటకు, మీసేవ చేయుటకు ఈ ప్రపంచములో పుట్టితిని. అయినచో నన్ను ఇట్లు మీదగ్గరనుండి దూరముగా నుంచుటకు కారణమేమి? నాజీవితము ఇంత చిక్కుగా ఎందులకున్నది? భగవంతుడు ఎందుకు ఇన్ని చిక్కు బాధ్యతలు అప్పగించెను? ఇన్ని ప్రపంచపు వ్యవహారములను భగవంతుడు నాకు ఎందుకు ఏర్పాటు చేసెను? భగవంతుడు నా హృదయపూర్వకమైన ప్రార్థనలు వినుట లేదా? గురుదేవా! మీరు నన్ను త్రోసిపుచ్చలేరు. దివ్యము పవిత్రము బలీయమునైనశక్తితో నేను మీతో కలిసి యుందును. నన్ను మీరు త్రోసిపుచ్చలేరు. మీరు ఎచ్చట నున్నను అచ్చట నన్నుకూడ మీతో ఉంచుకొనవలసినదే. మీరు నాశరీరమును పంపివేయగలరుగాని నా ఆత్మను పంపివేయలేరు. నా ఆత్మ ఎల్లప్పుడు మీ అధీనములోనే యుండును. అది భగవంతుని యిచ్ఛ. ఆండవను నన్ను మీకు అప్పగించినాడు. ఇప్పుడు నేను మీ అధీనురాలను. మరియు ఎల్లప్పుడు అట్లే యుందును. మీరు ఇందుకు ఒప్పుకొనెదరా?

గురుదేవా! నేను ఇంక ఆపెదను. మీ పవిత్రపాదములకు ప్రణామములు. ఎల్లప్పుడు నాయందు ఉండి నన్ను దీవింపుడు.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లో.

# 47. మౌనము యొక్క దివ్యభాష

ప్రేమ భక్తి కృతజ్ఞతలతో నిండిన హృదయముతో తమ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. పవిత్రము, ప్రేమమయము, కరుణార్ద్రమునగు 5 వ తేదీగల తమ ఉత్తరము అందినది. గురుదేవా! దివ్యప్రభూ! నేను ఏమిచేయవలెనో నాకు తెలియుట లేదు. సంతోషములోను కృతజ్ఞతతోను నేను మౌనము వహించియున్నాను. మీకు ప్రణామము లొనర్చుటకు సయితము నాకు శక్తిలేకయున్నది. నా హృదయము మీతో మాట్లాడుచున్నది. హృదయ భాషతో తెలుపవలసిన విషయములు కొన్ని యుండును. మీరు నాకు నేర్పిన దివ్యమౌనభాషతో మీకు తెలుపవలసిన అపూర్వము అందమునయిన ఊహాలలో ఇది యొకటి. భయముతో కూడిన భక్తి ప్రకటింపలేని ఆనందము ఆశ్చర్యముగాను అద్భుతముగాను నా శరీరమంతటను నిండియున్నది. నేను ప్రార్థించుట జీవించుట వృథా కాలేదు. నా మురుగన్, నా సొంత పళని ఆండవన్, అన్నివరముల నిచ్చు దేవుడు, నా ఉద్దేశములన్నిటికి అదృశ్యసాక్షిగానుండు ప్రభువు, భగవంతునియొక్క ఆకర్షణీయమగు రూపమునైన తండ్రి నన్ను ఆశీర్వదించుటకు నిజముగా వచ్చెను. నేను ఆయనకు దాసినను. నేను ఆయనకు సేవచేయుట తప్ప ఇంకేమియు కోరను. ఆయన నాకు చేసినదానికి నేను తగు ప్రతికారము చేయలేను. నా ప్రియమైన స్వామీ! ప్రతి విషయములోను

మీ యిష్టప్రకారము నా శక్తికొలది పని చేయుటకు నేను మీకు వాగ్దానము చేసెదను. తమ బిడ్డలకు సేవచేయుటకు నాకు అవకాశము నిండు. మీరు నా చేతులు కట్టివేసితిరి. వానిని మీ యిష్టప్రకారము ఉపయోగించుకొనుడు. నేను ఏమి చేయవలెనో నాకు ఉపదేశింపుడు. నాకు అంతర్దృష్టి కలుగజేయుడు. నామీఁద ఆధారపడువారికి కష్టము కలుగకుండ మిమ్ములను ఎట్లు సేవింపగలనో నాకు తెలియపఱచుడు. నేను మీకు సేవచేయుటకు చాల ఆసక్తితో నున్నాను. నాకు ప్రపంచసౌఖ్యములు అక్కఱ లేదు. నేను కోరునది ఒక్కటే. దానిని మీరు నాకు ఇచ్చినారు. నేను ఇంక నేమియు అడుగను. అది ఎల్లప్పుడు నాకు దక్కునట్లుగా నన్ను రక్షించి అనుగ్రహించవలెను.

ప్రియమైన గురుదేవా! నేను ఇక్కడ నున్నానుగాని ఇక్కడ లేను. నా శరీరము నా మనస్సు నా బుద్ధి పని చేయుచున్నవి. ఇవన్నియు ప్రపంచకర్తవ్యములో పాల్గొని యున్నవి. ఆ పనులను భగవంతుడు నాపైన వేసియున్నాడు. నేను ఎచ్చట నున్నాను? అనగా నా దివ్యఆత్మ నా ఆత్మ ఎచ్చటనున్నది? అది ఎల్లప్పుడు నా ప్రియుడు, నా హృదయమునకు ప్రభువు అగు వానితో కలిసియున్నది. అవును, నేను ఎన్నిపనులలో నిమగ్ననై యున్నను ఆ కాలమంతయు నా అంతరాత్మ నా భగవంతుని యొద్దనుండును. ఆయనతో సంభాషించుచు, ఊహింపలేని ఆనందము అనుభవించు చుండును. మరియు నాజీవితమంతటిలో అనుభవించని విషయ

ములను అనుభవించుచుండును. ఇది ఆశ్చర్యమైన విషయము. మాటలకు అతీతము. ఊహాలకు అతీతము. గత కొన్ని దిన ములనుండి యితరులనుండి దూరముగా ఒంటరిగానుండి నేను సంతోషముతో ఆనందబాష్పములు కార్చుచుంటిని. ప్రియ మైన ప్రభూ! నన్ను ఎల్లప్పుడు ఇట్టి సంతోషముతో ఈ ప్రపంచమం దుంచవలసినదిగా కోరుచున్నాను. మీతో నుండు స్వర్గీయమైన యీ కలయిక ఎల్లప్పుడు ఎట్లు నిలుపు కొన కలుగుదునో ఆ విషయము దయచేసి నాకు బోధింపుడు.

నాకు ఈ ప్రపంచమంతయు మీలో కేంద్రీకరింప బడినట్లు కనిపించుచున్నది. మీ దివ్యకర్మలకు భక్తియు మరియు గౌరవము ఎల్లప్పుడు నా హృదయములో నివసించు చున్నవి. మంచితనము, మర్యాద ప్రేమ – వీనికి మీరు మూర్తీభావము. ఇన్ని సంవత్సరములు మీ యొక్క కల యిక లేకుండ నేను ఎట్లు జీవించితినో నేను ఊహించ లేక యున్నాను. నా జీవితమంతయు మిమ్ములను కలిసికొనుటకు ప్రయత్నమువలె కనిపించుచున్నది. కాన జీవితము ఇంకను పూర్తికాలేదనుట ఆశ్చర్యకరమైన విషయము కాదు. మీతోడికలయిక లేకపోవుటయే నేను ప్రపంచసుఖములు కోరుటకు కారణమైనది. ఇప్పుడు మీ కటాక్షము తప్ప ఇంకేమియు నాకు అవసరము లేదు.

ఓ నాప్రియమైన గురుదేవా! ఇప్పుడు సంతోషముగా నున్నాను. నేను నారోగులను ప్రేమతోను ఆదరణతోను చూచుచున్నాను. మరియు నాయింటి పనులుకూడ చూచు

కొనుచున్నాను. కాని యీ కాలమున మీ దివ్యవిగ్రహము ఎల్లప్పుడు ఇచ్చట ఈలోపల కనిపించుచుండును. నేను మీతో ఎల్లప్పుడు మాట్లాడుచుందును. మరియు మీరు నామాటలు వినుచున్నారని నాకు తెలియును. నేను అట్టి ప్రశాంతమైన ఆనందము అనుభవించుచున్నాను. తృప్తివల్ల నాకు మిక్కిలి సౌఖ్యము గలుగుచున్నది. అది వర్ణింప వీలు లేనిది.

ఓ నా ప్రియతమా! నా గురుగా! నా ప్రభూజీ! గురుదేవా! మీకు నేను ఏమిచేయను? మీరు నాయందు గలుగ జేయు సౌఖ్యము విషయమై మీరు గ్రహించలేరు. నేను చేయు పనివిషయమై నాకు అనుజ్ఞయిండు. నేను ఇప్పుడు ఎవరివిషయమునను భయపడను. నేను మిమ్ములను సంతోష పెట్టుటకు ఇతరులయెడ అవిధేయత కనపరచుటకైనను సిద్ధముగా నున్నాను. మీ ఆజ్ఞలు దివ్యమైనవి. అవి నా మంచికొరకును ఇతరుల మంచికొరకును నయినవి. మీకు సంతోషము కలుగజేయుపని ఏదైన చేయుటకు అనుజ్ఞయిండు. అది ఎంత కష్టమైనదైనను నేను దానిని చేసెదను. నా ఆత్మకు ప్రభూ! మీకు ఎంత తెలివియున్నను మీయందు నాకుగల భక్తియొక్క లోతును మీరు గ్రహించలేరు. అది చాలగొప్పది. చాల తీపిగలది. పవిత్రతయందు చాల దివ్యమైనది. మీ హృదయమున ఇతరులయెడ కరుణతో గూడిన స్పందనములు గలిగినపుడు నేనుగూడ వానిలో పాల్గొందును. ఎందువల్లననగా నేను మీ స్పందన

ములకు శీఘ్రగ్రాహినై యుందును. మరియు అవి ఏవైపు నకు వెళ్లుచున్నను నేను వానిని పట్టుకొనగలను. మరియు నేను ఎల్లప్పుడు మీతో తాదాత్మ్యము పొందుచుందును. కనుక అవి యితరులను చేరుటకు నాద్వారా వెళ్లవలసి యున్నది. మీ హృదయము ఎవరివిషయమై కంపించినను అది నన్నుకూడ కంపింపజేయును. ఇది సంభవమే కాదా? నేను ఆత్మయొక్క ఎడతెగని స్థిరత్వమును తెలిసికొనినప్పుడు నేను ఊహించుఊహ భ్రమ కానేరదు. అది నిజముగా జరుగు చుండెడి కార్యము. బహుశా ఇదియే నాకు ఈర్ష్య లేకుండు టకు కారణమైనది. ఇదియే దివ్యప్రేమకు ప్రపంచప్రేమకు అంతరము తెలుపుచున్నది. అంతదూరముననున్నను దగ్గ రనేయున్నాను.

ఆధ్యాత్మికవిద్యయందు నేను ఇంకను ప్రారంభదశ లోనే యున్నాను. నేను నిశ్చయించుకొన్న జాగ్రత్త కలిగి యున్నను, నాకు తెలియకుండ కొన్నితప్పులు చేసియుందును. కాని నేనుచేయునది ఊహించునది ఏమియు దాపరికము లేకుండ దానివిషయమై మీరు ఏమి అభిప్రాయపడుదురో అనువిచక్షణ చేయకుండ అంతయు మీకు తెలుపుచున్నాను. నేను తప్పుచేసినయెడల దయచేసి సవరణ చేసికొనుటకు నాకు సలహాయివ్వవలెను. కాని ఈ తప్పులవలన నన్ను మీ దయకు అపాత్రురాలనుగా చేయవలదు. ఇదియే నాహృదయ పూర్వకమైన కోరిక. మీకటాక్షము లేనియెడల నాజీవితము ఖాళీ; బాధకరము. దానిని నేను సహించలేను. అది నా

చేతిలో లేదు. అది మీద్వారా నాపై వర్షించు నా మురుగని యొక్క కటాక్షమైయున్నది. మీలోనున్న మురుగనునకు నేను ప్రకటితహృదయముతో మనవి చేసికొనుచున్నాను. నేను నాజీవితము ఆయనకు అర్పించితిని. ఆయన నాకు విధించిన పని చేయుటకు నేను ఇచ్చటనున్నాను. ఆయన చేయు పనియందు ఏదో ఒక కారణముండును. కాన నేను చేయు ప్రతిపనియు ఆయునకును మీకును కానుకగా చేయుచున్నాను. నామనస్సు ఎల్లప్పుడు మీద్వారా ఆయనయందే లగ్నమై యుండును. సరియైన సమయమున ఆయన నన్ను నాకర్తవ్యములనుండి విడుదలచేయును. అందుకు నేను వేచియున్నాను.

ప్రియమైన ప్రభూ! మేము ఋషీకేశము మార్చి ఏప్రిల్ నెలలలో వచ్చెదము. మీ యొద్దకు వచ్చుటకు రోజులు లెక్కపెట్టుకొనుచున్నాను. నాకండ్లు మిమ్ము చూచుటకు ఆసక్తి నొందుచున్నవి. నా చెవులు మీ మాటలు వినుటకు, నా చేతులు మీకు సేవచేయుటకు ఆసక్తి పడుచున్నవి. మేము అచ్చట ఒక నెల రోజులుండుటకు ఊహించుచున్నాము. తరువాత భగవంతుని దయ. మేము అక్కడ నెలరోజులుండుటకు వీలుండునా? నేను అక్కడకు వచ్చినప్పుడు మిమ్ములను అడుగవలసిన ప్రశ్నలు చాలా ఉన్నవి. నా ప్రయాణమునకు అడ్డంకులు ఏమియు కలుగకుండ మీరు దయతో చూడవలెను.

మీ నడుమునొప్పి యెట్లున్నది? నేను ఇచ్చటనుండి ఆధ్యాత్మికముగా మీకు మర్దనము చేయుచున్నాను. మీకు

అది అందుచున్నదా? మీరు ఇపుడు కొంత స్వస్థతగా నున్నారా? దయచేసి తెలియపర్చవలెను. నేను చాల పెద్ద ఉత్తరము వ్రాసితినని భయపడుచున్నాను. ఇంక ఆపెదను.

డాక్టర్ వెత్తరుగారు శుక్రవారము రోజున ఇక్కడకు పుదుచ్చేరినుండి వచ్చినారు. సోమవారము ఉదయము సింహాళము వెళ్ళినారు. శ్రీనివాసజీ వారికి పూర్తిగా సదుపాయములన్నియు జరిపినారు. 8 వ తేదీ వారియింట్లో జరిగిన భజన చాల ఉత్తేజకరముగా నున్నది. డాక్టర్ వెత్తరుగారు ఆయన ధోవతి జుబ్బా పసుపుపచ్చని ఖండువాతో చాల అందముగా కనిపించినారు. వారు నాకు వారి ఫోటో ఒకటి యిచ్చినారు. ఆ ఫోటో వెనుకభాగమున ఈ మాట లున్నవి: 'ఓం, ఇది నా చిత్రము మాత్రమే. నేను దీనిని మీకు ఇచ్చుచున్నాను. నీవు నాయెడ కనుపరచిన ఆశ్చర్యకరమైన ప్రేమవలన గెలుపొందితివి. నా హృదయముకూడ తీసికొనుము.' అవి మనస్సును కరగించు మాటలు; కావా? అంతయు మీ కటాక్షమే.

నా ప్రియమైన ప్రభూ! మీకు నా ప్రణామములు. నేను ఎల్లప్పుడు మీదానను. నన్ను మీలో నుంచుకొనుడు.

చెల్లా.

# 48. ఆత్మసాక్షాత్కార రహస్యము

ప్రియమైన గురుదేవా! నిన్న మధ్యాహ్నము సహించ లేక పోతిని. మిమ్ము చూడవలెనను ఆశక్తివల్ల చాల విచారముతో నుంటిని. నేను మీ పాదసన్నిధిని కన్నీరు కార్చుచు గతజన్మములో చేసిన నా తప్పులన్నియు క్షమించ మని ప్రార్థించుచుంటిని. నన్ను ఈ ప్రకారము దిగువను విడిచిపెట్టి మీరు పైకి ఎందుకు వెళ్లితిరి? నేను భగవంతుని చేరవలెనని ప్రయత్నించుచుంటిని. కాని ఉత్తీర్ణురాలను కాలేదు. నేను మీతో ఆధ్యాత్మిక సంబంధము కలిగి యున్నను ఇంతదూరముగా నుండుటకు చాల కష్టముగా నున్నది. గురుదేవా! నేను ఏమిచేయుదును? నేను ఈ బలహీనతను అతిక్రమింపలేకయున్నాను. మిమ్ములను విడిచి యీప్రకారము ఇంకను ఎంతకాలము ఉండవలసియున్నది! క్రిందటిసారి నేను పడినబాధ యింకను జ్ఞాపకమున్నది. అది పోవుటకు నాకు అనేకదినములు పట్టినది. ఇట్టి శిక్ష పొందు టకు నేను చేసినతప్పు ఏమిటి? నన్ను మీవద్ద నుండకుండ చేయు ఈ కర్మలు భస్మమగుటకు నేను ఏమి చేయవలెను? నన్ను శాంతపఱచుటకు మీరు కొన్ని దయగలమాటలు వ్రాయరా? మీరే నా సౌఖ్యకారణము. అది మీకు తెలి యదా? అది ఒక దివ్య అనుభవము. మిక్కిలి విచిత్రమైన సంబంధము. ఆ బంధన చాల బలమైనది, పవిత్రమైనది. నా గురుదేవా! నన్ను సరిగా నడుపుము. నేను మీచేతిలో

నున్నాను. మీరు నన్ను మీ యిష్టమైనట్లు చేయుడు. నేను చెప్పదగినది ఏమియు లేదు. ప్రతిది మీ యిష్టమునకు వదలి వేసితిని. మీ ఆజ్ఞ ప్రకారము నడుచుకొనుటయే నా సౌఖ్యము; సంతోషము. ఈ మాటలు నా హృదయాంతరాళమునుండి వచ్చుచున్నవి. మీ హృదయమునుండి వచ్చు సంగీతము వినుటకు నా హృదయము అలవాటు పడినది. ఇది మీకు తెలియదా? ఓ ప్రియమైన గురూ! నేను అనుభవించుదానిని మీకు చెప్పలేకయున్నాను. అవి చాల మంచి ఊహలు. అవి గౌరవింపదగినవి; దైవికములు. మీ వంటి బ్రహ్మసాక్షాత్కారము పొందిన ఆత్మయే వానిని గ్రహించగలదు. ఇతరులు నన్ను సరిగా గ్రహింపలేరు. కాని మీరు నా విషయమై సరిగా ఆలోచించుచున్నంతవరకు ఇతరులు నా విషయమై యెట్లు ఆలోచించినను నేను లెక్క చేయను. భగవంతుడు నాకు సహాయము చేయునని నాకు నమ్మకమున్నది. అది నా హృదయాంతర్గతమగు నట్లును, మీలోనున్న మురుగనుపాదములయొద్ద నున్నట్లును, నేను అచ్చట విశ్రమించినట్లు కనిపించును. మఱియు మీ దివ్యఆత్మను జ్ఞప్తియందుంచుకొని ఉదయము నిద్రనుండి లేచెదను. నేను మీతో మాట్లాడునదంతయు మీకు నిజముగా కనిపించుచున్నదా? నేను ఈ తుచ్ఛమైన శరీరములో ఎందుకు కట్టువడియున్నాను? అదియొక ఆటంకముగా నున్నది. లేదు. నేను కలవరించుచున్నాను. నా మానుషశరీరమే ఒక కల. నేను చేయవలసినపని నిద్రనుండి

లేచి నేను మీావద్దనేయుంటినని తెలిసికొని ఎల్లప్పుడు నా ప్రియులగు మీాయొద్దనే యుందునని తెలిసికొనుట. ఓ ప్రియమైన ప్రభూ! నేను అనేకసార్లు ఆత్మలు ఎల్లప్పుడు నుండునని వినియున్నాను. ఇప్పుడు నాకు అది అనుభవమునకు వచ్చుచున్నది. అవును అది ఒకటే ఆత్మ. మీారు దానియొక్క దివ్య భాగము. కాని నా కర్మలయొక్క పొర మిమ్ములను నన్ను విడదీయుచున్నది. దీర్ఘధ్యానమందు యీా బాహ్య ఆవరణములను నేను అతిక్రమించునపుడు మన హృదయస్పందనములు ఏకమైనట్లు అనుభవమునకు వచ్చును. మన యిద్దరిలో ఒకేజీవనము ప్రాణము ప్రవహించుచున్నట్లు అనుభవము కలుగును. మరియు ఆత్మయొక్క మొదటిపరిస్థితి ఆసమయమందు నాకు అనుభవమునకు వచ్చును. ఈ ఉత్కృష్టఅనుభవము దివ్యమైన ఆనందము అగునా? కాదా? దీనితో పోల్పదగినది ఏదియును లేదు

అప్పుడప్పుడు మీాజ్ఞాపకము, భక్తి. కారణముగా నాకు ప్రపంచమందలి యితరవిషయము లేమియు తెలియనప్పుడు దాని ఆకర్షణశక్తి ఎక్కువగా నున్నప్పుడు అది దివ్యజీవన పద్ధతిప్రకారము జరుగుచున్నదా అను సందేహము నాకు పొడమును. ఇట్టి భక్తియొక్క తీవ్రత కలిగినప్పుడు నాయొక్క ఉద్దేశమునకు ఇది అడ్డంకి కలుగజేయునా అను సందేహము గలుగును. అప్పుడు శ్రీ వివేకానందస్వాములవారి యీావాక్యములు జ్ఞప్తికి వచ్చును. 'భగవంతుడు అంతులేని వృత్తము. వానిపరిధి ఎచ్చటను కనిపించదు. కేంద్రము ప్రతిచోటను ఉండును.' ఆ ప్రపంచము

యొక్క కేంద్రము మీయందు ఉన్నట్లు ఊహించుటలో నా ఊహ సరియైనదని నాకు తెలిసినది. దానిని నేను నాశక్తి కొలది ఆరాధించి యనుభవమునకు తెచ్చుకొనుటకు ప్రయత్నింతును. నాలో వారిభక్తి కేంద్రము కల్పించుకొనుటకు శక్తిలేదు. నేను దానిని పరిశీలింపజాలక పోయితిని. బహుశా కర్మలవలన మాయబడుటవలన చూడ లేక పోయితిని. ఆయన కేంద్రము మీలోనుండి దానికి నా కేంద్రముతో సంబంధము కలిగినపుడే నేను దానిని తెలిసికొనగలను. ఈకలయిక స్థిరపడినక్షణమున ఈ పవిత్రకలయిక కేంద్రమును పవిత్రపరచును. మరియు నన్ను దివ్యఅనుభవము పొందునట్లు చేయును. నేను ఎల్లప్పుడు దివ్యఆత్మను తెలిసికొనియుందును. ఎందువల్లననగా అది పూర్తిగా పవిత్రము పారదర్శకమునయి నా ముకురనివలె సాశ్వతమై ప్రకాశించును. భగవంతుని దయవలన దానియొక్క గొప్పతనము అందము ఆకర్షణ పూర్తిగా తెలిసికొని అనుభవము కలుగును. మీలోనుండు భగవత్కేంద్రమునకంటె నెక్కువ ముఖ్యమైనది ప్రేమింపదగినది ఆకర్షణీయమైనది మర్యాదగలది శక్తివంతమైనది అన్నిటిలో చొరగలిగినది వేరొకటి నాకు తెలియదు. అది నాలో అందమైన ఆవేశమును గలుగజేయును. మీలోనున్న ఆత్మకేంద్రముద్వారా భగవంతుని అనుభవమునకు తెచ్చుకొనుటయే నా ముఖ్యోద్దేశము. ఇది నాఆత్మను అనుభవమునకు తెచ్చుకొనుటతో సమానము. అవునా కాదా? మీలోనుండు భగవత్కేంద్రము ఎల్లప్పుడు శక్తితోను

ప్రేమతోను దానివైపునకు నన్ను ఆకర్షించుటను ఎట్లు నేను వర్ణింపగలను? మన యిరువురి కేంద్రములకు ఒక శాశ్వతమైన కలయిక యేర్పడినది. దానిని భూమియందలి ఎట్టిశక్తియు విడదీయలేదు. ఒకవిషయమేమన, నా పూర్వకర్మల శక్తి వలన తరచుగా నేను ఈ కలయిక తెలిసికొనలేను. మరియు అప్పుడు నేను చాల విచారముతో కూడియుందును. ఈ కల యిక లేవదీసెడు భ్రమనుండి తప్పించుకొనుటకు నేను మన స్ఫూర్తిగా సాధన చేయుచున్నాను. నేను దానిని తప్పించు కొన్నరోజే ఆత్మ సాక్షాత్కారదినము. అదియే నాస్వర్గము. ఆరోజున నేను మీరు ఒకటే అను విషయమును తెలిసి కొందును. అపుడు మనశక్తులు రెండు కలిసిపోవును. మరియు నేను మీ దివ్యగుణములన్నింటిని పొందుదును. నేను చాల కష్టమైన విషయమునకు ప్రయత్నించుచుంటినని నాకు తెలి యును. అందుకు నేను చాల కష్టపడవలసియున్నదనియు తెలియును. కాని నేను ఇందుకు ప్రయత్నించుచున్నరోజు నుండియే నాజీవితము జీవనయోగ్యమైనదగును. గురుదేవా నా హృదయమునుండి ఉప్పొంగివచ్చు ఊహాలన్నియు మీకు తెల్పినాను. నేను ఏమి వ్రాసినది నాకు తెలియదు. దయ చేసి తప్పులున్నచోట నన్ను దిద్దవలెను.

శివానందనగరమునుండి సంగీతానందస్వామి మద్రాసు వచ్చినారు. వారు నన్ను చూచుటకు నిన్న వచ్చినారు నేను వారికి చేయదగినది చేసినాను.

నేను చేసినపని సరియే. నేను సంగీతపాఠములు నేర్చుకొనుటకు ప్రయత్నించుట మీకు ఇష్టమని నాకు తెలి యును. నేను దాని నిప్పటికే ప్రారంభించినాను. 'మానస గురుగుహరూపం భజరే' ఆనందభైరవి. నేను అందు ఉత్తీర్ణు రాలనగుటకు చాలకాలము పట్టును. మీకు సౌఖ్యము గలుగువిషయమందు నేను పనిచేయుట నాకు కష్టమని పించదు. మరియు మీ ఆశీర్వచనములతో నేను క్రమశః వృద్ధిపొందుదునని నాకు నమ్మకముగలదు. నెలపత్రికలు, మరియు పుస్తకముల పై పుటలమీద అచ్చొత్తించబడిన బొమ్మలు కొన్ని చాల విచిత్రముగా నున్నవి. ఒక హృద యములోపల కండ్లకు అద్దములతోనున్న మీ చిత్రము చూచినపుడు అది నాహృదయముయొక్క ఛాయాచిత్రమని నేను ఊహించితిని. అపుడు నాకు ఆనందరహస్యము కలిగి నది. మీ మొదటిఉత్తరముతో నాకు పంపిన మొదటి చిత్రము ఆ పుస్తకముమీదిది, మరియు దానితో మీరు నాకు ఆనందముయొక్క రహస్యమును తెలియజెప్పితిరి. ఇప్పుడు యోగవేదాంత ఫారస్టు విశ్వవిద్యాలయపు వార పత్రికమీద చిత్రము విచిత్రముగానున్నది. మీరు ఈవిధ ముగా దుస్తులు ధరించుట కలలో చూచితిని. భేదమేమనగా అందు మీ చేతులమీద ఛాతిమీద మంచిగంధము రాసికొని యుంటిరి. మరియు పుష్పములచే అలంకరించుకొనియుంటిరి. మరియు నాగస్వరము మొదలగువానితోనుండు పెద్ద ఊరే గింపులో మధ్యనుంటిరి.

ప్రతిదియు చాల ఆశ్చర్యముగా నున్నది. అప్పు డప్పుడు నాకు పిచ్చియెత్తినట్లు అనుకొనెదను. అది దివ్యో న్మాదము. ఈ పెద్దఉత్తరమునకు నన్ను క్షమింపుడు. మిక్కిలి ప్రేమగలప్రభూ! మీకు ప్రణామములు. త్వరలో మీదగ్గరకు నేను వచ్చునట్లు నన్ను ఆశీర్వదింపుడు. నేను అచ్చటికి వచ్చువిషయమై మీరు ఏమియు వ్రాయలేదు.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 49. మిమ్ములను ఎల్లప్పుడు జ్ఞప్తియం దుంచుకొనుటవలన గలుగు ఫలము

గురునాథా! నాకు మిక్కిలి ప్రియమైనప్రభూ! మీ ఆనందదాయకములగు పాదములకు భక్తితోను ప్రేమతోను ప్రణామములు చేయుచున్నాను.

నిన్న నేను మీకు పంపిన పెద్దఉత్తరము మీకు అందియేయుండును. నేను ఇందులో నా ఆధ్యాత్మిక దినచర్య పంపుకొనుచున్నాను. మరియు డిసెంబరు నెలలో నేను వ్రాసిన లిఖితజపము మీకు పంపుచున్నాను.

ఓ నాగురుదేవా! మీ రిచ్చటనుండి నాకు బోధ చేయుచు నావిషయమై జాగ్రత్తతీసికొనుచున్నంతవరకు నా జీవితము బాగుగనున్నది. ప్రియమైనప్రభూ! మీరు ఈ సంగతివిని సంతోషింతురని నా నమ్మకము. నేను అనుభవించుచున్న సమస్తమునకు కారణము మీ కటాక్షమే.

నేను నా ధ్యానకాలములలో కొంచెము మార్పు చేసితిని. ఉదయము ఎప్పటివలె 4 నుండి 5–30 వరకే. సాయంకాలము 4–30 నుండి 6 వరకు బదులు 4 మొదలు 5–30 వరకు మార్చితిని. ఈకాలమునందు నాకు ఇంట్లో ఆటంకము లేమియునుండవు. ఇది సరిగాఉన్నదా? రాత్రి తిరిగి 10 నుండి 10–30 వరకు.

ఓ నా దయగలగురుదేవా! మీఉత్తరము చాల సార్లు చదివినాను. ఆఖరు ఉత్తరములో వ్రాసిన కొన్ని పవిత్రవాక్యములు ప్రకాశమును కలుగజేసి నా హృదయ మందు బాగా నాటుకొనినవి. మరియు వానిని నేను నా గొప్పధనమువలె చూచుకొనుచున్నాను. నాకు ప్రపంచ సంబంధమైనధనము అక్కరలేదు. నేను ధ్యానమునకు కూర్చొనిన వెంటనే యీమాటలు జ్ఞప్తికివచ్చి ప్రపంచము, నా ఉనికికూడ నేను మరచిపోవుచున్నాను. కావున ఇతర ములగు ఊహలు నాకు కలిగి నా ధారణను చెడగొట్టునను కష్టము లేదు. ఆ విలువగలమాటలు ధ్యానములో ఇంకను లోతునకు పోవుటకు సహాయపడుచున్నవి. మరియు కొంత సేపయినపిదప ఇదికూడ మరచిపోవుదును. మరియు నా ప్రియునియొక్క ఆత్మలో కలిసిపోవుదును. మరియు ఆస్పృహ మాత్రము నేను అనుభవించుచుందును. ఈ పరిస్థితిలో నా వ్యక్తిత్వమును నేనువిడిచి ఆనందము అనుభవించె దను. ఓ భగవంతుడా! ఆ ఏకత్వమును వర్ణనచేయుట చాల కష్టము. అది నేను నా జీవితములో అనుభవించిన అన్ని అనుభవములలోను మంచిది. నేను ఈ నా ఊహను ఇంతకంటె విపులముగా తెలియపరచలేను. కాని మీరు దానిని గ్రహింపగలరు అని నా నమ్మకము. ప్రియమైన గురుదేవా! నాకు మీయందుగల కృతజ్ఞత, గౌరవము ఎట్లు తెలియపరచగలను! నాఆత్మ మీపవిత్రమైన ఆత్మ ద్వారా సౌఖ్యకరమగు విందుభోజనమును అనుభవించు

చుండును. మరియు అది మిక్కిలి తృప్తితో గూడిన అనుభవము. మీరు అద్భుతపురుషులు.

ఈ స్థితియందు నేనేమి చేయవలెనో నాకు బోధింపుడు. ఈ ఆనందమును లెక్కచేయక నేను ఇంకను ఎక్కువగా ధారణచేయవలెనా? (ఇది చాలకష్టము) లేక ఈ సంతోషము అనుభవించుచు ముందు విషయము దానంతట అది వృద్ధిపొందుటకు విడిచిపెట్టనా? నేను ఒంటరిగా ఉన్నానను ఊహా భ్రమయా లేక నేను నిజముగా నా ప్రియుని దగ్గరనున్నానా? ఏదియెట్లున్నను మీరు నా జీవితము జీవనయోగ్యముగ చేసినారు. ఎప్పుడు మిమ్ము తలచుకొనిన-ఇది ఎల్లప్పుడు చేయుచునేయుందును - నేను తృప్తిరతిణయొక్క శాంతమైన మంచి యనుభవముతో సంతోషించుచుందును. నేను నాలోట్లు అన్నియు మరచిపోవుదును.

గత 3 దినములనుండి నాకు వీపునొప్పి వచ్చుచున్నది. మీ బాధ మీనుండి నేను మార్చుకొనుటలో ఉత్తీర్ణురాలనైతినా? అట్లయిన నాకు సంతోషమే. మీ జబ్బులంతయు నాకు మార్చి మీరు పూర్ణమైన ఆరోగ్యము అనుభవించండి. ఇదియే భగవంతునికి నిష్కపటమైన హృదయపూర్వకమైన నా ప్రార్థన. అప్పుడప్పుడు నాకు బాధవచ్చుచున్నట్లు ఊహించెదను. ఎందువల్లననగా మీరు ఎక్కువ బాధతోనున్నారు. మరియు నేను అందువిషయమై చాల ఆతుర్దాతోనున్నాను. మీ ప్రస్తుతపరిస్థితి దయచేసి తెలియపరచుడు.

12-1-55, ఈరోజున నేను మిమ్ములను మామూలు ప్రకారము తరచు చూచుచున్నాను. నిన్నటి విషయము నమ్మదగినది కాదు. మిమ్ము కలిసికొనినపుడు మీతో నేను దానిని చెప్పెదను. నా అనుభవములు కొన్ని వ్రాతలకు అతీతమైన పవిత్రతగలవి. వానిని ఇతరులకు తెలిపినచో అవి ఆగిపోవునేమోయని నేను భయపడుచున్నాను. నా కలలు చాలవరకు నిజమగుచున్నవి. నాకు మొదటవచ్చిన కల ఎన్నటికిని మరచిపోను. అది దివ్యమైనది.

'శివానంద హేటు డే' పుస్తకము, చమురు, మందులు క్రొత్తసంవత్సరపు కార్డు వీభిని పంపినందుకు నా ధన్యవాదములు. మీరు ప్రతివారము కారులో షికారు వెళ్లుచున్నారని విని చాలసంతోషించితిని. ఆ పుస్తకము చాల ఉత్తేజకరము.

గతనెలలో 72 ప్రాణాయామములు చేయుటచే ఛాతిలో నొప్పికలిగినది. కాబట్టి నేను వానిని 36 కు తగ్గించితిని. నేను క్రమశః 72 వరకు మరల వృద్ధిచేసెదను.

ఈ ఉదయము 3 గంటలకు ధ్యానము చేయవలెనను తీవ్రమైన, ఆశతో మేలుకొంటిని. అట్టిసమయములో మీరు లేకపోవుట చాలలోటు. ఈ మోస్తరుగా నామనస్సు ఉన్నప్పుడు భగవంతుడు మిమ్ము కొన్ని నిమిషములు చూచుటకు సహాయము చేయునెడల నేను శాశ్వతఆనందములో నుండగలుగుదును. అట్టిసమయములందు ధ్యానము చాల ఉపకారిగా నుండును. నేను లోన మీతో కలయిక పొందె

దను కాని అప్పుడప్పుడు ఈ కలయిక అను నా ఊహా భ్రమ యేమో అని ఊహించవలసివచ్చును. మరియు అపుడు నేను చాల అసౌఖ్యము అనుభవింతును. గురుదేవా! అది నా భ్రమయేనా? నిజము మీకు తప్పక తెలియును. ఓ భగవానుడా! మిమ్ములను చేరుట చాల రుచికరమైన పోరాటము.

పశ్చిమ దేశీయులు అనేకులు అక్కడకు వచ్చినట్లు తెలిసి నేను సంతోషముగా నున్నాను. అవును ప్రపంచ మంతయు మిమ్ములను పూజింపనిండు. నేను అనుభవించు చున్న ఆనందము అందరను రుచిచూడనిండు. కాని ఎల్లప్పుడు తప్పక నాకు నా సొంతస్థలమును దయచేయుడు. ఇతరులు మిమ్ములను స్తోత్రము చేయుట వినుటచే నాకు చాల గర్వము కలిగినది. నేను మీతో అంత ఆంతరంగికముగా ఉన్నాను.

ప్రియమైన గురుదేవా! ప్రణామములు. నేను ఇంకను వ్రాయగలను కాని అపుడపుడు ఆపుచేయువలెను. నా దిన చర్యతోపాటు కొన్ని వాక్యములు నేను వ్రాయువలెనను ఊహ నాకు మొదట కలిగెను. కాని నేనట్లు చేయలేకపోతిని.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 50. తమ తలుపు దగ్గర

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

మీ పవిత్రపాదములకు ప్రేమతోను గౌరవముతోను ప్రణామములు చేయుచున్నాను.

ప్రియమైన స్వామీ! నా జీవనమునకు జీవనమా! మీరు చూపు దయకు, కరుణకు నేను ఏమి చేయగలను? నిన్న సాయంత్రము నా ధ్యానము ముగిసిన వెంటనే మీ విలువగల తంతి వార్త అందినది. ఆ ధ్యానము చాల అందమైనది. అందు నేను పూర్తిగా మీలో ఏకమైతిని. ఆ అందమైన అనుభవము కలిగిన వెంటనే మీ తంతి వచ్చుట నా జీవితమునకు ఉత్తేజము కలిగించినది. ఎట్టి ఉత్తేజితమైన మాటలు! 12వ తేదీ ఉదయము 11 గంటలకు నేను మీలో మగ్నమై కూర్చొనియుండగా ఆ తంతి నాకు పంపబడినది. అప్పుడు నేను మీకు ఉత్తరము వ్రాయుచుంటిని. అది నిన్న పోష్టులో వేయబడెను. నేను మిమ్ములను నా సందేహములు తీర్చుమని కోరియుంటిని. ఈ తంతి ఆ సందేహమును తీర్చినది. నా ఏకాంతపు అనుభవముతో కూడిన ఊహ భ్రమయేమో అనుకొంటిని. కాదు, అది భ్రమ కాదు. భ్రమయైన మీరు నాకు తంతి పంపకనే యుందురు. నేను నిన్న మీకు వ్రాసిన ప్రకారము ఉదయము 8 గంటలనుండి మీరు ఇచ్చట లేకుండుట నాకు చాల బాధ కలిగించుచున్నది. నా

హృదయమునకు బాధ కలుగుచున్నది. అది మృదువైన బాధయే. అది బాధతో కూడిన సహింపరాని కోరిక. మరియు ఎట్టి ఆశ్చర్యము, వింత! మీరు నా హృదయవేదన విని నాకు దయతో తంతి పంపితిరి. నా ప్రియమైన ప్రభూ! మీకు ధన్యవాదములు.

ఇప్పుడే మీ తీపిప్రసాదము నాకు వచ్చినది. అది చాల రుచిగా నున్నది. మిసెస్ సాంబశివరావ్ కూడ దానిలో పాలుగొన్నది. నేను వ్రాయుచుండగా ఆమె వచ్చినది.

నేను పెద్ద ఉత్తరములు చాల వ్రాయుచున్నాను. మీరు చాల పని తొందరలో నుందురని నాకు తెలియును. కాని నేను ఇపుడు ముగించెదను. కాని కొన్ని వాక్యములతో మీకు ధన్యవాదము లీయకతప్పదు. నేను మీకు 1, 10, 12 తేదీలలో వ్రాసితిని. మీకు అవి యన్నియు అంది యుండును. నన్ను మీ వద్ద నుంచుకొనినందున మీ జీవితము ఆశ్చర్యకరముగా నున్నది. నేను ఎల్లప్పుడు మీ యొద్దనే యున్నాను. నేను మీ దాననే.

నేను ఎల్లప్పుడు వెదకుచున్నాను. మీరు దాని నెరుగరా? నాకు అది దొరకినది. నేను తలుపువద్ద నున్నాను. నేను ఎల్లప్పుడు ఆ తలుపు తట్టుచున్నాను. దాని తాళపు చెవి మీ యొద్దనున్నది. మీరు దానిని తెఱచినగాని నేను లోపలికి ఎట్లు వెళ్లగలుగుదును? కాని తలుపుదగ్గర నుండు మెట్లమీద పరుండినను నాకు విశ్రాంతియే. ఏదో ఒక రోజున

తలుపు తెరువబడును. మీరు నా కొరకు తలుపు తెరువవలసి యున్నది. అప్పటివరకు నేను ఓర్పుతో వేచియుండును. ఆహా! ఎంతటి ప్రేమమయము ఉత్తేజకరమునగు మాటలు! మీరు నన్ను చూడగలరా?

నా ప్రియమైన ప్రభూ! ప్రణామములు. నా ఆత్మ మీలో నున్నది. అది ఎల్లప్పుడు అక్కడనే యుండును.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 51. నా సంతోషమునకు మూలరహస్యము

గురునాథా! నా ప్రియమైన ప్రభూ!

మీ పవిత్రమైన పాదములకు ప్రేమతోను, భక్తితోను ప్రణామములు చేయుచున్నాను.

నా కుమార్తె మీకు ఉత్తరము వ్రాసినట్లు నాకు తెలియపరచినది. ఆమె సుఖముగా నున్నది. ప్రియమైన ప్రభూ! మీ మార్గములు ఆశ్చర్యకరములు. అనేక విధములుగా మీరు నా జీవితమును సౌఖ్యముగాను సౌమ్యముగాను చేయుచున్నది. మీకు నేను తగిన ధన్యవాదములొసగజాలను.

ప్రియమైన ప్రభూ! నేను రాత్రింబగళ్లు మిమ్ము ప్రార్థించుచున్నాను. ఈ జీవితముతో తిరిగి బాధపడునట్లుగా మీరు నన్ను ఒంటరిగా విడిచిపెట్టవలదు. తమ బోధన ప్రకారము నేను నా దైనిక జీవితములో నడుచుకొనుటకు సాధ్యమైనంత ప్రయత్నము చేయుచున్నాను. నేను ప్రస్తుతము నిర్మలమైన ఆనందము అనుభవించుచున్నాను. కాని అప్పుడప్పుడు మీ ఎడబాటుకు బాధ కలుగుట తప్పుటలేదు. నా జీవితములో ప్రతి నిమిషము మీరు నాకు అవసరము. మీ యొక్క స్ఫూహాయు మిమ్ములను త్వరలో కలిసికొనెదనను ఆసక్తియు నా సంతోషమును నిలుపుచున్నవి. మీరు కారణము కాని యెడల నేను ఎన్నడును భగవంతుని జ్ఞప్తియం

దుంచుకొనలేను. నేను పని చేయుచున్నప్పుడు, మాట్లాడు చున్నప్పుడు భుజించుచున్నప్పుడు నిద్రపోవుచున్నప్పుడు కూడ మిమ్ములనే తలచుచుందును. నా హృదయాంతరాళ మున మీ ఊహాలే యుండును. మీకు భగవంతునికి తేడా ఏమియు కనిపించదు. భగవంతుని ఆలోచన ఎల్లప్పుడు నుండును. ఇదియే ప్రపంచము జంఝూటము మధ్య నేను నిర్మలమైన జీవితము జీవించుటకు సహాయపడుచున్నది. నాకు ఏదైన ఆందోళన కలిగినపుడు నేను మీ ఉత్తరములు చదువుకొనుచుందును. మీ అద్భుతమైన ఛాయాచిత్రము కొంతసేపు తిలకించుచుందును. అపుడు నాకు తెలియకయే మంత్రశక్తివలన కలిగినట్లుగా నా శరీరమునందు శాంతి నమ్మకము వెలుతురు కనిపించును. మరియు నాకు తెలియ కుండగనే దివ్య ఆనందమైన ఆత్మోద్ధారణతో గూడిన చిఱు నవ్వు నవ్వెదను. కొద్ది కాలములో ఏమియు శ్రమ లేకుండ జీవితముయొక్క కష్టములు ఎదుర్కొనుటకు శక్తి కలిగి యుందును. మరియూ సంతోషముతో నుందును. ఇట్టి స్థితిలో మిమ్ము ప్రతి నిమిషము పూజించుట ఆశ్చర్యమయిన విషయము కాదు.

అరణ్య విశ్వవిద్యాలయమునకు సంగీత విద్యాశాలను తీర్చుట సంతోషకరమైన వార్త. నా సంగీతమును నేను అశ్రద్ధ చేసినందుకు నేను తరచు విచారపడుచుందును. నేను మిమ్ములను కలిసికొందునని నాకు తెలిసియుండిన యెడల నేను తప్పక సంగీతమున పరిశ్రమ చేసి యుందును. ఇప్పుడు

నేను దానిని అభ్యసించుట చాల కష్టము. అయినను నేను ప్రయత్నము చేయుచున్నాను. మీ కటాక్షమున్న అన్నియు సంభవమే. నేను నేర్చుకొని మీకు సంతోషము కలుగు పనులు చేసెదను. నా ప్రియమైన ప్రభూ! మీరు నా ఆత్మకు ఆత్మ. దానిని ఇప్పుడు ఏదియు మార్చలేదు.

మీ ప్రియమైన పాదములకు ప్రణామములు చేయుచున్నాను. త్వరలో మీ యొద్దకు నేను వచ్చునట్లు నన్ను ఆశీర్వదింపుడు. నేను మిమ్ములను కలిసికొనుటకు ఆతురతగానున్నాను.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 52. చెప్పనలవికాని ఆనందానుభవము

నిన్న నాకు అందిన మీదయగల ఉత్తరమునకు మీకు వేలకొలది ధన్యవాదములు. నేను బాధ అనుభవించిన తరువాత ప్రేమతోగూడిన మీ ఉత్తరము చూచుటచే నాకు పరమానందము కలిగినది. అహా! ఆ దివ్యాద్భుతమైన దివ్యహస్తము ఎప్పుడు నిచ్చుచుండెడి దయతోగూడిన ఆనందమయమగు చేయి అనేకమంది అదృష్టమునకు కారణమైనచేయి వేలకొలదిజనులకు ప్రాకృతిక మానసికజబ్బులు కుదిర్చినచేయి నాకు క్రొత్తజీవితము సంతోషము కలుగజేయు కొన్నిమాటలు వ్రాయుట నేను చూచితిని. దాని దయకు నేను నాహృదయపూర్వకమైన ధన్యవాదములిచ్చుచున్నాను. పొంగివచ్చు కన్నీళ్లవలన నేను కొన్నినిమిషములవరకు మీ ఉత్తరము చదువలేకపోతిని. ఆ పూజనీయమగువ్రాత చూచుటచేతనే నేను స్వర్గధామమునకు చేర్చబడితిని. తమ వ్రాతయందలి మొదటివాక్యము నేను చదివినప్పుడు నామనస్సు కలతచెందెను. ఓ ప్రియమైన విలువగలప్రభూ! దయచేసి నాపేరు మారువకుడు. నన్ను చెల్లమ్మ అని పిలువవలదు. మీకు నేను ఎల్లప్పుడు చెల్లగానే యుండునట్లు ఆశీర్వదింపుడు. ఆవిషయము మీకు స్వల్పమైనను అది నాకు మిక్కుటమైన ఆనందము కలుగజేయును.

నా ఆత్మకు ఆత్మయైనవాడా! నా ప్రియమైన గురుదేవా! నేను మీకు ఆఖరు ఉత్తరము వ్రాయునప్పుడు నా

హృదయములో నేను లేను. మీరు నాగురుదేవులని నాకు జ్ఞప్తిలేదు. మీరు నాకు చాల ప్రియమైనటువంటి నా ప్రాణమని ఊహించితిని. ఆకారణమువల్ల నాకు భేదములు ఏమియు కనిపించలేదు. అది నాయొక్క అంతిమసారమునకు వ్రాయబడిన ఉత్తరము. మరియు నేను చూపిన స్వేచ్ఛను క్షమింపవచ్చును దయయుంచి నన్ను క్షమింపుడు. నాకంటె చాల ఎక్కువ వస్థితియందుండువారికి నేను సలహా చెప్పుటకు నాకు అధికారములేదు. కాని నేను మీయందు భక్తితో మగ్నమైనప్పుడు మీరు నేనే అయినట్లు కనిపించెను. మీరు ఆరోగ్యముగా లేరని వినినప్పుడు నాకు ఎంత కష్టము గలిగినదో మీరు ఊహింపజాలరు. నేను ఇచ్చట కలలో వలె తిరుగుచున్నాను. నేను నాపనులు బొమ్మవలె అనాలోచితముగా చేయుచున్నాను. చాలరోజులనుండి నాకు నిద్ర లేదు. నేను ఆహారము పుచ్చుకొనుట తప్పదని పుచ్చుకొనుచున్నాను. ప్రతిక్షణము మీ ఆరోగ్యవిషయమై భగవంతుని ప్రార్థన చేయుచున్నాను. మీకు తెలిసినను తెలియక పోయినను ఈరోజులలో నేను ఎల్లప్పుడు మీవద్దనే యున్నాను. నేను మీజవాబుకు ఆదుర్దాతో ఎదురుచూచుచున్నాను. దయచేసి మీరు అన్నివిషయములు విపరముగా వ్రాయవలెను. ఈమధ్యవచ్చిన మందులవిషయమై మీకు తెలియకపోవచ్చును. నేను వానిని ఇక్కడనుండి పంపగలను. దయచేసి నాకు ఉత్తరము వ్రాయుటకు ఉపేక్ష చేయవద్దు. మీవద్ద నేను లేకపోవుటయే నేను నాజీవిత

ములో చేయుచున్న గొప్పనష్టము. నాఆత్మ ఎప్పుడు మీ చుట్టు నిలిచియుండును. ఓ ప్రియమైన ప్రభూ! నాకు మీ యందుగల భక్తి చాల అందమైనది. మరియు బాధ గలుగ జేయునది. నేను ఈప్రపంచమందు మీ కటాక్షముతప్ప మరి ఏమియుకోరను. ఇది నా ఊహకాదు. నా హృదయాంతరాళమునుండి వచ్చినది. అది నిజమైనవిషయము. ఓ నా దేవుడా! నా సొంత ఆత్మా! నా పవిత్ర గురుదేవా! నాకు అన్నియు మీరే!

ఈరోజులలో నేను చాల కొద్దిగా చదువుచున్నాను. నేను చదువలేను. నేను మీపుస్తకము కొద్దిపంక్తులు చదివినవెంటనే యేదోయొకటి తటస్థించును. నేను దానిని వర్ణింపలేను. నాకు అప్పుడు కలుగుకోరిక ధ్యానముచేయుటయే. నేను చదువవలెనని నాకున్నది. నేను తెలిసికొనవలసినది చాల ఉన్నది. ఈమధ్య కొన్నిరోజులనుండి రామతీర్థస్వామి పుస్తకములు చదువుచున్నాను. అవి చాల ఉత్తేజకరమైనవి. మీపుస్తకములతరువాత నాకు ఆ పుస్తకముల యందే యిష్టము కలుగును. వారిమాటలలో కొంత పరిచయముగలదు. వానిని నేను ఇంకను చదువనా? నిన్న మీ మాసపత్రిక వచ్చినది. కావున దానిని చదువుట మొదలు పెట్టితిని. ఆ ఉత్తేజకరమైన అనుభవములు ఊహించు నప్పుడు నేను ఇంకను మత్తుగా నున్నట్లు ఊహించెదను. నా ఆధ్యాత్మిక అనుభవములు నేను బయలుపఱుచకూడదని నాకు తెలియును. కాని ప్రియమైనప్రభూ! నాకు ఏమి జరుగు

చున్నది మీకు తెలియవలయును. దానిని నాయంతట నేను ఉంచుకొనుటకు వీలు లేదు. దీనివిషయమై మీతో తప్ప ఇం కెవరితో చెప్పుకొందును? ఎవరు నావిషయమయి గ్రహించ గలరు? వారు నన్ను పిచ్చిదానిక్రింద జమకట్టెదరు. అది పిచ్చియా? అయినను ఈరకము పిచ్చియుండుట నాకు ఇష్టమే

గురుదేవా! దివ్యశక్తి నాచుట్టు నున్నది. దాని మాధుర్యము నేను ఎట్లు వర్ణింపగలను? అది నిజమయిన ఆనం దము, పరమానందము. నాశరీరమందలి ప్రతిఅణువు దానితో తడిసియున్నది. ఆ ఆధ్యాత్మిక ఆసక్తి, దానితో కలియుటకు గల కోరిక—వీనిని నేను ఆపుకొనలేక యున్నాను. అది నా ప్రాకృతిక ఇంద్రియజ్ఞానమును మాపుమాపినది. నేను చదువ లేదు, అది నామనస్సును బుద్ధిని ధ్వంసముచేసినది. నేను ఈప్రపంచమునుండి వెళ్ళిపోయితిని. ఎచ్చటికి వెళ్ళితినో నాకు తెలియదు. నేను అనుభవించినది నేను చెప్పలేను. ప్రపంచభాష యేదియు దానిని తెలియపరచలేదు. మీరు ఇట్టిస్థితిని తఱచు అనుభవించియుండవచ్చును. కావున మీరు నావిషయమై గ్రహించెదరని నమ్ముచున్నాను. ఇది ఎట్టి స్థితి? ఆధ్యాత్మికజీవితములో మామూలుస్థితియా? నేను అప్పుడు చేయవలసినది యేమైన నున్న దయచేసి నాకు సలహా యిండు. ఈ అనుభవము తరచు పొందుటకు కోరిక నన్ను వ్యాకులపరచుచున్నది. నాశరీరములో కొంత మార్పు కలిగినది, నానరములు ఉబ్బి పెద్దవైనట్లు ఒక

మంటవలన బాధకలుగుచున్నది. నేను స్వప్న ప్రపంచములో నడుచుచున్నట్లు ఊహించుచున్నాను. చెడ్డపని యేమియు నాకు జరుగుటలేదని ఊహించెదను. నేను అనుభవించిన విషయముయొక్క అనిశ్చితమైన అభిప్రాయము మీకు ఇవ్వగలిగితిని. ఈప్రపంచమంతయు ఇంతకంటె ఆనందకరమైనవిషయము నేను ఎన్నడును అనుభవించియుండ లేదు. నేను స్పష్టముగా తెలియపరచలేను. కాని దీనితరువాత మీ ఆరోగ్యమువిషయమై మార్పు ఏమియు కలుగదను నమ్మకముమాత్రము కలిగినది. లేనియెడల భగవంతుడు నాయెడల అట్టికరుణ చూపించడు. ఆయన నాభక్తికి సంతోషించినాడు. ఆపదఏమియు కలుగునట్లు చేయడు. నా ఊహ సరియైనది కాదా? గురుదేవా! ఇంతటితో నేను ఆపెదను. అనేక పుటల గ్రంథము నేను మీకు వ్రాయగలను. ఎచ్చటనుండి ఆ విషయములు వచ్చునో నాకు తెలియదు. ఓ విచిత్రమైనప్రభూ! నాకు కనపడుచుండెడి దేవా! మీ ఆనందమయపాదములకు నా ప్రణామములు.

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 53. శరీర చైతన్యమును మించినది

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

మీ దివ్యమైన పాదములకు ప్రేమతోను భక్తితోను ప్రణామములు చేయుచున్నాను. 16వ తేదిగల మీ దయగల ఉత్తరము నిన్న చేరినది. నాయందు మీరు చూపు ఓర్పునకు, దయకు నా హృదయాంతర్గత ధన్యవాదములు.

నాకు సరిగా వ్రాయగలిగిన శక్తి నిచ్చుటకును, వ్రాయకూడని సంగతులు వ్రాయకుండ నుండునట్లు చేయుటకును సరస్వతీదేవిని నేను ప్రార్థించుచున్నాను. మీరు ఆరోగ్యముగా నున్నారని వినుటకు నాకు చాల సంతోషముగా నున్నది. నేను అంత ఉద్రేకములో అన్ని విషయములు వ్రాసి మిమ్ములను బాధపెట్టకూడదు. ఈ భూమియందు జీవించుచున్న భగవంతులరగు మీకు ఎట్టి సలహాలిచ్చుటకును నేను ఎంతటి దానను? నాకు ఆలోచనకు కాలము లేదు. నాకు మీ యందుండెడి భక్తియే మీ గొప్పదనమును నా విలువలేమిని మరపు కలిగించినది. నేను మీకు సహాయము చేసెదనని ఊహించుటలో నాది ఎంతటి అజ్ఞానము! భగవంతుడు తప్ప ఇంకెవరైనను ఇతరులకు సహాయము చేయగలరా? ఆయన ఆజ్ఞకంటె ఉత్కృష్టమైనది యింకొకటి యుండునా? నా కర్తవ్యము ప్రతిదానిని భగవంతునికి వదలివేసి నా గురుదేవుని మంచి ఆరోగ్యములో

నుంచమని ఆయనను కోరుటయే. నన్ను నేను ఆయనకు సంపూర్ణాత్మార్పణము చేసికొని మిమ్ములను మంచి ఆరోగ్యముతో నుంచుటకు నా యొద్దనుండి ఏమి తీసికొనవలెనో దానినంతయు తీసికొనవలెనని ప్రార్థించెదను. నేను ఇప్పుడు చేయుచున్నది అదియే. ఆయన నా ప్రార్థనలు వినునని నాకు తెలియును. ఓ గురుదేవా! మీరు ఎల్లప్పుడు ఆరోగ్యముగా నుండవలెనని నా కోరిక. మిమ్ములను నేను నా హృదయ పూర్వకముగా ప్రార్థించెదను. మీరు నా శరీరమునందలి ప్రతి అణువునందు కలిసియున్నారు. మీరు నా రక్తములోను, ప్రాణములోను, హృదయములోను నేను చూచెడి ప్రతి వస్తువునందు ఉన్నారు. మీరు నా తప్పులన్నియు సులభముగా వదలివేయుచున్నారు. నాలో నున్న కొద్ది మంచినే గమనించుచున్నారు. నేను మీకు వ్రాసినదంతయు మీరు దయతో క్షమించుచున్నారు. ఈ ప్రపంచములో మీతో సమానులింకెవరును లేరు. మీరు నిజముగా భగవానులే. ఏ మనుజుడును మీ వంటి మంచివాడు కాడు. నేను ఇపుడు మీ పాదములయొద్ద నున్నాను. నేను చేసియుండిన పనులకు క్షమాపణ కోరుచున్నాను. నన్ను ఆశీర్వదింపుడు.

నేను మీకు వ్రాసిన మరురోజు నాకు ఒక విచిత్రమైన కల వచ్చినది. అనేకమంది జనులు మీ కొఱకు హాలులో వేచియున్నారు. అందులో నేను ఒకతెను. అందరతో ప్లాటుఫారము మీదకు వచ్చి కూర్చొని కొన్ని దివ్యకీర్తనలు పాడ ప్రారంభించినాను. కొద్ది సమయములో నాకు ఒక విచిత్ర

మైన అనుభవము కలిగినది. నేను నా శరీరమునుండి బయలు దేరి మీ ప్రక్కను జేరితిని. అచ్చటినుండి క్రిందపడిపోయిన నా శరీరమును చూచుచుంటిని. నన్ను మరల నా శరీరము నొద్దకు వెళ్ళుమని మీరు ఆజ్ఞ ఈయకూడదని నేను హృదయ పూర్వకముగ మిమ్ములను ప్రార్థించుచుంటిని. ఇదియొక కలయే. అహో! అది యెంత నిజముగా కనబడెను! అది నిజమగుటకు నేను కోరుచుంటిని. కల గనుటకూడ ఒక సౌఖ్యమే. మీతో నుండుట అంతకంటె సౌఖ్యము.

నా ప్రియమగు గురుదేవా! నేను మీ సలహా, మార్గ దర్శకత్వము, రక్షణ చాల ఎక్కువగా కోరుచున్నాను. జరి గిన విషయమంతయు మీకు వ్రాసెదను. ఆ ఆనందకరమైన అనుభవము తరువాత నేను చాల సౌఖ్యముగ నుంటిని. శాంతముగా 3 రోజులుంటిని. అనగా 14వ తేది వరకు. అప్పుడు నా ఆధ్యాత్మికవృద్ధిలో గొప్పతనము కలిగెను. నేను వృద్ధిపొందుట లేదని యిపుడు కూడ ఊహించు చున్నాను. 15 లగాయతు 18 వరకు చాల భయంకరము గానే యుండినది. నేను ఖాళీగా నుంటిని. ఇంతకన్న నేను ఎట్లు తెలియపరచవలెనో నాకు తెలియదు. నాకు దేని యందును రుచి లేదు. ఆహారమందు రుచి లేదు. స్నేహితుల యందు ఇష్టము లేదు. నాకు ఎవరితోను మాట్లాడుటకు ఇష్టము లేదు. నేను సాధన ప్రారంభించినది లగాయతు ధ్యానమునందు ఆసక్తి తగ్గినది. కాని ధ్యానము చేయుటకు కూడ ఆసక్తి కొద్దిగా కనిపించినది. కాని నేను మామూ

లుగా ధ్యానమునకు కూర్చుండుట మాన లేదు. ధారణయందు ఆసక్తిలేని కారణముచే అప్పుడు జపము చేయుచుంటిని. ఆ జపము నెమ్మదిగా బిగ్గరగా మానసికముగా చేయుచుంటిని. నేను మీకు ప్రార్థన చేసితిని. కనిపించని దేవునిగూడ నా ఊహల నాకు ఇవ్వమని కోరుచు ప్రార్థించితిని. కష్టమైన అనుభవములు కలిగినను వానిని సహించితిని. ఇట్టి నా మన స్తబ్ధతను సహించలేక పోయితిని. నేను అన్ని విధముల ఊహలచే బాధితనైతిని. నేను మీకు వ్రాసిన ఆవేశ విష యములను ఆపుటకు నా మనస్సును స్వాధీనములో నుంచు కొనుటకు మీరు ప్రయత్నము చేయుచుంటిరి. ఆ ప్రయ త్నము మీరు చాల ఎక్కువగ చేయుచుంటిరి. కొద్ది సమ యములందు మీలో నేను కలియుటకు వచ్చి అడ్డంకులు కలిగినట్లు ఊహించితిని. మరికొన్ని సమయములందు ఏదో ఒక భయము నాకు తెలియనటువంటిది నన్ను బాధించు చుండెను. నేను అనుభవించినది నేను సరిగా వర్ణన చేయ జాలను. మధ్యాహ్నము చదువుటకు రుచించ లేదు. మీ కటాక్షము నాపై కలుగుటకు తఱచుగా ప్రార్థించుచుంటిని. నేను నా ఆధ్యాత్మిక మార్గమునందు పతనమందుచున్నానా? నేను ఏదైన తప్పుపని చేసితినా? నాకు తెలిసి యేమియు తప్పుపని చేయలేదు. అంతవరకు నేను నమ్మకముగా చెప్ప గలను. ఓ ప్రియమైన ప్రభూ! ఈ విధముగా తిరిగి బాధ పడునట్లు నన్ను ఒంటరిగా వదలిపెట్టకుడు. ప్రతి నిమిషము

నాకు మీరు తప్ప ఇంకెవరును లేరు. మీకు సేవచేయుటకే నేను బ్రదికియున్నాను.

తరువాత, 18వ తేది రాత్రి ప్రార్థన సమయమందు హఠాత్తుగా నేను ఏడ్చుటకు ప్రారంభించితిని. నేను ఎందుకు ఎట్టి ఊహాలతో ఏడ్చుచుంటినో నాకు తెలియదు. తిరిగి నా ఊహాలు నాకు కలిగినవి. నేను చెప్పదగినదంతయు మీతో చెప్పితిని. తరువాత నాకు మనస్సునందు సుఖము కలిగినది. ఓ గురుదేవా! ఇది అంతయు ఎందుకు తటస్థించినది మీకు తెలియును. చేయదగినదియంతయు చేయుడు. ఇట్టి పరిస్థితి మరల కలుగకుండ నేను ఏదైన చేయవలసియున్న నాకు సలహా యొసగుడు.

నేను మరల మీపుస్తకములు చదువుచున్నాను. నేను తెలివితక్కువదానను. నేను అజ్ఞానిని. అనేకపుస్తకములు చదువుటవలన గలుగు లాభమేమి? మీ పుస్తకములలో కొన్నివాక్యములు చదివి వానిపై ధ్యానించుచు వానిని మీరు ఎట్లు అనుభవములో పెట్టుచుంటిరో తలంచుచు, మీ కలయికయందు సౌఖ్యమును పొందుటతో నేదియు సరిరాదు. మీతోగలుగు ఆధ్యాత్మికసంబంధము వలన నాకు పుస్తకములు చదువుటవలనకంటె ఎక్కువ జ్ఞానము కలుగును. జ్ఞానమంతయు మీలో కేంద్రీకరింపబడి యున్నది. మీబోధ కొంత అనుసరించిన అది అనేకపుస్తకములు చదువుటకంటె ఎక్కువవిలువ గలిగియుండును. నా ప్రియమైనగురుదేవా! నాకు ఒక్కజ్ఞానమే కావలెను. అది

మిమ్ము సంతోషపెట్టుట, ఆధ్యాత్మికముగా మీతో కలిసి యుండుట. శాస్త్రములన్నియు నన్ను మరచిపోనిండు. 'శివానందశాస్త్రము' మాత్రము నాకు తెలియనిండు. అది ప్రపంచమందలి అన్ని శాస్త్రముల మొత్తమునకు సమానము. మీరు అర్థముతో వ్రాసిన భగవద్గీత కనిమెరా లైబ్రరీలో చూచినాను. నేను దానినికూడ చదువుచున్నాను. దానిని సులభశైలియందును స్పష్టముగను వ్రాసితిరి. నేను దానిని ప్రేమతో చదువుచున్నాను.

ఓ భగవానుడా! కరుణామూర్తి! నా ప్రియమైన మురుగా! నా గురుదేవా! నన్ను అన్నిటియందు క్షమింపుడు. నేను మీపాదధూళికి సరిగాను. కాని నా అదృష్టము మీ చేతిలోనున్నది. నన్ను విలువగల ఆత్మగా చేయుము. నేను మీలో ఎల్లప్పుడు కలిసియుండునట్లు అంగీకరింపుడు. పూర్తి స్వేచ్ఛతో నన్ను మిమ్ములను ఆరాధింపనిండు. గురుదేవా! నేను మీదానను. నన్ను త్రోసివేయవద్దు. మీరు నన్ను త్రోసివేసిన నేను శాశ్వతముగా పతితురాలనగుదును. నేను ఆధ్యాత్మిక జీవితములో బాలికను. మీ దివ్యకరుణవలన కొన్ని ఆనందానుభవములు నాకు కలుగుచుండెను. మీరు వానిని ఆపవద్దు. ఈ ప్రపంచములో అన్నిటికంటె మీ ఆధ్యాత్మిక కలయిక నాకు అవసరము. దయచేసి మీ ఆరోగ్యమును జాగ్రత్తగా చూచుకొనుడు. ఇంతకంటె నేను చెప్పునది ఏదియు లేదు.

నిన్నటిరోజున రామానందస్వామిజీ మాయింటికి వచ్చినారు. పోస్టుజవాను నాకు ఉత్తరములు ఏవియు లేవని చెప్పినతరువాత నేను మీయొక్క దర్శనముకూడ లేక ఒంటరిగా ఇచ్చట కూర్చొనియుంటిని. ఉత్తరము సాయంకాలము వచ్చినది. ఉదయము వేకువఝామున నాకు ఉత్తేజకరమైన సౌఖ్యము కలుగజేయుకల వచ్చినది. నేను మీ యుత్తరమునకు వేచియుండగా ఎవరో ఒకరు మీ ఫోటోలు కొన్ని తీసికొనివచ్చినారు. వానినిచూచి వానిలో ఏమిఉన్నదో చెప్పవలసినదని అడిగినారు. అవి నాగురుదేవుని అందమైన ఛాయాచిత్రములని నేను చెప్పినాను. అపుడు ఆయన పై బొమ్మలపై తన దృష్టినినిలిపి నన్ను వానివంక మరల చూడుమని చెప్పెను. అపుడు ఆశ్చర్యకరముగా గురుదేవుని ప్రతి బొమ్మప్రక్కన నా చిత్రముకూడ కనిపించెను. నాకు అత్యాశ్చర్యము కలిగినది. అప్పుడు అతడు ఇట్లు చెప్పెను: 'ఇట్టిస్థితిలో నీవు ఎందుకు అనవసరముగా ఆదుర్దా పడెదవు?' ఇది చాల అందమైన కల.

అవును, నేను రామానందజీస్వామిని చూచుటవల్ల చాల సంతోషము కలిగెను. నా ఆధ్యాత్మికగృహమునకు సంబంధించిన వ్యక్తిని చూచుటవల్ల నాకు చాల సంతోషము కలిగినది. అవును; అది నా ప్రియమైనగృహము. అది ఆనందమునకు తృప్తికి నిలయము. నా ఆత్మయొక్క ప్రభువు నివసించుగృహము. నా ఆత్మ ఎల్లప్పుడు అచ్చటనే యుండును. కాని నాప్రభువు నాశరీరమును ఇచ్చటనుంచెను.

నేను ఇచ్చట బాధపడవలసివచ్చినది. స్వామిజీ యిచ్చట ప్రార్థనలు చేసెను. ఈరోజుననే ఋషీకేశము వెళ్లుచున్నానని చెప్పెను. ప్రియమైనగురుదేవా! ఇంక నేను ఆపెదను. నా పెద్దఉత్తరమునకు క్షమింపుడు. మీ ప్రియమైన పాదములకు నా ప్రణామములు.

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 54. శస్త్రచికిత్సకుడు శివానందుడు

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

మీ దివ్యపాదములకు ప్రేమతోను, భక్తితోను ప్రణామములు చేయుచున్నాను. 21-వ తేదీన వ్రాసిన ఉత్తరము మీకు చేరియుండును.

మీ పుస్తకము "శివానంద డే టు డే"యును, క్యాలెండరును పంపినందుకు ధన్యవాదములు. ఓ ప్రభూ! పరమాత్మా! నా ప్రియమయిన గురుదేవా! క్యాలెండరుమీది చిత్రము మీయొక్క నూతన లీలయా! ఇది ఆశ్చర్యము కలుగజేయుచిత్రము. మరియు దివ్యమైనది. అసలురూపము. మీచిత్రము సుబ్రహ్మణ్యస్వామివలె నుండవలెనని నేను కోరుచున్నాను. ఎట్లయినను ఆచిత్రము నాహృదయములో నున్నది. ఈనెల "హెల్తు అండ్ లాంగ్ లైఫ్"—ఓహో! సర్వజ్ఞుడవైన నాప్రభూ! అన్నిటిలోను నీవు ప్రత్యేకశక్తి గలవాడ వెట్లయితివి? ఇది చాల ఆశ్చర్యకరముగా నున్నది. కష్టమై, వైద్యసంబంధమైన శబ్దము లుపయోగింపక అంతయు చాల అందముగా తెలియపరచినారు. వైద్యవిద్య తెలియనివారికిగూడ బాగా తెలియుచున్నది. నా ప్రియమైనప్రభూ! నన్ను కంటిజబ్బు ప్రవీణురాలని అంటారు. నేను అన్ని శస్త్రచికిత్సలు చేసినాను. కాని ఒక్క శస్త్రచికిత్సయున్నది. అది మీరుమాత్రమే చేయగలరు. ఆ

ప్రత్యేకమయిన కంటిజబ్బు (Cataract)నకు మీరు మాత్రమే శస్త్రచికిత్స చేయగలరు. నేను నాకండ్లు మీ పవిత్రపాదములవద్ద ఉంచుచున్నాను. దయచేసి వానిని తీసికొని ఆపరేషనుచేసి నాకు దివ్యదృష్టి నీయవలెను. ఇది మీరు నిరాకరించవలదు. గురుదేవా! నన్ను ఆశీర్వదింపుడు. మిమ్ములను ఎల్లప్పుడు చూచుదృష్టి నీయవలెను. నా ప్రభూ! మీరు అమానుషులు. మీయొక్క నిజస్థితి మాకు ఎప్పుడు బయలుపెట్టెదరు?

ప్రియమయినగురుదేవా! ఓ శాంతమూర్తీ! నా ఆత్మయొక్క ప్రియుడా! నాకు కనపడు మురుగా! నాకు మీయందు ఈ భక్తి కలుగుటయందు నేను అదృష్టవంతురాలను. ఈప్రపంచమందు భగవంతుని తెలిసికొనుటకు ఆయనకటాక్షము అవసరము. అది నాకు నా అదృష్టము వలన కలిగినదని నేను ఊహించుచున్నాను. కనుపించని విశ్వదేవతయొక్క కనుపించు స్వరూపమగు భగవాన్ శివానందులను తప్ప నేను ఇంకొక దేవుని ఎఱుగను. ఓ నా ప్రభూ! మీరే నాకు శరణము. నేను మీదానను. మీరు నాకు శాశ్వతమయిన ఉత్తరవాదులు. మీకటాక్షము పొందుటకు తగినలక్షణములు నాయొద్ద లేవని నాకు తెలియును. అయినను దయగల నాప్రభువు నాయందు దయ గలిగియున్నాడు. నేను తమకటాక్షముయొక్క ఆనందము చవిచూచినాను. దానిని ఎల్లప్పుడు పొందు నర్హతకలుగుటకు నేను జీవించి పనిచేయుచున్నాను. అది లేకుండ నేను

ఉండలేను. అది నాకు ఆహారమునకంటె ఎక్కువ అవసరము. దయచేసి నాయందు ఎల్లప్పుడు కరుణకలిగియుండుడు. రాత్రింబవళ్లు నాకు కనిపించెడు భగవంతులరగు మీద్వారా ఆయనకటాక్షము నాపై వర్షించుటకు ఆ కనిపించని భగవంతుని నేను ప్రార్థన చేయుచుందును.

ప్రభూజీ! నాప్రియమయినగురూ! మీయొక్కదయతో కూడిన మాటలు కొన్ని నాశరీరములోపల నా ఆత్మవరకు దూరి నాజీవితమునకు కనిపించుశక్తివలె మారినవి. వానిని నా హృదయాంతర గహ్వారమందు జాగ్రత్తపెట్టినాను. నేను ఒంటరిగానున్నప్పుడు అవి నా స్నేహితులు. మీయెడబాటు కలిగినప్పుడు అవి నాకు శాంతినిచ్చును. నేను నీరసముగానున్నప్పుడు నాకు బలమునిచ్చును. అవి నన్ను ఎల్లప్పుడు మంచిపనులు చేయుటకు పురికొల్పును. నేను మీతో అంతర్గతముగ మాట్లాడుట నాకు స్వభావసిద్ధమైనది. ఓ నా ప్రభూ! మీరు నాలో నొక గొప్ప నిజమయిన అద్భుతమైన శక్తిని మేలుకొలిపితిరి. నన్ను ఉచ్చస్థితికి తీసికొని వెళ్ళితిరి. నాకు నూతనజీవితము నిచ్చితిరి. స్వామిజీ మీరు అన్నిచోట్లనున్నారు. మిమ్ము నాచుట్టును అనుభవించుచున్నాను; నాలో అనుభవించుచున్నాను. మీరు నేను పీల్చుగాలిలోనున్నారు. మీరు నాజీవితములోను, ప్రాణములోను, ఆత్మలోను, నేను చూచు అన్నిటిలోను ఉన్నారు. మీరు సర్వత్ర వ్యాపించు పరమాత్మ. నామనస్సులోనుండి పైకి ప్రకటించని ప్రతిప్రార్థనయు మీరు వినుచున్నారని నేను ఊహించు

చున్నాను. నేను మీయందు భగవంతునివలె గౌరవముతోను, ప్రేమతోను నున్నాను. నన్ను ఎల్లప్పుడు మీ రక్షణలోను, నడిపించుటలోను ఉంచుకొనుడు. నేను నేర్చుకొనవలసినవన్నియు దయచేసి నాకు నేర్పుడు. నన్ను అజ్ఞానము నుండి ఉద్ధరింపుడు. నన్ను మీ కటాక్షమునకు తగినదానినిగా చేయుడు. శాశ్వతముగా మీ ఆత్మలో కలియుటకు మార్గము చూపుడు. నేను ఇప్పుడు ఇంకేమియు లెక్క చేయను. ఓ ప్రభూ! నన్ను ఆశీర్వదింపుడు. మీకు ఇష్టమయినదానిని చేయుటకు శక్తిని అంతరజ్ఞానమును ఇండు. అడ్డంకులు అన్నిటినుండి నన్ను రక్షింపుడు. నా సాధన చేయుటకు నాకు బలమునిండు, మీ కటాక్షమువలననే నేను సరిగా సాధన చేయుటకు వీలగును.

దయచేసి మీ ఆరోగ్యము సరిగా చూచుకొనుడు. దయచేసి యెక్కువపని చేయకుడు. ఇది నేను మీకు చేయు దీనమయిన ప్రార్థన. నేను మీవద్దనుండి ప్రతిదినము మీకు జరుగవలసినదానిని చూచుకొనుచున్న యెడల ఇంత ఆదుర్దా పడనవసరము లేదు. నేను చాల దూరముననున్నాను. ఆవిషయములో నేను దురదృష్టవంతురాలను. మీరు నాకు చాల విలువగలవారు.

నేను ఏవయిన తప్పులుచేసియున్న దయచేసి వానినన్నిటిని క్షమింపుడు. ఎల్లప్పుడు మీ కటాక్షమునకు పాత్రురాలనగునట్లు చూడుడు.

మీ ప్రియమయిన పాదములకు ప్రణామములు. నేను మిమ్ము చూడగలను. ఎల్లప్పుడు మీయొద్దనే యుందును. నా ఆత్మ మీయొద్దకు వచ్చుటను ఎవరును ఆపుచేయలేరు. అది చాల యెక్కువశక్తితో చాల తొందరగా మీయొద్దకు ప్రయాణము చేయగలదు. గురుదేవా! నన్ను క్షమింపుడు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# ౫౫. శివానందులే నా జీవితసారము

గురు దేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

మీ దివ్యమైనపాదములకు ప్రేమతోను భక్తితోను ప్రణామములు చేయుచున్నాను. మృదంగమువిషయమై నిన్నటిరోజున మీవద్దనుండి ఉత్తరము వచ్చినందుకు మీకు ధన్యవాదములు. ఈచిన్నవిషయమైనను మీ ఉత్తరువు ప్రకారము చేయగలిగినందులకు చాల సంతోషముగా నున్నది. మీసలహాప్రకారము నేను ఒకటి తీసికొనివచ్చె దను. ఇక్కడనుండి యింకను కావలసినవస్తువులు ఏవైన నున్నయెడల తెలియపఱచ గోరుచున్నాను.

ప్రియమైన గురు దేవా! శివానందనగరమునుండి పోష్టు జవాను ఉత్తరము నాచేతికి ఇచ్చునప్పుడు నాశరీరము సంతోషముతో ఉప్పొంగును. మంచి విలువగల ఆ పొడుగు పాటి కవర్లకొరకు వేచియుండునప్పుడు నాకు ఎట్టి ఆదుర్దా ఉండునో మీకు తెలియునా? నేను వానిని చదువునపుడు నేను మద్రాసునుండి ఆనందకుటీరమునకు చేరినట్లును అచ్చట అన్నియు మరచి నా ప్రియమగుదేవునితో నున్నట్లును ఊహించెదను. నాజీవితములో మీరు ఒక ముఖ్యభాగ మయితిరి. నా చెవులు మీ ఆత్మయొక్క ఆంతరిక సంగీతము వినుటకు ఆసక్తితో నిక్కియుండును. నాహృదయము మీ ఆత్మయొక్క ఆంతరికసంగీతములో తాళము వేయునట్లు

కొట్టుకొనుచుండును. నాకండ్లు సర్వవ్యాపకములో మిమ్ము వెదకుచున్నట్లుండును. అంతటను వ్యాపించు మీశక్తిలో కొంతభాగముతీసికొని నేను ఊపిరి పీల్చుచున్నట్లు కనిపించును. మిమ్ము స్థాపనచేసిన నా హృదయాంతర్గతమునుండి మీ మృదువైన సందేశము తీసికొనుటకు నా నెత్తురు నా హృదయమునకు పరువెత్తుచున్నట్లుండును. మీ సందేశము యొక్క మాధుర్యము శరీరమంతటికి తెలియచేయుటకు నా నెత్తురు ప్రవహించుచుండును. మీకు సేవచేయుటకు కావలసిన బలముకలుగుటకు నేను శరీరమును ఆరోగ్యముగా నుంచుకొనుచున్నాను. ఓ శివానందదేవా! పరమానంద మూర్తీ! మీరు నాజీవితసారమైనారు. నాపరమాత్మను చేరుటకు ప్రయత్నించుటలో భక్తి అనునదిలో ఎల్లప్పుడు ఈదుచున్నాను. మీ అంతులేని శాశ్వతానందమును స్వేచ్ఛ యొక్క తీరమును నేను ఎప్పుడు చేరగలను? ప్రియమయిన స్వామీ! ఈపద్ధతి త్వరగా జరుగుటకు దయచేసి మార్గము బోధించవలెను. నేను అందులకై నాహృదయపూర్వకముగా ఆసించుచున్నాను. నాశక్తికొలది దానికి ప్రయత్నించుచున్నాను. ఓప్రభూ! నా యందు దయయుంచవలెను. నేను అపూర్ణురాలనని నాకు తెలియును. అట్టి ఉచ్ఛస్థానమును చేరుటకు నాకు తగిన అర్హతలు లేవని నాకు తెలియును. నేను మీ కాలి రజమునకుగూడ పోలను. కాని ఓదయగల నా ప్రభూ! మీరు నాకు నేర్పగలరు. నేను నేర్చుకొనుటకు ఆసక్తురాలనై యున్నాను. మీరు నన్ను మార్గములోపెట్టి

పైకి తీసికొని రాగలరు. సమస్తమును సమర్పించుకొనిన యీ వ్యక్తిని విడువవలదు. దయగల ఓ ప్రభూ! మీ దయగల చూపు నాపై ప్రసరింపజేయుడు. శక్తివంతమైన మీ చేతితో నన్ను పైకి లేవనెత్తి ముందుకు నడుపుడు. గురుదేవా! నాకు మీకంటె ఇంకెవరును లేరు. నా ప్రభూ! ఈ సంగతి మరువకుడు. నేను మీ ఆత్మలో ముఖ్యభాగమును. బహుశా నేను చేసిన ఏ అపరాధముననో విడివడియున్నాను. నేను పవిత్ర్యమును పొందుటకు నా శక్తివంచన లేకుండ ప్రయత్నించుచున్నాను. ఓ మురుగా! నా ప్రార్థనలు వినుడు. నన్ను మరల ఎన్నడును ఒంటరిగా విడువవలదు. మీ వద్ద నుండి నన్ను విడిచిపెట్టకుడు. మీ దివ్యశక్తితో నన్ను కప్పి జాగ్రత్తగానుంచుడు. మీకు ఇష్టముగా నుండు పనులు చేయుటకు నాకు ఉత్తేజము కలుగజేయుడు. నేను పతితురాలను కాకుండ చూడుడు. మరియు నా మనస్సునుండి చీకటిని దయచేసి పోగొట్టుడు. అది మీ దివ్యకాంతియొక్క బలమైన రేఖవలన జరుగవలయును. గురుదేవా! మహా ప్రభూ! భగవంతుడు నన్ను మీకు సమర్పించిన ఆశ్చర్యకరమయిన విధమును దయచేసి ఆలోచింపుడు. ఓ ప్రభూ! నేను ఏమి వ్రాయుచుంటినో నాకే తెలియదు. భగవంతుడే నాచే ఈ ప్రకారము వ్రాయించుచున్నాడు. నేను నా ప్రార్థన గదిలో కంటికి కనిపించునటువంటియు నొకప్పుడు కనిపించనటువంటియు నా మురుగని చిత్రపటముల యెదుట కూర్చొని యున్నాను. నా కండ్లనుండి కన్నీటిబిందువులు కారుచున్నవి.

ఓ నా ప్రభూ! అవి కృత్రిమబాష్పములు కావు. అవి నాకు మీయందుగల భక్తియొక్క సారమైన పవిత్రబిందువులు-ముత్యములవలె స్పష్టమైనవి. నేను ఎల్లప్పుడు మీకు నమ్రకముగా ఉండుదానను. నేను స్వార్థపరురాలను కాను. అట్టి ఉద్దేశములు నాకు లేవు. నాకు కావలసినది మీ కటాక్షము మాత్రమే. ఇది స్వార్థపరతయా? మీయొక్క అంతులేని దివ్యకటాక్షము మీ ద్వారా నావైపు ప్రవహించుచున్నది. అదియే నాకు గొప్ప ఆనందమును నిచ్చుచున్నది. ఒకసారి దాని ను[illegible]వాత దానినే మరిమరీ కోరుచుందును. అ[illegible] తప్పా? అ[illegible]నను నాకు తెలియదు. ఆకోరికను ఆపుకొనుటకు నాకు శక్తిలేదు దానిని ఆపుకోవలసియున్న యెడల ఎట్లు ఆపుకోవలయునో మీరే నాకు బోధింపవలసియున్నది. గురుదేవా! నేను ఇంక ఆపెదను. దీనికి అంతు ఉండదు. నేను ఎన్నియో పుటలు నింపగలను కాని మీ కాలము చాల విలువగలదని నాకు తెలియును. తరచుగా నాకు గలుగుచున్న యీ ఆవేశములకు నన్ను క్షమింపుడు. అప్పుడప్పుడు నాకు ఏమిజరుగునో మీకు తెలియదేమో! అది నాకు కొంత సహాయపడును. కాన నేను వ్రాయునట్టి విషయములకై మీరు నన్ను క్షమింపగోరుచున్నాను.

మీరు మీ విలువగల ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారా? ఇంకొక నెలవరకు నేను ఇట్టి సందిగ్ధస్థితిలో ఉండవలసియున్నది. నేను అచ్చట నున్నప్పుడు ఉదయమున నే లేచి నా ప్రియమయిన దేవుడు దగ్గరనే యున్నాడను

తెలివిగలిగి ఆఫీసుగదిలోనికి వెళ్ళి మిమ్ములను చూడవచ్చు ననియు మీ దివ్యవాణి వినవచ్చుననియు తెలిసికొనినప్పుడు నాకు పట్టరానిసంతోషము గలుగును. గురుదేవా! నన్ను ఆశీర్వదింపుడు. నాత్రోవలో ఎట్టిఅడ్డంకులు రాకుండ చూడుడు. మిమ్ములను దర్శించుటకు నేను రోజులు లెక్కించుచున్నాను. ఆ ఉద్దేశము కలిగినంతమాత్రమున నేను సంతోషముతో ఉప్పొంగిపోవుదును. క్రిందటిసారి ఏమిజరిగినదో నాకు తెలియదు. కాని ఈసారి 'మానవరూపమునయున్న నా దేవుడు శివానందనగరములోనున్నాడు. ఇంకెక్కడను లేడు' అను పూర్తిజ్ఞానముతో నేను వచ్చుచున్నాను మరియు నేను నా సొంత ఆధ్యాత్మికగృహమునకు సంతోషముతో ఆహ్వానింపబడుదునని నాకు ఇప్పుడు పూర్తినమ్మకము గలదు. నేను అక్కడ ప్రతివ్యక్తిని కలిసికొనవలెనను ఆసక్తితో నున్నాను. ప్రతివారు నాకు ప్రియులే. గంగామాయి నన్ను కౌగలించుకొని నా భగవానుని కలసికొనుటకు తగినట్లు నన్ను పవిత్రురాలను చేయును. నామనస్సునందు చాల మనోహరమైన కోరిక లున్నవి. వానిని తరచుగా నేను విడుదల చేసెదను.

నా ప్రియమైనప్రభువునకు ప్రణామములు. నేను తమ దివ్యపాదములు ముట్టవచ్చునా? నన్ను త్వరలో మీతో నుండునట్లు దీవింపుడు. నేను మీకు 21, 23 తేదీలలో వ్రాసియున్నాను. ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 56. ఆయన రాజ్యమునకు ఎగురుట

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

భక్తితోను, ప్రేమతోను మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. నా ఆధ్యాత్మిక దినచర్య మీకు అందినట్లు తెలిపినందులకు మీకు నా ధన్యవాదములు. నేను 21, 23, 25 తేదీలలో వ్రాసిన మూడు ఉత్తరములకు జవాబు ఇంతవరకు వచ్చియుండలేదు. ఓ నా ప్రభూ! మీకు పని ఎక్కువగా నున్నదా? మీ వద్దనుండి కొన్ని పంక్తులు వచ్చుటకు నేను ఎంత కోరికతో నున్నానో మీకు తెలియునా? మీరు మీ అదృశ్యమైన కలముతో నా హృదయములోనికి వ్రాయగల శక్తి కలిగియున్నట్లు మీకు తెలియును. నాకు అది అనుభవమున్నది. అది కొంతవరకు నేను చదువగలను. కాని పూర్తియైన సుఖశాంతి సుఖము కలుగుటకు నాకు మీ ఉత్తరము కావలెను. మీ సహాయము దొరికిన వెంటనే దయచేసి ఉత్తరము వ్రాయుడు. అది నాకు ఆహారముకంటె ఎక్కువ అవసరము. కాని దాసి కొరకు ఓర్పుతో వేచియుండుటకు ప్రయత్నించెదను. నా హృదయ వేదన మీరు గ్రహించగలరా? నేను ఆ ప్రకారము ఈ రోజున ఉదయము 3 ఘంటలకు నిద్రనుండి లేచినాను. మీ యెడబాటువలని బాధ అనుభవించుటకు సాధ్యమైనంతవరకు

ప్రయత్నించుచున్నాను. అపుడపుడు అది ఎక్కువ బాధ కలుగజేయుచున్నది.

ప్రియమైన గురుదేవా! మీరు అంతటి దివ్యమధురముగాను, ఆశ్చర్యముగాను ఆకర్షణీయముగాను ఆనందమయముగాను ఉన్నారు. నాకు ఆ రహస్యము తెలియునని నేను ఊహించుచున్నాను. నా దేవుడా! మీరు నా ప్రియమైన మురుగనుని దాచినారు. ఆ దైవస్వరూపము గత కొన్ని సంవత్సరములనుండి నా సహచరుడుగా నుండి నాకు శాంతి గలుగజేయునదిగా ఉన్నది. మీరు ఆయనను మీలో దాచుకున్నారు. కాని నా కండ్లు లోపలికి దూరి అక్కడ ఆయనను చూడగలుగుచున్నవి. తన కటాక్షమువలననే ఆయన నాకు కనుపడుచున్నాడు. ఓ దయగల గురుదేవా! ఆయనను నాకు దూరముగా నుంచవలదు. ఆయన నా యొద్దకు రాకుండ మీరు చేయవలదు. నా శరీరమునందలి ప్రతి అణువు ఆయన కొరకు ఎట్లు తహతహలాడుచున్నదో మీకు తెలియును. మీకు అనుభవము కలదు. అది మీ హృదయమును మెత్తపరుపజాలదా? మీకు నా యందు అనుకంపము లేదా? ఆయన విషయమై నేను ఎంత అసహాయురాలనుగా నున్నానో మీకు తెలియదా? నేను ఫిర్యాదు చేయుటకు తగిన కారణము లేదు. ఆయనకు నాయందు చాల దయగలదు. అది మాటలతో చెప్పనలవికాదు. నాకు తెలియును. మనలో ఆశ్చర్యమైన భావకలదు. మనము ఒకరితో ఒకరు కలసిపోయిన క్షణములు గలవు. అది నేను

అనుభవించిన మధురానుభవము. శరీరము వదలివేయ బడెను. మరియు మనము శరీరము లేని ప్రపంచములో నుంటిమి. అచట పలుకదగిన భాష లేదు. మామూలు ఇంద్రియములవల్ల తెలిసికొను విషయములు అచ్చట ఉండవు. అది ఒక ఆశ్చర్యకరమైన స్వర్గము. దయగలిగిన సమయములందు ఆయన తన దివ్యవైభవముతో గూడిన ఉచ్ఛస్థానమునుండి నా అంతరాత్మతో మాధుర్యమైన కల యిక [illegible] కలిసికొని మనల పైకి [illegible]ళ్ళుచుండును. ఆకర్ష ణీయముగా నా ఎరుక [illegible] నప్పు పైకిలాగి ఆయనయొద్దకు కొనిపోవుచు [illegible] నా దేహకమునతో అనుభవించిన వానిలో చాలా దివ్యమైన ప్రకాశము. నేను నా అను భవమును ఇంతకంటె విపులముగా వర్ణింపలేను తరచుగా ఈ ఆధ్యాత్మిక కలయిక విద్యుత్ మీటా వేసినట్లు హఠా త్తుగా కలుగును. మరియు అప్పుడు నేను ఈ ప్రపంచమందు ఉండజాలను. కొలది కాలములో అచ్చటికి చేరుదును. అచ్చటికి ఎవరును రాలేరు. అచ్చట ప్రాపంచిక శాసనము లుండవు. అచ్చట ఎట్టి భేదము కనుపించదు. అది ఆనంద మహాసముద్రము. అట్టి సమయమున నేను భగవంతునిలో నున్నానని భగవంతుడు నాలో నున్నాడని చెప్పుట కష్టము. అది ఎడతెంపులేని ప్రవాహమువలె నుండును. అది ఏ వైపునకు పారుచున్నదో చెప్పుట కష్టము. అచట కలయిక యుండును. అది గొప్ప ఆనందము, శాంతి మరియు తృప్తిని ఇచ్చును, తన దివ్యకటాక్షము రుచిచూపి ఆ తరువాత

ఆయన అదృశ్యుడై తనకొఱకు నేను అంతకంతకు శోధపడు నట్లు చేయును. అయినను ఆయన నా యందు దయగలిగి యుండును. సర్వజ్ఞుడును దయగల వాడునగు నా ప్రభువు నకు నేను ధన్యవాదము లర్పించుచున్నాను. నా హృదయ మందు నేను ఆయనకొరకు తయారుచేసిన దేవాలయమునకు ఆయన తఱచుగా వచ్చుచుండును. మరియు నన్ను మంచిగా నుండుమనియు మంచి చేయుమనియు ప్రోత్సహించుచుండును. ఆయన సలహాకు వ్యతిరిక్తముగా నెవరును పోజాలరు. ఆయన చాల ప్రేమతో సలహాయిచ్చును. రోజంతయు నేను నా హృదయము పవిత్రముగా నుండునట్లు జాగ్రత్తపడు చుందును. నాకు తెలియకుండ అందు మాలిన్యములు ఏవైన చేరునేమో యని భయపడుచుందును. అది మలినముగా నున్నదని తెలిసిన తక్షణమే ఆయన దానియొద్దకు వచ్చుట ఆపివేయును. అట్టి ప్రమాదము వినుటను గూడ నేను సహించను. అటు తరువాత నేను ఉండజాలను. అప్పుడు నేను జీవించిన ప్రయోజనము లేదు. ఇప్పుడు నాకు ఆయన కటాక్షము తప్ప ఇంకేమియు అవసరము లేదు. ఓ భగవానుడా! అది ఎట్టి ఆనందము! నేను దానిని ఎట్లు వర్ణించను? ఇంకెవ రైనను దానిని వర్ణించగలరా? లేరు, ఎవరును చేయలేరు. దాని తియ్యటి రుచి, మత్తు గలిగించు సూక్ష్మమైన రుచిని తెలిసికొనుటకు దానిని త్రాగవలెను. ఏ మానవుని కలయిక గాని ప్రేమగాని యీ ఆనందమును నీయజాలదు. అల్ప మనుజుని స్థితికి దిగినపుడు దాని గుణము మారిపోవును.

దాని దైవత్వము పవిత్రత కోల్పోవును. అనేక సార్లు ఆయనను నాలో నెల్లప్పుడు నుండులాగున బంధించుటకు వీలగు మార్గము తెలిసికొనగోరితిని. కాని మరు నిమిషముననే నా స్వలాభము నేను కనిపెట్టితిని. ఆయనను కోరువారు అనేకు లున్నారు. ఆయన ఎందరనో ఆశీర్వదింపవలసి యున్నది. ఆయనను బంధీకృతునిగా జేయ వీలులేదు. కాని తనయందు భక్తిగలవారియందు తఱచుగా ఆయన కనబడుచుండును. నేను చేయవలసిన పని నా భక్తిని వృద్ధి చేసికొనుటయే. ఆ పని యిప్పుడు నాకు చాల సంతోషము సౌఖ్యము నిచ్చునట్టియు అప్రయత్నముగా చేయదగినదియునై యున్నది. ఇంతవరకు నేను ఆయనయందు భక్తిని పొందుటకు ఆయన కటాక్షమే కారణమను విషయము నాకు మరపునకురాదు. మరియు కటాక్షమును నా యొద్దనుండి ఎన్నటికిని తొలగించవలదని ఆయనను ప్రార్థించుచున్నాను. నా యొద్దనుండి విడిపోవుటకు అడ్డంకిగా శక్తికొలది ప్రయత్నము చేసెదను. ఆయన నా జీవితసారము, నా హృదయసారము. నేను ఇక ఆయన లేకుండ జీవింపజాలను. దీనిని బట్టి నేను నా కర్తవ్యము చేయుటలో అశ్రద్ధ చేయుచున్నానని అనుకొనవలదు. కాలమంతయు ఆయనకొరకు తీవ్రాసక్తితో ఆయన నాకు విధించిన పనులన్నియు చేయుచునే యున్నాను. నేను అన్ని పనులు చేయుటకు బలముగలిగి యున్నాను. ఏలననగా ఆయనను సంతోషపెట్టుటకు ఆ పనులు చేయుచున్నాను. ఆయనను సంతోషపెట్టుటయే నా జీవితములో ముఖ్యమైన

కోరిక. నేను ఆయనకొరకే జీవించియున్నాను. ఆయన ఒక్కడే నా ప్రియుడు. ఆయన నా జీవితము, నా సంతోషము, నా ప్రాణము మరియు నా ఆత్మ. ఈ విధముగా ఊహించుటచే నాకు ఆనందము కలుగును. నేను జీవిత మంతయు సంతోషముగా అనుభవించితిని. మరియు అంతయు అశాశ్వతము, నిరుపయోగము అని కనిపెట్టితిని. ఓ ప్రియమైన ప్రభూ! నా గురుదేవా! మీ ద్వారా నేను ఎల్లప్పుడు ఆయనలోనుండు లాగున ఆశీర్వదింపుడు. మీలోననే నేను ఆయనను కలిసికొన గలిగితిని. నాకు తెలుచు ఆయన దర్శనము కలుగునట్లు చేయుము. నేను మీరు కోరినదంతయు చేసెదను. ఆయనను త్వరలో నెట్లు చేరగలనో అది నాకు తెలుపుడు. ప్రతి నిమిషము ఎక్కువ విలువగలది. నా జీవితములో చాలభాగము వృథాగా పాడుచేసితిని. భగవంతుడు ఇక్కడనే ఉండెను. కాని నేను తెలిసికొనలేక పోయితిని. పోయిన కాలమును ఎట్లు కూడబెట్టుకొనగలనో తెలుపుడు. ఇతరులకు ఏమియు బాధ కలుగకుండా తప్పించుకొని ఎల్లప్పుడు ఆయన దగ్గర నుండుట ఎట్లో తెలియపరచుము. మీరు నాయొక్క తీవ్ర ఆతురత కనిపెట్ట గలిగితిరా? ఓ ప్రియమైన ప్రభూ! నన్ను ఎన్నడును ఒంటరిగా విడువవలదు.

గురుదేవా! నేను మనస్సులో నుండు ఊహాలన్నియు బయలుపరచితిని. ఇపుడు నాకు తేలికగా నున్నది. నేను విషయములు వ్రాయని యెడల నాకు ప్రమాదము కలుగునని ఊహించితిని. నా అనుభవములు ఎంతవరకు నిజమో

దయ చేసి తెలుపుడు. ఇవన్నియు భ్రమలు కావని నా నమ్మకము. దయచేసి నన్ను సరియైన మార్గమున నడుపుడు.

ప్రియమైన గురుదేవా! నాకు కలుగుచున్న యొక ఆందోళన విషయమై నాకు మీ సలహా, సహాయము కావలెను. గత కొన్ని దినములనుండి అప్పుడప్పుడు ధ్యానమునకు కూర్చుండిన సమయమునందుకూడ స్వామి పూర్ణానందజీ యొక్క స్మృతివలన నాకు కలతగలిగి విచారముగా నుంటిని. మీకు కోపమైనను నిరుత్సాహము కలిగించు విషయములు వ్రాయకుండ జాగ్రత్తపడుచున్నాను. అందువలన నేను వారి మహాసమాధి విషయమై వ్రాయుట మానినాను. మరియు మీ శిష్యురాలు చెల్లమ్మాళ్ ను గురించి కూడ వ్రాయలేదు. నేను ఆ గతించిన ఆత్మలకు ప్రార్థన సలుపుచున్నాను. ఇపుడు మీ సహాయము అవసరమై మీకు వ్రాయుట తప్పనిసరి యైనది. మిమ్ము శ్రమ పెట్టినందులకు క్షమించి చేయవలసిన పని చేయుడు.

మీ విలువగల ఆరోగ్యవిషయమై జాగ్రత్తపడుడు. శ్రీనివాసజీ ఇక్కడకు ఇప్పుడే వచ్చినారు. ఆయన ద్వారా నూనె పంపవలసినదిగా మీరు కోరినట్లు ఆయన తెలిపినారు. దానిని క్రమముగా ఉపయోగించుచుండుడు. నా ప్రియమైన ప్రభూ! మీ పాదములకు ప్రణామములు.

ఎల్లప్పుడు మీ దాసను,

చెల్లా.

# 57. బాష్పతత్త్వము

మురుగా! గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

భక్తితోను ప్రేమతోను మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. మీరు దయతో వ్రాసిన ఉత్తరమునకు తగినంతగా ధన్యవాదములు సమర్పింపజాలను. నా ప్రేమగల ప్రభూ! మీయొక్క ఆలోచనీయమైన మృదుత్వము ఆలోచన నిజముగా అమానుషమని చెప్పవచ్చును. నేను నామనస్సు నాస్వాధీనమందుంచుకొనలేనని మీకు తెలియును. కన్నీళ్ళు కార్చుటకు మనోహరములగు కొన్ని క్షణములుండును. అట్టి సమయములందు నాప్రియమైన ప్రభువు నాపై కనుపర్చు కటాక్షము అను అమృతము పొంగిపొరలి నాకండ్లద్వారా బయటికివచ్చునట్లు నేను ఊహించెదను. నేను మీదయగల ఉత్తరము చదువ ప్రారంభించిన సమయమున అందుండు దయతో గూడిన ఉత్తేజకరములగు మాటలనుండివచ్చు ఆనందము నాశరీరమంతటను వ్యాపించి అదృశ్యమగు వార్తాహరులవలె నాకండ్ల వెనుక నిలిచియుండునాయని నాకు ఆశ్చర్యముగలుగుచుండును. తక్షణమే ఆ ఫలితము కనిపించును. కొద్దికాలములోనే నేను క్రొత్త జీవితము, ఆశ, సంతోషము, శాంతి సుఖములతో నిండియుండును. ఓ ప్రియమగు గురుదేవా! మీకు నా ధన్యవాదములు.

ఓ గురుదేవా! భగవంతునియొక్క స్వస్వరూపము తోను జీవితముతోను నున్న పవిత్రదేవాలయమా! మీరు మీకండ్లు మూసికొని మీలోనుండు మనోహరమైన నా మురుగనును చూడుడు. మీరు మమ్మిద్దరను అచట చూచుటలేదా! ఆ అందము మీకండ్లకు మిరుమిట్లు గొలుపుటలేదా? అంతరదృష్టితో ఆతనను జూచువారు ఎన్నడును అలసటజెందరు. జీవించు దేవాలయమగు నా గురుదేవునిలోపల నేను ఆయనను రేయింబవళ్లు పూజింతును. ఎల్లప్పుడు ఆయనపాదములకడనుండి తన కటాక్షమును నాపై వర్షింపమని మౌనముతోకూడినభక్తితో కోరుదును. ప్రతియుదయము ఆయనకు పూలతో అభిషేకముచేసి భక్తిమాలతో ఆయనను అలంకరించెదను. తఱచు నా కన్నీళ్లతో ఆయనపాదములు కడిగెదను. నేను ఏపనియైనను చేయుటకు పూర్వము దాని మంచిచెడ్డలనుగూర్చి ఆయనను అడిగెదను. నేను తిను ప్రతిపదార్థము ముందుగా ఆయనకు అర్పణ చేసెదను. నేను ఆయనను పూజించువిధములన్నియు వర్ణింపజాలను. ఈపవిత్రమయినజీవితములోనున్న ఆ దేవాలయము యొక్క బాహ్యాకర్షణీయమయిన ప్రకాశము చూచునప్పుడు మరియు ఇప్పటి పవిత్రమైనస్థితికి తీసికొనిరాదగిన ఆమేధాశక్తియొక్క ఆవరణము చూచునపుడు, మరియు ప్రసిద్ధికెక్కిన గౌరవముగల డాక్టరు కుప్పుస్వామినుండి విడివడగల ఓర్పు ఆత్మశక్తి, ఆరూపములో భగవంతుడు నిలిచియుండుటయు చూచినపుడు నాయొక్క కించిత్వము

అనధికారత్వము నాకు అనుభవమునకు వచ్చును. మరియు అనేకమంది గొప్పవారు ప్రపంచమందలి అన్ని భాగముల నుండివచ్చి ఆ దేవాలయముచుట్టు మూగినపుడు ఆ దేవాలయములోనికి జొచ్చుటకు నాకు భయమును సందేహమును కలుగును. కాని నేను భక్తివల్ల ఆశక్తికి లోనగునప్పుడు అన్నియుమఱచి లోనికివెళ్లుటకు ధైర్యముగలుగును. ఒక్కసారి లోనికివెళ్లినతరువాత నాకు సౌఖ్యముగా నాయింట నున్నట్లే యుండును. అప్పుడు నాకు అట్టిసందేహమును భేదభావమును కలిగించినవి నా బాహ్యచక్షువులని నాకు అనుభవముకలుగును. లోననుండు నాప్రియమైన ఆండవన్ నా అనర్థాలు అన్నియు మఱచిపోవునట్లు చేయును. మొదట ఆయన స్థూలరూపమున కనిపించును. కాని దగ్గరగ వెళ్లిన కొలది రూపము అదృశ్యమగును. మరియు చాలదగ్గరకు సమీపించినప్పుడు అతడు మిక్కిలి శక్తికలిగిన ఆనందకరములగు సూక్ష్మస్పందనముల ప్రోగుగామారి పోవును. నేను ఆ మనోహరమయినశక్తిలో మునిగిపోయి స్వర్గీయమయిన ఆనందము అనుభవించెదను. ధ్యానము ఇపుడు నాకు గొప్పసౌఖ్యముగా మారినది. ఈప్రపంచము విడిచి, శరీరము విడిచిపెట్టినట్లుగా నిశ్చలమయిన ఆకాశము లోనికి ఎగురుట మరియు సంతోషము కలుగజేయు ఆశ్చర్యమగు శాంత్యోద్రేకములు—ఇవన్నియు చాల అద్భుతముగా నుండును; అప్పుడే నేను మీకు దగ్గరగానున్నట్లు ఊహించెదను. ఈ అనుభవముల అవతలనున్న దానిని తెలిసికొనుటకు

నాశక్తికొలది నేను సాధన నిష్కపటముగా చేయు చున్నాను. దీనిని తెలిసికొనుటకంటె నేను ఇంకొకదానిని నాజన్మలో ఎన్నడును కోరియుండ లేదు. మరియు అందులో కలిసిపోయి ఆపవిత్రమయిన ఏకత్వమునకే కోరుచున్నాను. నాప్రియమయినప్రభూ! నేను మిమ్ములను అనేకవిధముల అనేకజన్మలలో పూజించియున్నానని నా నమ్మకము. ఒక జీవితములో ఇంతభక్తి కలుగ నేరదు. నేను అంతయు ఆయ నకు వదలిపెట్టెదను. నా ప్రియమయినప్రభూ! నేను మీ దానను. నన్ను విడువవలదు.

శ్రీ ఆల్గర్ట్సు కాగర్ట్సు నిన్నటిరోజు మద్రాసు చేరి నారు. అట్టి చిన్నవయసులో అట్టి ఆధ్యాత్మికకాంతు చూచుట చాల సంతోషకరమయిన విషయము. అప్పు డప్పుడు మీయొక్క గొప్పదనము మరియు శక్తిచూచి భయపడుచుందును. ఆ ఆల్గర్ట్సు అడయారులో దివ్యజ్ఞాన సమాజమునకు వెళ్లుటకు కోరెను. కాబట్టి మేమిద్దరము నిన్న అక్కడకు వెళ్లితిమి. కొన్నిరోజులనుండి మాఅమ్మకు జబ్బు గా నున్నందున నేను ఆ ఆల్గర్ట్సుతో కొద్దిగంటలకంటె ఎక్కువకాలము ఉండ లేకపోయితిని. మీకటాక్షమువల్ల ఈదినము మాతల్లి ఖులాసాగ నేయున్నది. ఆమెకు దగ్గు జ్వరమువచ్చినది. నేను మీరు ఈమధ్య తీయించుకొన్న ఛాయాచిత్రములన్నియు చూచితిని. మిమ్ములనుగూర్చి నాకు కావలసినవిషయములన్నియు తెలిసికొంటిని.

నేను 5-వ తేదీని 30 రూపాయలు శివరాత్రి పూజ నిమిత్తము మాణిఆర్డరు పంపియున్నాను. ఈరోజు ఋషీకేశము వచ్చుచున్న ఓంజీ ద్వారా కొన్ని లేత కొబ్బరికాయలు కొన్ని కురిడీ కొబ్బరికాయలు పంపినాను. మీకు లేత కొబ్బరికాయలు ఇష్టమని నేను విన్నాను. మంచివి దొరకలేదు. కాని పంపించినవి చెడ్డవి కావు. దయచేసి వానిని స్వీకరింపుడు.

మీరు ఇచ్చిన సలహాలకు మీకు నాధన్యవాదములు. నేను వానిని అభ్యసించుటకు ప్రయత్నము చేయుచున్నాను. మరియు మీకు సంబంధించినవిషయములోతప్ప మిగిలిన అన్నివిషయములలో ఉత్తీర్ణత పొందుచున్నాను. మీకు సుస్తిగానున్నదని ఊహించినప్పుడు నేను నిశ్చలత్వము కోలుపోయితిని. మీకటాక్షమువలన తిరిగి మామూలుస్థితికి త్రిప్పుకొని మీ బోధనప్రకారము జీవించెదను నేను చాలా మందజ్ఞానము కలదానను. కాని నాలోటు సవరించి నన్ను సరియైనమార్గమున నడుపుడు. నేను మీ మృదుత్వము, దయ మరియు జ్ఞానము పొందినపుడు అన్నియు చేయగలను. తమరు ఆనందస్వరూపమే.

నా ప్రియమైన పభూ! మీ దివ్యపాదములకు ప్రణామములు. త్వరలో నేను మీ పాదసన్నిధికి వచ్చెదను. దానిని తలచుకొనునప్పుడు నాకు ఆవేశము కలుగును. దయచేసి నన్ను దీవింపుడు.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

# 58. తమ కటాక్షమే నన్ను పోషించుచున్నది

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను భక్తితోను మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. నిన్న వచ్చిన దయగల మీ ఉత్తరమునకు నా హృదయపూర్వకమైన ధన్యవాదములు చేయుచున్నాను.

ప్రియమైన ప్రభూ! నేను మిమ్ములను స్వయముగా కలిసికొని దగ్గర దగ్గర సంవత్సరమైనది. కాని నా జీవితమందలి ప్రతి ఘడియయందును మీ స్పృహ నాకు ఉన్నదని చెప్పుట అతిశయోక్తి కాదు ప్రతిసారి తమ దివ్యమైన ప్రేమగల ముఖము అందు నేను చూచిన ప్రతిభావము మీ యొక్క ప్రతిపద్ధతి, మీ కంఠధ్వని యొక్క ప్రతి మధురమైన స్పందనము నా జ్ఞప్తియందు ఎల్లప్పుడుండును. మరియు నేను దగ్గరనుండి కొన్ని నిమిషముల క్రిందటనే మిమ్ములను విడిచినట్లు ఊహించెదను. నేను త్వరలో మిమ్ము కలిసికొందునని ఊహించునప్పుడు నా లోపలనుండి మిమ్ములను పూజచేయవలయునను ఊహ కలిగినప్పుడు నా శరీరమంతయు భక్తియను నిప్పులో కరగిపోవును. మరియు నేను పరవశతలో మునిగిపోవుదును. ఓ ఆశ్చర్యమైన భగవంతుని ప్రకటిత స్వరూపమా! మీరు మనుష్యమాత్రులు కారు. మీరు ఆనందము యొక్కయు ప్రేమయొక్కయు స్వరూ

పులు. మీ వైభవము నేను వర్ణించుటకు నాకు శక్తి లేదు. నన్ను మీతో కలిపినందులకు భగవంతునికి నిరంతర ధన్యవాదము లిచ్చుచున్నాను. మీరు చిరునవ్వు నవ్వినప్పుడు ప్రపంచమంతయు నవ్వినట్లు కనిపించును. మీరు నా విషయమై సంతోషించినప్పుడు ప్రపంచము నందలి అందరితో సంతోషముగా నుందును. అపును గురుదేవా! మీ కరుణాపూరిత కటాక్షము నా జీవితమునకు వెలుతురు పోషకశక్తి అయినది. పగలంతయు రాత్రంతయు మిమ్ములను నేను ఆరాధించుచుందును. నిద్రపోవుటకు ముందు నాకు కనుపడు భగవంతుని నేను ధ్యానము చేసెదను. నేను నిద్రనిమిత్తము కండ్లు మూసికొనినప్పుడు మీరు నాలోనుండి తప్పించుకొని పోవుదురేమో యని ఊహించి మిమ్ములను ధ్యానము చేసెదను. మరియు నా ఊపిరి నెమ్మదిగా విడుచునప్పుడు మీరు నా హృదయాంతర్గతమందు విసరుచున్నట్లు ఊహించెదను. ఇవన్నియు విపరీతములైనను నిజమైనవి. మరియు వారి మధురమైన తలంపే నా జీవితము నిలుపుకొనుటకు కారణమగుచున్నది. దయతో గూడిన తమ కటాక్షమువలన నేను చేరగలిగిన ఉచ్చస్థితి అనుభవము వలన నాకు కలుగు అద్భుతమైన దివ్యసౌఖ్యమునకు తగినట్లు మీకు నేను ధన్యవాదములు సలుపజాలను. మీ దివ్యప్రకాశము నన్ను చుట్టియున్నదని నేను ఊహించుచున్నంతవరకు నేను మీ రక్షణలో సురక్షితముగా నుందునని నాకు తెలియును. నా ప్రపంచ ఆదుర్దాలు అన్నియు మీతో వెళ్ళకక్క మీ

దయతో గూడిన శక్తితో శాంతముగా నిద్రించుటను మీరు నాకు బాగా నేర్పియున్నారు. నా లొంగని మనస్సు మీరు ఆతురతతో ఆపుచేసి మార్చుటకు ప్రయత్నించిన విషయము నాకు జ్ఞప్తికి వచ్చినపుడు నేను మీయందు భక్తితోను కృతజ్ఞతతోను నిండినట్లు ఊహింతును. కొన్ని సంవత్సరములలో సంపాదించిన పాపములు కొద్దిరోజులలో పోగొట్టుటకు మీకు శక్తిగలదని మీరు నాకు కనుపర్చినారు. నా లోపములు నా అనుపయోగత మీకు పూర్తిగా తెలిసినప్పటికి మీరు దయతో గూడిన ఉత్తేజకరములగు ఉత్తరములు నాకు వ్రాయుదురు. మరియు నా హీనత చంపివేయుటకు ప్రయత్నించెదరు. మీవల్ల వచ్చు ప్రతి దయగల మాటయు నా భక్తి వేయిరెట్లు వృద్ధియగునట్లు చేయును. మరియు నేను కృతజ్ఞతతో విచారపడుదును. నేను వృథాగా ఖర్చుపెట్టిన వయస్సంతయు మంచి మార్గమున ఉపయోగించి నా గురువు యొక్క కటాక్షము పొందుటకు తగిన పరిపూర్ణత కలిగించుకొనక పోతినేయని పశ్చాత్తాపపడుదును.

ఔను, ఏప్రిల్ నెల దగ్గరకు వచ్చినది. నా భగవంతుని త్వరలో కలిసికొనగలనని నేను ఊహించుకొనినప్పుడు నాకు ఎట్టి యనుభవము కలుగునో నేను వర్ణించలేను. అది నేను సాధారణ భాషలో తెలియపరచలేని అనుభవము. కాని ధ్యానములో మీరు దగ్గరగా నున్నట్లు తెలియపరచు ఆశ్చర్యము సంతోషకరమునైన ఆవేశము కలిగినపుడు నా హృదయము మీతో అన్ని భాషలలోనికి పవిత్రమైన

భాషతో మాట్లాడును. అది ఒకానొక దివ్యానుభవము. ఈ రోజులలో సూర్యుడు ఎప్పుడు ఉదయించునో ఎప్పుడు అస్తమించునో నాకు తెలియదు. నా మనస్సులో ఏదో ఒక అంతు లేని ఊహ ఉండును. మరియు నేను అన్ని పనులు యంత్రము తనంతట పని చేసినట్లు చేయుచుందును. నా సుఖమును ఊహలను పాడుచేయు కదలికగల భూతముగూడ ఒకటి యున్నది. అప్పుడప్పుడు నేను శక్తిహీనురాలనుగా నుందును. నేను మీ యొద్దనుండవలసిన రోజులు దగ్గరకు వచ్చుచున్నవి గనుక నా ప్రతిస్వల్పలోపము కూడ గొప్ప దానివలె కానిపించుచున్నది. ప్రియమైన గురుదేవా! నేను మీకు అసౌఖ్యము కలిగించు ఏ పనియైనను చేసియుండిన యెడల దయతో నన్ను మన్నింపుడు. మీ యందలి భక్తితో పూర్తిగా తడిసియున్నానని దయతో గ్రహింపుడు. నేను మిమ్ములను సంతోషపెట్టుటకే ఎల్లపుడు ఆతురతతో నుందును. కాని నా అజ్ఞానమువల్ల మీకు ఇష్టము లేనిది ఏదైన నేను చేసినయెడల దయచేసి నన్ను సవరింపుడు. క్షమింపుడు. మీ కటాక్షముతో ఆశీర్వదింపుడు. గత కొన్ని మాసములలో మీకు అనేక తెలివిగల ఆత్మలతో పరిచయము కలిగినది. నన్ను వారితో పోల్చిచూచిన నేను శూన్యమనే. ఇది నాలో నాకు తెలియని యొక భయమును కల్పించుచున్నది. నేను తృప్తిపఱచుకొనుటకు ప్రయత్నించెదను. మీయందు నాకున్న మిక్కుటమైన భక్తి కారణమున నేను అన్నియు సరిచేయగలను. కాని అపుడపుడు నా మానవమనస్సు నన్ను

పోసప్పుచ్చును. ప్రార్థనలే నాకు ఊరడింపులు. నాకు ప్రార్థనలయందు చాల నమ్మకము గలదు. మనుజులలో తుచ్ఛులనుగూడ ప్రేమించుటకు మీకు శక్తిగలదని నాకు తెలియును. నా తప్పులన్నియు క్షమించుటకు భగవంతుని ఇదే హృదయపూర్వకముగా ప్రార్థనచేయుదును. మరియు మీ కటాక్షము నాయందు ప్రసరింపజేయుటకుగూడ భగవంతుని ధ్యానింతును. మీరు మాత్రము నాకు సలహాలిచ్చుచుండవలెను. నేను మిమ్ము సంతోషపెట్టుటకు ప్రతిపనీ అది ఎట్టిదైనను చేయుటకు సిద్ధముగా నున్నాను. ఓ నా భగవంతుడా! నా ప్రియమైన ప్రభూ! మీ కటాక్షములేనిది నేను జీవించలేను. నేనేమి చేయగలను? బహుశా ఇది పూర్ణ భక్తియొక్క స్థితికాదు కాబోలును. మీ కటాక్షమునకు యాచింపకూడదని నాకు తెలియును. కాని ఈ విషయమున నేను అసహాయురాలను. నిజస్థితి ఏమనగా మీరు నన్ను విడిచిపెట్టినను మీయందు నాకు గల భక్తి యెన్నడును తగ్గదు. నేను ఎంత శక్తి నుపయోగించినను దానిని ఆపజాలను. కాని నేను మీ కటాక్షము కొరకు యాచించెదను. నేను తప్పుచేసిన నన్ను క్షమింపుడు. పరిపూర్ణతకు నన్ను తర్ఫీదు చేయుడు.

మీ దయగల పాదములకు నా ప్రణామములు. దయయుంచి నాకు బలము జ్ఞానము నిచ్చి నన్ను దీవింపుడు.

ఎల్లప్పుడు మీ దాసను,

చెల్లా.

# 59. ఆనందకుటీరముయొక్క పిలుపు

గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను, భక్తితోను మీ పవిత్రపాదములకు ప్రణామములు చేయుచున్నాను. నేను 17వ తేదీన వ్రాసిన ఉత్తరము మీకు అందియుండునని ఆశించుచున్నాను.

నిరాటంకమగు శక్తి నన్ను మీకు ఇపుడు వ్రాయుటకు ప్రేరేపించుచున్నది. ఈ రోజు ఏకాదశి. నేను ఉపవాసమున్నాను. కాని ఓ ప్రియమైన ప్రభూ! మీరు నన్ను ఆశ్చర్యకరమగు ఆధ్యాత్మిక ఆహారముతో పోషించుచుండగా నాకు ఆహారమెందులకు?

నేను నాయందు ఉప్పొంగు భక్తి కనపడుచునపుడు కొన్ని విషయములు వ్రాయుటకు మరచిపోవుదును. మీరు నాకు నూనె, మందు, పుస్తకములు, ప్రసాదము పంపినందుకు మీకు ఆలస్యముగా ధన్యవాదము లర్పించుచున్నందుకును, నేను ఆధ్యాత్మిక దినచర్య వ్యాఖ్య, లిఖితజపము ఆలస్యముగా పంపుచున్నందుకు నన్ను దయయుంచి క్షమింపుడు. వానిని ఈరోజుననే వేరే పోష్టుద్వారా పంపుచున్నాను. రోజంతయు నామనస్సు నావరించియుండు ఒకానొక ముఖ్యమైన ఊహ యీరోజులలో అనేక విషయములను మఱచునట్లు చేయుచున్నది.

మేము ఏప్రిల్ 2 వ తేదీన ఇచ్చటనుండి బయలు చేరవలయునని తలచుచున్నాము. అక్కడకు 5 వ తేదీన వచ్చెదము. నాకు ఎట్టి ఆటంకము కలుగకుండా నన్ను ఆశీర్వదింపుడు. నన్ను త్వరగా తమయొద్దకు చేరనిండు. నేను మిమ్ములను చూడగోరుచున్నాను. నేను ఇదివరకే అక్కడ నివసించియున్నాను.

ఈసారి శివరాత్రి నాకు విచిత్రముగా కనిపించు చున్నది. పగలు రాత్రి అంతయు నా ఆత్మ మీవద్దను భగవంతునివద్దను నున్నది. నా యొక్క ప్రాణము శివుని దేవాలయమునకు వెళ్ళి అక్కడ పూజచేసినాను. రాత్రి అంతయు అయినాపరము దివ్యజీవన సమాజమువారి భజనలో జేరి ఆనందించుచు హర్షించుచు జాగరణ చేసియున్నాను. నాకు నిద్రపట్టలేదు. ఎందువలన ననగా ఆ సంగీతము నన్ను రాత్రి అంతయు నా ప్రియమైన ప్రభువునొద్దకు తీసికొని పోయినది. అట్టి కారణమున నేను ఆహారము నిద్ర మఱచి పోయితిని.

ఓ ప్రభూజీ! గురూజీ! పరమ స్వరూపా! సచ్చిదానందమూర్తీ! నా ప్రియమైనప్రభూ! మీకు వ్రాయుటకు వీలైనమాటలు నాకు దొరకుటలేదు. మీరే నాసమస్తము, నాప్రాణము, ఆత్మ సౌఖ్యము అన్నిటికంటె ప్రభువులు. ఓ నాప్రభూ! నా ఆత్మయొక్క దివ్యసంతోషముతో గూడిన సంగీతము మీరు వినుటలేదా? అప్పుడు నేను తెలియపరచలేని విషయములన్నియు మీరు తెలిసికొన

గలరు. గత రెండు రోజులనుండి భగవంతుడు నాయెడల దయగలిగియుండెను. నేను అంతులేని ఆనందములో మునిగి యున్నాను. ఈ నిరంతరమైన ఆధ్యాత్మిక ఆనందము యొక్క నిరంతరమైన ప్రవాహము అన్ని ప్రాపంచిక ఊహాలు గెల్చుటకు ఉత్తీర్ణత చెందినది. నాప్రియమైన ప్రభువు నివసించు ఆనందకుటీరముయొక్క పిలుపును అడ్డు పెట్టలేక యున్నాను. నేను ఋషీకేశములో నున్నాను. తల్లియగు గంగానదియొక్క ఓంకారధ్వని వినినపుడు ఆనంద కుటీరముయొక్క పవిత్రమైన శాంతి సమీరము తనయొక్క మృదువైన తాకుడుతో నన్ను సంతోషపెట్టుచున్నది. దీనితోపాటు మొన్న ఋషీకేశమునుండి సదాశివానంద స్వామిజీ నా ఆసుపత్రికి వచ్చిరి. నేను వారితో చాలసేపు మాట్లాడితిని. తరువాత నిన్న ఓంజీ యిక్కడకు వచ్చిరి. మరియు నా ప్రియమైన ప్రభువుయొక్క విశేషములు చెప్పిరి. ఈ గొప్ప మహిమాత్ములవల్ల నాకు కావలసిన విషయము లన్నియు తెలిసికొన్నాను. ఇది నాకు మిక్కిలి ఆత్మశాంతి కలుగజేసినది. నేను ఆనందకరమైన తృప్తి ననుభవించు చున్నాను. భగవంతుడు నాయందు చాల దయగలిగి యున్నాడు. ఆయన అనేకవిధములుగా నా భయమును పోగొట్టుచున్నాడు. నేను ఎట్లు నా కృతజ్ఞత చూపగలను? నిన్నసాయంత్రము శ్రీ సదాశివానందస్వామిజీ మైలా పూరులో ఒకయింట్లో భజనకు పిలిచెను. మేము సంతో షముతో అక్కడికి పోయితిమి. కొన్ని నిమిషములు నేను

భజనలో నాయకురాలుగా నుంటిని. నేను ఆ ఆధ్యాత్మిక సంగీతముయొక్క ఆనందస్పందనములలో మునిగియున్న పుడు నా కంఠధ్వనియొక్క లోపములు, నా అనుభవ రహితమైనగానము–వీనివిషయమై మరచితిని. నాకు తెలిసిన విషయమేమన ఆ దివ్యగానములో నేను మైమరచి మీ యొద్దకు జేరితిని. అంతకంటె నాకు కావలసిన దేమికలదు? ఓ నా ప్రియమైన గురుదేవా! నేను ప్రపంచ బంధము లన్నియు తెంపుకొనుచున్నాను. తమ దివ్య పవిత్ర పాదము లకు గట్టిగా ఈ బంధములతో కట్టుకొనునట్లు ప్రయత్నించు చున్నాను. మిమ్ములను ఈసారి తప్పిపోనీయను. నాకు గల ప్రతిశక్తితోను నేను పొందగల ప్రతి శక్తితోను నేను మీ కాళ్ళకు గట్టిగా కట్టబడుదును నేను సుఖముగా నుండ వలసినదిగా నొకప్పుడు మీరు వ్రాసినారు. నా ప్రభూ! నేను సంతోషముగా నుండగలిగినచోటు మీ పాదసన్నిధానమే. ధ్యానసమయములందు సౌఖ్యముగా నుందును. రోజులో మిగిలిన కాలమంతయు నా ఆత్మ యింతదూరమునుండి మిమ్ము చేరవలెనని ప్రయత్నించుచుందును. కాని నా శరీ రము అన్నిపనులు చేయుచుండును. నాకు సంతోషము ఎట్లు కలుగును? కాని మీరు నన్ను ఎల్లప్పుడు మీ పాద ములయొద్ద దయచేసి ఉంచగలిగిన నేను సంతోషింతును.

ఓ గురుదేవా! ఆధ్యాత్మికజీవితము చాల ఆశ్చర్య మైనది. భగవంతుడు దయతో ఆ పవిత్రమైన ఆధ్యాత్మిక ఏకత్వదృష్టి కలిగించినాడు. ఆ ఆధ్యాత్మిక ఆనందమును

అప్పుడప్పుడు రుచిచూచుటకు అవకాశము కలిగించెను. ఆ మత్తు కలుగజేయు దివ్యపానీయమును జేరి దానిని నా దాహము తీరునట్లు త్రాగినగాని నేను విశ్రమింపలేను. అది అడ్డుపెట్టుటకు వీలులేని దాహము. తఱచుగా ఆటంకము లేని శక్తివల్ల బలవంతపెట్టబడి నేను ధ్యానమునకు కూర్చుండెదను. అప్పటి నాస్థితి దాహము గొనినవాడు నీటికొరకు వెదకునట్లుండును. అప్పుడప్పుడు మిక్కిలి ఆసక్తిగల మనుజునివలె నాలోనికి త్రాయుబడిన కటాక్షామృతమును త్రాగుదును. నాకు గలిగిన దివ్యానుభవములన్నియు మీ కటాక్షమువల్ల గలిగినవని నాకు తెలియును. అట్టి స్థితిలో నా జీవితమందలి ప్రతి క్షణమునను మిమ్ములను పూజించుటలో ఆశ్చర్యమేమున్నది? మీ దివ్యమాధుర్యము యొక్క జ్ఞప్తి నాకు రాత్రింబగళ్లు అనుభవమునకు వచ్చును. నా జీవితములో గొప్ప సంఘటన మీలో నేను కలిసికొనుటయే. దానియొక్క అద్భుతమైన అనుభవము నన్ను అప్పుడప్పుడు చకితురాలనుగా చేయును. నాకు మీకు కలిగిన ఆధ్యాత్మిక సమావేశ సమయమునుండియు అంతకు పూర్వమునుండియు మీయందు నాకు గలుగు గొప్ప భక్త్యావేశమువల్ల ఆత్మయొక్క నిరంతర స్థితియు ఆధ్యాత్మిక అవకాశములు తెలిసినవి. ఎన్ని పుస్తకములు చదివినను ఈ విచిత్రమైన అనుభవము లేనిదే నాకు ప్రవేశ అనుభవము గలుగలేదు. నాకు మొదట గలిగినట్టి నేను ఎల్లప్పుడు మీదానను అనెడి మొదటి ఆధ్యాత్మిక ఉత్సా

హము నేను మరచిపోజాలను. నా ఆత్మకు ఆకర్షణ కలుగుటకు అదియే మొదటిసారి. నేను వివిధ దేవాలయములకు వెళ్ళి వివిధముగా అలంకరింపబడిన భగవత్స్వరూపములు చూచినను సామాన్య పవిత్రతతో కూడిన పళని ఆండవను యొక్క రూపమునే పూజించుటకు ఎక్కువగా ఇష్టపడు చుందును. భగవంతుని మార్గములు విచిత్రములు. ప్రార్థన కంటె ఎక్కువ శక్తిగలది యింకేదియు లేదు. భగవంతుని దయకు నేను ఆయనకు ఎల్లప్పుడు నమస్కరింతును. దివ్య జీవితము గడుపుటకు నా శక్తియంతయు ఉపయోగించు చున్నాను. తమ కటాక్షమువల్ల ఏదో ఒకరోజున నా గమ్యస్థానమును చేరగలను. నేను కష్టపడుటకు ఓపికతో వేచియుండుటకు లెక్కచేయను. కాని, నాకు బలము, సౌఖ్యము నిచ్చుటకు ఆ కాలమంతయు మీ కలయిక కావలెను ఇప్పుడు మీరు లేనిదే నేను శూన్యము. కాన, దయచేసి ఎల్లప్పుడు మీ కటాక్షముతో నన్ను దీవింపుడు. నేను కోరునది యిదియే. నన్ను ఎన్నడును విడిచిపెట్ట వలదు

నా ప్రియప్రభూ! మీకు నా ప్రణామములు. త్వరలో నేను మీ పాదములకు వందనముచేసి, మీరు నాతో మాట్లాడు పలుకులు వినెదను. ఆ ఆనందముకొఱకు నేను నిరీక్షించుచున్నాను.

శాశ్వతముగా మీదానను,

చెల్లా.

## 60. ఆత్మనివేదనము

గురుదేవా! నా విలువగల మరియు ప్రియమైన ప్రభూ!

ప్రేమతోను భక్తితోను మీ ఆనందమయములగు పాదములకు ప్రణామములు చేయుచున్నాను. నేను మీకు 17, 22 తేదీలలో ఉత్తరములు వ్రాసియున్నాను. అవి మీకు చేరియుండునని ఊహించుచున్నాను. ఇంక కొలది రోజులుమాత్రమే నేను వేచియుండవలయును.

ఇంత తొందరలో తిరిగి మీకు వ్రాసినందుకు క్షమింపుడు. నేనయి దీనిని వ్రాయుటలేదు. అప్పుడప్పుడు ఒక దివ్యశక్తి నన్ను ఆవేశించును. అది నాచేత దాని యిష్టప్రకారము చేయించుచున్నది. మేము ఇచటినుండి 2-వ తేదీన బయలుదేరుదుము. 5-వ తేదీన మీ పవిత్రపాదముల యొద్ద నుందుము. అయినను ఎడబాటుయొక్క ఇంత బాధ ఎందుకు అనుభవించుచుంటినో నాకు తెలియదు. నేను ఇప్పుడే మిమ్ములను చూడవలెనను బాధను సహించలేక యున్నాను. భగవంతుడు నాయందు నిజముగా చాల దయ గలిగియున్నారు. నేను 19 వ తేదీనుండి విడువకుండా ఆనందము అనుభవించుచున్నాను. ఈమధ్యాహ్నముకూడ మీ యొక్క స్పష్టమైనరూపము కనిపించినది. ఈరోజులలో నాలో మీఅనుభవము కలిగినప్పుడు నాకు చాల ఆనందము కలుగును. నేను మీ ఛాయాపటమును చూచినప్పుడు ఎడ

బాటుయొక్క అనుభవము పొందుదును. నేను మీనుండి విడిగా నున్నానను అనుభవము పొందుటకు నాకు ఇష్టము లేదు. ఓ నామనోహరమైన ప్రభూ! భగవంతుడు నన్ను మీనుండి ఎందుకు ఎడబాటు కలుగజేయుచున్నాడు. ఆయనను మీయందుమాత్రమే నేను చూచుచున్నానని ఆయనకు తెలియదా? అయితే నన్ను ఇట్టి కష్టస్థితిలో ఎందుకు ఉంచినాడు. ఎల్లప్పుడు ఆయనయొద్దనే యుండవలెనను బ్రహ్మాండమైన ఆసక్తి నా ఆత్మశక్తినంతయు పోగొట్టుచున్నది. ఇప్పుడు నా పూర్వస్నేహితురాలొకతె నేను క్లబ్బుకు ఎందుకు వచ్చుటలేదనియు తన్ను ఎందుకు కలిసికొనలేదనియు అడిగినది. కారణము చూచాయగా నేను తెలిపితిని. అట్టి సాధకజీవితము గడపుటకు నేను మిక్కిలి చిన్నదానవని ఆమె ఆక్షేపించినది. ఓగురుదేవా! నేను ఈ నా సాధకజీవితమును ఆలస్యముగా ప్రారంభించినానని ఊహించుచుంటిని. కాని యితరులు ఆప్రకారము తలంచుటలేదు. నేను నాజీవితములో ఈమార్గమును చాల ఆలస్యముగ ప్రారభించితిని కనుక పోయినకాలమును గూడ దీయవలెనని ఊహించుచుంటిని. కాని యిందుకుకూడ నాకు పూర్తిస్వాతంత్ర్యము లేదు.

గురుదేవా! మిక్కిలి ఆశ్చర్యకరమైన ఒక బంధన వల్ల నేను మీకు కట్టుబడితిని. ఆ బంధన మరల విడిపోవునదికాదు. భగవంతుడు చేయుకార్యమును ఎవరు అడ్డగింపగలరు? ప్రాకృతికవస్తువులు కలుపుటలో మనుష్యుడు ఉత్తీ

ర్ణడుకావచ్చును. ఆత్మలను కలుపుట భగవంతుడుమాత్రమే చేయగలడు. అవును తరచుగా తనకు ప్రియమైన అంతటను వ్యాపించెడు శాశ్వతమగు ఆత్మ కనిపించకపోయినను నా హృదయములో దూరినట్లు నాకు అనుభవముకలదు. అట్టి సమయమందు కాలము ఆగిపోయినట్లు కనిపించును. నా ఊపిరి ఆగిపోయినట్లు కనిపించును. అప్పుడు నేను అనుభవించు శాశ్వతానందము వర్ణించుటకు మనుష్యమాత్రునికి శక్తియుండదు. ప్రపంచమానముతో గూడిన అట్టి సౌఖ్య సమయములందు అత్యద్భుతముగా మన ఆత్మయొక్క ఏకత్వము నాకు తెలుపబడును. నేను మీకు పూర్ణముగా శరణాగతురాలనగుదును. నన్ను పవిత్రురాలను చేయుటకు నన్ను సరియైనమార్గమునబెట్టి దివ్యజీవనము జీవించుటయందు ఉత్తేజపఱచెదరు. అట్టి సమయములయందు నాకు బోధించుసూచనలయొక్క మాధుర్యము ఆదినమందలి మిగిలినభాగమందు శాంతిపాఠముగా నాయొద్ద నిలిచియుండును.

గత కొన్నిదినములనుండి మీయందుగల మిక్కుటమైనభక్తి, ఎడబాటుయొక్క తీవ్రమైనబాధ ఈ రెండిటి మధ్య నాహృదయము నొక్కబడుచుండెను. అది నేను భరించలేకయున్నాను. కాబట్టి నాలోనివిషయములన్నియు మీకుతెల్పి శాంతిపొందుటకై యీ యుత్తరము మీకు వ్రాయుచున్నాను. మీకు వ్రాయుట నాకు ఉపయోగకారి. అది చాల ఆశ్చర్యకరమైన సూక్ష్మక్రియ. అప్పుడప్పుడు

నేను ఈ మనుష్యరూపమున వేరుగా నుండలేనట్లు ఊహిం చుచుందును. మీకు నాకు మధ్య అడ్డమువచ్చెడు ప్రతివిష యము నేను నాశనముచేయ కోరుచున్నాను. నాకు సహాయ కారిగా నుండునని తోచునెడల నా చెడ్డ స్థూలశరీరమును గూడ నాశనముచేయుదును. కాని అది సరియైన మార్గము కాదని నాకు తెలియును. నేను కష్టపడి పనిచేయవలసి యున్నది. నేను పవిత్రురాలను కావలసియున్నది. నేను ఆర్ద్రహృదయముతో ఆయనను ప్రార్థింపవలసియున్నది. ఏనాటికైనా ఆయన నాప్రార్థన వినకతప్పదు. నన్ను అంతిమ ధ్యేయమునకు తీసికొనిపోవును. ప్రస్తుతము మామూ లుగా నుండుటకు నా దినచర్య జరుపుకొనుటకు నా ఆత్మ శక్తియంతయు ఉపయోగింపవలసియున్నది. నేను కష్టపడు చున్న విషయముతప్ప ఇంక ఏదియు నాకు ముఖ్యముకాదు. ఆకారణమున నాగది అశుభ్రముగా నుండును. ఇతరవిష యములందుకూడ నేను అలక్ష్యముగా నుందును. ఇట్టి నా స్థితి కొందరకు అసౌఖ్యము కలిగించును. నాకు ఏమి తట స్థించుచున్నది వారికి తెలియచెప్పుట నాకు అసహ్యముగా నున్నది. నావిషయమై నాకే ఆశ్చర్యముగానుండును. ఇత రులు నావిషయమై ఎట్లు బోధపర్చుకొనగలరు? ఇట్టి మహా సముద్రములో మునిగియుండుటవల్ల నేను ఆనందమును మరియు బాధను ఒకేసమయమున పొంది బాధపడు చున్నాను. అంతమంచివిషయము అంత చెడ్డవిషయము ఒకే

సమయమందు కలుగుట నాకు ఎన్నడును తెలియదు. నేను మంచి ఊహాలతో నిండియుందును. కాని వానిని నేను తెలుపలేను, మీయందు నాకుగల తీవ్రమైనభక్తియొక్క వేడి నేను ఆ ఊహాలను మీకు తెలియపర్చుగల శక్తినంతయు భస్మము చేసినది.

ప్రియమైనప్రభూ! నాకుగల తీవ్రమైన భక్తిని మీ పాదపద్మముల సన్నిధానమున నివేదింపనిందు. మీరు నా విషయమై ఏమి ఆలోచించుచనదియు నేను తలంచుట లేదు. నేను అందుకు అర్హతకలదానవా కాదా అను విషయము నాకు బాధ కలుగజేయుట లేదు. మీయొద్దనుండి నాకు ప్రతిఫలముగా ఏదైనావచ్చునా అను విషయముకూడ నాకు లెక్కగా కనిపించుట లేదు. నేను ఎల్లప్పుడు మీకు ఇచ్చుచుండుటకు మాత్రమే అనుజ్ఞయిందు. హద్దు లేనట్టియు అంతు లేనట్టియు నాభక్తిని మీకు అర్పణచేయవలెనను నాకోరిక నేను అడ్డగింపజాలను. నా యీవియొక్క ఆనందము నన్ను అనుభవింపనిందు. ఆహా! ఇది భక్తియొక్క మిక్కిలి విచిత్రమైన స్థితి. ఇట్టిది నాకు ఇదివరకు ఎన్నడును తెలియదు. ఇప్పుడు నాహృదయము మీ పాదములవద్దనుంచితిని. దానిని మీకు పూర్తియైన భక్తి నమ్మకము గౌరవము ఆశ-వీనితో నిచ్చుచుంటిని. మీరు దానిని కాలిక్రింద మట్టగించవచ్చును లేదా నెమ్మదిగా స్వీకరించవచ్చును. దాని విలువనుబట్టి మీరు దానిని మీ యిష్టము వచ్చినట్లు చేయవచ్చును. దానిని మీరు ఏమి చేయదలంచు

కొన్నను అది ఎల్లప్పుడును మీదే. అవును నేను దానిని మీ యందుండు నా కనుపించెడు మురుగనుకు శాశ్వతముగా అర్పించినాను. భగవంతునికి నా ప్రార్థన ఏమనగా మీరు సుఖముగా ఆరోగ్యముగా నుండుటయు మిమ్ములను సేవించుటకు నాకు అవకాశము కలుగజేయుటకును నాకు ఎల్లప్పుడు నిస్వార్థమైన భక్తి ఆవేశము కలుగుటకును దానివలన నాకు భయము సందేహము నిరుత్సాహము నీచత్వము- ఇవి కలుగకుండుటకును నన్ను ఆశీర్వదించుమనియే.

ఓ నా విలువగల ప్రభూ! భగవంతుడు నాకు ఏమి చేసినాడు? నన్ను ఎచ్చటికి తీసికొని పోవుచున్నాడు? ఇది ఎచ్చట సమాప్తి చెందును? నేను ఆయనకు శరణాగతులాలనైతిని. ఆయన తన యిష్టప్రకారమే చేయనిండు. ఇంక నా జవాబుదారి లేదు.

మీ పవిత్రపాదములకు ప్రణామములు.

ఎల్లప్పుడు మీదానను,

చెల్లా.

# 61. పరాభక్తి స్వభావము

గురుదేవా! మిక్కిలి అమూల్యమైన ప్రేమ గల నా ప్రభూ!

దయతో గూడిన మీ పాదములకు ప్రేమభక్తితో పొంగి పొరలు హృదయముతో ప్రణామములు చేయుచున్నాను. నా ప్రియమైన ఆత్మస్వరూపా! నేను మీకు ఏమి చేయగలను? మీ ఉత్తరములు నాకు జీవితాధారములై యున్నవి. అవియే నా గీతోపనిషత్తులు నేను మీకు తగినట్లు ధన్యవాదము లీయజాలను. దయగల పవిత్రమైన మీ 26 వ తేది గల ఉత్తరమునకు నేను ధన్యవాదము లీయగోరినపుడు నేను తగినట్లు ధన్యవాదము లీయజాలక పోయితిని. నేను నిన్న జవాబు వ్రాయ నుద్దేశించితిని. కాని భక్తికృతజ్ఞతవల్ల నింపబడిన నా చేతులు వణకెను. నా కండ్లు మూతలుపడెను. కాబట్టి నేను ఆ ప్రయత్నము విడిచి ధ్యానమునకు గూర్చుంటిని. నా ప్రభూ! ధ్యానమనునది ఎవరు కనిపెట్టిరి? అది చాల విచిత్రమైన అనుభవము. భగవంతుడు నిజముగా ఈ పేదరాలియందు దయగలవాడు. ఓ నా మనోహరమైన ప్రభూ! కాలమంతయు నా ఆత్మ యీ శరీరమునుండి మనస్సునుండి ప్రపంచమునుండి బయటకు వచ్చుటకు ప్రయత్నించుచున్నది. అది నా జీవితమునకుమూలమగు వాడును, ఈ ఝంఝూటమునకు వెలుపలనుండువాడును నగు నా ప్రియుని వెదకుటకు బాధపడుచుండెను. ఈ మాంస

పరిసరములను మించి నా ప్రియ ప్రభువును కలిసికొని ఆత్మైక్యము ననుభవించుట ఎంతయో మధురమైన అనుభవము. అట్టి కలయిక దేశకాలములందు ఎన్నడును కలుగదు. ఉత్కృష్టస్థితియందుండు నా దయగల ప్రభువు బహుశా నా హృదయవేదన వినుచుండును. నా ఆత్మ యొక్క దైన్యమైన ఆకర్షణను తెలిసికొనును. ఆయన నేను ఎక్కగలిగినంత మితికి దిగివచ్చును. అప్పుడు నాకు ఆయనతో ఆధ్యాత్మికకలయిక కలుగుటకు వీలుండును. ఓ నా ప్రియమైన ప్రభూ! మీ అంతస్తున నేనుకూడ తేలుటకు నాకు ఎందుకు నేర్పరు? నేను చేరుటకు కష్టముగా నుండు స్థలమున మీకు ఎందుకు ఉందురు? నన్ను దూరముగా నుంచుటకు అట్లు చేయుదురా? నేను మీకు అపకారము చేసితినా? మీరు నన్ను కలిసికొనకుండ ఎందుకు నిలిచి యున్నారు? మీ దయకు నేను పాత్రురాలనుకానా? అట్లయిన నన్ను పాత్రురాలనుగా ఎందుకు చేయరు? నా ఆత్మ యొక్క నిరంతరరోదనము మీకు వినిపించుట లేదా? నా భక్తికంటె ఎక్కువ విలువగలది ఏదైన ఎవరైన మీకు సమర్పించుచున్నారా? ఓ నా జీవితమునకు జీవితమా! నేను మిమ్ము పూజించెదను. మీరు నాకు అవసరము. తరచు నా నాలుకకు ఆహారము రుచించదు. అది చెప్పునది ఏమనగా నా ప్రియునకు స్తోత్రము ప్రేమతోకూడిన మాటలు చెప్పి ఆనందము అనుభవించిన పిమ్మట ప్రాకృతిక ఆహారము అనుభవించలేనని. నా కండ్లు చెప్పునదేమనగా మిమ్ములను

చూడగలిగినప్పుడే తమ పూర్ణవిషయము తెలియపరచ గలవని. నా చేతులు నా ప్రియునకు కానుకలిచ్చుటలో నేను ఉపయోగించునపుడు తప్ప ఇతరసమయములయందు నాకు పనిచేయమని చెప్పాను. నా కాళ్ళు నా ప్రియుని యొద్దకు వెళ్లుటకు మాత్రమే ఉపయోగించెదమని చెప్పాను. నా కడుపు నా ప్రియుడిచ్చు ప్రసాదమును జీర్ణింపజేయుట యందు తనకు సంతోషము కలుగునని చెప్పాను. నా ప్రియుని ప్రతిశ్వాసతో జ్ఞాపకముంచుకొనిన పనిచేసెదనని రహస్యముగా చెప్పాచు నా నెత్తురు నా హృదయములో స్థాపితమైన నా ప్రియుని పాదములు కడుగుటకు మాత్రమే ప్రవహించుటకు ఒప్పుకొనును. నా ప్రియమైన గురుదేవా! భక్తియొక్క యింతటి తీవ్రత కలిగియుండుట మీకు తెలిసి నదా? దీనికంటె ఎక్కువ విలువగల యితరమగు ఈవి మరి యేదైన నున్నదా? భగవంతుడు నన్ను వేరే వ్యక్తిగా ఎందుకు సృష్టించినది నాకు ఆశ్చర్యము కలిగించుచున్నది. నా శరీరము ప్రతి అణువునుండి భక్తి ఉబుకుచున్నది. అది నన్ను దహించుచున్నది. నా హృదయమంతయు మరియు ఆత్మ మీ పాదములయొద్ద నున్నవి. నా నెత్తురు యొక్క ప్రతిబిందువు దివ్యప్రేమతో తడిసియున్నది. నేను మీలో పూర్తిగా కలిసిపోయితిని. ఆహా! నన్ను ఎల్లప్పుడు మీ యందే ఉండనిండు. నేను ఇంక నాదానను కాను. నేను ఎక్కడకు వెళ్ళినను, ఏమి చేయుచున్నను నేను ఆ కనుపడు ముద్దుగనుకు తెలిపికొనుచున్నాను. ఆ ఆధ్యాత్మిక ప్రియుడు

నన్ను ఎల్లప్పుడు తనయొద్దనే యుంచుకొనుచున్నాడు. బహుశా యీ సంగతి మీకు తెలియకపోవచ్చును. నేను చాల మనోహరమైన స్నేహితుని కనిపెట్టినాను. చాల కర్తవ్యముల మధ్యనున్నను శరీరములు బాహ్యచేష్టలలో మగ్నమైయున్నను మేము స్వయముగా నొకరినొకరము చూడకుండ ఇతరులకు తెలియకుండ ఒకరితో నొకరము మాట్లాడుకొనగలము. నేను నా ఆధ్యాత్మిక ప్రియుని ఇక నన్ను విడిచి వెళ్ళనీయను. ఆయన నాయందే యుండునట్లు నా శక్తికొలది ప్రయత్నించెదను. ఆయన అద్భుతమైన ప్రకాశము మనోహరత్వము ఎవరు వర్ణింపగలరు?

గురుదేవా! 'ప్రియుడు' అను మాట చాల మనోహరమైనది. మరియు ఆంగ్లభాషలో అది చాల శక్తివంతమైన మాట. ఆనందమంతయు దానియందు రూపు దాల్చినది. అది చాల పవిత్రమైన మాట.

నేను ఇదివరకుకంటె బలిసితినని యెవరో నాతో చెప్పిరి. నా ప్రియమైన ప్రభువునకు నాలో స్థలముండుటకు నేను పెరిగితినని నేను ఆమెతో చెప్పదలచితిని. నేను పిచ్చి పిచ్చిగా మాట్లాడుచున్నానా? అవును నేను దివ్యసంతోషముతో నిజముగా పిచ్చిదాననే. నేను ఎల్లప్పుడును ఈ విధముగనే యుండుటకు ఇష్టపడుదును.

మేము రెండవ తేదీన బయలుదేరుచున్నాము. నా కళ్లు 5 వ తేదీన మీ దివ్యరూపమును జూచి ఆనందించును. నేను మిమ్ములను చేరునట్లు దయచేసి దీవింపుడు. మీ

కటాక్షము లేనిదే ఏ పనియు జరగదు. నన్ను చూచుటకు మీరు ఇష్టపడుడు.

నిన్నటిదినము మేము సుశీల అచ్యుతరామన్ ఇంటి యొద్ద భజనకు పోయితిమి. శివానందస్వామిజీ ప్రతిదినము భజనలు జరుపుచున్నారు. ఈ రోజు మా యింట్లో భజన జరుగును. మీ భక్తులను కొందరిని ఆహ్వానించినాను. శ్రీనివాసజీ, మిసెస్ సాంబశివరావు, డాక్టర్ కృష్ణరావు, ఓంజీ, శ్రీ కుప్పుస్వామి, కల్యాణసుందరం, సూర్యనారాయణ అయ్యర్ వగైరా వారందరిని సకుటుంబముగా వచ్చి తమ కటాక్షామృతమును ఆస్వాదింపవలసినదిగా కోరినాను. శ్రీ సదాశివానందస్వామిజీ పూజ చేయుదురు. నేను మృదంగమును కొంటిని. బాగా మృదంగము వాయింపగల యొక వ్యక్తి దానిని పరికించెను.

గురుదేవా! నా ప్రియమైన ప్రభూ! నేను ఇపుడు గంటలు లెక్కపెట్టుచున్నాను. నా శరీరమునందలి ప్రతి అణువు మిమ్ములను చూడవలెనని ఆశతో స్పందించుచున్నది. నా ప్రభూ! నన్ను దీవింపుడు. మీ దయగల పాదములకు నా ప్రణామములు. అట్టి ప్రేమతో గూడిన ఆనందమయమగు పాదములు నా హృదయమందు ఎందుకు ఉంచరు? మిమ్ములను చూచుటకు తీవ్రమైన ప్రయత్నములో బద్దలగుటకు సిద్ధముగా నున్నదాని నెందుకు అడ్డగించెదరు?

ఎల్లప్పుడు మీ దాసను.

చెల్లా.

# 1. ప్రథమ సందర్శనము

స్వామిజీ! కొన్ని విచిత్రమైన సందర్భములలో నేను మీ పుస్తకములు చదువుటకు అవకాశము కలిగినది. ఆ రోజునుండి యిప్పటివరకు ఒక్క క్షణముకూడ మిమ్ములను నా మనస్సునుండి తీసివేయుటకు నాకు శక్తి లేకయున్నది.

నేను ఇంకను చాల ఇతర పుస్తకములను చదివితిని కాని అవి యేవియు నాకు కావలసిన సౌఖ్యము నిచ్చినవి కావు. నేను ఒక పుస్తకాలయమునకు వెళ్ళి కొన్ని పుస్తకములు అడిగితిని. వారు నాకు మీ పుస్తకము 'ఆధ్యాత్మికపాఠములు' ఇచ్చిరి. నేను అందులో కొన్ని పుటలు చదివితిని. మరియు నిక కొన్ని చదువనెంచితిని. నేను ఆ పుస్తకము కొంటిని. అందులో మీ ఫోటో ఉన్నది. అది ఇన్నిదినములనుండి నేను వెదకుచున్న దివ్య మూర్తి యొక్క ఛాయాపటముగా నా అనుభవమునకు వచ్చెను. విద్యుత్తువంటి స్పందనము నా శరీరమందు కనిపించెను. ఇప్పుడు నా మనస్సులో ఏ సమయమందైనను మీ బొమ్మ పోల్చగలను. మొదటి బొమ్మలో మీ మెడలో పూల హారమేమియు లేదు. కాని ఆ రోజున నేను ప్రార్థనకు కూర్చు

న్నప్పుడు మీ దివ్యరూపమునందు పూలదండ కనిపించెను. నేను మరల కొన్ని పుస్తకములలో పూలమాలతో నున్న మీ ఛాయాచిత్రమున్నది. నాకు ఆశ్చర్యము కలిగినది. ఆరోజు నుండి మీకు ఉత్తరము వ్రాయవలెనని సంకల్పించితిని.

నేను మిమ్ములను నా మనస్సులో నా గురువుగా నమ్మి కొనిన పిమ్మట మీ పుస్తకములు మరికొన్ని-శివునిజ్ఞానము, యోగసారము-చదువుట ప్రారంభించితిని.

చెల్లా.

## 2. సుస్థిర పరిణామము

నా కీ దివ్యదర్శనము కలిగినది : మీరొక అడవిలో కూర్చొని ధ్యానము చేయుచుంటిరి. నేను మిమ్ము తదేక దృష్టితో చూచుచుండగా హఠాత్తుగా ఒక ప్రకాశమాన మైన వెలుతురు కనిపించెను. అచ్చట మీరు శ్రీకృష్ణుని రూపమున నిలుచుకొనియున్నట్లు చూచితిని. ఇది బుధ వారము మధ్యాహ్నము జరిగినది.

రెండవ దృశ్యము : అది బుధవారము రాత్రి జరిగి నది. మీరు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి (పళని ఆండవన్) రూపముతో నా పడక దగ్గర నిలుచుకొనియుండగా జూచితిని. మీరు నన్ను జాగ్రత్తగా చూచుచున్నారు. నేను స్తంభించి పోయితిని. ఒక్క మాటయైనను పలుకలేక పోతిని. మీరు నన్ను కొంతసేపు చూచి మీ చేయియెత్తి నన్ను దీవించి అదృశ్యులయితిరి.

ఈ సందర్శనము వలన నేను వృద్ధిపొందుటకు మార్గము కలదని నాకు ఆశగలుగుచున్నది.

చెల్లా.

# 3. శివానందుల ప్రత్యక్ష దర్శనానుభవము

మీరు నెలరోజులు మౌనముగా నుండుటవలన నేను సహింపజాలక పోయితిని. వైకుంఠైకాదశి రోజున మీ దయ ప్రేమతో గూడిన ఉత్తరము అందినది. అది నన్ను నిజముగా వైకుంఠమునకు ఎత్తివేసినది. గురుదేవా! కరుణాసాగర! మీరు చేసిన సహాయమునకు నా హృదయము కృతజ్ఞతతో నిండియున్నది. నేను మీకు ప్రత్యుపకారము చేయుటకు అవకాశము గలుగుటకు ప్రార్థించుచున్నాను. ఇపుడు నేను నిర్మలముగాను సంతోషముగాను నున్నాను. శ్రీ యస్.కు ప్రమాదము కలిగినది. మీ యొక్క కరుణా కటాక్షమువల్ల అతని ప్రాణము రక్షింపబడినది. మరియు మీ దివ్యసహాయమువలన అతడు త్వరలో బాగుపడునని నాకు నమ్మకము గలదు. నేను శివానందనగరము యొక్క విచిత్ర దృశ్యములు చూచుచున్నాను—మీరు నడచెడి మెట్లు, జనులు స్నానము చేయు గంగాఘట్టము, దేవాలయము, తెల్లని భవనములు, సత్సంగ ముహాలు, పొడుగుపాటి బల్లతో నుండు మీ హాలు. అప్పుడప్పుడు మీరు చదువుచున్నట్లు, వ్రాయుచున్నట్లును, శిష్యులతో సంభాషించుచున్నట్లును, పడక కుర్చీలో పరుండియున్నట్లును చూచుచున్నాను.

చెల్లా.

# 4. అమానుషమైన కటాక్షము

గురుదేవా! దృశ్యమానుడవగు నా భగవంతుడా! మీరు దయతోను, ప్రేమతోను తీవ్రమైన ఉత్తరము వ్రాసినందుకు మీకు చాల ధన్యవాదములు. ధనముల మూటయగు మీ పుస్తకములు పంపినందులకు ధన్యవాదములు.

మీ ఉత్తరము నాకు అందినరోజు నా జీవితమునందు చాల ముఖ్యమైన దినము. నేను మీ ఉత్తరము, ఫోటో, ప్రసాదము నా ప్రార్థనమందిరమునకు తీసికొని పోయి నాకు అట్టి విచిత్రమైన గురువును కలుగజేసినందుకు భగవంతునికి ప్రార్థనలను సలిపితిని. మీరు పంపిన ప్రసాదము నా నొసట ధరించితిని. స్వామీజీ! పరమాత్మా! నా విశ్వవిద్యాలయపు అధికారపత్రము నేను మీ శిష్యురాలనని నాకు ఇచ్చిన ఆధారపత్రముతో ఎంతమాత్రము పోల్చుటకు వీలులేదు. నేనుమీ పాదదర్శనమునకు 40 సంవత్సరములు వేచియుంటిని. ఇప్పుడు నాముఖ్యమైన కోరిక నేను మీదయకు పాత్రురాలనగుటయే. నేను మీ ఉత్తరము ప్రతిదినము చదువుదును. అప్పుడప్పుడు అనేకసార్లు చదువుదును. నేను మీ దివ్యరూపము చూచినప్పుడు నాకు గొప్ప ఆనందము సంతోషము కలుగును. మీ ధ్యేయమునకు అనుకూలమగునట్లుగా నేను జీవించుటకు నాకు శక్తిగలుగజేయుడు. నేను మీకటాక్షము పొందుటకు ఏమి చేసియుంటిని? గురూజీ! చెడుమార్గము

నుండి నన్ను తప్పించి రక్షింపుడు. ఉత్కృష్టధ్యేయమునకు నాకు మార్గము చూపుడు. మీ ఊహలచే సలహాలచే నాకు ఉత్తేజము గలిగింపుడు. నాయొద్దకు ఇంకను తఱచుగా రండు. నాకు మనశ్శాంతినిండు. మీ యొద్దనుండి కొన్నిదినములు ఉత్తరములు రాని యెడల నాకు చాల ఆదుర్దాగాను విచారముగాను ఉండును. నాకు రూపముయొక్క అనుభవము గలదు. మీరు భవనముల ప్రక్కన నడుచుచున్నట్లును, గంగానది యొడ్డున నడుచుచున్నట్లు నేను మిమ్ములను చూచితిని. ఈ దృశ్యములు చూచునపుడు నేను స్పృహతోనే యుంటిని. నేను ఏమైన కఠినపు పలుకుపలికిన మీరు నన్ను చీవాట్లు పెట్టుచున్నట్లును నేను తలచెదను. నేను తప్పు గావించిన మీరు నన్ను చక్కచేయుచున్నట్లు నాకు అనుభవము కలుగును. మీ కాళ్ళపై పడునట్టి అదృష్టము గలుగును. మీ దివ్యముఖము చూచెదను. మీ ఆకర్షణీయమైన చూపు అనుభవించెదను. ఆ ప్రకారము నా పాపములన్నియు కడిగివేసికొని నాగమ్యము నేను చేరుదును. ఇచ్చట నేను మీ పాదముల దగ్గరనున్నాను.

నేను ఒక రైల్వే ఉద్యోగస్థునకు ఆపరేషను చేసితిని. అతడు భాగ్యవంతుడు కాడు. అతడు తాను ఇవ్వగలిగినంత ఇచ్చినాడు. అతని దూరపుచూపు బాగుపడినది. కాని వానికి దగ్గర చూపు రాలేదు. 4 రోజులకు ఒకపరి చొప్పున వానిని అనేకసార్లు పరీక్ష చేసితిని. కాని ఉపయోగము లేకపోయినది. పెద్ద అక్షరములు కూడ అతడు చదువలేకపోయెను.

అప్పుడు మీరు రచించిన 'తమిళ సమాధియోగము' నా యొద్ద నుండెను. ఆ పుస్తకము అతని చేతికిచ్చి నేను బొమ్మ తీసికొని వచ్చుటకు వెళ్ళితిని. నా దివ్య ప్రభువగు స్వామిజీ! ఆ విషయము నేను ఇప్పుడు తలచుకొనినను నా వెంట్రుకలు గగుర్పొడుచును. మీ పుస్తకమునుండి చిన్న అచ్చులోనున్న విషయములు కూడ అతడు చదువగలిగెను. మీ చిత్రము పుస్తకమునుండి తీసితిని. ఈ బొమ్మలోనుండు భగవంతుడే నీకు దృష్టినిచ్చినాడని వానితో చెప్పితిని, అతడు మీ చిత్రమును పూజించినాడు.

చెల్లా

# 5. శిలా విగ్రహము కాదు : సజీవ స్వరూపము



నా జీవితములో సందర్భములను బట్టి నేను చేయవలసిన తప్పులన్నియు భగవంతుడు క్షమించుగాక. నేను పూర్తిగా ప్రార్థించినాను. అందువల్లనే నన్ను మీవద్దకు వచ్చుటకు ఇది సమయమని ఆయన ఊహించినాడు. స్వప్నములో మిమ్ము నాకు కనపడునట్లు చేసిన ఆయనయే నన్ను మీ శిష్యురాలినిగా ఏర్పాటు చేసెను. భగవంతుడే నన్ను క్షమించినప్పుడు భగవంతుని ప్రతిరూపమగు మీరు నన్ను క్షమింపరా? మీరు నాయందు దయగలిగి నన్ను నిజముగా దీవింతురని నేను నమ్ముచున్నాను. ఈ రోజున ప్రార్థన తరువాత నేను అనుభవించినదదియే. ఋషీకేశము వైపు నన్ను ఆకర్షించిన ఆధ్యాత్మిక ఆకర్షణ నేను ఆపలేనంత బలీయముగా నున్నది. నేను పురుషుడనయిన యెడల ఈపాటికి నేను అక్కడ ఉండియుందును. నేను ఈరోజు ఉదయము ఆసుపత్రికి వచ్చినాను. నేను చూచిన దృశ్యమునకు నాకు కలిగిన ఊహలు నేను వర్ణింపజాలను. మీ శిలా విగ్రహము చేయుటకు ఆర్డరు ఇచ్చినాము. నేను ఆసుపత్రికి రాక పూర్వమే ఆ చిత్రకారుడు దానిని నా ఆసుపత్రిలో ఉంచినాడు. ఒక్క క్షణకాలము మీరు నా ఆసుపత్రిలో కూర్చొని యున్నట్లుగానే ఊహించినాను. అది చాల బాగుగ నున్నది. మీరు భగవంతుని యొక్క [illegible] నా భర్త ఊహించినారు. నేను మీ పాదపద్మముల పైబడి [illegible]

అంటుకొన వచ్చునా? నా విషయమై మీరు అచ్చట తలం చెదరని నాకు గట్టి నమ్మకముగలదు. నా ఊహలు ఆ ప్రకారము ధారణమైయెనవి. నాదయగల ప్రభూ! నేను పూజించెదు గురూ! నేను పవిత్రమైన జీవితము గడపుటకును మీసహాయముతో భగవంతుని జేరుటకును నన్ను ఆశీర్వదింపుడు.

ఒక్క దినము కూడ నేను మీ పుస్తకములు చదువకుండనుండలేను. వానివలన నాకు సౌఖ్యము తృప్తి కలుగుచున్నది.

మహాప్రభూ! మీకు నాయందు దయయున్నంతవరకు నేను తృప్తిగా ఉందును. ప్రాతఃకాలమందు నా ప్రార్థనలకు పూర్వము మీ కుటీరము ఛాయా పటము వైపు చూచి మీ తలుపునకు నమస్కరించెదను. ఆ సమయమందు మీరు అక్కడ ఉందురో లేదో నాకు తెలుపవలెను. మీరు ఉదయము 4 గంటలకు ఏమి చేయుచుందురో తెలుపుడు. నేను మీ దగ్గరనున్నట్లు ఊహించినచో తత్క్షణము చాల శక్తి కలుగును. నా స్వప్నములో అప్పుడప్పుడు మీరు విశ్వనాథ మందిరము లోపల ప్రార్థన చేయుచున్నట్లు నాకు కనిపింతురు. కొందరు స్వాములుగూడ మీ వెంటనుందురు. అది కన పర్చుట నేను మీ ఋషీకేశము కుటుంబమునకు చేరినదాన నని తెలుపుటకా? నేను మద్రాసులో నున్నాను. నేను ఋషీకేశమునకు చెందినదానను. గురునాథా! నేను మీ పాదములపై బడి ఆ మీ పాదపద్మములను తాకనిండు.

చెల్లా.

# 6. విచిత్రానుభవము

గురునాథా! నా మిక్కిలి ప్రియమైన ప్రభూ!

పూర్ణ భక్తితోను, దివ్యప్రేమగల హృదయము తోను మీ దివ్యపాదములకు ప్రణామములు చేయుచున్నాను. మీ దయగల ఉత్తరము అందుతో పంపిన మీదయగల సందేశము చేరినవి. నా ప్రియమైన, పూజ్యమైన ప్రభూ! నేను ఏమి చేయవలెనో నాకు తెలియుటలేదు. నేను దివ్యా నందముతో నిండియున్నాను. నా కృతజ్ఞతా సూచకమైన ఊహాలు నేను ప్రభువైన సుబ్రహ్మణ్యునకే తెలుపగలను. నా కండ్లయందు సంతతము కారుకన్నీటి ఆనంద బాష్ప ములు అతడొక్కడే చూచుచుండును. ఓ భగవంతుడా! ఈ ఆనందము నాకు ఎల్లప్పుడు ఉండునని నమ్మకము కలిగిన యెడల ఈ జీవితములో నాకు ఇంతకంటె ఏదియు అక్కర లేదు. నేను నా జీవితమును ఆయనసేవకే అర్పించెదను. సమాధి యింతకంటె ఆనందకరమా?

భగవంతుని మార్గము నిజముగా ఆశ్చర్యకరము. కొద్ది రోజులక్రిందట నేను ఆసుపత్రిలో నున్నప్పుడు ధ్యాన మునకు అడ్డంకి లేని కోరిక కలిగినది. అప్పుడు నేను ధ్యానిం చితిని. మరుసటిక్షణమే భగవంతుని ప్రార్థింపవలెనను ఊహా పరంపరలు కలిగెను. వానిని బిగ్గరగా చెప్పనుద్దేశించితిని గాని ఆ చెప్పుటకు మారుగా ఇట్లు వ్రాసితిని. మీ దయగల ఉత్తరమే దానికి బదులుగా తేలెను. ఇప్పుడు నా ప్రార్థన ఇందులో పంపుచున్నాను. అది ప్రభువైన సుబ్రహ్మణ్యునకు

నా సొంత ప్రార్థన. దానినే నేను తమకు పంపుచున్నాను. ఏలననగా ఆయనను మీతోనున్నట్లు నేను స్థిరపరచు కున్నాను కనుక, మీరు ఆ ప్రార్థనను చదివితే ఆయన చదివినట్లే. నిజముగా దానిని చదువకపూర్వమే ఆ ప్రభువు నా ప్రార్థన వినియుండెను.

మీ సందేశము 14 వ తేదీన వ్రాయబడినది. ఆ రోజున నాకు ఏమి జరిగినదో తెలిసికొనుటకు మీరు ఆసక్తు లగుదురు. నేను ఏప్రిల్ 18 వ తేదీన జన్మించితిని. కాని మేము ఇక్కడ నక్షత్ర తిథి ప్రకారము జన్మదినము జరుపుదుము. శ్రవణ నక్షత్రము ఈ నెల 14 వ తేదీ అయినది. కావున నా జన్మదిన మహోత్సవము ఆ రోజుననే జరిగినది. నా మామూలు ధ్యానానంత రము ఆరోజు ఉదయము నేను విశ్వనాథ దేవాలయమునకు (నేను లోగడ పళని ఆండవన్ యొక్క దంతపు విగ్రహము వెనుక ఉంచిన దేవాలయము ఎందువల్లననగా సుబ్రహ్మణ్య ప్రభువును ఆ రూపమున పూజించుట దురదృష్టమని నాకు ఒకరు సలహాయిచ్చిరి.) వెళ్ళి అక్కడ శివునకు, దేవికి, గణేశునకు, ఆంజనేయునకు అర్చనచేసి సుబ్రహ్మణ్య ప్రభువు నకు పాలతో అభిషేకముచేసి ఆయన కటాక్షమునకై తీవ్రముగా ప్రార్థించితిని. ఆయనకు నాయందు దయకలిగెను. ఆయన నా ప్రార్థనలు ఎల్లప్పుడు వినుచుండును. నేను అక్కడ ఉంచిన పళని ఆండవన్ దంతపు విగ్రహమునకు

ప్రభువైన విశ్వనాథుడు జీవముపోసెను. ఆయన నాకు మీ పాదములు చూపించెను.

నా ప్రభూ! నా కొక సందేహముగలదు. మీరు తమ పుస్తకములో మనము ఆధ్యాత్మిక అనుభవము పైకి తెలుపగూడదని వ్రాసియున్నారు. మీకు నేను అన్నియు తెలుపవచ్చునని నాకు తెలియును. కాని ఆ ఉత్తరములు ఇతరుల చేతగూడ చదువబడుచున్నవి. ఈ పరిస్థితిలో నేను నా అనుభవములన్నియు మీకు వ్రాయవలదా? దయచేసి సలహాయివ్వండి. కాని నిన్నటిరోజున నా ధ్యానసమయమందు నాకు గలిగిన విచిత్ర దృశ్యము నేను మీకు వ్రాయుచున్నాను. నేను మిమ్ము అలంకరింపబడిన యెత్తైన స్థలమందు కూర్చొనియుండగా పసిబిడ్డరూపమున చూచితిని. నేను చిన్నపిల్లగా పరికిణీ జాకెట్టు ధరించి నేలమీద మీ ప్రక్కను నిలుచుకొని యుంటిని. దగ్గరగా కొందఱు పెద్దలు నిలుచుకొనియుండిరి. వారు నన్ను మీకు ప్రదక్షిణము చేయమనిరి. నేను ఆ ప్రకారము చేయుదలచితిని. కాని నేను భూమిపైకి ఎత్తబడి గాలిలో నున్నట్లు అనుభవము కలిగెను. దీని అర్థమేమి? మొన్న ఋషీకేశమందు దత్తాత్రేయ దేవాలయమువద్ద ఎడమప్రక్కన కూర్చొనియున్నట్లు కలగంటిని. మీరు బాల సన్యాసివలెను మీ చుట్టును ప్రకాశమానమగు వెలుతురుతోను కనిపించితిరి. నేను మీ రూపము స్వప్నమునందు చూచుచున్నాను. ఇవి కొన్ని అద్భుత ప్రదర్శ

నములు. అవును భగవంతుడు నా నిద్రలో కూడ నాయొద్ద నున్నాడు.

నా ప్రియమైన ప్రభూ! నా శరీరము మాత్రమే యిచ్చటనున్నది. నా ఆత్మ ఎల్లప్పుడు మీ యొద్దనేయుండి మీకు పూజచేయుచుండును. మిమ్ములను దేవుని సేవించుట యందే నా సౌఖ్యముగలదు. మీ పాదసన్నిధానమునందే నాకు విశ్రాంతి గలుగును. మీయెడల నాకు ఉండెడిభక్తి అస్వాభావికము-ప్రపంచమందలి మనుష్యులు గ్రహింపజాలని ఉచ్ఛస్థితికి చెందినది. నేను నా పూర్వజన్మలలో మిమ్ములను తెలిసికొనియుందును. ఏప్రియల్ 4 వ తేదీన నేను మిమ్ములను కలిసికొనినపుడు నాకు అనుభవమునకు వచ్చిన దేమన: నేను మిమ్ములను చాలరోజుల తరువాత మరల కలిసికొంటి నని. అప్పటి నా సంతోషమునకు మేర లేదు. మీ సలహా యందు ప్రతి అక్షరమును నేను జ్ఞప్తియందుంచుకొని ఆ ప్రకారము నడిచెదను. ఎడబాటు యొక్క బాధ నన్ను వేధించు సమయమందుగాక మిగతా సమయములందు నేను సంతోషముగా నుండుటకు ప్రయత్నించెదను. మీ దివ్య పాదములకు ప్రణమిల్లు,

ఎల్లప్పుడు మీదాసను,

చెల్లా.

# 7. తప్పిపోయిన పిల్లలను శివుని కటాక్షము కనిపెట్టును

పరమాత్మా! అన్నియు తెలిసిన నా ప్రియమైన ప్రభూ!

మీ పూజనీయమైన పాదములకు ప్రేమతోను భక్తితోను ప్రణామములు చేయుచున్నాను. నేను మిమ్ములను స్వయముగా పరమాత్మా అని పిలువవలసియున్నది. ఇంత తొందరలో వ్రాసినందుకు క్షమింపుడు. కాని నాకు జరిగిన ఒక సంఘటన మీకు తెలియపరచుటకు దీనిని వ్రాయవలసి వచ్చినది. అది మీ అమానుషశక్తులను మరల మరల తెలియపరచుటయేకాక మీ యందు నాకు గల నమ్మకము ద్విగుణీకృతమగుటకు సహాయకారి అయినది.

నేను మీకు లోగడ ఉత్తరములో వ్రాసిన ప్రకారము గత కొన్నిదినములనుండి నాకు నిద్దుర సరిగా పట్టుటలేదు. నిన్న చాలకష్టము మీద రాత్రి 12 గంటలకు నేను నిద్రించితిని. కాని నేను మరల ఒంటిగంటకు లేవవలసివచ్చెను. మీ స్నేహితుడైన ఒక రైల్వే ఉద్యోగస్థుడు (ఈ మధ్య హృద్రోగమునుండి స్వస్థత పొందినవాడు) 14 సంవత్సరముల వయస్సుగల తన మేనల్లుని, 12, 10, 6 సంవత్సరముల వయస్సుగల పిల్లలను 6-30 గంటల సినీమా ఆటకుపంపెను. వారంతట వారే బస్ మీద వెళ్ళియుండిరి. మరల వారే బస్ మీద తిరిగి రావలసియుండెను. ఈ ప్రకారము వారు

ఇదివరలో చాలసార్లు చేసిరి. కాని నిన్నటిరోజున వారు తిరిగిరాలేదు. ఉదయము 1 గంటవరకు వారికొరకు మద్రాసు పట్టణమంతయు వెదకిరి. అప్పుడు మా వద్దకు మా తమ్ముని సహాయముకొఱకు వచ్చిరి. నా సోదరుడు పోలీసులో అసిస్టెంటు ఇనిస్పెక్టరు జనరలు ఉద్యోగములో ఇచ్చట నుండెను. కాన అతడు అన్నిచోట్లకు నిస్తంత్రీ సమాచారము పంపెను. అతడు చేయవలసిన పనియంతయు చేసినను లాభము లేకపోయెను. తల్లిదండ్రులబాధ నేను చూడజాలక పోతిని. ఉదయము 4 గంటలవరకు నాకు నిద్రపట్టలేదు. తరువాత 6 గంటలవరకు నిద్రించితిని. నేను అశాంతితో నుంటిని. నా దైనిక ధ్యానమునకు కూడ అడ్డంకి కలిగెను. వారి కెట్టి సహాయము చేయవలెనా యని ఆలోచనలో నిమగ్ననైయుంటిని. స్వామిజీ వారికి తప్పక సహాయము చేయుదురని నేను నా భర్తతో చెప్పితిని. నేను వారితో ఈ మాట చెప్పదలచితిని. యోగవేదాంత అడవివార్తా పత్రిక ద్వారా పోస్టాఫీసులో మీకు ఫోను ఉన్నదని తెలిసినది. కాబట్టి దాని ఆధారమున పిలువదలచితిని. ఈ సంగతి నా భర్తతో చెప్పితిని. నా ఆదుర్దా గ్రహించి ఆయన ఇట్లు చెప్పెను: ఇట్టి సమయములలో ఉపయోగింపని నీ ధ్యానమెందులకు? నీవు ధ్యానముచేసి దీనికి విరుగుడు కనుగొనుము. అపుడు 7 గంటలయినది. నేను తక్షణమే నా ప్రార్థనాలయమునకు వెళ్ళితిని. అచ్చట ఒక గంట వరకు మిమ్ములను ధ్యానించితిని. ఈ రోజున ఆ మంత్రము

జపింపలేకపోతిని. నేను ఈ విధముగా పలికితిని : స్వామిజీ! నా భగవానుడా! ఆ పిల్లలను కనుగొనుటకు మార్గము నాకు చూపుడు. కొంతకాలమునకు నేను ధ్యానముయొక్క తీవ్రస్థితికి వచ్చితిని. అపుడు ఒక భవనము దాని యెదుట కొందరు పిల్లలను కనుగొంటిని. ఆ దృశ్యము కనిపించి అదృశ్యమయ్యెను. దాని యొక్క అర్థము నాకు తెలియ లేదు. ఆ సమయమందు నా కుమార్తె నా యొద్దకు వచ్చి ఇచ్చటనుండి 40 మైళ్ళదూరములో నున్న అరక్కోణము స్టేషనువద్ద పిల్లలు కనబడిరి అని కేక వేసెను. అప్పుడు ఉదయము 8 గంటలైనది. దాని పరిణామమెట్టిదో మీరు ఊహించగలరా ? నా స్వామిజీ! నా ప్రియమైన ప్రభూ! ఆయన నా ప్రార్థనలు వినెను. సమస్య పరిష్కారమయ్యెను. ఆ పిల్లలు రైలులో నెక్కి రైలు పెరంబూరు స్టేషనువద్ద ఆగునని ఊహించిరి. కాని ఆ రైలు అరక్కోణమునకు సరాసరి వెళ్ళురైలు. నాకు చాల ఆదుర్దాకలిగినది. గురూజీ యొక్క శక్తివలన వారందరు సుఖముగా ఉన్నారని నేను ఇంటివద్ద అందరితో చెప్పితిని.

ఈ సంఘటన నాకు ఎంతో ప్రాముఖ్యత కలుగ జేసినదిగా తోచెను. భగవంతుడు తన భక్తులకు విచిత్ర ముగా సహాయము చేయుచుండును. కొన్నిదినములనుండి నేను చాల నిరుత్సాహముతో నుంటిని. ఈ ఊహతోపాటు మీరు హఠాత్తుగా నాకు ఉత్తరము వ్రాయుట ఆపివేయు టయు నాకు అసంతృప్తిని నిరుత్సాహమును కలుగజేసినది.

ఆధ్యాత్మిక వృద్ధికి సంతోషముగనుండుట అవసరమని నేను చదివియుంటిని. కాబట్టి నాకు గలిగినట్టి విచిత్రమైన అనుభవములు అన్ని స్వప్నములు, దృశ్యములు అబద్ధములని ఊహింప ప్రారంభించితిని. నేను వృద్ధిపొందలేదనియు నేను ఆధ్యాత్మిక జీవితమునకు పనికి రాననియు ఊహింప ప్రారంభించితిని. మీరు నాయందు కోపగించితిరని ఊహించితిని. ఓ భగవానుడా! సందేహములు నన్ను బాధించుచుండెను. నేను పతితురాలనగుటకు సిద్ధముగా నుంటిని. మీరు నన్ను పనికిమాలిన దానినిగాను, ఎందులకును గొరగాని దానిగాను తలంచితిరేమో అని ఊహించితిని. ఈ సంఘటన మీరు నా దేవుడని నాకు నమ్మకము కుదిర్చెను. మీయందు నాకు నమ్మకము ప్రేమ ఉన్నంతవరకు మీరు నన్ను విడువరని కూడ నమ్మకము కలిగెను.

ఓ భగవంతుడా! నే నేమిచేయను? ప్రపంచమందందరికంటె మీరు నాకు దగ్గరి వారు, ప్రేమగలవారు. నేను నా ఉద్దేశములను అడ్డగింప లేకపోయితిని. భగవంతుడే యిట్టి విచిత్రమును గలిగించినాడు. దానిని నా మంచి కొరకే ఒక కారణముతో కలిగించియుండును. నేను ఆయనను నమ్మియున్నాను. నా కోరిక నెరవేర్చుటకు భగవంతుడు సహాయముచేయుచున్నాడని మీరు చెప్పెడి

నమ్మకమైన మాటవలన నేను బలమును పొందుటకు ప్రయ త్నించుచున్నాను. ప్రతి నిమిషము మీ నుండి కలిగిన యెడబాటుయొక్క బాధ వృద్ధియగుచున్నది. మీ యొక్క యితర ముఖ్య శిష్యులతో పోల్చిచూచిన నేను ఉపయోగ ములేని అముఖ్యమైన దానను. కాని ఈ విషయము మీ యందు నాకు గల భక్తిని తగ్గించుటలేదు. మీరు నా విషయమై దయగలిగి యున్నారని తెలియటయే నాకు గల గొప్ప ఆనందము. కాని మిమ్ములను ఎట్లు సంతోషపెట్ట గలనో నాకు తెలియదు. నా మనస్సునుండి ఆదుర్దా తగ్గిం చుటకు మీ ఉత్తరములే ముఖ్యమైనవి. స్వామిజీ! తప్పు లతో నున్న ఈ బీదశిష్యురాలిని స్వీకరింపుడు. మీరు స్వదస్తూ రితో వ్రాసిన ఆఖరు ఉత్తరము మరల మరల చదువుట వలన నాకు కొంత మనశ్శాంతి గలుగుచున్నది. నాకు ఇంకొక ఉత్తరము ఎప్పుడు వచ్చును? మీ చెల్లవిషయమై మీకు ఎప్పుడు దయగలుగును? మీరు ఆమెకు వ్రాయురా? నాసందేహములు నేను పూడ్చి పెట్టుకొనుటకు నేను సంతో షముగా నుండుటకు ప్రయత్నించెదను. కాని యేదియు నాకు సహాయకారిగా లేదు. ఈ రోజున కలిగిన సంఘటన వల్ల కొంత సంతోషము కలిగినది. నన్ను శాంతపరచుటకు ఒకే మందు గలదు. అదియే మీదయ. నాకు ఇంకొకటి ఏదియు అవసరములేదు. నా జీవితములో ప్రతి నిమిషము

మిమ్ములను నాయెదుట చూచుచున్నాను. నేను రాత్రులలో నిద్రించునపుడు మీతో నున్న భగవానుని యందు విశ్రాంతి తీసికొందును. మీ నుండియే మరల ఉదయము ప్రపంచములోనికి వచ్చెదను. ఒకానొకప్పుడు కల యొక్క ఆఖరుభాగమే స్ఫురణకు వచ్చును. మరి యొకప్పుడు కల అంతయు జ్ఞాపకముండును కాని నేను ఎల్లప్పుడు మీ యొద్దనే యుంటున్నాను. నేను ఏమిచేయను ? నేను ఏదైన తప్పిదముచేసితినా చెప్పుడు, దయచేసి చెప్పుడు. దయయుంచి నాకు ఉత్తరము వ్రాయుడు. నేను మీ దివ్య పాదములకు ప్రణమిల్లి యింతటితో ఆపెదను.

శాశ్వతముగా మీదాసను,

చెల్లా.

# 8. దేవుని దర్శనము

కరుణానిధీ! నేను మిక్కిలి ప్రేమించిన ప్రభూ!

ప్రేమతోను భక్తితోను మీ పాదములకు ప్రణామములు చేయుచున్నాను.

నిన్న నాకు మీ దయగల ఉత్తరములు అందినందులకు నా హృదయాంతర్గమగు వేలకొలది ధన్యవాదములు సమర్పించుచున్నాను. అది ఎండిన మొక్కకు నీరు పోసినట్లయినది. ఇప్పుడు ఆదుర్దాతో కూడిన నా హృదయమునకు నెమ్మది కలిగినది. మీ దయ దాని తృష్ణను తీర్చినది.

కొన్ని దినములనుండి నా సంగతి నాకు తెలియుట లేదు. ఓ దేవుడా! ఇపుడుకూడ నేను పడిన బాధ తలచుకొనిన భయము కలుగుచున్నది. నా ఆధ్యాత్మిక జీవితములో ఒక గొప్ప ఆపద దాటినట్లు నేను ఊహించుచున్నాను. నాకు తప్పక నరములబలహీనత కలిగియుండవలసిన దే. కాని మీ యందు నాకు గల శాశ్వతమైన బలమైన పవిత్రమైన భక్తి ఆ ఆపదను అడ్డగించినది. ఓ నన్ను కాపాడు దేవదూతా! నా ప్రియమైన ప్రభూ! ఈ అనుభవము నాకు మరల కలుగకుండ జేయుము, భగవంతుడు చేయు ప్రతిపనియందును అర్థము గలదు. ఆ కొద్ది రోజులలో నేను పూర్వజన్మములో చేసిన చెడుకర్మలలో చాల భాగము దగ్ధమైనట్లు నేను ఊహించెదను. ఓ దయగల ప్రభూ! మీరు అచ్చటనుండియే నాకు చికిత్స చేసినారు. ఇప్పుడు నేను శాంతమై ఆనందము నిచ్చెడు

నిర్మలమును సుస్థిరమునగు మీ యందలి భక్తిని అనుభవించుచున్నాను. నిన్న మధ్యాహ్నము నాకొక అందమైన స్వప్నదర్శనము కలిగినది. అది చాల ఉత్తేజమైనది. అది ఎల్లప్పుడు నా మనస్సులో నిలిచియుండును. నేను విచారముతో నున్నప్పుడు కూడ భగవంతుడు నా ప్రక్కనే యుండునని అతడు నాకు తెలియపరచెను. నాకు కొన్ని నిమిషములు నిర్మలమైన నిద్రకలిగినది. ఒక దివ్యావేశము కలిగినది. దానిని నేను ప్రతిదినము అప్పుడప్పుడు అనుభవించుచున్నాను. ఈ కష్టమును సహించుటకు బలమిచ్చి నాకు నమ్మకము కలిగించినది. ఆ దృశ్యమేమనగా! హఠాత్తుగా నేనొక తెల్లని కాంతిని చూచితిని. దాని మధ్య కండ్లు మిరుమిట్లుగొల్పు వెల్తురుండెను. తరువాత ఒక నెమలి ప్రభువు సుబ్రహ్మణ్యస్వామి, ఆరుతలలు పండ్రెండు చేతులతో కనిపించెను. ఆ దృశ్యము చుట్టు వెలుతురు ప్రాకారముండెను. అక్కడ నేనున్నప్పుడు మీతో చెప్పిన ప్రకారము భగవాన్ రాముని, కృష్ణుని, దేవిని చూచితిని. ఈ రూపములో నేను సుబ్రహ్మణ్యస్వామిని లోగడ చూచి యుండలేదు. నేను ఆయనను ఎల్లప్పుడు పళని ఆండవర్ వలె బట్టతలతోను రెండు చేతులతోనే చూచుచుందును. కనుక ఈ దృశ్యము చాల ఉత్తేజకరముగ నుండెను. ప్రభువు చాల దయామయుడు. నా బాధను ఆయన కనిపెట్టెను. ఆయన పెట్టిన పరీక్షయందు నేను ఎంతగా కష్టపడి కృతార్థురాలనైతినో ఆయన చూచెను. 'నేను ఎల్లప్పుడు నీ

యొద్దనుండి నీకు అవసరమైనప్పుడు సహాయము చేయుదు' నని ఆయన తెలుపగోరెను. ప్రియమైన గురుమహారాజా! నాకు ఆయనయు మీరును ఒక్కటియే. ఆయన నా ఏర్పాటును ఒప్పుకొనెను. అది వారిని పూజించుటకు నేను నిశ్చయించుకొనిన రూపము. ఇపుడు నాకు భయము లేదు. నేను ఎంత బాధపడవలసివచ్చినను చివరకు భగవంతుడు నాకు సహాయపడునని నాకు తెలియును. నాకు సహాయము చేయుటకు నా అభివృద్ధి తొందరపరచుటకు నన్ను తనలో కలుపుకొనుటకు ఆయన నాకు బాధలు కలుగజేయుచున్నాడు.

మీకు గత రెండు ఉత్తరములు వ్రాసిన పిమ్మట నాకు కొంచెము భయము గలిగినది కాని ఇప్పుడు నేను సరియైనపనియే చేసితినని నాకు నమ్మకము కలిగినది. ఏ విషయమును మీ యొద్ద దాచిపెట్టుటవలన ప్రయోజనము లేదు మీరు నన్ను విడువరని నాకు తెలియును. నా మనస్సుయొక్క చేష్టలన్నియు మీకు తెలియవలెను. మంచి విషయము మాత్రమే వ్రాయుటలో ఎట్టి సబబు లేదు. నా మనస్సు మీకు పూర్తిగా తెల్పినగాని మీరు ఎట్లు చక్క దిద్దుదురు? నేను ఎట్టి బాధపడవలసివచ్చినను అనుభవించి నేను నా ఉద్దేశములో ఉత్తీర్ణత పొందవలెను. నేను చివరకు మా ప్రభువులో కలిసిపోవలెను. దీనిని పొందుటకు నేను ఏదైనను చేయవలసినచో దానిని చేయుటకు సిద్ధముగా నున్నాను. దయచేసి నాకు సలహా యిచ్చుచుం

డుడు. నేను మీకు కలుగజేసిన యిబ్బందులన్నిటికిని నన్ను క్షమింపవలెను. ఇంతటినుండి నేను ఉత్తరములు వ్రాయుట సాధ్యమైనంతవరకు తగ్గించెదను. మీరు వ్రాసిన ఉత్తరములకు మాత్రము ముక్తసరిగా జవాబు వ్రాయుదును. ఓ ప్రభూ! నా యందు దయగలిగియుండవలెను. మీ దయ లేనిది నేను జీవించలేను. నా ఆత్మ ఎల్లప్పుడు మీ యొద్దనే యుండును. ఇచ్చటినుండియే మీ ముఖమందలి వివిధ మార్పులు నాకు కనిపించియున్నవి. మీ మాటల యొక్కయు పనుల యొక్కయు స్ఫృహ నన్ను దివ్య ఆవేశముతో నింపును. మీ కటాక్షము లేని యెడల నేను ఏమియు చేయలేను, అనుభవింపలేను. నా విషయమై మీరు కోపగించినట్లు నాకు తోచిన యెడల భయముచే నాకు ఏమియుతోచదు. నిరుత్సాహ సముద్రములో మునిగియుందును. మీకు తెలియకుండగనే నేను మీలో నున్న భగవంతునితో నివసించియుందును. నేను ఆయనలో ఒక భాగమైనట్లు ఊహించెదను. గత జన్మల కర్మల కారణమువల్ల మొట్టమొదట తాత్కాలికముగా కొంతకాలము ఆయననుండి విడివడినట్లు ఊహించితిని. ఆ కర్మలు దగ్ధమైన పిదప నేను ఆయనతో శాశ్వతముగా కలిసియుందును. ఇంత పెద్దఉత్తరము వ్రాసినందులకు నన్ను క్షమింపుడు. నా హృదయమే నా కలముద్వారా యీ కాగితము మీద ప్రవహించుచున్నది. రేపంతయు నేను అక్కడ మీ పాదసన్నిధానమున గురుపూర్ణిమ ఉత్సవము

లలో పాల్గొనుచునుండెదను. మీకు ఆరోగ్యము దీర్ఘాయువు కలుగునట్లు ప్రార్థించుచు ఈ రోజున మీకు తంతి వార్తను పంపియున్నాను. మీరు నన్ను జ్ఞప్తియందుంచుకొందురని నేను నమ్ముచున్నాను. బలీయమును పవిత్రమునయిన నా భక్తిని మీరు ఎట్లు నిరాకరించెదరు? దయా ప్రేమలకు ప్రభువైన దేవా! మీ సంబంధము కలిగిన రోజు నుండి ప్రతి ఉదయము సాయంత్రము నా ప్రార్థన గదిలో నున్న సుబ్రహ్మణ్యస్వామి చిత్రముయొక్క చేతులపైన నా చేతులుంచుచున్నాను. ఎన్ని అడ్డంకులు కలిగినను వానిని త్రోసివేసి తన దివ్యసేవకు నా చేతులు ఉపయోగించుకొనుమని నా హృదయ పూర్వకముగా ఆ ప్రభువును ప్రార్థించుచున్నాను. ఆయనయే నాకు డాక్టరు పదవి నొసంగెను. (నా ఆఖరు యం. బి. బి. ఎస్. పరీక్షకు రోల్ నంబరు 8. అదియొక ప్రత్యేకత కదా!) నా గురుదేవా! నా మిక్కిలి ప్రియమైన ప్రేమగల ప్రభూ! నా భగవంతునికి సేవచేయుటకు తగిన అవకాశము ఆయన నాకు కలుగ జేయునని నేను నమ్ముచున్నాను. ఇప్పుడు కాక పోయినను ముందు నేను అందుకు తగిన దాననని ఆయన అనుకొనినప్పుడు అట్టి వీలును నాకు ఆయన కలుగజేయును. నేను అంతవరకు ఓపికతో వేచియుందును. నా ఆధ్యాత్మిక వృద్ధికి అవసరమైనదంతయు నేను ఇప్పుడు చేయుచున్నాను. ఇక ముందుకూడ చేసెదను.

ఓ ప్రభూ! నన్ను దీవింపుడు. తమ దివ్యపాదములకు ప్రణామములు చేసి ముగించెదను. శాశ్వతముగా మీ దానను,

చెల్లా

# 1. శిష్యురాలు అంగీకరింపబడెను

డాక్టరు చెల్లమ్మ, 25-10-1954

పూజ్యము, అమరమునైన ఆత్మ స్వరూపిణీ!

ప్రణామములు. ప్రభువైన షణ్ముఖుడు మిమ్ములను కటాక్షించుగాక! మీదయగల ఉత్తరము అందినది. నీకు స్వాభావికము ఆంతరికమునైన ఆధ్యాత్మిక సంస్కారములు గలవు. అవి యిపుడు పుష్పించి విచిత్రమైన శాంతి ఆనందము మరియు అద్భుతమైన అనుభవములు కలుగజేయును. ఇపుడు నీకు మంచిరోజులు వచ్చినవి.

నీ ఆధ్యాత్మిక వృద్ధియందు నేను ప్రత్యేక జాగ్రత్త తీసికొనెదను. నిన్ను నేను నా ప్రియమైన శిష్యురాలుగా నంగీకరించుచున్నాను. ఆధ్యాత్మిక మార్గమున నడచుటయు, ప్రార్థన, ధ్యానము, ధారణ, పవిత్ర గ్రంథముల యధ్యయనము, భక్తులు, మహాత్ములు, మహర్షులు—వీరి సహవాసము అనుభవించుటయు మహోన్నతస్థితి. ప్రభువు నిన్ను ఆశీర్వదించునుగాక.

నీవు దేవియు సుబ్రహ్మణ్యస్వామియు నీ యిష్టదేవతలుగా నిశ్చయించుకొనవచ్చును. ఉదయము సాయంత్రము నీ ధ్యానమును తప్పక జరుపుచుండుము. ఏకాదశిరోజులలో రాత్రిళ్లు పాలు పండ్లు పుచ్చుకొని ఉపవాసదీక్ష జరుపవచ్చును.

నెలకొకసారి నీ దైనిక చర్యా విషయమై నాకు వ్రాయుచుండుము. నేను నిన్ను బాగా నడిపెదను. నీ అధ్యయనము నిమిత్తము పోష్టుద్వారా కొన్ని పుస్తకములు పంపుచున్నాను. నీ చుట్టుపట్ల వాతావరణమును అధ్యాత్మమయముగా చేయుము. సంగీతము భజన జరుపుచుండుము. మీ స్నేహితులను సమావేశపరచి వారికి ఉత్తేజము కలుగ జేయుము. నీవు జనసమూహమునకు గొప్ప సేవచేయుటయే గాక, నీ ఆధ్యాత్మికోన్నతినిగూడ అభివృద్ధినిగూడ పొందగలవు. భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక. నీవు పూర్తిగా ఉత్తీర్ణతనందగలవని నేను ఆశించుచున్నాను

నీకు వీలుకలిగినపుడు దయయుంచి ఋషీకేశము వచ్చి యిచ్చట కొన్నిరోజులు ఉండవలెను. మార్చి నెల అందుకు చాల బాగుండును. ఇప్పుడు ఇక్కడ శీతకాలము. నీవు ఇచ్చట ఆశ్రమము యొక్కయు పవిత్ర గంగానది యొక్కయు హిమవత్పర్వత ప్రకృతి సౌందర్యముల యొక్కయు పవిత్ర ఆధ్యాత్మిక స్పందనములు అనుభవింపవచ్చును. సహృదయాభినందనములు.

ఓంకారముతోను పవిత్ర ఆశీస్సులతోను, ప్రేమతోను,

నీ సొంత ఆత్మ,

శివానంద

## 2. మొదటి పాఠము

డాక్టర్ చెల్లమ్మ, 3-11-1954

మద్రాసు.

పూజనీయమైన ఆత్మ స్వరూపిణీ!

ప్రణామములు.

నీవు ప్రేమతో వ్రాసిన ఉత్తరములు అందినవి. నీ దివ్య దర్శనములను, అనుభవములను సందేహములను గూర్చి ఎల్లప్పుడు నీవు నాకు వ్రాయుచుండవచ్చును.

అన్ని కాలములయందును ఆటంకము లేకుండ నెల యంతయు నీవు జపము చేయవచ్చును. జపము ఎల్లప్పుడు ధ్యాన ప్రార్థనలతో మిళితమైయుండవలెను.

చేతులు కాళ్ళు శుభ్రపఱచుకొని ప్రార్థన చేయ వచ్చును. ధారణాశక్తిని అభివృద్ధి పఱచుకొనుటకును, మంచి ఆరోగ్యమును స్థిరపరచుకొనుటకును ప్రాణాయామము చాల సహాయకారియగును. వీలైనంతవరకు ఊపిరి బాగా నెమ్మదిగా లోనికి తీసికొనుము. నీవు సౌఖ్యముగా ఆ శ్వాసనిలుపగలుగునంతవరకు కొన్ని క్షణములైనను నిలుపుము. తరువాత ఊపిరి నెమ్మదిగా విడిచిపెట్టుము. అట్టి కొన్ని ప్రాణాయామముల యనంతరము నూతన శక్తితో నింపబడుదువు.

నీవు ఫోటో పంపినందులకు ధన్యవాదములు. ఇపుడు నీ కుటుంబము యావత్తు నాయెదుట నున్నది. భగవంతుడు మిమ్ములనందరను ఆశీర్వదించుగాక.

ఈ కాలమునకు దగిన పూర్తి ఆశీర్వాదములు నీకు ఇచ్చుచున్నాను. నీకు సౌఖ్యమైన క్రిస్టమసు, క్రొత్త సంవత్సరములు కలుగునుగాక! అల్లే డాక్టరు నాయరుకు ఆయన పిల్లలకు కలుగునుగాక. ప్రేమతోను, ఓంతోను.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 3. నిజమైన వైకుంఠము

డాక్టర్ చెల్లమ్మ, 8-11-1954

పూజ్యమైన పరమ ఆత్మ స్వరూపిణీ!

ప్రణామములు. సుబ్రహ్మణ్యస్వామికి వైభవము, జేజేలు.

దినచర్యతోగూడిన నీదయగల ఉత్తరము అందినది. చాల ఆశ్చర్యముగా నున్నది. నీ దైనిక గృహస్థ కర్తవ్యములమధ్య నీవు ఆధ్యాత్మిక సాధనలు, ప్రార్థనలు, ధ్యానము గీతాధ్యయనములు జరుపుచుంటివి. ప్రభువు సుబ్రహ్మణ్యస్వామి నిన్ను కటాక్షించుగాక. నీవు చాల వృద్ధి పొందుచున్నావు. నీవు ప్రగాఢ అధ్యయనము, మంచి అనుభవము పవిత్రతతో కూడిన భక్తి గలిగియున్నావు. నీవు త్వరగా వృద్ధిపొంది శాంతి, ఆనందము, జ్ఞానము, అమరత్వము తప్పక పొందగలవు.

ఇపుడు ఇచట చాలచలిగా నున్నది. నీకు మార్చి నెల బాగా ఉండును. అప్పుడు ఇచ్చట ఒకనెల రోజులు అనుష్ఠానము దైవిక పద్ధతులు జరుపుచునుండవచ్చును. ప్రేమ పూర్వక అభినందనములు.

నీ చుట్టుపట్ల వాతావరణము ఆధ్యాత్మికముగా చేయుము. నిన్ను కలిసికొనుటకు వచ్చినవారి అందరియందు

నమ్మకము కలుగజేయుము. నీ పిల్లలను ఆధ్యాత్మిక మార్గమునందు తర్ఫీదుచేయుము. అప్పుడు మీయిల్లంతయు ఆధ్యాత్మిక స్పందనములతో నిండియుండును. అదియే నిజమైన వైకుంఠము. భగవంతుడు మిమ్ము ఆశీర్వదించునుగాక. ప్రభు విశ్వనాథుని ప్రసాదము ఇందువెంట పంపుచున్నాను.

మీనాక్షి అభివృద్ధిపొందిన భక్తురాలు. నీవు ఆమెకు ఉత్తరము వ్రాయవచ్చును. ఆమె మీయింటికి వచ్చి నిన్ను కలిసికొనును. ఆమె భజనకీర్తనలు బాగా పాడును.

నీకు కనిపించిన దృశ్యములు నిజమైనవి. జపము, ప్రార్థన, పవిత్రత ద్వారా చికిత్సచేయుము.

ప్రేమతోను ఓంతోను,

నీ సొంత ఆత్మ,

శివానంద

# 4. నిష్కామకర్మయొక్క దివ్యబోధ

డాక్టర్ చెల్లమ్మ, మద్రాసు. 10-11-1954

కటాక్షింపబడిన దేవతా !

పూజలు, ప్రణామములు. 17వ తేదీన నీవు వ్రాసిన ఉత్తరము అందినది.

నీవు ఆధ్యాత్మిక సంస్కారము యొక్క పూర్ణమైన భాగ్యమును పొందియున్నావు. దానిని జాగ్రత్తగా పోషించుకొనుము. నీ ప్రయత్నమునందు శ్రద్ధవిడువకుము.

నీ స్వప్నములవల్ల నీకు పురోభివృద్ధి కలుగజేయు ఆధ్యాత్మిక ఆసక్తియున్నట్లు కనుబడుచున్నది. నీకు ప్రభువు మరుగరుయొక్క కటాక్షము గలదు. స్వప్నశాస్త్రము ప్రకారము మఱ్ఱిచెట్టు, నది, గురుదర్శనము, భగవంతుడు కనిపించుట చాల శుభసూచకములు. నీవు ప్రాకృతికముగను ఆధ్యాత్మికముగను చాల మంచిస్థితికి రావలయును.

ప్రతిదినము మూడుసార్లు తప్పకుండ నీ ఆధ్యాత్మిక సాధనలు జరుపుచుండవలయును. అవి నీ పురోభివృద్ధికి చాల ఉపయోగకరములు. నీ శరీరమందు విద్యుత్ శక్తి వంటి ఒక ప్రవాహము క్రిందనుండి పైకివచ్చుటయను అనుభవమువలన నీ మనస్సు స్థూలమునుండి సూక్ష్మముగా మారుచున్నట్లు తెలియపరచును. మృత్యువుయొక్క ఊహ

లేక తెలియని యొక ఆందోళన కలుగుట మొదలగు విషమ సందర్భము గలిగినప్పుడు ముముక్షువు తన ప్రయత్నములు మానకూడదు. తన యిష్టమంత్రము ఉచ్చరించుచు ధారణ వృద్ధిచేసికొనవలెను. అది అనిర్వచనీయమైన అట్టి విషమ సమయములందు గలుగు నిజమైన ఆనందదాయకమైన అనుభవము. అట్టి యనుభవములకు నీవు చిక్కి ఆనందము పొందుచు నీ ప్రయత్నమును విరమింపక ఆ పరమ పురుషుని దర్శనమగువరకు సాధన చేయవలెను.

సమస్త సృష్టియందును దివ్యప్రేమను వృద్ధిచేసికొనుము. అందరిలో భగవంతుని చూడుము. నీది ప్రభావముతో కూడినవృత్తి. నిష్కామ బుద్ధితో ప్రజలకు సేవ చేయుటకు నీకు చాల వీలుగలిగించు అవకాశములు గలవు. బీదలకు దీనులకు ఉచితముగా సేవచేయుము. ఇతరులకు నీకు తోచిన సహాయము చేయుము. నీవు నిష్కామసేవ చేయుటకు పూర్వము నీ సొంత ఆత్మకు నీవు సేవచేయునట్లు అనుభవమునకు తెచ్చుకొనుము. ఏలననగా ఈ ప్రపంచమునందు నీ ఆత్మకంటె వేరువస్తువు లేదు. ఎల్లప్పుడు నిష్కామసేవ చేయువారియందు భేదములేని ఆత్మైకత్వము స్ఫురించును. కర్మమే భగవంతునిపూజ. ఆత్మజ్ఞానము పొందుటకు ప్రపంచ ఝంఝూటమునుండి విడుదల యగుటకును ఆత్మజ్ఞానమే సాధనము. నెలలో రెండుసార్లు కంటె ఎక్కువగా ఉపవాసముండ నవసరములేదు. శక్తిమంతమైన

ఆహారము లేకుండ ఎక్కువకాలము ఉపవాసమున్న శరీర స్థితి బలహీనత చెందును.

నీవు మంచి సాధకు రాలవు. అందు వల్లనే నీకు గీత చదువుటయందు ఆసక్తికలిగినది. అర్థముతోను, మాహాత్మ్యముతోను దానిని చదువుము. సూర్యనారాయణ అయ్యరు ఏర్పాటుచేసిన శాఖాకార్య క్రమములో నీవు కూడ పాల్గొనుము. ఏవ్యక్తియైనను తన జన్మ పరంపరల చివరకు వచ్చినప్పుడు మాత్రమే వానికి సరియైనగురువు దొరకుట లేక సరియైన ఉపదేశము పొందుట అను అదృష్టము సంభవించును.

సొసైటీలో నీవు సభ్యురాలవుగా చేరుము. ప్రతి దినము నీవు చేయుపనిని తెలియపరచు దినచర్యను పంపుము. నేను నీకు సరియైన మార్గము చూపెదను.

నిన్ను భగవంతుడు ఆశీర్వదించునుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 6. యోగములో సామాన్యజ్ఞానము

శ్రీ చెల్లమ్,  2-1-1955

పూజ్యమైన అమరమైన ఆత్మ స్వరూపా!

ప్రణామములు. నీకు కాలోచితమైన ఆశీర్వచనములు. నీకు శాంతి ఆనందము దివ్య ప్రభావముతో గూడిన సంతోషము ప్రకాశమగు క్రొత్త సంవత్సరము కలుగునుగాక.

నీవు లోగడ వ్రాసిన రెండు ఉత్తరములు అందినవి. నీవు వ్రాసిన విషయములన్నియు జాగ్రత్తగా గమనించితిని. నీ సాధనలో నీవు గొప్ప వృద్ధి కనపరచుచున్నావు. దాని కంతటికి భగవంతుని కటాక్షమును నీయొక్క గాఢమైన ఆధ్యాత్మిక సంస్కారమును కారణమైయున్నది. భగవంతుడు నిన్ను దీవించునుగాక.

నీ సామాన్యజ్ఞానమును ఉపయోగించి నీ ఆధ్యాత్మిక వృద్ధికి సహాయకరములగు పనులుచేయుము. నీ మానసిక జపము, ధ్యానము ప్రార్థనలయందు స్థిరముగా నుండుము. అప్పుడు నీకు తొందరగా వృద్ధికలుగును. ఏకాదశిరోజున పుష్కలముగా పండ్లరసము, పాలు పుచ్చుకొనుము. నీవు సేవచేయునపుడు ఎక్కువగా ఉపవసించుట మంచిదికాదు. నీ యిష్టదేవతను తఱచు మార్చవద్దు. పళని ఆండవను చక్ర

వర్తులకు చక్రవర్తి. ఋషీకేశము నీ నిజమైన గృహము. దక్షిణ దేశస్థులకు ఇచ్చట మార్చి ఏప్రియల్ నెలలు చాల సంతోషము కలుగజేయుకాలము. నీకు వీలుగా నున్న యెడల ఇచ్చటికి వచ్చుటకు ప్రయత్నింపుము. నీకు ఉత్తేజము కలుగును. ఆధ్యాత్మిక స్పందనములవల్ల ఇచ్చట నీకు చాల ఉపయోగము కలుగును. ప్రేమమయమైన ఆశీర్వాదములు.

ప్రేమతోను ఓంతోను,

నీ సొంత ఆత్మ,

శివానంద

# 7. స్వప్నముల యర్థము

శ్రీ చెల్లమ్, మద్రాసు 3-2-1955

దివ్యమైన అమరమైన ఆత్మ స్వరూపిణీ! ప్రణామములు.

నీవు నీ అధ్యయనమునందు, జపధ్యానములయందు సత్సంగమునందు నియమముగా నుండుట చూచి నాకు చాల సంతోషము కలిగినది. నీకు క్రొత్త దృక్పథము కలుగును. నీ దైనిక జీవితమునందును మానసిక శాంతియందును చెప్ప నలవికాని సంతోషము కలుగును. భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

రామకృష్ణమిషనునకు వెళ్లుము. అచటి ఆధ్యాత్మిక స్పందనము నీకు చాల సహాయకారియగును. ఇదియే నీకు సత్సంగము ఉచ్చ జీవితముయొక్క పునాది.

భజనయు కీర్తనయు మనస్సును వృద్ధిపరచును. కాని ధ్యానము చాల ముఖ్యమైనది.

లౌకిక హోదాయొక్క అధికారము, చీటికి మాటికి స్థితిగతులు మార్చుట మున్నగు వానితో భక్తి, యోగ, తత్త్వమార్గముల ననుసరించువారికి సంబంధమేమియు లేదు. ఇది పవిత్రమైన దివ్య ఆనందము, దివ్య జ్ఞానముగల దివ్యజీవనము. నీకు భగవంతుని కటాక్షము కలదు. చెడు సంస్కారములు నిన్ను మార్చజాలవు.

అట్టి ఊహలు నీకు కలిగినప్పుడు భగవానుని నామము మానసికముగా తలంపుము. దృశ్యములు, స్వప్నములు, ధ్వనులు ఇంకను భక్తుల అనుభవములో నుండునవన్నియు సూక్ష్మావరణము నుండి వచ్చు నిజమైన ప్రోత్సాహములు– ఆంతర పవిత్రతను తెలియపరచును. భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

నీవు సాధ్యమైనంతవరకు సంపాదించి కూడబెట్టుము. అది నీకు ముందు శాంతి సౌఖ్యము కలుగజేయును. అది దైవకార్యము కొఱకైనది.

ప్రేమతోను, ఓంతోను,

నీ సొంత ఆత్మ,

శివానంద

# 8. సంతోషకరమైన పలుకులు

శ్రీ చెల్లమ్మ, 9-2-1955

ప్రభావముతో కూడిన అమర ఆత్మా! ప్రణామములు.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

దయతోగూడిన నీ ఉత్తరము అందినది. దానిని చదువుకొని అందుండు విషయములను గురించి సంతోషించితిని. భగవంతునియొక్క పవిత్రత, కటాక్షము-వీని ద్వారా నీవు మంచి అభివృద్ధి పొందుచున్నావు. ధ్యానధారణాజపముల స్థిరమైన ఆచరణవల్ల నీకు ఆశ్చర్యమైన అనుభవము కలుగును.

నా పుస్తకములు నిన్నుమంచి మార్గములో నడుపును.

అది చాల సంతోషకరమైన విషయము. నీవు ఋషీకేశము మార్చి, ఏప్రియల్ నెలలలో రమ్ము. నీవు నీస్వంతయిల్లయిన యీ ఋషీకేశమును చాల ఇష్టపడుదువు. నీవు ఆనందముతో నుందువు. నీకు ఉత్తేజము కలుగును.

నీవు తరచుగా నాకు వ్రాయుచు నీయనుభవములు నాకు తెలుపవచ్చును. అపుడు నీ మనస్సు తేలికయగును. నీ ధ్యానమునందు నీవు వృద్ధిపొందుదువు. ఎప్పుడైనను

ఏదైనను ప్రత్యేకముగా నున్న యెడల నేను నీకు వ్రాయుదును.

శ్రీ డాక్టర్ లక్ష్మీమిార్ చందనీ అమ్మ ఆశ్రమమునకు వచ్చి కొన్ని రోజులుండినది. నీవు ఢిల్లీలో చదువుచున్నపుడు ఆమెకు నీతో చాల పరిచయము గలదు.

నీకు శాంతి ఆనందములతో కూడిన సంతోషకరమైన క్రొత్త సంవత్సరము కలుగునుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 9. నిరుత్సాహము-దాని విజయము

10-2-1955

శ్రీ చెల్లమ్.

ప్రణామములు.

నీ దయగల ఉత్తరము అందినది.

నీకు అప్పుడప్పుడు నిరుత్సాహము కలుగును. నీవు ప్రాపంచిక ఆవేశములమధ్య ఉందువు. అపుడపుడు సాధనలో అంతరము కలుగును. వాతావరణము నందలి మార్పులవల్ల నీవు సరిగా ధారణ ధ్యానము చేయలేకపోవచ్చును. దయచేసి ఆదుర్దా పడకుము. నీవు దివ్యముగా వృద్ధిపొందుచున్నావు. తప్పనిసరిగా ఆ మానసిక జపము ప్రార్థన చేయుము. రామకృష్ణమిషనుకు వెళ్లుము. నా పుస్తకములు చదువుము. నీవు వృద్ధిపొందుదువు. భజనయందు కీర్తనలయందు పాల్గొనుము. నీ మనస్సు నిర్మలముగా నున్నప్పుడు ధ్యానమునకు కూర్చుండుము. ఆ ప్రకారము ఒకటి తర్వాత ఒకటి చేయుము. భగవంతుడు నిన్ను ఆశీర్వదించును గాక.

నా పుస్తకములో ముఖ్యభాగముల విషయమై వ్యాసములు వ్రాయుము. అందు ఆబోధనవల్ల నీకు కలిగిన ఉపయోగములను వ్రాయుము. నీవు వ్రాసిన వ్యాసముల నకళ్లు నాకు పంపుము. నీ మనస్సును ఈ ప్రకారము నీవు

ఉపయోగించిన యెడల నీకు త్వరగా వృద్ధిగలుగును. నిరు త్సాహమంతయు పూర్తిగా అదృశ్యమగును.

నీకు సామాన్యమైన అనుజ్ఞ నిచ్చితిని. నీవు నాకు అవసరములనుబట్టి ఉత్తరములు వ్రాయుచుండుము. అవి అన్నియు నేను చదువుకొనెదను. అవసరమున్నప్పుడు నేను నీకు ఉత్తరము తొందరగా వ్రాసెదను.

మంచి కోరికలతో మరియు ఓంతో,

నీ స్వంత ఆత్మ,

శివానంద

# 10. ఆధ్యాత్మికాభివృద్ధి లక్షణములు

శ్రీ చెల్లమ్మ, 24-2-1955
మద్రాసు.

దివ్యమై అమరమైన ఆత్మా!
ప్రణామములు.

1955వ సంవత్సరము జనవరి నెల తాలూకు నీ దిన చర్య నాకు అందినది. అది బాగా తయారైనది.

బాహ్యసంబంధమైన సాధనానుష్ఠానము నీ ఆంతర శాంతి, ప్రపంచ వస్తువులయందు నిరాపేక్ష, నిస్పృహాత, అపోహాలు లేకుండుట మొదలగు వానిని వృద్ధిచేయవలెను. ఈ విధముగా నీవు వృద్ధిపొందునట్లు నీకు తోచిన యెడల నీవు చాల మట్టుకు వృద్ధిపొందినట్లే.

ప్రయత్నము ఎన్నడును వృథకాదు. నీవు ఇప్పుడు జరుపుచున్న సాధన నీ శాశ్వతపు ఆధ్యాత్మిక ధనమును వృద్ధి పొందించును. అయినను నీ హీనస్వభావము పూర్తిగా పవిత్రమగు వరకు నీవు తొందరపడకూడదు. జబ్బు మనుష్యులకు సేవచేయుటకు భగవంతుడు నిన్ను ఏర్పాటు చేసియున్నాడు. నీ పనులమధ్య నీ వైరాగ్య అగ్నిని మండుచున్నట్లుగానే ఉంచవలెను. నీవు పూర్ణముగా వృద్ధిపొందుటకు అది అసాధారణమైన వీలుకలుగజేయును. నీవు కర్మయోగముద్వారా భగవంతుని సాక్షాత్కారము పొందుటకు అది వీలుకలిగించును.

నీ ఆధ్యాత్మిక దినచర్య ఒక ధ్యేయవస్తువుగా నున్నది. అది యితర సాధకులు వారి పనుల మధ్య సాధన వృద్ధిచేసికొనుటకు వానికి ఉత్తేజము కలుగజేయును. కావున అది సొసైటీ పత్రికలలో ప్రచురింపబడును.

నీవు నీ ఆధ్యాత్మిక మార్గములో వైభవముగా వృద్ధి పొందుదువుగాక. భగవంతుడు నిన్ను కటాక్షించుగాక!

నీ సొంత ఆత్మ,

శివానంద

# 11. మొట్టమొదటి ఉపదేశము

శ్రీ చెల్లమ్మ, 25-2-1955

మద్రాసు.

పూజనీయురాలగు దివ్యతల్లీ,

ఓంనమోనారాయనాయ. ప్రణామములు. ఈ మధ్య మీ వద్దనుండి వచ్చిన ఉత్తరము అందినది.

నీకలలు దృశ్యములు చాల బాగున్నవి. నీవు నీ యెదుటనున్న ధ్యేయమునకు నడచుచున్నావు. నీకు ప్రస్తుతము కలిగిన అనుభవములు నిజమైన భక్తుడు భగవంతుని కటాక్షము కొఱకు పరితపించుచున్నట్లున్నవి. నీవు వాని విషయమై ఆదుర్దాపడవద్దు. ముముక్షువు ప్రప్రథమమున తీవ్రఆదుర్దాతో నున్నచో ముందువచ్చు ప్రతి నిమిషము అతనికి తీవ్రమైన సంతోషసమయముగానుండును. కాన ఓర్పుతో వేచియుండి నిరీక్షింపుము. ఇదివరలో చేయుచున్నట్లే ఎల్లప్పుడు ప్రార్థనచేయుము.

నీవు ఇప్పటి వరకు వ్రాసిన ఉత్తరములనుబట్టి నీవు శ్రీ సుబ్రహ్మణ్యస్వామియొక్క తీవ్రమైన భక్తురాలవయినట్లు స్పష్టముగా తెలియుచున్నది. కాబట్టి నేను శ్రీ సుబ్రహ్మణ్యమంత్రమును వ్రాసిన ఉపదేశపు కార్డు ఇందువెంట పంపుచున్నాను. ఆ మంత్రమును నమ్మకముతోను భక్తి

తోను జపించుచుందుము. నీకు కావలసిన దానిని నీవు ఆ ప్రభువునుండి పొందెదవు. నేను వ్రాసిన పుస్తకము 'భగవాన్ షణ్ముకుడు-ఆయనపూజ' చదువుము. నీకు ఉత్తేజము కలిగి ఆనంద మార్గమునకు ప్రకాశముకలుగ జేయును. జపానుష్ఠానములలో 'జపయోగము' కూడ బాగా సహాయముచేయును. తీవ్రమైన నమ్మకము ద్వారా ఆయన కటాక్షమును పొందుము. ఇందు వెంట ప్రసాదము పంపుచున్నాను.

భగవంతుడు నిన్ను కటాక్షించుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 12. ఆత్మ సాక్షాత్కారమునకు తిన్నటి మార్గము

శ్రీ డాక్టర్ చెల్లమ్మ, 27-2-1955

మద్రాసు.

వైభవముగల అమరమైన ఆత్మస్వరూపిణీ!

ప్రణామములు. ఓం శరవణభవాయ నమః.

భగవానుని పాదపద్మములకు భక్తియొక్క ఉద్రేకముతో నీవు దయతో వ్రాసిన ఉత్తరమువల్ల నాహృదయమునకు మేరమీరిన ఆనందము కలిగినది.

'గురువుయొక్క అవసరము' అను నీవు వ్రాసిన వ్యాసము చాల ఉత్తేజకరమైనది. ప్రపంచమునందలి సాధకుల ఉపయోగము నిమిత్తము నీ హృదయ నిర్గతమైన ఉత్తేజమగు ఉత్తరము వ్రాయుచుండుము. ఇదికూడ గొప్ప నిష్కామ కర్మ.

నీ హృదయము భగవంతునికిమ్ము. చేతులు మానవ సేవకు ఉపయోగించుము. నీ దైనిక జీవితములో ఇది నీ కర్తవ్యము, అనుసరింపదగుమార్గము అయియున్నది. భగవానునియొక్క ఉద్దేశము మీ చేతులద్వారా పెదవులద్వారా మనస్సుద్వారా ప్రవహింపనిమ్ము. నీవు ఆయనలో నున్నావని అనుభవమునకు తెచ్చుకొనుము. ప్రపంచమంతయు ఆయనయే అనియు, ఆయన మాత్రమే ప్రకటితరూప

మనియు గ్రహింపుము. ఆయన నీలోనున్నట్లు ఊహింపుము, ఇదియే ఆత్మసాక్షాత్కారమునకు తిన్నని మార్గము.

నేను గాని ప్రపంచమందలి ఏయితరులుగాని నీ విషయమై అసంతుష్టి చెందుటలేదు. అందరును నాకు ప్రియులే. నీవు నాకు మిక్కిలి ప్రియురాలవు. ఎందువల్ల ననగా నీవు భగవంతుని యందు భక్తితో నిండి యున్నావు. ప్రపంచ వస్తువులయందు విరక్తికలిగియున్నావు. ధైర్యము గల ఆత్మస్వరూపిణీ! ఆధ్యాత్మిక జ్ఞానమును రాజ్యమును స్వాధీనము చేసికొనుము. భగవంతుడు నిన్ను కటాక్షించునుగాక!

నీ సొంత ఆత్మ,

శివానంద

## 13. గురువు తన పేరునిచ్చును

శ్రీ శివానంద చెల్లమ్మ, మద్రాసు. 20-3-1955

ఓం నమో నారాయణాయ.

నీ వ్యాసములు చాల బాగున్నవి. ఒకటి ఒక పుస్తకమున ప్రకటింపబడినది. ఇంకొకటి 'దివ్య జీవనము'లో ప్రకటింపబడును. మూడవదికూడ ప్రచురింపబడును.

నీవు ఆశ్రమమునకు వత్తువని తెలిసినందులకు సంతోషము. ఇరువురకును హృదయపూర్వక అభినందనములు.

మీవంటి భక్తిగల శిష్యులు గురువుయొక్క పేరును తమ నామములకు కలుపుకొందురు. కావున నీవిపుడు శివానంద చెల్లమ్మవు.

నీవు నాకు ప్రియమైన చెల్లవు. ఏలననగా నీవు నిజమును తెలిసికొనుటకు వెదకు ఆసక్తికలదానవు.

బీదలను ఎక్కువ దయతోను భక్తితోను చూడుము. దానివల్ల ఆత్మ పవిత్రత ఆత్మ సాక్షాత్కారము కూడ కలుగును.

నీతిశాస్త్రమే యోగమునకు మూలము లేక పునాది. నీతిశాస్త్రము యోగవేదాంతము యొక్క పద్ధతి సారము. యమములో స్థిరపడుము.

ఆత్మ సాక్షాత్కారము తొందరగా కలుగజేయునది శ్రద్ధ జాగ్రత్త నిచ్చునది వైరాగ్యము.

భగవంతుడు నిన్ను కటాక్షించుగాక!

నీ సొంత ఆత్మ,
గౌరవప్రేమ ఓంలతో,
శివానంద

# 14. ఆహ్వానము

శ్రీ శివానంద చెల్లమ్మ, మద్రాసు, 23-3-1955

ప్రభావముతో గూడిన అమర స్వరూపిణీ!

ప్రణామములు. నీదయగల ఉత్తరము అందినది.

ఈ పవిత్ర స్థలమునకు నీవు ఏప్రియల్ 1 వ తేదీన యాత్ర జరుపుటకు మద్రాసునుండి బయలుదేరుదువని తెలిసికొని సంతోషించితిని. శుభ ఆశీస్సులు. నీ యిష్టము వచ్చినన్నిరోజులు నీవు ఇక్కడ నుండవచ్చును. ఇది నీ సొంత యిల్లు. డాక్టర్ నాయరుగారికి నా హృదయపూర్వక ఆహ్వానము. ఇపుడు శీతకాలము సమాప్తమయినది. ఇచ్చటి శీతోష్ణస్థితి సరిగా మద్రాసునందువలెనే యుండును.

నీ ప్రతిజ్ఞా పత్రము ఆశ్చర్యజనకము. అందు అన్ని విధముల అభివృద్ధికి ఆస్కారము కలదు. చాల పొగడ దగినది. నేను నీకు జయము కలుగవలయునని కోరుచున్నాను. నీ ప్రతిజ్ఞల ప్రకారము నీవు అనుసరించిన యెడల నీవు కొద్దికాలములో అమితమైన లాభము పొందగలవు.

ఓం ప్రేమలతో,

నీ సొంత ఆత్మ,

శివానంద

## 15. మగ్నాకార్టా

శ్రీ శివానంద చెల్లమ్మ, మద్రాసు. 21-4-1955

ఓం శరవణభవాయ నమః.

నీదయగల ఉత్తరము అందినది.

ప్రతి దినము నీవు నాతో కలిసి యుండవచ్చును. దూరము స్థలము ఒక లెక్కలోనివి కావు. ఎడబాటు యొక్క ఊహ నీసాధనయందును దైనిక జీవితమునందును చాల సహాయకారిగా నుండును. ఎడబాటు జ్ఞానమును సౌఖ్యము నయియున్నది.

మీరు ఆశ్రమమందుండువారు. నేను మీ ఉద్దేశములు శ్రీ చిదానందస్వామి, శారదానందస్వామి మొదలగువారికి తెలియ పఱచినాను.

గీతలో 10 వ అధ్యాయము చదువుము. నీవు దేవుని యందు నివసింతువు.

నీ వైద్యశాల దేవాలయము, బృందావనము మరియు వారణాసి. ప్రపంచమంతయు నీ శరీరము, ఇల్లు. నేను ఎల్లప్పుడు నీ ప్రక్కనే ఉందును. నేను నీ హృదయమునందు నివసింతును.

ఎల్లప్పుడు సంతోషముగా నుండుము. ఉద్రేకములను తగ్గించుకొని నిర్మలముగా నుండుము. కండ్ల ఆసు

పత్రిలో నీపని దివ్యమైనది. రోగులే దేవతలు. దినచర్యను గృహచర్యను అశ్రద్ధచేయవలదు. చేతితో చేయబడిన ప్రతి పనియు దేవుని సేవయే. నీవు ఇప్పుడుకూడ ఋషీకేశములోనే యున్నావు. విశ్వ దృష్టి కలిగియుండుము. అతిని త్యజింపుము. క్రమశః ముందుకు నడువుము. నీ స్వంత గృహము ఋషీకేశము. వైద్యమును అశ్రద్ధచేయవలదు.

ప్రభువునామమే నీ శరణము. నీవు ఏమి చూచినను దానియొక్క ప్రభావమును ఆయనకు ఆరోపింపుము. అందమును నీవు ఎచ్చట చూచినను ఆయనను జ్ఞప్తియందుంచుకొనుము.

నీ ఆత్మకు (శ్రీ) డాక్టరు వేలాయుధమునకు ఆయన పిల్లలకు, తల్లిదండ్రులకు ప్రణామములు.

భగవంతుడు మీకు ఆరోగ్యము శాంతి మరియు ప్రకాశము కలుగజేయునుగాక. ఇందువెంట భగవంతుని ప్రసాదము పంపినాను. హరి ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

గౌరవప్రేమ ఓంలతో,

శివానంద

# 16. దైనిక జీవితమునందు యోగము

శ్రీ చెల్లమ్మ, 30–4–55

మద్రాసు.

గౌరవముగల అవినాశినియగు ఆత్మా !

ప్రణామములు.

మార్చి నెలకు సంబంధించిన నీ ఆధ్యాత్మిక దినచర్య పుస్తకము అందినది.

నీవు ఆధ్యాత్మిక మార్గమునందు బాగా వృద్ధిపొందు చున్నావు. సాధన యందు సరిగా నడచుకొనుటకు ప్రయత్నించుము. ఆ ప్రకారము చేయుట నీ నియమితమగు ఉన్నతికి కారణము.

ధ్యానము సత్సంగము విడివిడిగా కనపర్చవలెను. జపముయొక్క సంఖ్య క్రమశః వృద్ధిపరచవలెను. పనిచేయునప్పుడు ఏమియుపనిలేనప్పుడు భగవన్నామము మానసికముగా జపించుటకు అభ్యాసము చేయవలెను. ప్రభువును ఎల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనుట, ఆయన నామమును స్మరించుట ఆధ్యాత్మికోన్నతికి సహాయము చేయును.

ఇతరులకు నిష్కామ సేవచేయుటయేగాక నీవు నీ మామూలుపని చూచుకొనునపుడు కూడ అసంగభావము అభ్యసించవలెను. కర్తవ్యమును వదలుకొనుటవలనను కర్మ

ఫలమును భగవానునకు సమర్పించుటవలనను ఆయనయే కర్తయని ఊహించుటవలనను అంతయు ఆయనదే అను కొనుటవలనను ఒక వ్యక్తి తానుచేయుకర్మ యావత్తు యోగముగా మార్చుకొనవచ్చును.

ఆధ్యాత్మిక పంథాయందు ఆరోగ్యము దీర్ఘాయువు శాంతి ఆనందము సంపద కలుగునట్లు భగవంతుడు మిమ్ము లను ఆశీర్వదించుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 17. ఏకత్వమందు

శ్రీ శివానంద చెల్లా, 2-5-1955

ఓం శరవణభవాయనమః.

ఉచ్చ దివ్యభావము మంచిది, సహాయకారి. 'పాండురంగ' రికార్డు చాల ఉత్తేజకరముగా నుండును. నేను నిన్ను వినగలను. పీరుడా ముందుకు నడువుము.

దైనిక జీవితమందు ఏకత్వభావము అమలులో పెట్టవలెను. ఏకత్వభావము వ్యక్తియొక్క గుణములో నొక భాగముగా నుండవలెను. శాంతిమార్గమే నిజము, అహింస, ప్రేమ, పవిత్రత సరియైన శీలము–వీనికి మార్గము.

సమదృష్టి ఆత్మ సాక్షాత్కారమునకు పరీక్ష. భక్తి అమరత్వము యొక్క తలుపును తెఱచును.

నీవు ప్రభువు సుబ్రహ్మణ్యునియందు స్థిరముగా నుందువుగాక! ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 18. మిక్కిలి గౌరవనీయమైన కోరిక

శ్రీ శివానంద చెల్లమ్మ, 7–5–1955

మద్రాసు.

ఓం శరవణభవాయనమః

నాకు గుల్లయును, గ్లాసును అందలేదు.

క్రొత్త ఫ్రేముతో నీకు ఫోటో పంపెదను.

నీవు సరియైన మార్గములో అభివృద్ధి పొందుచున్నావు.

నీవు తప్పక నీ కోరికను అనుభవింపగలవు. భగవంతుని సన్నిధానములో నుండవలయునను కోరికయే అన్ని కోరికలలో గౌరవనీయమగు సాత్త్వికకోరిక. అదియే దైవ ప్రేరితమైనది.

ధ్యానాభిలాష తీవ్రముగా నున్నప్పుడు ధ్యానమునకు కూర్చొనుము.

భగవంతుడు నిన్ను కటాక్షించుగాక!

నీ సొంత ఆత్మ,

శివానంద

# 19. ఆంతరదృష్టి మారుట

శ్రీ శివానంద చెల్లా 13-5-1955

పూజ్యమైన అమరమగు ఆత్మా!

ప్రణామములు.

ఓం శరవణభవాయనమః.

నిద్రలో గూడ భగవంతుని జ్ఞాపకమున్నయెడల అదియొక గొప్ప విషయము. సాయంకాలమందు నీవు డాక్టరుతో కలిసి బయటకు వెళ్ళవచ్చును. అది కొంత విశ్రాంతిగానుండును. రాత్రి నీవు తీక్ష్ణముగా ధ్యానము చేయుటకు వీలుకలుగును.

భగవంతుడు నీకు అన్ని విధముల సహాయము చేయును. ఆయన భక్తులకు బానిసగా నుండును. శరీరపు గుర్పాటు త్వరలో పోవును. తీక్ష్ణ ధ్యానము సమాధి యొక్క ఆనందము అనుభవించెదవు. సాధనకు నీవు కూర్చుండు కాలము సరియైనదే. నీవు జపమాల నుపయోగింప నవసరము లేదు.

గాలి వేడిగా నున్నప్పుడు నీవు ప్రాణాయామము చేయకూడదు. చల్లగా నుండు ఉదయకాలమందు నీవు చేయవచ్చును. శీతకాలమందు ప్రాణాయామము ఎక్కువగా చేయవచ్చును.

నీవు పంపినమాల అందినది. శంఖము గ్లాసులుకూడ అందినవి. గ్లాసులు నాకు బాగా సరిపోయినవి. గ్లాసులతో ఫోటో నీకు పంపెదను.

నేను డాక్టర్ల సలహా, నామంచినికోరి నా క్షేమము చూచు నీయొక్క సలహా వినెదను. నీ ప్రార్థనలు నమ్మక ముతో కూడినవి. అవి నీ హృదయాంతర్గతమునుండి వచ్చు నవి. ఆంతరికములు. వానికి భగవంతుడు జవాబు నిచ్చును.

ఈ ప్రపంచమే భగవంతుడు. నీ పనులన్నియు ఆయనకు కానుకలు. మద్రాసు-ఋషీకేశము. మీ పిల్లలే భగవంతుడు. నీ పనియంతయు దైవసంబంధమైనదే. ప్రపంచమంతయు బృందావనము; కైలాసము.

నెమ్మదిగా వృద్ధిపొందుట ఉపయోగకారి. తొందర మార్పు పనికిరాదు. నీవు ఆత్మ ప్రకాశము అను పరమ స్థితిలో నిలిచియుందువుగాక! భగవంతుడు త్రోవలోనుండు అడ్డంకు లన్నియు తొలగించునుగాక! నీకు నిజమైన భగవ ద్దర్శనము కలుగునుగాక!

నీకు డాక్టరు తలిదండ్రులకు పిల్లలకు భక్తులందరకు నా ప్రణామములు.

ప్రభు విశ్వనాథుని ప్రసాదము ఇందుతో పంపినాను.

నీ సొంత ఆత్మ,
శివానంద

# 20. అడ్డంకులు పోగొట్టుకొనుటకు

శ్రీ శివానంద చెల్లా, 20-5-1955

ఓం శరవణభవాయ నమః.

నీదయగల ఉత్తరము, ప్రార్థన దృశ్యములు.

ప్రభు సుబ్రహ్మణ్యులకు నీ ప్రార్థన ఆంతరికమైనది. అది హృదయాంతరమునుండి వచ్చినది. ప్రభు సుబ్రహ్మణ్యుడు నిన్ను కటాక్షించునుగాక.

ప్రయత్నము చేయుము. వీరుడవుకమ్ము. ముందుకు నడువుము. ఇచ్చట ఇపుడే శాశ్వతశాంతి పొందుము.

నిర్మలత్వము నమ్మకము కోరికలు లేకుండుట మాతృ సక్తి మొదలగునవి కలిగినపుడు త్రోవలో అడ్డంకులు ఏమియు నుండవు.

ఆధ్యాత్మిక జీవితమువల్ల శాశ్వతశాంతి పూర్ణత్వము శాశ్వతానందము బాధల నోర్చుకొనగల శక్తి సమత్వము కలుగును.

నీ సొంత ఆత్మలోన దూరుము. మూలమునకు పోయి అచ్చట ఎల్లప్పుడు శాంతిగా విశ్రమింపుము.

నీ పొరుగువాడగు శ్రీ సుబ్రహ్మణ్య అయ్యరుగారు ఇచ్చట ఉండిరి.

ఎండగా నున్నప్పుడు ధ్యానము చేయవద్దు.

ఆత్మకు ప్రణామములు. డాక్టరు 'వీ'కి తలిదండ్రులకు ప్రణామములు. భగవంతుడు నిన్ను కటాక్షించుగాక. గౌరవము ప్రేమ మరియు ఓంతో,

శివానంద

# 21. ఆధ్యాత్మిక వృద్ధియొక్క గీటురాయి

శ్రీ శివానంద చెల్లా,                                30–5–1955

ప్రభావముతో గూడిన అమర ఆత్మ!

ఓం శరవణభవాయ నమః,

నేను నిన్ను సంతోషపరచెదను. నీవు మంచి ధ్యానము అనుభవించుచున్నావని తెలిసి సంతోషించుచున్నాను. నేను నిన్ను సరిచేసెదను.

కండ్లజోడుతో నుండు ఫోటో యిదివరకే పంపబడినది.

కండ్ల చికిత్సాసమావేశము జరుగుచున్నది. పావన పురుషుడయిన శ్రీ డాక్టరు అధ్వర్యూ, కండ్ల చికిత్స ప్రత్యేక అధికారి, పనిచేయుచున్నాడు. నేను మీ యునికిని ఇక్కడ అనుభవించుచున్నాను. నీ వ్యాసము ప్రచురింపబడియున్న ఫారెస్టు విశ్వ విద్యాలయ వారపత్రికను ఇదివరకే పంపియున్నాను. 'శివానంద డేటు డే' కూడ పంపినాను.

నీ అందమైన వ్యాసము 'నాకు తెలిసిన నా యజమాని' అనునది నాకు అందినది.

నేను నిన్ను సరిగా అర్థము చేసికొన్నాను.

ఇప్పుడు నేను ఆఫీసుకు ఉదయము 6 గంటలకే వెళ్లు చున్నాను. తిరిగి 8 గంటలకు వచ్చుచున్నాను. ఉదయము నందును రాత్రియందును నేను ఆధ్యాత్మిక స్పందనములు ప్రపంచమంతటికి పంపుచున్నాను. సంతోషము తృప్తి, నిర్భీతి, విరక్తి, ఎల్లప్పుడు భగవంతుని యొక్క సాన్నిధ్యము కలిగియుండుట, ప్రపంచము యొక్క భ్రమ స్వభావమును తెలిసికొనుట–ఇవన్నియు గలిగియుండినచో వ్యక్తి ఆధ్యాత్మిక మార్గమందు వృద్ధిపొందుచున్నట్లు తెలియును. చెల్లా నిన్ను భగవానుడు ఆశీర్వదించుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

## 22. అంతులేని ధనమునకు తాళపు చెవి

శ్రీ శివానంద చెల్లా, 8-6-1955

ఓం శరవణభవాయ నమః.

పూజ్యమైన అమర ఆత్మ!

కండ్లజోడు సరిగానున్నది.

మంచి సాధకునకు నిద్రకూడ వాని ధ్యానమునకు తరువాత అనుబంధముగా నుండును. సందేహము లేకుండ భగవంతుడు నీ యందు దయగలిగియున్నాడు. ధ్యానముతో కూడిన జీవితము పూర్వజన్మలలో జరిపిన ఉత్కృష్ట కార్యములయొక్క ఫలము.

ఆత్మవిజయము లేక మనుస్సును జయించుట చాల గొప్ప విజయము.

శరీరము బ్రహ్మపురి.

అహము చంపబడిన తరువాత జ్ఞానము, ఆధ్యాత్మిక ధనము శక్తియొక్క భాండాగారము నీకు తెరువబడును, ఓ చెల్లా.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించుగాక.

ఓం తత్ సత్.

నీ స్వంత ఆత్మ,

శివానంద

# 23. ఆధ్యాత్మిక అనుభవములు

శ్రీ ఓం శివానంద చెల్ల 18–6–1955

మద్రాసు.

తత్త్వమసి.

ఇది ప్రతిసాధకుడు లేక ముముక్షువుయొక్క మామూలు అనుభవము. అప్పుడప్పుడు విచిత్రమైన అనుభవములు కలుగుచుండును. అది ఆధ్యాత్మిక వృద్ధియొక్క సూచన. ధారణయున్నప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలు తగ్గియుండును. అట్టిస్థితి కలిగినపుడు ధ్యానమునకు కూర్చుండవలెను. అప్పుడు చెప్పనలవికాని ఉద్రేకము పవిత్రఉత్సాహము నీవు అనుభవించెదవు. ఈ అనుభవముల విషయమై నీవు ఆదుర్దాపడవద్దు.

చెల్లా, నేను నీకు సేవచేయుదును. నేను నీ కొరకై ప్రార్థించుచున్నాను.

వేచియుండుము. ఓర్పుగలిగియుండుము. శ్రీ కృష్ణ భగవానుడు చెప్పినదేమనగా 'సమయము కలిగినపుడు నీవు నన్ను కనుగొనగలవు'. ముముక్షువు వృద్ధిపొందుటకు అవసరమగువాతావరణము భగవంతుడు కలుగజేయును. అతడు ఫిర్యాదుచేయకూడదు. అది తన మంచికొఱకును వృద్ధికొఱకును మాత్రమే అయియున్నది.

నీవు నీ మృత్యుంజయ జపము క్రమముగా చేయుము. ఎట్టిచెడుశక్తియు నీ దగ్గరకు చేరదు. నీకు హానికలుగ జేయదు. ఈ విషయము నీకు ఇంకను బాగా నిర్భీతి కలుగుటకు జరుపునది. వీరు రాలగు చెల్లా ముందుకునడువుము. వెనుకకు చూడకుము. ఇప్పుడే ఇచ్చటనే నీ ధ్యేయమును చేరుము.

ఆత్మకు డాక్టరు 'వీ' కి తల్లిదండ్రులకు నా వందనములు, ప్రణామములు.

నీ సొంత ఆత్మ,

శివానంద.

# 24. విరహము విషయమై

శ్రీ శివానంద చెల్లమ్మ 26-6-1955.

మద్రాసు.

పావనమైన అమరఆత్మా!

ప్రణామములు.

ఓం నమోనారాయణాయ!

నీదయతోగూడిన మేనెలతాలూకు ఉత్తరము డయిరీ అందినవి. వానిని బట్టి నీవు నీ ధ్యేయమునకు చాల దగ్గరగా నున్నావని తెలియుచున్నది. నీ యొక్క విరహము తీవ్ర రూపము ధరించినపుడు నీ ప్రియునియొక్క రూపము తప్పక నీకు అనుభవమునకు వచ్చును. నీవు బాగా వృద్ధిపొందు చున్నావు. నీవు ఎప్పుడు ఒంటరిగాను నిస్సహాయవుగను నున్నట్లు నీకు తోచునో అపుడు ఆయనను జ్ఞాపకము చేసి కొని ఆయన శరణుజొచ్చి ఆయన నామమును స్మరింపుము. నీవు ఆప్రభువుతో కలిసిపోగలవు.

సాధనయందు నీ క్రమమును ఆసక్తియు ఆదర్శనీయ ములుగా నున్నవి. ఈ జన్మయందే నీవు తప్పక నీ ధ్యేయ మును పొందగలుగుదువు. భగవంతుడు నిన్ను ఆశీర్వ దించుగాక!

గౌరవము ప్రేమ మరియు ఓంతో,

నీ సొంత ఆత్మ,

శివానంద

# 25. శరణాగతియొక్క ఫలితము

శ్రీ శివానంద ఉల్లా, 19-7-1955

ఓం శరవణ భవాయ నమః

పావనమైన అమర ఆత్మా!

నీ ఉత్తరములలో దయచేసి తారీఖు వేయుము.

'నా గుర్తులు లేక చిహ్నములు' అను నీ వ్యాసమును దయచేసి పూర్తిచేయుము. నీవు ఉద్రేకమందున్నావు. విచారము ఎక్కడిది? నీ ఉత్తరములన్నియు నేను చదువుచున్నాను.

నేను బాగా ఆరోగ్యముగానున్నాను. నీవు శరణాగతి అయినప్పుడు విచారమునకు బాధకు నిరుత్సాహమునకు ఇతరవ్యతిరేక అనుభవములకు అవకాశము లేదు.

ప్రాతఃకాలమునందు నీవు ప్రాణాయామము చేయవచ్చును. అది నిజమైన దృశ్యము. క్రమమైన ధ్యానము ద్వారా నీ ఆత్మను మథింపుము. నిజము అపుడు బయల్పడును, ప్రకాశితమగును.

ఎవరు నిర్మలముగా నుండి యితరులయందుకూడ ఆ విధముగానే ఉందురో అట్టివారు స్వేచ్ఛతో సౌఖ్యముతో కూడిన పూర్ణ ఆత్మ స్వరూపులు.

ఆత్మనుగాని నిజమునుగాని తెలియనివాడు తప్పక భ్రమ కలిగియుండును.

భగవంతుడు నిన్ను దీవించుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 26. జ్ఞానముగల ముముక్షువు

శ్రీ శివానంద చెల్లా, 28-7-1955

ఓం

లక్నో వాస్తవ్యురాలు శ్రీదేవకీ కట్టే, ఆమె తలిదండ్రులు సోదరీలతో కూడ ఇచ్చట నెలరోజులుండి యీ దినముననే యిచ్చటనుండి వెళ్ళినది. ఆమె నిన్ను బాగా ఎఱుగును. నీవు ఆమెకంటె పెద్దదానవు.

నీవు ధ్యానము క్రమముగా జరుపుచున్నావని తెలిసి సంతోషించుచున్నాను. నీ ధ్యానపద్ధతి సరిగానే యున్నది. ఊపిరిని విడిచినపుడు ప్రణవజపము (ఓం) చేయవచ్చును. ప్రతిపనియు పూజయే. అది తొందరగా చేయనవసరము లేదు. నిజమే. నీ ఆనందస్థితి నీవు వర్ణించలేవు. నాకు ఆ సంగతి అనుభవమే.

నీవు నా ప్రక్కనే కూర్చుండవచ్చును. దూరమొక లెక్కలోనిది కాదు. వాక్యముల విషయమై నీవు ఎక్కువ శ్రద్ధ తీసికొననవసరము లేదు. నీ హృదయమునందలి ఊహలు, ఆవేదనలు నాకు తెలియును.

జ్ఞానముగల ముముక్షువు, లెక్కలేని వారిలో

చుకుకుగలవాడు, నిద్రపోవు వారిలో మేలుకొనియుండు వాడు, నియమములు లేని వారిలో నియమములు గలవాడు, ఆలోచన లేనివారిలో ఆలోచన గలవాడునయి యిప్పుడే ఇచ్చటనే ధ్యేయమును చేరి అమరత్వము శాశ్వతానంద మును పొందును.

చెల్లా సౌమ్యా! నిన్ను భగవంతుడు ఆశీర్వదించును గాక!

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 27. మోక్షమునకు మార్గము

శ్రీ శివానంద చెల్లా, మద్రాసు. 5-8-1955

శ్రీ ఓం.

ఏబది పుష్పములుగల బుట్ట అందినది.

నేను ఉదయము ఎనిమిది గంటలకు నీదండను ధరింతును.

మిమ్ములనందరిని నేను ఆశీర్వదించెదను.

ప్రపంచ కర్తవ్యములు భగవంతుని పూజలే.

అన్ని పనులను జ్ఞానముతో అంతమగును.

నేను నీకు సేవచేయుదును.

నేను ఎల్లప్పుడు నీ ప్రక్కనే యుందును.

మోక్షము అనునది పొందదగినది కాదు. అది యిది వరకే అచటనున్నది. అడ్డంకులు తొలగించి నీవు దానిని అనుభవింపవలెను.

భగవంతుడు అడ్డంకులు తొలగించుగాక!

శాశ్వతానందములో నీవు నిద్రింతువు గాక!

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 28. నిజము శాశ్వతముగా నిలిచియుండునది

శ్రీ శివానంద చెల్లా, 12-8-1955

వైభవముతో కూడిన అమర ఆత్మా!

దయతో కూడిన నీ రెండు ఉత్తరములు అందినవి.

నేను నమ్మగలను. నాకు తెలియును. రోజంతయు నీవు నాతోనే యున్నావు. ప్రార్థనలు నేను వినుచున్నాను. శాశ్వత ఆనందమునకు నిన్ను భగవంతుడు నడుపు చున్నాడు.

నేను నీకు సేవచేసెదను.

దివ్యదృశ్యములు చాల ఉత్సాహామును కలుగ జేయును. అవి ముందు జరుగు విషయములు తెలుపును.

నీ ఉత్తరములు నా హృదయమును కరగించును. అవి ఆకర్షణీయమైనవి.

నీ స్వస్థానమును తెలిసికొనుము. నీ నిజస్వభావ మును, నీ యొక్క ధ్యేయమును తెలిసికొనుము.

నీవు ఎక్కడచూచినను సరియే. ప్రతిచోటను ఎల్లప్పు డుండెడి ప్రతి దానికి మూలము ధ్యేయము అగు నిజము ఉండును.

మౌనము జపము ధ్యానము—వీనిద్వారా భగవంతు నితో తాదాత్మ్యము పొందుము.

నీ కంఠధ్వని కరుణ, సేవ, అణకువ, నిజసంస్కృతి కలయికలతో కూడియుండవలెను.

నిత్య వైరాగ్యముతో జీవింపుము.

శ్రీ ఓం నారాయణ (ఇ. గోపాలకృష్ణమూర్తి)కి వ్రాయుము. అతడు వృద్ధిపొందిన ఆత్మ. అతడు రైల్వే ఉద్యోగమువదలి శ్రీశైలమునందలి అడవులలో నివసించెను.

నీ యొక్క క్లుప్తమైన జీవితచరిత్రను నాకు దయ చేసి పంపుము.

భగవంతుడు మిమ్ములను మీ కుటుంబమును ఇతరు లను ఆశీర్వదించునుగాక.

ఓం తత్ సత్

నీ సొంత ఆత్మ,
శివానంద

# 29. మతముయొక్క సారము

శ్రీ శివానంద చెల్లా, 23-8-1955

ఓం శరవణభవాయనమః

ప్రభావముతో గూడిన అమర ఆత్మా!

'జన్మదినము ఎట్లు జరుపవలయును?' అను నీ వ్యాసము చాల బాగున్నది. ఆ ప్రకారము ఎవరైన జీవించిన అట్టివాడు మహాపురుషుడగును.

మతముయొక్క సారము నమ్మకము భక్తి పవిత్రత ప్రార్థన ధ్యానము. ఈ అయిదును అభ్యసించిన వాడు భగవంతుని ఉద్దేశముతో కలిసియుండును.

కరుణ, సహకారము, ప్రేమ-ఈమార్గమును వెదకుము. భగవంతుని చట్టముయొక్క నిజమును తెలిసికొనుము.

సేవచేయుము. సేవద్వారా నీ జ్ఞానము వృద్ధి చెందును. సేవను ప్రేమతో జోడింపుము. అందరిలోనుండు ఏకపురుషుని కనుగొనుము.

నీ ఆత్మ నాతో సంభాషించెడు అందమైన ఊహాల ద్వారా కనపడుచు విచిత్రమైన విషయములన్నియు వినుచున్నాను.

నీవు క్రమశః వృద్ధిపొందుచున్నావు. నీ ధ్యేయమును చేరుటకు ఇంకను కొంతదూరము ప్రయాణము చేయవలసియున్నది.

నీవు ఎల్లప్పుడు నావద్దనే నివసించుచున్నావు. నీ ప్రార్థనలు నేను వినుచున్నాను. నీవు తప్పక నీ ధ్యేయమును చేరగలుగుదువు. నీకు నేను సహాయముచేసెదను.

భగవంతుడు నిన్ను కటాక్షించి త్రోవలోనుండు అడ్డంకులు తొలగించునుగాక. వీరుడా! ముందుకునడువుము. వెనుకకు చూడవలదు.

నీ సొంత ఆత్మ

శివానంద

# 30. విశ్వచైతన్యముయొక్క రహస్యము

శ్రీ శివానంద చెల్లా, మద్రాసు. 14-9-1955

వైభవముతో కూడిన అమర ఆత్మా!

ఓం శరవణభవాయనమః

నీ విలువగల బహుమతులు బట్టలు, మఫ్లరు, స్వెట్టర్, పూజకు 108 పువ్వులు అందినవి.

నిన్ను స్మరించుచు 8 వ తేదీన ఆహారము ఒక కబళము భుజించితిని. ఉదయము 4 గంటలకు పూజచేసితిని.

ఎగ్మూరు ఆడవారి ఆస్పత్రి రేడియోలజిస్టు శ్రీ డాక్టర్ కృష్ణారావు ఇచ్చట ఉండెను. అతడు మిమ్ములను కలిసికొనును.

27-8-1955 తేదీన మీరువ్రాసిన లేఖ అందినది. గురువుయొక్క జీవితము చదువుట సరియైన అధ్యయనము. నీ సూక్ష్మభావము నేను కనుగొంటిని. అది తుడిచివేయ జాలనిది.

నీ జీవితచరిత్ర : ఆ రోజులలో నీవు చదువునందు చాల ఎక్కువ శ్రద్ధతీసికొనుచు యుంటివి. అది చాల ప్రశస్తమైన విషయము. నీ జీవితచరిత్ర ఉత్తేజకరమైనది.

ప్రతిది భగవంతుని ప్రకటిత రూపమని మనకు అనుభవము కలిగినప్పుడు అందరిలో ఒకే ఆత్మ ఉన్నట్టు స్ఫురించును. భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

## 31. మంచితనము — ధర్మము

శ్రీ శివానంద చెల్లా,  19-9-1955

ప్రభావముగల ఆత్మా,

ఓం శరవణభవాయనమః

నీ దయతోగూడిన ఉత్తరము. నేను నీ కింకొక ఉత్తరము నీ మిఠాయిలు వగైరాలు అందినట్లు వ్రాసినాను. అది నీ కీసరికి అందియుండవచ్చును. మూడు నాటకము లున్నవి—గురుకృప, ఈశ్వరభక్తి, భర్తృహరి. నేను ఉదయము 3 గంటలవరకు కూర్చొనవలసి యుండెను. ప్రతి దినము మధ్యరాత్రి 12, 1 గంటలవరకు కార్యక్రమములు జరుగుచుండెను. ప్రేక్షకులు గుంపులు గుంపులుగా వచ్చు చుండిరి. నేను ప్రతివారి సదుపాయములు చూడవలసి యుండెను.

నేను నీ ఉత్తరములకు ముందుగా జవాబులు వ్రాసె దను. నీ ప్రేమతోకూడిన ప్రార్థనలకు నా ధన్యవాదములు. అవి నాకు అందినవి.

మ్యూజియమ్ థియేటరు కార్యక్రమములో నీవు చురుకుగా పాల్గొనుట విషయమై మిసెస్ సాంబశివరావు నాకు వ్రాసినది.

మంచితనము అనునది కర్మలో ప్రేమచూపుట.

దివ్యమైన మంచి భగవంతుడే. మంచియే మంచిగుణము, దయాపరమగు మంచిగుణము. నీవు స్థిరపడుదువుగాక.

దయతోను ప్రేమతోను నుండుటయే ధర్మము. నీకు జరిగిన ప్రమాదములను మరచి క్షమించుటయే ధర్మము. బాధపడుచున్నవానితో నొక దయగలమాట మాటాడుటయే ధర్మము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించుగాక. నీవు అంతిమ పరమధ్యేయము లేక అంతిమశాంతి పొందెదవుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద.

## 32. నీవు దైవసంబంధముగలదానవు

శ్రీ శివానంద చెల్లా, 24-9-1955

ఓం శరవణభవాయనమః

పూజనీయమగు శాశ్వత ఆత్మా!

నేను నీవిషయమై ఎన్నడును అసంతృప్తితో నుండను. నీవు భూసంబంధమైనదానవు కావు. నీవు సంఘము దాని నియమములు దాటియుంటివి. నీవు దివ్యమానవివి. ఎల్లప్పుడు సంతోషముతో నుండుము.

సమాధియనగా నిజమును తెలిసికొనుట. అది అన్ని ద్వంద్వములకును అతీతమైయుండును. మోక్షము పవిత్రమైన మనస్సున నివసించును. మోక్షమునందు కోరికలేనివారికే మోక్షముగలుగును.

సమదృష్టి శాశ్వతునియందు భగవత్సాక్షాత్కారము కలిగియుండుటకు గుర్తు.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

ఓమ్ తత్ సత్,

శివానంద

శివ కేవలోఽహం.

# 33. మోక్షమునకు మార్గము

శ్రీ శివానందచెల్లా, మద్రాసు. 27-9-1955

పూజనీయమగు ఆత్మా!

ప్రణామములు, జూన్, జూలై నెలలకు సంబంధించిన నీ ఆధ్యాత్మిక దినచర్య అందినది.

అది సరియైన దినచర్య. నిర్దిష్టమైన ఆధ్యాత్మిక జీవితము గడపుటకు శక్తి నీకు భగవంతుడు కలుగజేయును గాక. సూక్ష్మ ప్రపంచపు దేహములలో స్థూలాత్మయున్నట్లు అనుభవమునకు తెచ్చుకొనుము. అందరిలోనుండు ఒకనిని చూడుము. అప్పుడు నీ కర్మలు దివ్య ధ్యానములగును. ఇదియే మోక్షమునకు లేక స్వేచ్ఛకు మార్గము.

దివ్య అధ్యయనము ఆలోచన వస్తువుల స్వభావము యొక్క విచారణ, జపము, సత్సంగము, నిరంతర ధ్యానము- వీనివల్ల నీ సందేహములు నివృత్తియగును. బిగ్గరగా చేయు ఓంకారోచ్చారణమువలన భగవంతుని స్వరూపము ధ్యానించుటవలన నిరుత్సాహము పోవును.

భగవంతుని కటాక్షము నీపైనుండునుగాక!

మర్యాద, గౌరవములతో,

ఓం ప్రేమలు,

నీ సొంత ఆత్మ

శివానంద

# 34. నీవు ముక్తుడవు

శ్రీ శివానంద చెల్లా, 30–9–1955

ఓం శరవణభవాయ నమః.

పూజనీయమైన అమర ఆత్మా!

24–9–55 తేదీ గల నీ ఉత్తరము అందినది.

శ్రీ పట్టు ఇచ్చట సంగీత కచేరిచేయుచున్నది. ఆమె ప్రేక్షకులను ఉత్తేజపరచుచున్నది.

మాకు జలతరంగ కచ్చేరి జరిగినది. భాగీరథీవల్ల వీణ, భాగీరథికుమార్తె మాలతీయను కోమలి నృత్యము జరిగినది. విశ్వవిద్యాలయములో ఇద్దరు అమెరికాదేశపు స్త్రీలు ప్రవేశించిరి. ఒక ఆస్ట్రేలియనుకూడ ఉన్నాడు. దయార్ద్ర హృదయము కరుణయుగల ఒక గ్రీకు దేశపుస్త్రీ ఉన్నది.

నేను ఇదివరకే అజ్ఞానమూలమును కోసివేసినాను. నీవు ఇప్పుడు స్వేచ్ఛాజీవివై ఆనందముగా నున్నావు.

ఆత్మ జ్ఞానము మోక్షమునకు దగ్గరి త్రోవ.

ముక్తి నీ నిజమైన స్వభావము. ఎల్లప్పుడు నీవు అదియేయగుదువు.

ముక్తి అనునది బాధయు విచారములేని వ్యతిరేకమైన స్థితి. అది నిజమైన పూర్ణ ఆనందముయొక్క అనుభవము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 35. స్పష్టమైన పిలుపు

శ్రీ డాక్టరు శివానంద చెల్లమ్మ. 6–10–1955

అమర ఆత్మ,

మురుగా మురుగా,

తారీఖు లేని మీదయగల ఉత్తరము. నా ఆరోగ్యము చాల బాగున్నది. ఆవిషయమై తెలిసికొనుటకు నీకు పూర్తిహక్కు గలదు.

అదియొక కలగాదు. ఊహ కాదు. నీకు కలిగిన దృశ్యము నాకు తెలియును.

రాత్రి సత్సంగములో నేను నిన్ను గుర్తించితిని. పట్టు తన కథ, సంగీతము కంఠధ్వని-వీనితో సత్సంగమును ఎంతో ఉత్తేజ వంతముగా చేయుచున్నది. గురుశిష్యసంవాదము పాటలు వగైరా అన్నియు బాగున్నవి. ఆమెయు మీనాక్షియు ఆదివారమునాడు ఇక్కడనుండి వెళ్లుదురు.

భగవంతుడు పరమకృపాలుడు. భగవంతునియిష్టమే అన్నిటికంటె ఎక్కువ. జీవితము భగవత్సాక్షాత్కారము కొరకు ఏర్పడినది. కలయికవల్ల శాంతిగలుగును, శాంతి కొఱకు పనిచేయవలయును. భగవంతుడు మాత్రమే సత్యము. భగవంతుని తెలిసికొనుటయే జీవితముయొక్క నిజమైన కర్తవ్యము. నిజమైన మతము అందరను ఏకత్వము చేయును. అన్నిమతములలో ఒకటే ఉద్దేశము

గలదు. పైకి భేదములు కానిపించినను లోనుండునది కలయి కయే. ప్రపంచమును నిలుపునది ధర్మము. దివ్యజీవనము అన్ని చెడుగులను బాగుచేయును. ఈ జీవితమును సరిగా ఉపయోగించుము. నీ జీవితము మంచి నడవడికమీాద ఆధారపడునట్లు చేయుము. ఇంద్రియ విషయములకు లొంగ కుము. ప్రపంచత్వమును పూర్తిగా విడిచిపెట్టుము. దుర భ్యాసములు రూపుమాపుము. కామ క్రోధములను జయింపుము. నిష్కామసేవయే దివ్యపూజ. సేవచేసి వృద్ధిపొందుము. దివ్యప్రేమతో నిండియుండుము. ఓ ఒంటరిబాటసారీ నిద్రమేల్కొనుము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక

శివానంద

# 36. అధ్యాత్మముయొక్క సారము

శ్రీ దివ్యమగు చెల్లా 21–10–1955

తత్త్వమసి

నీవు ఎల్లప్పుడు సుఖముగానుండునట్లు కోరుచున్నాను. నీవు ఆనందముయొక్క స్వరూపము. ఆనందస్వరూప.

అవును నీవు పుష్పములు ధరింపవచ్చును. పుష్పము భగవంతుని అందము యొక్క సందేశమును తెలియ పఱచును. సత్యము శుభ్రము సుందరము, శాంతము.

మొటిమలు పోవును. వ్యాసలీనుగాని నూనెగాని రాయుము. ధ్యానము ప్రారంభించునపుడు నోరు గట్టిగా మూసికొనవలయును. అపుడు గాలి అడ్డంకి కలుగదు.

నీ దుర్గాపూజ సాధన గమనించితిని. ఈ మార్గములో నీవు వృద్ధిపొందుచున్నావు. ఓ ఆధ్యాత్మిక వీరుడా!

అద్వైత చైతన్యమునందు నీవు స్థిరపడుము.

ఎవరు స్వేచ్ఛగానున్నారు? ఎవరు మనసును స్వాధీనపరచుకొనిరో వారు. యాచించుట నిబంధన. యాచించుటను జయించుటయే స్వేచ్ఛ. ఆధ్యాత్మిక సారమగు దీనిని గ్రహింపుము చెల్లా.

భగవంతుడు నిన్ను నీ కుటుంబమును తక్కిన అందరిని దీవించునుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ
శివానంద

# 37. దివ్యశక్తియొక్క సూత్రము

శ్రీ శివానంద చెల్లా 29-10-1955

మద్రాసు

ఓం శరవణభవాయనమః

22-10-55 తేదీగల నీ ఉత్తరము. దివ్యమైన ఉత్తేజకములుగు కలలు. నీ మానసభావ నాకు బాగా తెలిసినది.

నీవు నన్ను నీ హృదయమందు ఇదివరకే చిత్రించుచుంటివి. నేను నీ వాడను.

నమ్మకము, భక్తి, పవిత్రత, నిష్కామము, దయ, సేవ, సాధన-ఇవన్నియు దివ్యశక్తియగు విశ్వసూత్రమును గలుగజేయు సూక్ష్మమూలములు.

వివేకము కోరిక లేకుండుట నిజమైన తెలివి సరియైన కర్మ శాంతి అమరత్వమునకు మార్గదర్శకములు.

భగవంతుడు నిన్ను దీవించును గాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ

శివానంద

## 38. ముఖ్యమైన ప్రశ్నలు

శ్రీ శివానంద చెల్లా. 11-11-1955

ఓం

కోపము తగ్గించుకొనుటకు నీవు చేయుసాధన సరిగా నా సాధనవలె నున్నది.

క్రమముగా కొన్ని ఆసనములు వేయుచుండుము. ధ్యానమునకును మంచి ఆరోగ్యమునకును అవి సహాయపడును. శరీరము మన స్వాధీనములోనుండును. అది తమస్సునుండి విడుదలయై తేలికగా నుండును.

నీ కుమార్తెకు ఫోటోలు పంపినాను. నేను డాక్టర్ కృష్ణారావుగారి మందు తీసికొనుచున్నాను. అది నాకు చాల ఉపయోగకారిగానున్నది.

1. అన్నివస్తువులలో మిక్కిలి పురాతనమైన వస్తువేది?—భగవంతుడు.

2. అన్నివస్తువులలో చాల కఠినమైన దేది?—ఆత్మసాక్షాత్కారము.

3. అన్నిటిలో చురుకుగలది ఏది?—ఊహ.

4. అన్నిటిలో మిక్కిలి మంచిది ఏది?—సత్యము.

5. అన్నిటిలో మిక్కిలి అందమైనది ఏది?—ప్రపంచము.

6. అన్నిటిలో మిక్కిలి గొప్పది ఏది ?-విశాలస్థలము లేక దేశము.

7. అన్నిటిలో జ్ఞానము గలది ఏది ?-పావనపురుషుడు లేక మౌని.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ

శివానంద

# 39. మంగళమునకు మూలము

## సంతోషము, ఆనందము, అమరత్వము

శ్రీ శివానంద చెల్లా, 19-11-1955

మద్రాసు.

అమర ఆత్మ స్వరూపా!

ఓం నమో నారాయణాయ.

నీ ప్రియమైన ఉత్తరము.

నేను నీ ఉత్తరములు జాగ్రత్తగా తప్పీలుగా చదివెదను.

నీ పద్యము చాల బాగున్నది.

నీ దినచర్యయొక్క విమర్శన దివ్యజీవనము నవంబరు సంచికలో వెలువడినది.

హృదయమునుండి వచ్చు ప్రవాహము మంచి పద్యభాగము.

నేను నీకు 'శివానంద గీత'యను తమిళ గ్రంథమును పంపినాను. అందులో నీవు ఇక్కడ పాడినపాట ముద్రింపబడినది.

దేవాలయమునకు పోవుట అచట దేవుని పూజించుట చాల ఉత్తమము ఉత్తేజకరము అయినది.

లోగడ మనలను బాధించిన విషయములు ఇపుడు మనకు బాధకలుగజేయని యెడల అదియే మన ఆధ్యాత్మిక

వృద్ధికి సూచన. ఇది జపము ధ్యానము—వీని బలముయొక్క ఫలితము.

నీవు విఘ్నేశ్వరుని సుబ్రహ్మణ్యస్వామిని తలచుకొనినయెడల రాహుకాలము ఏమియు పనిచేయజాలదు. నీవు ఏ పనినైనను ఎప్పుడైనను చేయవచ్చును.

నీ కుమార్తెకు నేను కొన్ని బొమ్మలు ఈ రోజున పంపినాను.

నీవు పంపిన పూలబుట్ట అందినది. నీ అల్లుడు నాకు నేరుగా వ్రాయవచ్చును. భక్తునకు తలచుగా ఆనంద బాష్పములు వచ్చుచుండును. అది పవిత్రమైన ఆవేశము.

నేను నీ హృదయములో నుండునప్పుడు నన్ను నీవు ఎల్లప్పుడు చూడగలవు. చాల పనియున్నది. కాబట్టి నేను నీకు ముందుగా జాబు వ్రాయలేకపోతిని. భగవంతుడు నిన్ను దీవించును గాక.

శివానంద

# 40. ఆత్మయొక్క స్వభావము

శ్రీ శివానంద చెల్లా 1-12-1955

హరి ఓం.

నీ పద్యములు (2) చాల బాగున్నవి. పళని ఆండవర్ దృశ్యము చాలా ఉత్తేజకరము, వృద్ధికలుగ జేయునది.

నీ ఉత్తరములు నీ హృదయాంతర్గతమునుండి వచ్చు ఊహాలు. వానిని వ్రాయుటయందు ప్రయత్నమే యుండదు.

నిజము లేక ఆత్మను తెలిసికొనుటయే గొప్పతనము. ఆత్మయనునది ఒడ్డు ఉపరితలము లేని మహాసముద్రము. అది కేవలము స్థితి చైతన్యము ఆనందము.

ఏకత్వము లేక నిర్వికల్పసమాధిలో కోరిక తనయందే యణగియుండును; ఇంకొక వస్తువును కోరుట ఉండదు.

నిజమే పూర్ణ అనుభవము.

ఈ ఆనందములో నీవు స్థిరముగా నుందువు గాక. నీవు ఒక విభూతి.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,
శివానంద

# 41. ధ్యేయము దగ్గరనే యున్నది

శ్రీ శివానంద చెల్లా 17-12-1955

ఓం శరవణభవాయ నమః.

విటమినుల డబ్బా అందినది. నేను దానిని తింటిని. ఆశ్రమవాసుల కందఱకు పంచిపెట్టితిని. నీ ఆధ్యాత్మిక దిన చర్య మంత్రజపము పుస్తకము అందినవి. వానిని బాగా తయారుచేసి నావు. తమిళ గీతములు చాల ఉత్తేజకరము లుగా నున్నవి.

నీ పుష్పమాల అందినది. అది అందముగా సువాస నగా నున్నది. నీవు మాట్లాడుట వినుచున్నాను. అభ్యాసము వల్ల దేహాభారము అదృశ్యమగును. నీవు ఎల్లప్పుడు ఆనంద ముతో నుందువు. ఉత్కృష్టమైన భావములు మంచివే. నీవు వానిని ఆపనవసరము లేదు.

నీ ఆసనపద్ధతి సరిగా నున్నది. నీవు పశ్చిమోత్తమ ఆసనము కూడ చేయుము. నీవు ఇంతకంటె ఎక్కువ పరిశ్రమ చేయనవసరము లేదు. ఈ ఆసనములు చాలును. చివరకు ఒక్కసారియే చేయుము. ప్రాణాయామముయొక్క సంబంధ సామ్యము చాలును. కుదిలింపు (అస్థిరత) తనంత తానే అదృశ్యమగును.

భక్త్యావేశములను నీవు తగ్గించుకొననవసరము లేదు. పూజలో అవి చాల ఉపయోగకరములు. నీ హృదయ ఆవే దనను వ్రాతలో నింపుము. మరియు ఉత్తరమును పంపుము. దానిని చింపివేయవద్దు.

ఎడబాటు విషయమై ఊహింపకుము. నేను ఎల్లప్పుడు నీ హృదయమందే నివసించియుందును. నీ ప్రక్కనే నిలిచియుందును. నిన్ను నేను ఎన్నడును విడిచిపెట్టను. నీవు ఎడబాటును అనుభవించుచున్నప్పుడు ఆధ్యాత్మిక మార్గమునందు నీవు వెనుక పడుటలేదు. నీవు పైకి వెళ్లుటకు అది గుర్తు.

ఆ మూడు దినములలో ఆసనములు చాలింపుము.

ముందుకు నడువుము. అది చాల దగ్గరనే ఉన్నది. నీవు ముందుకు నడువవచ్చును.

శాంతి కొఱకు జీవింపుము. విశ్వప్రేమకొఱకు జీవింపుము. ప్రేమమయముగు సేవనిమిత్తము జీవింపుము. దివ్యజీవనము జీవింపుము. నిర్లక్ష్యము లేని వారియందు జాగ్రత్తగా నుండుము. ఎల్లప్పుడు ధ్యానశీలివై యుండుము.

ఒకే జీవితముగలదు. ప్రేమచట్టము ఒకటే. ఒకడే దేవుడు. ఒకటే నిజమైన మతము. ఒకటే సత్యము. భగవంతుడు నిన్ను దీవించునుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 42. సులభముగా శక్తినిచ్చు సాధన

శ్రీ శివానంద చెల్లా, 22-12-1955

మద్రాసు.

ఓం, నీ మూడు ఉత్తరములు, ఆధ్యాత్మిక దినచర్య లిఖితజపము గింజలు అందినవి. వారమున కొకసారి నీ హృదయమందలి సంగతులన్నియు తెలుపుచుండుము.

ఆందోళన లేని మనస్సు గలిగియుండుట చాల గొప్ప అదృష్టము. దీర్ఘ ధ్యానములోనికి వెళ్లుటకు ఇది చాల సహాయకారి.

తొందరపనులవల్లను ప్రేక్షకుల సమావేశముల వల్లను అపుడపుడు ఆలస్యము కలిగినను నీ ఉత్తరము లన్నిటికిని క్రమముగా జవాబులు వ్రాయుచున్నాను.

నాకు నీ హృదయఆవేదనలు తెలియును. నీవు నన్ను చాల ఎక్కువగా సంతోషపెట్టుచున్నావు. నేనుకూడ నీకు సేవచేయుచున్నాను.

నీవు నాకు వ్రాయుటకు, నాతో సహకారము పొందుటకు పూర్తిగా స్వేచ్ఛ యిచ్చుచున్నాను. అడ్డంకులు ఏమియు ఉంచుకొనవద్దు. నాలో ఆండవనును చూడుము. అది సులభమైన సాధన. ఈ పద్ధతిద్వారా నీవు తొందరగా జీవన్ముక్తురాలవు కాగలవు. నీ ఉద్దేశములు సరిగానున్నవి.

నేను నీయొక్క మంచి ఊహలు ఉద్దేశములు శ్రీ

స్వామి వేంకటేశానందజీకి తెలియపరచినాను. ఆయన చాల సంతోషించినాడు.

నీవు సేలం కాన్ఫరెన్సుకు వెళ్ళకపోవుట మంచిదే. కర్తవ్యమే మొదటివిషయము.

నీవు ఎల్లప్పుడు పవిత్రులు స్వేచ్ఛ గలవారు పూర్ణులు అమర ఆదర్శపురుషులు—వీరిలోని సారమవు.

నిజము మాట్లాడుము. పవిత్రురాలవుగా నుండుము. అందరిని ప్రేమింపుము. మంచి అంతయు దీనియందే యున్నది.

వెదకుము, కనుగొనుము, లోనజొరబడుము, విశ్రాంతి తీసికొనుము. ఇదియే మార్గము. ఇదియే నిజము. ఇదియే దివ్యజీవనము.

క్రొత్తసంవత్సరము నీవు కోరినదంతయు—ఆరోగ్యము శాంతి వైరాగ్యము ప్రకాశమును ఇచ్చుగాక.

ఓం తత్ సత్

నీ సొంత ఆత్మ,

శివానంద

## 43. కటాక్షముయొక్క పూచీ

శ్రీ శివానంద చెల్లా, 5-1-1956
మద్రాసు.

ప్రభావముగల అమర ఆత్మా,

ఓం శరవణభవాయనమః

నీయొక్క మూడు ఉత్తరములు అందినవి. నీవు ఉత్కృష్టమైన దివ్యభావములు ఆపుచేయవలదు. అవి యుపయోగకరములు, ఉత్తేజకరములు.

అన్నక్షేత్రమునకు మీరు దయతో పంపినది అందినది.

నీవు దీర్ఘధ్యానములో నున్నప్పుడు ఓం గాని మంత్రముగాని ఉచ్చరింప నవసరము లేదు. ధ్యానమును సమాధిలో మగ్నముకానిమ్ము. గాఢ ధ్యానములో ఆ భేదము అదృశ్యమగును. రెండును ఒకటేయగును.

నా ఆరోగ్యము చాల బాగున్నది.

ఇపుడు ఇచ్చట పశ్చిమదేశస్థులు చాలమంది ఉన్నారు. ఆస్ట్రేలియనులు, జర్మనులు, ఫ్రెంచివారు, కనడావారు మరియు స్త్రీలుగలరు.

నేను నా శిరస్సును ఫ్లానలుతో కాపాడుకొనుచున్నాను; స్టాకింగులు ఉపయోగించుచున్నాను.

చెల్లా నేను నీవాడను. నీవు నాయందు పూర్ణస్వేచ్ఛ కలిగియుండవచ్చును.

నీవు చాల దయ ప్రేమ కలిగినదానవు.

పనితొందరవల్ల నీకు తొందరగా జవాబులు వ్రాయజాలక పోయితిని.

సమావేశములు, సేవ, సంభాషణ, హాజరగుట, రాత్రి దీర్ఘసత్సంగము వగైరాలతో నా కాలమంతయు పూర్తియగుచున్నది.

నీయొక్క శాంతి ఆరోగ్యము దీర్ఘజీవితము ఆధ్యాత్మికవృద్ధి మరియు కలయికకొరకు నేను ప్రార్థించుచున్నాను. మనము వేడి నిప్పు, చల్లదనము మంచుగడ్డ, ప్రకాశము వజ్రమువలె ఒకటియే.

నేను ఎన్నడును నిర్లక్ష్యముగా నుండను. నీయందు నాకు అయిష్టత లేదు. నీవు నా జీవితము, ప్రాణము, ఆత్మ.

నీవు సకాలములో నా జవాబు పొందనియెడల ఆదుర్దాపడవద్దు. నా తంతివార్త నీకు అందును. నాపుస్తకములలో ఒకదానిలో ఏదైన ఒకభాగము చదువుము. నీకు మనశ్శాంతి ఉత్సాహము, ఉత్కృష్టత, బలము శాంతి కలుగును.

1956 వ సంవత్సరము నీకు ప్రకాశము అంతర్దృష్టి జ్ఞానము మహాభావము అమరత్వము నిరంతర శాంతి సంతోషమును ఇచ్చుగాక.

గౌరవార్థములు ప్రణామములు – నీకు నీ తలిదండ్రులకు భక్తులకు పతిదేవునకు—

ఇందులో భగవత్ప్రసాదము పంపుచున్నాను.

ఓం తత్ సత్,

నీ సొంత ఆత్మ,

శివానంద

# 44. మంచితనమును అభ్యసింపుము

శ్రీ శివానంద చెల్లా, 12-1-1956

మద్రాసు.

ఓం శరవణభవాయనమః.

డాక్టర్ ఆర్. టి. వర్తర్‌గారి ఆహ్వానము వగైరా తెలిసినందులకు చాల సంతోషము. నీ కుమార్తె నాతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నది.

నేను ఆమెకు పుస్తకములు వగైరాలు పంపితిని.

ధైర్యము సహనము కరుణ, వైరాగ్యము ఓర్పు— వీనిని గూర్చి చింతించి వానిని నీ దైనిక జీవితములో అమలులో పెట్టుటకు ప్రయత్నింపుము.

నీ యింద్రియములను గట్టిగా స్వాధీనపరచుకొనుము.

ఓర్పును సహనమును అభ్యసింపుము.

మనస్సును స్థిరముగాను నిర్మలముగాను ఉండునట్లు తర్ఫీదు చేయుము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 45. సంగీతము విషయమై

శ్రీ శివానంద చెల్లా, 23-2-1956

మద్రాసు.

పూజ్యమైన అమర ఆత్మ!

ఓం శరవణభవాయ నమః

దయతో గూడిన నీ మూడు ఉత్తరములు చేరినవి.

ఎక్కువ కాలయాపన కాలేదు. సంగీత సంస్కారము మరలవచ్చును. సంగీతము శాంతి నిచ్చును. భగవంతునితో కలియుటకు సహాయకారి.

నీ ఆధ్యాత్మిక దినచర్య మంత్రముల నోటుబుక్కు అందినది.

నీ ధ్యాన కార్యక్రమము చాల బాగా ఉన్నది. ఆనందము అవర్ణనీయము. నేను దానిని తెలిసికొంటిని.

ఆ ఆనంద ఆవేశమును అనుభవింపుము. తరువాతి విషయము దానంతట అదియే వచ్చును.

నేను ఖులాసాగా ఉన్నాను. ఆరోగ్యము బాగా ఉన్నది.

నీ అనుభవములు ఇతరులకు చెప్పవద్దు.

36. ఇది చాలును. దానిని వృద్ధిచేయనవసరము లేదు.

అది భ్రమకాదు. ఆ కలయిక నిజము.

అమరమైన ఆనందమునకు మార్గము హృదయములో జనించును. హృదయము పవిత్రమయినపుడు త్రోవ విశాలముగా కనిపించును.

ఆధ్యాత్మిక మార్గమునందు మొదటిమెట్టు మనస్సును పవిత్రపఱచుకొనుట.

నీవు ఎంత పవిత్రముగా నుందువో భగవంతునకు అంత దగ్గరగా నుందువు.

భగవంతుడు నిన్ను దీవించుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 46· ఉత్కృష్టమైన మంచి

శ్రీ శివానంద చెల్లా, 28-1-1956

మద్రాసు.

ఓం ఓం ఓం

నీ ఆధ్యాత్మిక సందేశము ఆశ్చర్యకరముగా నున్నది. అది నాకు చాల మంచి చేసినది.

నీ యల్లుడు నాతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపు చున్నాడు. అతడు నా శిష్యుడు. అతడు భక్తిలోను జ్ఞానము లోను వృద్ధిపొందును.

నీ ఉత్తరములు భక్తి నమ్మకము ఆసక్తి ప్రేమ దయ దీనత్వము ఆర్జవము వగైరాలతో నిండియుండును.

అవి నా హృదయమును తాకుటయే కాక అందులో జొరబడును.

భక్తి ధ్యానముల పవిత్రత ద్వారా మనస్సు పొందు ఆనందము మాటలవలన వర్ణింపనలవి కాదు.

అంత్య నిజము చాల ఆశ్చర్యకరము. వర్ణింపరానిది. అంతులేనిది. దానిని వర్ణింపలేము. అది తర్కమునకు అతీతము.

ఓగు అనునది అజ్ఞానముయొక్క పర్యవసానము. నిజముయొక్క జ్ఞానము ఉత్కృష్టమైనది.

నీవు నిజములో స్థిరపడుదువుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 47. గోపీ - చెల్లా - గీత

శ్రీ శివానంద చెల్లా, 9–2–1956

మద్రాసు.

పూజ్యమైన అమర ఆత్మా

మురుగా! మురుగా!

నీవు పంపిన తినుబండారముల ప్యాకెట్టు అందినది. నేను వానిని తినుచున్నాను.

ఏప్రియల్ నెలలోగాని లేక నీకు వీలుగానున్న సమయమందుగాని ఆశ్రమమునకు రమ్ము. నీవు వచ్చునపుడు దయయుంచి కండ్లు పరీక్షచేయు పనిముట్లు మందులు తీసికొనిరమ్ము.

నీవు వ్రాసిన మూడు ఉత్తరములు అందినవి. ఇతర డాక్టర్లకంటె నీవు ఎక్కువ తెలివిగలదానవు, దయగల దానవు.

నీ ఉత్తరమంతయు చదివినాను.

డాక్టర్ చెట్టన్ నీతో రావచ్చును. ప్రియమైన డాక్టర్ చెట్టన్‌కు నా ప్రేమ ఆహ్వానములు, అభినందనములు.

నీ ఉత్తరములు కేవలము ఉత్తరములుకావు. అవి

గోపీ-చెల్లా-గీత. నాకు అవి బోధపడుచున్నవి. వాని సారమును నేను గ్రహించితిని.

భక్తియొక్క పారవశ్యము దివ్యజీవనములోను భాగవత జీవనములోను సంబంధించినది. అది యెన్నడును అడ్డంకికాదు. అది భక్తియోగముయొక్క సారము!

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద.

# 48. నిజమైన వైరాగ్యము

శ్రీ శివానంద చెల్లా, 17-2-1959

మద్రాసు.

పూజ్యమైన ఆత్మా,

ప్రణామములు.

దయతో గూడిన నీ ఉత్తరములు.

నీవు ప్రపంచములో నివసించునపుడు సందర్భములను బట్టి వానిని అనుకూలపఱచుకొనవలెను. అందువల్ల మనస్సుయొక్క పవిత్రత చెడదు. నిజమైన వైరాగ్యము మానసికస్థితికి సంబంధించినది. మనస్సును ఎల్లప్పుడు జపము చేయునట్లు తర్ఫీదు చేయుము. అన్ని చెడుసంస్కార ములును అంతమగును. నీవు ఆంతరబలమును పొందెదవు.

నీవు సాధన ప్రార్థన జపము ధ్యానము అధ్యయనము వీధిలో స్థిరముగానున్నట్లు తెలిసికొని సంతోషించినాను.

నీవు వ్యాసములు వ్రాయునట్లుకూడ తెలిసికొన్నాను. అది నీకు మంచి ధారణాశక్తిని కలుగజేయును. ఆ వ్యాస ములు జనసామాన్యమునకు ఉపయోగపడును. అది మానవ జాతికి చేయు మానరూపమైన సేవ.

వైద్యసంస్థకు నీవు విరాళములిచ్చుట నీకారుణ్యమును తెలియపఱచును. ఆ సొమ్ము ప్రతిపైసయు జబ్బువారికి, బీదవారికి-ఆరోగ్యము చేకూర్చుటకై ఉపయోగింపబడును. అట్టిరోగులు, దీనులు నారాయణుని ప్రకటిత స్వరూపులు గదా! ఇది నీకు చిత్తశుద్ధియు సత్వర ఆధ్యాత్మికవృద్ధియు కలుగజేయును.

నేను నాప్రార్థనలను పంపుచున్నాను. నీ ఆరోగ్యము విషయమై జాగ్రత్తవహింపుము.

ప్రేమతోను ఓం తోను,

నీ సొంత ఆత్మ,

శివానంద.

# 49. ముందుకు నడువుము

శ్రీ శివానంద చెల్లా,　　　　　　17-2-1956

మద్రాసు.

ప్రభావముతో గూడిన పూజనీయమగు ఆత్మా,

ఓం శరవణభవాయనమః

దయతో గూడిన నీ ఉత్తరములు.

నేను బాగా ఆరోగ్యముగానున్నాను. నీ ప్రార్థన నాకు చాల మంచిచేసినది.

నీవు ఎల్లప్పుడు నాప్రక్కనే ఉన్నావని నాకు తెలియును. రెండు ఒకటేయయ్యెను. నీవు నీ యిష్టప్రకారము స్వేచ్ఛ తీసికొనవచ్చును. నీవు ఏదైనను వ్రాయవచ్చును. నీవు ఉచ్చస్థితిలోనున్నావు.

నీవు శ్రీరామతీర్థస్వామి పుస్తకములు చదువవచ్చును.

నీ ఆధ్యాత్మిక అనుభవములనుగురించి నీవు నాకు వ్రాయవచ్చును.

అది మామూలు పరిస్థితి. అదియొకరకమైన క్రింది సమాధి. ఆనందప్రవాహమును నిలుపుకొనుము. అంతకంటె నీవు చేయవలసిన దేమియు లేదు. మౌనముగా విశ్రాంతితీసికొనుము.

ధ్యానముకంటె మనస్సును పవిత్రముచేయునది ఏదియు లేదు.

ఆధ్యాత్మికమార్గము చాల కష్టమైన ప్రయాణము. నీవు అలసట చెందకూడదు. విసుగు చెందకూడదు. ముందు కష్టము సహించి నడువవలెను. కనుగొనుము, లోన ప్రవేశింపుము. విశ్రమింపుము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద.

# 50. సంగీత కళాశాల

శ్రీ శివానంద చెల్లా,　　　　22-2-1956

మద్రాసు.

ప్రభావముతో గూడిన అమర ఆత్మా!

ఓం శరవణ భవాయనమః.

ఏప్రిల్ నెలలో ఇచ్చటకు వచ్చునప్పుడు మంచి మద్దెలను తీసికొనిరమ్ము. వై.వి.యఫ్. విశ్వవిద్యాలయము యొక్క సంగీతశాఖ తొందరగా వృద్ధి పొందుచున్నదనియు, అచ్చటికి అనేకమంది గాయకులు సంవత్సరము పొడుగునను వచ్చి పాటకచ్చేరీ జరుపుచున్నారనియు నీకు తెలిసిన విషయమే. కాని ఆ శాఖయందు పనిముట్లు లేవు. కాని ఒక మృదంగము కొనుట చాల అవసరము.

మృదంగము మధ్య రకముగా నుండవలెను. 5 కట్టల శ్రుతితో నుండవలెను. ఇది మద్రాసు బ్రాడ్వేయందు సౌతిండియన్ మ్యూజిక్ ఎంపోరియమ్‌లో దొరకును. మృదంగవాద్యగాని సహాయముకొని పై శ్రుతి ప్రకారము పరీక్ష చేసికొనుట మంచిది.

ఇందుతో భగవంతుని ప్రసాదము పంపినాను. భగవానుడు నీకు ఆరోగ్యము శాంతి ఆనందమును ఇచ్చును గాక.

నీ సొంత ఆత్మ,

శివానంద.

## 51. నీవు భౌతికసంబంధమైనదానవు కావు

శ్రీ శివానంద చెల్లా, 1-3-1956

మద్రాసు.

పూజనీయమగు అమర ఆత్మా!

ఓం మురుగా!

నీవు దయతో వ్రాసిన మూడు ఉత్తరములు – చల్లా గీత. అవి అన్నియు నిష్ఠ, ప్రేమ, భావము—వీనితో నిండి యున్నవి. నేను అట్టి ఆత్మోత్తేజకరమయిన ఉత్తరములు వ్రాయలేను. నీవు ఇప్పుడు ఇంకొక ఆవరణలో నున్నావు. నీవు దేవివి–వల్లి దైవమయివి. నీవు ఈ భూమికి సంబంధించిన దానవు కావు. భూసంబంధమైన పై పొరలు ఇప్పుడు రాలి పోయినవి.

నా క్షమాపణ అవసరమగు ఏను లేవియు నీవు చేయుట లేదు. నీ ఉత్తరములు–భక్తిగీత—చదువుట సంతోష కరమైన కార్యము. నీ భావములు నాలో భయము, భక్తి, ఉత్తేజము, ఆశ్చర్యము—వీనిని గలుగజేయుచున్నవి.

అట్టి వ్యతిరేక సంబంధమైన మార్పు సాధకులవల్ల ఎల్లప్పుడు అనుభవింప బడుచుండును. తీవ్రమైన నామ సంకీర్తన చేయుము. అది మాయమగును.

నీవు ఎక్కువ ఆదుర్దాతో నున్నావు. ఎక్కువ ప్రయాసపడుచున్నావు. నెమ్మదిగా నుండుము. నామరసము

యొక్క అమృతమును త్రాగుము. విశ్రాంతిగా నుండుము. మురుగన్ ప్రతిది జాగ్రత్తపెట్టును. నీవు శాంతికలిగి ఎల్లప్పుడు సౌమ్యముగా నుండవలెను.

ధ్యానము తుషారము. శాంతి పుష్పము. మోక్షము పండు.

లోచూపు చూడుము. ఆత్మస్వాధీనతను ఆత్మ ఆధిక్యతను అభ్యసింపుము. ఆధ్యాత్మికవీరవనితవు కమ్ము.

పవిత్రత జీవితముయొక్క సువాసన. ప్రేమ జీవితము యొక్క చట్టము. సేవ జీవితముయొక్క సారము. దివ్య జీవనము జీవితముయొక్క మార్గము.

చెల్లా భగవంతుడు నిన్ను ఆశీర్వదించునుగాక.

నీ సొంత ఆత్మ,

శివానంద.

# 52. ఆధ్యాత్మిక దినచర్య పుస్తకము

శ్రీ చెల్లమ్మ, 10–3–1956
మద్రాసు.

పూజనీయవగు దివ్యతల్లీ,

ఓం నమోభగవతే వాసుదేవాయ. ప్రణామములు.

నీ వ్యాసము, దినచర్య.

నీ వ్యాసము చాల బాగున్నది. అది మొదటినుండి చివరవఱకు చదివితిని. మన పత్రికలలో ఏదో ఒకదానిలో దానిని ప్రకటించెదను. నీవు నిజముగా ప్రబుద్ధాత్మవు.

నీ ఆధ్యాత్మిక దినచర్యకూడ దివ్యమార్గమున నడచు నీ కోరికను స్పష్టపఱచుచున్నది. ఇప్పుడు నీవు దినమంతయు తీవ్రమైన సాధన చేయుసాధకురాలవని తెలియవచ్చుచున్నది. నీ సత్యాన్వేషణమార్గమందు నీకు ఎల్లప్పుడు భగవంతుని ఆశీస్సులు కలుగును గాక.

దయచేసి ప్రతిదినము విడువకుండ గీత అర్థముతోను మాహాత్మ్యముతోను చదువుము. దానివల్ల నీకు అమితమైన శాంతి సంతోషము కలుగును. సాధన అప్పుడప్పుడు చేయకుము. నిజమైన ముముక్షువునకు క్రమమైన సాధన ముఖ్య అవసరము. ప్రతిదినము చేయుపని కొద్దిదైనను ఇబ్బంది లేదు.

నీ ప్రస్తుతపు సాధనను ముందుకూడ జరుపుము. ఈ

సంవత్సరమునకు ప్రతిజ్ఞల కాగితము పూర్తిపఱచి పంపుము. నీకు మార్గమును చూపెదను.

నీ మనస్సు పవిత్రమై విక్షేపము లేకుండ ఉండిన పరమాత్మను నీలోపల ప్రతిచోటను నీవు చూడగలుగుదువు. కావున మనస్సుతో పోరాడి జయము పొందుము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించును గాక.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 53. నీ జన్మహక్కు

శ్రీ చెల్లమ్మ, 13-3-1956
మద్రాసు.
మురుగా

దయగల నీ రెండు ఉత్తరములు. లేత కొబ్బరి కాయలు వగైరా. శివరాత్రి కానుకలు. నేను ఆ తియ్యని నీరు త్రాగితిని. చాలబాగున్నది. నీ అనుభవములన్నియు నిజము. అవి ఊహామాత్రములు కావు. ప్రభువైన మురుగని నిన్ను—ఇద్దరను, నేను చూచుచున్నాను. నమ్మకము అనునది బీజము. భక్తియే వేరు. ధ్యానము తుషారము. శాంతి పుష్పము. భగవత్సాక్షాత్కారము ఫలము. శాంతి అనునది పవిత్రముగా నుండవలెను. ఆనందము జ్ఞానముతో నుండవలెను. సంతోషము భక్తునకు ఉండవలెను. ధ్యానము చేయువానికి బలముండవలెను. నిస్వార్థ సేవకునకు సంతోషము. ఏప్రియల్ దగ్గరకు వచ్చినది. శ్రీమురుగని బిడ్డరొక్క దర్శనము చేసికొని నేను సంతోషింతును. నీవు ఎల్లప్పుడు అమరమైన ఆనంద చైతన్యముతో నుందువు గాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,
శివానంద

# 54. దివ్యాహ్వానము

శ్రీ చెల్లమ్మ, 22-3-1956

మద్రాసు.

తన్నోషణ్ముఖ ప్రచోదయాత్.

నీ కుమార్తె నాకు వ్రాయుచున్నది. నేను ఆమెకు సేవచేయుచున్నాను.

17-3-56 తేదీ గల నీదయగల ఉత్తరము.

నీవు ఎల్లప్పుడు సురక్షితముగ రక్షింపబడి సురక్షితముగా నున్నావు. నాకు అసంతుష్టి కలుగ జేయుపని ఏమియు నీవు చేసియుండ లేదు. నీవు ఉదారస్వభావముగల చెల్లవు. నాకును ప్రభువైన మురుగనుకును ప్రియమైన దానవు.

నీవు ఎవరికిని తీసిపోవు. నీవు తెలివితోను భక్తితోను కూడిన చెల్లవు.

నీవు భక్తితో తడిసియుందువు. నాకు నీ హృదయము బాగా తెలియును. సరియైన పురుషార్థముతో ఈ ప్రపంచమునందు సాధింపరాని పని యేదియు లేదు.

నీ పూర్వ ప్రయత్నములను నశింపజేసి జయించి యిప్పుడు క్రొత్త ప్రయత్నము చేయుము. నీ జీవితము యొక్క ఉత్కృష్ట ఉద్దేశము అది—అనగా బ్రహ్మ సాక్షాత్కారము ఈ జన్మలోనే కలుగవలయుననుట.

చెల్లా, చూడు, విను, రా. నాల్గవదియగు తురీయ

పద్ధతి పరబ్రహ్మయొక్క శాశ్వతస్థానము; మరుగని ధామమునకు త్రోవ. ఆ త్రోవను వెదకుము, కనుగొనుము లోపలకు వెళ్ళుము, విశ్రాంతి తీసికొనుము. విడదీయుము. కలుపుము. డి. వి. ఎన్. సేవింపుము. ఇమ్ము, పవిత్రులాలవుకమ్ము. ధ్యానింపుము. తరింపుము. మంచిగా నుండుము. మంచిచేయుము.

చెల్లా సరియైన మార్గమున నడువుము. వెళ్ళి శాంతిగా అచ్చట విశ్రమింపుము.

భగవంతుడు నిన్ను ఆశీర్వదించును గాక.

ఓం తత్ సత్.

నీ సొంత ఆత్మ,

శివానంద

# 55. తంతి సంబంధమైన బోధలు

డాక్టర్ శివానంద చెల్లమ్మ. 16 జూన్ 1955.

No. 1. కాన్ స్టైబిల్ రోడ్, అయనావరం.

భగవంతుడు నిన్ను, నీ కుటుంబమును శాంతితో సంతోషముతో సమాధితో ఆశీర్వదించును గాక. తత్త్వమసి.

శివానంద

*　　　*　　　*

శివానంద చెల్లా. 13 జూలై 1955.

No. 1. కాన్ స్టైబిల్ రోడ్డు,

అయినావరం మద్రాసు.

మాయ నిజమును కప్పిపుచ్చును. ప్రపంచమును ప్రకటించును. అబద్ధమును నిజముగా కనపరచును. మాయను ధ్యానముద్వారా శాశ్వతముగా చంపుము. స్వేచ్ఛగా నుండుము, తత్త్వమసి.

శివానంద

*　　　*　　　*

డాక్టరు చెల్లమ్మ. 27 జూలై 1956.

No. 1. కాన్ స్టైబిల్ రోడ్,

అయినావరం, మద్రాసు.

వెదకుము. తెలిసికొనుము. లోనప్రవేశింపుము. విశ్రాంతి తీసికొనుము. ఇదియే నిజము. ఇదియే దివ్య జీవనము.

శివానంద

# విశ్వప్రార్థన

ఓ ప్రభూ! నీ వీ ప్రపంచమునకు సృష్టికర్తవు. నీవు ఈ ప్రపంచమును రక్షించువాడవు. నీవు గడ్డియందును గులాబిపూవునందును గలవు. నీవు సూర్యునియందును నక్షత్రములందును గలవు నీకు ప్రణామములు. జననమరణ చక్రమును నిర్మూలముచేయువాడా నీకు ప్రణామములు. ఆనందమును అమరత్వమును ఇచ్చు ప్రభూ!

ఓ తియ్యని ప్రభూ! నేను మృత్యుబంధనములనుండి విడివడుదునుగాక. నా అమరమగు స్వభావము మఱవకుందును గాక. అందరను సమానదృష్టితో చూచుటకు నాకు శక్తి కలుగునుగాక. బ్రహ్మముయొక్క ఉత్కృష్ట స్థితిని నేను పొందుదునుగాక. అపవిత్రతనుండియు పాపము నుండియు నేను విడివడుదునుగాక. నా ముఖ్యమైన నిజ స్వభావమును నేను తెలిసికొందునుగాక.

అందరి హృదయములలో నివసించునట్టియు నిప్పునందును నీటియందును ఉండునట్టియు, మొక్కలలోను ఓషధులలోను చెట్లలోను నుండునట్టియు ఆయి యిటుకలు ఇనుపచువ్వలు—వీనిలో నుండునట్టియు ప్రపంచమంతటిలో వ్యాపించియుండునట్టియు పరమపురుషునకు నావందనములు.

నీకు నేను ప్రణామములు చేయుచున్నాను. ఓ రహస్యములకు రహస్యమైనవాడా! నేను నీకు తలవంచి నమస్కరించుచున్నాను. మా హృదయములలో నుండు

వాడా, నీకు నమస్కరించుచున్నాను. అన్ని మనస్సులకు, చేష్టలకు, కార్యములకు సాక్షిగానుండువాడా నేను నీకు తలయొగ్గి నమస్కరించుచున్నాను. అన్ని మనస్సులను పరిపాలించువాడా! నేను నీకు ప్రణమిల్లుచున్నాను. అన్ని జీవులను సూత్ర ఆత్మవలె కలుపువాడా! ఈ ప్రపంచము నందలి అన్ని వస్తువులలో దూరి వ్యాపించియుండువాడా!

ఓ పరమపురుషా, పరమ ప్రభూ! నీకు నమస్కారములు. నీవు ఆద్యంతములు లేనివాడవు. నీవు పుష్పమవు; తేనెటీగవు; నీవు స్త్రీవి; పురుషుడవు. నీవు సముద్రమవు; నీవే అలలు. వణకుచు కఱ్ఱపట్టుకొని తిరుగు ముసలివాడవు. నీవు సాధువవు; దుర్మార్గుడవును నీవే.

నీవు దివ్యజ్యోతివి. నీవే జ్ఞానము, అంధకారమును పోగొట్టువాడవు. నీవు పరమగురువవు. నీవు మనస్సుకు వాక్కుకు అందనివాడవు. అడ్డంకులన్నింటికి అతీతుడవు. నీవు పరమాత్మవు. నీ వీ ప్రపంచమునకు ఆత్మవు.

నీవు స్వయంప్రకాశకుడవు. నీవు భాగములు లేనివాడవు. కర్మలులేనివాడవు. కరచరణములు లేనివాడవు. మచ్చగాని తప్పుగాని లేనివాడవు. జననమరణములు లేనివాడవు. నీవే మాతంద్రివి; తల్లివి; సోదరుడవు; స్నేహితుడవు; బంధువుడవు; గురువవు పూర్ణశరణాగత రక్షకుడవు. నీవు శాంతి ఆనందము జ్ఞానము శక్తి బలము అందము—వీనికి మూర్తివంతుడవు.

ఓ పూర్ణదయగలప్రభూ! నీ కటాక్షమువల్ల నేను

నిజమును అనుభవమునకు తెచ్చుకొందునుగాక. నేను ఎల్లప్పుడు మంచి ఊహలతో నుందునుగాక. నేను దివ్యజ్యోతిని అనుభవమును పొందుదునుగాక. మానవకోటిని ఆత్మభావముతో నేను సేవింతునుగాక. దురాశ, కామము, అహము, ఈర్ష్య, ద్వేషము—వీనినుండి నేను విడివడుదునుగాక. నేను అందరిలోను మృదువైన శాశ్వతమైన ఏక ఆత్మనే చూచుచుందునుగాక. పవిత్రమైన బుద్ధితో నేను బ్రహ్మమును అనుభవమునకు తెచ్చుకొందునుగాక.

ప్రకాశములకు ప్రకాశమైన వ్యక్తి నాకు త్రోవ చూపునుగాక. అతడు నా మనస్సునందలి మాలిన్యములను శుభ్రపరచునుగాక. అతడు నాకు ఉత్తేజమును కలిగించునుగాక. నాకు శక్తి ధైర్యము బలము అతడిచ్చునుగాక. నా మనస్సునందలి తెరను అతడు తొలగించునుగాక. ఆధ్యాత్మిక మార్గమునందు కలుగు అన్ని అడ్డంకులను అతడు తొలగించునుగాక. అతడు నా జీవితము సుఖముగాను ఫలవంతముగాను ఉండునట్లు చేయునుగాక. ఓ ప్రభువులకు ప్రభువా, దేవుళ్ళకు దేవుడా, దేవతలకు దేవతా. ఉపనిషత్తుల బ్రహ్మమా. మాయ ఈశ్వరులకు సహాయకారీ, అమరత్వమునకు పరమవంతెనవంటివాడా, నేను నీకు మ్రొక్కుచున్నాను.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# I

మనస్సు ఇంద్రియములు మరియు స్థూలశరీరము—వీని యొక్క శిక్షణానుభవమే యోగము. యోగము శరీరమందుండెడి సూక్ష్మశక్తుల సహకార అధికారములకు సహాయకారి. యోగము పరిపూర్ణతను శాంతిని ఇచ్చునది. యోగము నీకు నీ వ్యవహారమందును దైనిక జీవనమునందును సహాయము చేయును. యోగాభ్యాసమువలన నీకు ఎల్లప్పుడు మనశ్శాంతి కలుగును. నీకు నిర్మలమైన నిద్రకలుగును. నీకు ఎక్కువశక్తి చురుకుదనము జవత్వము దీర్ఘాయుర్దాయము మంచి ఆరోగ్యము గలుగును. కొద్ది కాలములో ఎక్కువ పనిచేయగలవు. నీ జీవితములో ప్రతి విషయమునందును నీకు జయము కలుగును. యోగము నీలో నూతనబలము, నూతనవిశ్వాసము, ఆత్మవిశ్వాసము గలుగజేయును. యోగముద్వారా నీవు మనస్సు కామము భావము, ఊహ, ఆవేశము, నాలుక వగైరాలపై అధికారము చెలాయించగలవు. శరీరము, మనస్సు ఎల్లప్పుడు నీ యిష్టప్రకారము నీ ఆజ్ఞకు లోబడియుండును.

భగవంతునితో తాదాత్మ్యమునుపొందుట యోగము యొక్క వితరణ విధేయతలయొక్క ఉచ్చస్థితి. ఇందు నేను అను భ్రమ పూర్తిగా పోవును గనుక అట్టిస్థితి స్వేచ్ఛ యొక్కయు నైతిక వృద్ధియొక్కయు స్థితిగను ఎంచబడును. ఇప్పుడు యోగికి దివ్యశక్తులన్నియు నుండును. అతడు స్వేచ్ఛమైన శాశ్వత ఆనందమును అనుభవించును.

సహనశక్తి మంచిగుణము. దానిని యోగియు జ్ఞానియు భక్తుడును కలిగియుండును. ఆ యోగాభ్యాసములో ఉత్తీర్ణుడగుటకు ముముక్షువు చాలాకష్టములు అనుభవించవలయును. తితీక్షవల్ల ఆత్మశక్తి వృద్ధియగును. ఆకారణమువల్లనే శ్రీకృష్ణుడు అర్జునితో ఈ ప్రకారము చెప్పెను: "ఓ కుంతీపుత్రా! ప్రకృతి సంబంధమైనట్టి చల్లదనము వేడి కలుగును, సుఖదుఃఖములు వచ్చుచు పోవుచునుండును. అవి శాశ్వతములు కావు. వానిని ధైర్యముతో అనుభవింపుము. ఓ భారతా! ఎవరిని ఈ ద్వంద్వములు బాధింపవో, పురుషశ్రేష్ఠా అట్టివాడు సుఖదుఃఖములయందు సమత్వముగలిగి స్థిరముగానుండి అమరత్వమునకు తగినవాడై యుండును. (శ్రీమద్భగవద్గీత 11 వ అధ్యాయము, 14, 15 శ్లో.)

నైతిక ఉత్కృష్టత లేక గుణపరిపూర్ణత కేవలము యోగముయొక్క అంతిమ ధ్యేయము కానేరదు. జీవితగమ్యమును పొందుటకు అది కేవలము ఒకమార్గము. మంచి గుణమును వృద్ధిపఱచుకొనుట బుద్ధికుశలత సంపాదించుట కంటె ఎక్కువ కష్టము. ఎందువల్లననగా పవిత్రమైన—మచ్చలేని—హృదయముగల యోగిమాత్రమే నిజమును గ్రహించగలడు.

నైతిక జీవితముయొక్క ముఖ్యగుణములు కృత్రిమములు లేకుండుట, ఋజమార్గమున నడచుట, జీవితమార్గమున

దయ దీనత్వము, ఊపిరి పీల్చుకొను ప్రతిజీవియందును దయ కలిగియుండుట పరిపూర్ణమైన నిష్కామ్యత నిజముపలుకుట బ్రహ్మచర్యము అస్తేయము గర్వము కృత్రిమబుద్ధి లేకుం డుట విశ్వప్రేమ కలిగియుండుట.

యోగాభ్యాసకుడు ఎక్కువ ధనముగలవాడు కాకూ డదు. ఎందువల్లననగా అది వానిని ప్రపంచ దుర్గుణములకు లాగుచుండును. శరీరావసరములకు వలయునంత సొమ్మును అతడు కలిగియుండవచ్చును. ఆర్థిక స్వాతంత్ర్యము వానిని ఆదుర్దాలనుండి తొలగించును. మరియు తన సాధన ఏ అడ్డంకియు లేకుండ జరుపుటకు వీలగును.

యోగాభ్యాసకుడు మితభోజి అయియుండవలెను. అతడు సోమరితనము సౌఖ్యము స్వాభావికముగు బద్ధకము ఎక్కువ నిద్దుర లేకుండ నుండవలెను. అతడు మౌనముగ నుండవలెను. జీర్ణశక్తి చక్కగా నుండుటకు అప్పుడప్పుడు ఉపవాసము చేయుచుండవలెను. అతడు అన్ని విధములైన అత్యాశలు అడ్డగించుకొని ప్రపంచ కోరికలయొక్క వ్యతి రేకభావనలు విచారణ ఆలోచన వివేకములద్వారా వృద్ధి పఱచుకొని అట్టి కోరికలకు ఆటంకము గలుగజేయవలెను. మోసముచేయు మనస్సుతో అతడు ఈ విధముగా జెప్ప వలెను: "ఓ మనస్సా! నీ జిత్తులు నాకు తెలియును. ఇప్పుడు నాకు వైరాగ్యము వివేకము కలిగినవి. ఇప్పుడు నీ యిష్టము వచ్చినట్లు జరుపుటకు వీలులేదు. నేను నిర్దాక్షిణ్యముగా నీ యాటకట్టించెదను. నేను చాల గుణపాఠములు నేర్చు

కొన్నాను. అజ్ఞానమే నన్ను శాశ్వత ఉపయోగములకు బదులు అశాశ్వతపు భావములను కోరునట్లు చేసినది. ఇక నాకీ యింద్రియ సౌఖ్యములు అక్కఱలేదు. అవి నాకు కక్కిన కూడువంటివి. నేను స్వేచ్ఛను పొందుటకు నిశ్చయించుకొన్నాను. యోగముయొక్క శాశ్వతమైన ఫలము శాశ్వతమైన శాంతి; అంతులేని ఆనందము మరియు పరమ సంతోషము.

యోగము అడ్డంకిలేని ధ్యానము నభ్యసించుట కొఱకు ప్రాపంచిక ఆశలనుండి పూర్తి విరక్తి ఉండవలెనని నొక్కిచెప్పుచున్నది. నీ హృదయముయొక్క ఆంతరిక ప్రకాశముపైగాని నీకు ఇష్టముగల వేరొక అంశముపైగాని నీవు ధ్యానము చేయుచుండవలెనని అది ఆదేశించుచున్నది. ఎల్లప్పుడు ధ్యానముచేయు నిమిత్తము జీవితముయొక్క మూలవిషయములనుండి యొకవ్యక్తి విడుదల కావలసినదిగా అది నియమించుచున్నది. సరియైన పద్ధతిలో జీవితము నడపువాడు యోగమును ఇంటియొద్దకూడ అభ్యసింపవచ్చును.

కోరికలు ఆశలు జయించి యమము నియమము సంయమము (ధ్యానధారణ సమాధులు ఒకేకాలమందు జరుపుట) అభ్యసించిన అసాధారణమైన శక్తులు పొందవచ్చునని యోగి నమ్మకముగా చెప్పుచున్నాడు. యోగసూత్రముల గ్రంథకర్తయగు పతంజలి మహర్షి అభ్యాసకులు శక్తులయొక్క ప్రేలేపణమున ముగ్ధులు కాగూడదని

స్పష్టముగా తెలియపఱచియున్నాడు. దేవతలే అజాగ్రత్త గల యోగికి తమతో సరిసమానమగు స్థానము నిచ్చెదమని ప్రేరేపింతురు. విద్యార్థులు ఎంతగా హెచ్చరించినను నిజముకంటెను ఆధ్యాత్మిక అనుభవముకంటెను సిద్ధులనే ఎక్కువగా కోరుచుందురు.

శక్తికొఱకైన కోరిక జాగ్రత్తగా వెలుగుచున్న యోగదీపమును ఆర్పునట్టి గాలిపంకావలె పనిచేయును. యోగి చాలకష్టపడి సంపాదించిన ఆ కొద్ది ఆధ్యాత్మిక ప్రకాశము ఆ యోగమును వృద్ధిపఱచుకొనుటయందు నిర్లక్ష్యము చూపుటవలనను సిద్ధులను పొందవలెనను స్వలాభపరత్వమువలనను నశించును. మరియు వ్యక్తిని అజ్ఞానము అను అంతులేని గుంటలోనికి త్రోసివేయును. అతడు మరల యోగశిఖరము నధిరోహింపజాలడు. అజాగ్రత్తగల విద్యార్థిని ప్రేరణలు గ్రద్దలవలె ముంచివేయుటకు పొంచియుండును. నక్షత్ర మానసిక గంధర్వలోకముల ప్రేరణలు భూసంబంధమైన ప్రేరణలకంటె చాల శక్తివంతమైనవి.

ముముక్షువు పూర్ణమై స్థిరమైన ధ్యానమును అభ్యసించినకాని యోగమందు ఉత్తీర్ణుడు కాజాలడు. అన్ని కాలములయందు అతడు ఆత్మనిర్బంధనను అభ్యసించవలయును. ఎందువల్లననగా హఠాత్తుగా ఇంద్రియములు సంక్షోభపెట్టవచ్చును. అందువల్లనే శ్రీకృష్ణుడు అర్జునునకు ఈ ప్రకారము సలహాయిచ్చెను: 'ఓ కుంతీనందనా, జ్ఞానికి కూడ ఉద్రేకముతో కూడిన తన యింద్రియములు ఎన్ని

అడ్డంకులు కలుగజేయుచున్నను అతని మనస్సును ఉద్రేక ముతో తోసికొనిపోవును. అట్టి తిరుగుబోతు ఇంద్రియ ములకు మనస్సు లోబడుటవలన సముద్రముపై ఓడను గాలి త్రోసికొనిపోవునట్లు బుద్ధికి తోచినట్లు పరుగెత్తును. (భగవద్గీత అధ్యాయము 2, శ్లో. 60, 67.)

తఱచుగా యోగమార్గమందు అనేక అడ్డంకులు కలుగును. ఆశాభంగము నిరుత్సాహము జబ్బు నీరసము సందేహము కర్తవ్యము అనిశ్చయము ప్రాకృతిక మానసిక శక్తిహీనత మందమతి నిలుకడ లేకపోవుట ఇంద్రియ భోగములకొఱకు దురాశ తప్పుడు పనిచేయుట—ఇవియన్నియు అడ్డంకులుగా పనిచేయును. అతడు నిరుత్సాహ పడకూడదు. వానిని జయించుటకు పతంజలి మహర్షి ఏకతత్త్వాభ్యాసము అనగా ఒకే వస్తువుపై నిరంతర ధారణ అభ్యసించుట—విధిగా నియమించెను. ఇది వానికి స్థిరత్వము బలము నిచ్చును. అతడు సమానులతో సహవాసము నీరసులయందు దయ అధికారులయందు మర్యాద దుష్టులయందు నిర్లక్ష్యమును విధించియున్నాడు. ఇట్టి అభ్యాసము మనశ్శాంతి నిచ్చును; అయిష్టతను ఈర్ష్యను నశింపజేయును. ఈ సద్గుణములు అలవాటు పఱచుకొనిన వానికి నూతన జీవితము గలుగును. అవసరమైనది పట్టుదల. అదియే యోగమునకు మూలాధారము. మనస్సు స్వాధీనమైనప్పుడు యోగికి చాల ఉపయోగము కలుగును. అతడు అసంప్రజ్ఞాత సమాధియొక్క ఉత్కృష్ట ఆనందమును పొందును.

# ఆంతరయౌగిక శిక్షణ

## II

నీవు ఎల్లప్పుడు మనోసమత్వము కలిగియుండవలెను. ఇది చాల ముఖ్యమైన అభ్యాసము. ఇది నిస్సందేహముగా కష్టమైన అభ్యాసమే. కాని ఎన్ని కష్టములు వచ్చినను దానిని నీవు అభ్యసింపవలయును. అప్పుడు నీవు నిజముగా సుఖముగా నుండగలవు. అప్పుడే నీవు నిజమైన మనశ్శాంతిని పొందగలుగుదువు. కష్ట సుఖములయందును శీతోష్ణములయందును లాభ నష్టములయందును జయాపజయములందును పొగడ్త ఆక్షేపణలయందును మర్యాద అమర్యాదలయందును మనో సమత్వముండుటయే జ్ఞానము. ఈ అభ్యాసము చాల కష్ట మయినదియేగాని అంత ఆధ్యాత్మికశక్తి నిచ్చును. ఎవడు అన్ని కాలములయందును అన్ని పరిస్థితులయందును తీక్ష్ణమైన కోపకారణము కలిగినను మనఃస్థిమితతను నిలువబెట్టు కొనగలుగునో వాడు భూమికి నమ్మిన ప్రభువు. అట్టివానిని పూజింపవలెను. అతడు చింకిగుడ్డలు కట్టుకొనినను తినుటకు వానికేమియు లేక పోయినను వాడే భాగ్యవంతుడు. వాడు నీరసముగానుండు శరీరము కలిగినవాడయినను చాల బలము గల మనుజుడు. ప్రాపంచిక జనులు కొద్ది విషయములయందు కూడ మనోసమత్వము పోగొట్టుకొందురు. వారు త్వరలో ఉద్రేకముపొంది కోపమునకు లోనగుదురు. ఒక వ్యక్తికి ఉద్రేకము కలిగిన వానిశక్తి నష్టమగును. వ్యక్తి మిక్కిలి శారీరకబలము కలిగియున్నను మంచి కండరములతోకూడి బాగుగవృద్ధియైన శరీరము గలిగియున్నను, ఉద్రేకము

కోపము ఉన్నయెడల అట్టివాడు చాలదుర్బలుడు. మనో సమత్వము కావలెనని కోరువారు వివేకము బ్రహ్మచర్యము ధ్యానము వృద్ధిపఱచుకొనవలెను. తమ వీర్యము వృథాగా నష్టపరచిన వారు చాల తఱచుగా కోపమును పొందుదురు.

ఉద్రేకము అవసరము తటస్థపడినప్పుడు ఉగ్రకోపముగా మారును. కావున నీవు చాల జాగ్రత్తగా నుండవలెను. కోపోద్రేకమును మొదటనే త్రుంచివేయవలెను. దానిని గొప్పకోపతరంగముగా మారకుండ చూచుకొనవలెను. ఒకసారి మీరు అట్టి కోపస్వభావమునకు లోబడిన ముందు అట్టివానిని మీరు అడ్డగించలేరు. కాని మొదటిసారి అట్టి ఉద్రేకము ఆపుకొనుటలో ఉత్తీర్ణులైనచో ముందు అట్టి పరిస్థితి కలిగినను మీరు దానిని సులభముగా జయించగలరు. ఇది ప్రకృతియందు మార్పులేని న్యాయము.

కోపావేశము గడచిపోవును కాని అది సూక్ష్మశరీరమునందు తనయొక్క స్థిరమైన గుర్తులు నిలుపును. అప్పుడు క్రమశః ఎక్కువ కోపమునకు ఆవేశమునకు వ్యక్తి పాల్పడుచుండును. ప్రతి ఆవేశము కోపముగలుగుటకు ఆకోపము తొందరగా వృద్ధిపొందుటకు అవకాశమిచ్చును. మనుష్యుడు తన ఆత్మ స్వాతంత్ర్య శక్తిని పూర్తిగా కోల్పోవును. ఒక్క నిమిషమందు అది ఎట్టిక్రూరమైన నేరమైనను చేయవచ్చును. ఖూనీగాని లేక యితరమైన కార్యముగాని చేయవచ్చును. అతడు ఊహా ప్రపంచమును మైలపరచును. తన చెడుస్పందనములచే చుట్టునున్న వారికి కూడ హాని

కలుగజేయును. కాబట్టి యిట్టి కోపావేశము రాకుండనుండు టకు గొప్ప జాగ్రత్త ప్రతిమనుష్యుడు తీసికొనుట అత్యావ సరము. ఇతరులతో కలిసి తిరుగునప్పుడు మాట్లాడునప్పుడు అతడు జాగ్రత్తగా నుండవలెను.

ఇంద్రియములు నీ శత్రువులు. అవి నిన్ను బయటికి లాగి నీ మనశ్శాంతిని పోగొట్టును. వానితో స్నేహము చేయవద్దు. వానిని జయించవలెను. వానిని ఆటంకపఱచ వలెను. పోగరుగల గుఱ్ఱములను స్వాధీనపరుచుకొనునట్లు వానిని నీవు స్వాధీనపఱచుకొనవలెను. ఇంద్రియములను స్వాధీనమునందుంచుకొనుటవలన నీకు ఆధ్యాత్మికబలము మనశ్శాంతి గలుగును. ఇంద్రియములను స్వాధీనములో నుంచుకొనుట ఒకదినములో జరుగుపని కాదు. అందుకు చాల కాలము నిరంతరమైన ఓపికతోకూడిన అభ్యాసము కావ లెను. ఇంద్రియముల స్వాధీనతయే నిజముగా మనస్సును స్వాధీనపఱచుకొనుట. పది యింద్రియములను లోబరచు కొనవలయును. అవి చనిపోవునంతవఱకు వానిని పస్తుపెట్ట వలయును. వానికి కావలసిన దానినివ్వకుము. అప్పుడు అవి నెమ్మదిగా నీరసించును. అవి నీ ఉత్తరువుల ప్రకారము నడుచుకొనును. ప్రపంచసంబంధమైన జనులు విద్యాధికు లైనను భాగ్యవంతులైనను శాస్త్రసంబంధమైన అనేక అధి కారసంబంధమైన శక్తులు గలవారైనను వారు ఇంద్రియ ములకు దాసులై యుందురు. నీవు పూర్తిగ ఆ మాంసభక్షణ

మును మానిననే నాలుకపై నీకు కొంత అధికారము కలిగి నట్లు తెలిసికొందువు.

నీవు జాగ్రత్తగాను చురుకుగాను ఆలోచనపరుడవు గాను నుండుము. నీ మనస్సును వృత్తులను జాగ్రత్తగా కని పెట్టిచూడుము. జీసను ప్రభువు చెప్పినదేమన: 'జాగ్రత్తగా కాపలా కాచిచూడుము. ప్రార్థింపుము.' మనస్సును జాగ్రత్తగా చూచుట అనగా అంతరదృష్టి. ఇట్టి ఉత్కృష్టమైన ఉన్నతిగల, ఉపయోగముగల అభ్యాసము కోటిలో నొకనికి పట్టువడును. ప్రజలు ప్రాపంచికస్థితిలో మునిగియుందురు. వారు కామినీ కాంచనములవెంట పరువులెత్తుదురు వారికి ఆత్మ లేక ఉత్తమ ఆధ్యాత్మిక విషయములు ఆలోచించుటకు తీరికయుండదు. సూర్యోదయమయినంతనే మనస్సు దాని మామూలు అలవాట్లు—ఇంద్రియసంబంధమైన తినుట త్రాగుట సంతోషించుట నిద్రించుట మొదలగు వాని— వెంట పరుగిడుచుండును. ఆరోజు గడచిపోవును. ఈ ప్రకారమే జీవితమంతయు గడచిపోవును. నైతికవృద్ధి గాని ఆధ్యాత్మికవృద్ధిగాని ఏమియు నుండదు. విద్యాధికులు సంస్కృతులు అని అనుకొనువారు కూడ అంతర దృష్టి కలిగియుండరు. వారు తమ బుద్ధికుశలత మాత్రము వృద్ధిచేసికొని కొంతధనము సంపాదించి కొంత అధికారము పొంది కొన్ని ఆడంబరములగు బిరుదులను మర్యాదలను పొంది ఆత్మజ్ఞానముగాని జీవిత గమ్యమును గాని పొందకయే నాటకరంగమునుండి అదృశ్యులగుదురు.

ఇది నిజముగా విచారకరమైన విషయము గదా? ఇది చాల విచారకరము. ప్రతిదినము అంతరదృష్టిగలవాడు తనలోట్లు కనుగొని సరియైన మార్గమున వానిని పోగొట్టుకొనగలడు. మనస్సు తన స్వాధీనము జేసికొనగలడు. అనుజ్ఞ లేకుండ జొరబడునట్టి కామము క్రోధము దురాశ భ్రమ మరియు గర్వములను తన మానసిక కర్మాగారములోనికి జొర నివ్వడు. అతడు దయ సహనము పవిత్రత ధైర్యము మొదలగు దివ్యసద్గుణములు అభ్యసించగలడు.

ప్రతిదినము ఆత్మవిమర్శన ఆత్మపరీక్ష తప్పకుండ ఉండవలసిన విషయములు. అప్పుడే యోగాభ్యాసకుడు లేక విద్యార్థి తనలోట్లు పోగొట్టుకొని ఆధ్యాత్మిక జీవితమునందు తొందరగా వృద్ధిపొందగలడు. తోటమాలి ఏమిచేయును? అతడు చిన్న మొక్కలను జాగ్రత్తగా చూచును. ప్రతి దినము కలుపు మొక్కలు తీసివేయును. వానిచుట్టు మంచి బలమైన కంచె వేయును. సరియైన సమయములందు ప్రతి దినము వానికి నీరుపోయును. అప్పుడే అవి అందముగా పెరిగి త్వరగా ఫలించును, ఆప్రకారము యోగాభ్యాసకుడు దైనిక ఆత్మ విచక్షణద్వారా తన లోట్లుకనిపెట్టుకొని సరియైన మార్గములద్వారా వానిని పోవునట్లు చేసికొనవలెను. ఒక పద్ధతివలన ఉపయోగము లేని యెడల ఇంకొక పద్ధతి అవలంబించవలెను. ప్రార్థనవలన ఉపయోగము లేని యెడల సత్సంగము ప్రాణాయామము ధ్యానము భోజనమార్పులు విచా-

రణ మొదలగువానిని అనుసరించవలెను. మనస్సు పై భాగమున కనిపించు గర్వము, మోసము కామము క్రోధము వగైరాలయొక్క అలలను నశింపజేయుటయేగాక చిత్తముయొక్క లోపలి మూలలయందు దాగియుండు సూక్ష్మస్పందనములను కూడ నిర్మూలము చేయవలెను. ఈ సూక్ష్మసంస్కారములు చాల ప్రమాదకరమైనవి. అవి దొంగలవలె దాగియుండి ముముక్షువు కొంచెము అజాగ్రత్తగా నుండి దైనిక ఆధ్యాత్మిక అభ్యాసములందు కొంత తగ్గించునపుడు వానికి ఎదురు తిరుగును. అనేక సమయములందు మిక్కుటమైన ప్రేరేపణ కలిగినను అవికనపడనియెడల దైనిక ఆంతర దృష్టి ఆత్మ విమర్శనలప్పుడు కూడ కనిపించనియెడల అతి సూక్ష్మ స్పందనములుకూడ నశించినవని నిశ్చయించవచ్చును. ఆంతరదృష్టి ఆత్మ విమర్శన అనువానికి ఓపిక పట్టుదల జలగవంటి పట్టు శ్రద్ధ స్థిరమైన ఆత్మబలము నిశ్చయము సూక్ష్మబుద్ధి ధైర్యము మొదలగునవి కావలయును. అపుడు దానివల్ల లెక్కలేని విలువగల ఫలము నీవు పొందుదువు. ఆ ఫలము అమరత్వము పరమశాంతి అంతులేని ఆనందము. దీనికి నీవు చాల ఎక్కువ కరీదు నీయవలసియున్నది. కాబట్టి నీవు ప్రతిదినము అభ్యాసము చేయుటకు బద్ధకించకుము. నీయొక్క పూర్తిమనస్సు హృదయము బుద్ధి ఆత్మ దానియందు ఉంచవలెను. అప్పుడే నీకు తొందరగా విజయము సమకూరుటకు వీలుకలుగును.

యోగమార్గమునందు ప్రతి ముముక్షువు నిర్మలమైన మనస్సును గలిగియుండవలెను. నిలుకడలేని మనస్సుగల ముముక్షువు యోగమునందు ఎంతమాత్రము వృద్ధిపొందనేరడు. యోగాభ్యాసమునకు ఉండవలసిన ప్రథమలక్షణము మనస్సు నిర్మలముగా నుంచుకొనుట, ఉదయము మౌనముతో గూడిన ధ్యానముచేయుట కోరికలు త్యజించుట సాత్విక ఆహారము తీసికొనుట ఇంద్రియములను స్వాధీనము నందుంచుకొనుట ప్రతిదినము ఒక గంట మౌనముగా నుండుట—ఇవియన్నియు నిర్మలమైన మనశ్శాంతిని పొందుటకు చాల సహాయకారులుగా నుండును. వ్యర్థమైన ఊహాలు అనుభవములు ఆదుర్దాలు చిక్కుగల ఊహాలు కేవలము కారణములేని భయములు అన్నియు తీసివేసికొనవలయును. ముముక్షువునకు ఉచ్ఛస్థితిగల మనశ్శాంతియుండిన యోగము సరిగా స్థిరముగా నిలబడును. నిర్మలమైన మనస్సువలననే నిజమును కనుగొనుటకు వీలగును. మౌనముతోగూడిన మనస్సే దివ్యప్రకాశమును పొందగలుగును. శాంతముగల మనస్సే ఆధ్యాత్మికదీపము పెట్టుకొనుటకు తగిన ప్రమిద. ఒక వ్యక్తికి నిర్మలమైన మనస్సు ఉండినచో వాని ఆధ్యాత్మిక అనుభవములు స్థిరముగా నుండును. లేనియెడల అవి వచ్చుచు పోవుచునుండును.

నీవు ప్రాతఃకాలము నిద్రనుండి లేచునపుడు కొంత ప్రార్థన జపము ధ్యానము 4 నుండి 6 వఱకు చేయుము.

అప్పుడు స్థిరమైన ఈ ప్రతిజ్ఞ చేయుము : 'నేను ఈ దినమున బ్రహ్మచర్య వ్రతమును సలుపుదును. నేను ఈరోజు నిజము పలికెదను. నేను ఈరోజు ఇతరుల మనస్సునకు బాధకలుగ జేయను. నేను ఈరోజున కోపగించను.' మనస్సును జాగ్రత్తగా కనిపెట్టుము. స్థిరమైన ఆత్మశక్తి కలిగియుండుము. స్థిరముగా నుండుము. నీవు ఆదినమున తప్పక జయము పొందెదవు. నీ ఆత్మశక్తి వృద్ధిపొందును. తరువాత నీ యీ ప్రతిజ్ఞ ఆ వారమంతయు జరుపవలయును. నీవు క్రమముగా ఎక్కువ బలమును పొందుదువు. నీ ఆత్మశక్తి వృద్ధిపొందును. తరువాత నీ ప్రతిజ్ఞ నెలవరకు జరుపుము. నీకు ప్రారంభమందు కొన్ని ప్రమాదములు గలిగినను లెక్క చేయకుము. ఆదుర్దాపడవద్దు. తప్పులే నీ ఉపాధ్యాయులు. అవి తిరిగి నీవు చేయవు. నీవు నమ్మకముతోను ఆసక్తితోను ఉంటిన దైవకటాక్షము నీకు గలుగును. కష్టములను ఇబ్బందులను ఎదుర్కొనుటకు నీకు భగవంతుడు బలము నిచ్చును.

మనస్సును స్వాధీనము చేసికొనినవాడు నిజముగా సంతోషముగాను స్వేచ్ఛగాను ఉండును. శారీరక స్వేచ్ఛ స్వేచ్ఛకాదు. వ్యక్తిభావములకు ఆవేశములకు లోబడు నెడల పద్ధతులు కోరికలు మనోవికారములు—వీనికి లోనగు నెడల అతడెట్లు నిజమైన సౌఖ్యమును పొందును? అట్టివాడు చుక్కాని లేని పడవవలెనుండును. నదిలో నిటునటు కొట్టు

కొను గడ్డిపరకవలె ఇటునటు తముకు బడుచుండును. అతడు అయిదునిమిషములు నవ్వును అయిదుగంటలు ఏడ్చును. అతడు అట్టి మనోవ్యాకులముతో నిటునటు ఊగిసలాడు నపుడు భార్య కుమారుడు స్నేహితులు ధనము కీర్తి బిరుదములు శక్తులు వానికి ఎట్టి సహాయము చేయగలవు? తన మనస్సును స్వాధీనమందుంచుకొన గలిగినవాడే మహా వీరుడు. ఒక్క సామెత కలదు : 'మనస్సును స్వాధీనపఱచుకొనినవాడు ప్రపంచమును స్వాధీనపఱచుకొనును.' నిజమైన జయము మనస్సును జయించుటయే. అప్పుడే ఒకవ్యక్తి నిజమైన స్వేచ్ఛను అనుభవించగలడు. కఠినమైన విధేయత నియంతట నీవు ఏర్పఱచుకొన్న కట్టుదిట్టములద్వారా నీ కోరికలు ఊహలు ఆసక్తులు ఆశలు మొదలగునవి రూపుమాపవలెను. అప్పుడే నీవు నీ మానసిక దాస్యమునుండి విడుదల పొందగలవు. నీవు మనస్సునకు ఎంతమాత్రము లొంగకూడదు. మనస్సు అల్లరిచేయు కోతివంటిది. తగిన పద్ధతులచే దానిని లొంగదీయవలయును. అప్పుడే నీవు పూర్ణమైన యోగివి కాగలవు. ధనము నీకు స్వేచ్ఛ నీయజాలదు. స్వేచ్ఛయనునది బజారులో కొనదగిన వస్తువు కాదు. అది అయిదుపడగల సర్పముచే కాపాడబడుచున్న గుప్తధనము. ఆ సర్పమును చంపినగాని నీకు ఆ ధనము దొరకదు. ఆ ధనమే ఆధ్యాత్మిక ధనము. సర్పము అనునది మనస్సు. అయిదుపడగలు అయిదు ఇంద్రియములు. వీనిద్వారా మనస్సు బుసకొట్టును.

రాజసిక మనస్సు ఎల్లప్పుడు క్రొత్తవస్తువులను కోరు చుండును. దానికి మార్పులు కావలెను. ఏకవస్తువునందు దానికి విసుగుపుట్టును. అది స్థలములో మార్పు, ఆహారములో మార్పు అన్నిటిలో మార్పు కోరును. కాని యోగాభ్యాసకుడు మనస్సు ఒకే వస్తువును అంటిపెట్టుకొనియుండునట్లు తర్ఫీదు చేయవలెను. అతడు ఏకత్వమునకు భయపడకూడదు. వానికి తీక్ష్ణమైన ఓర్పు ఉండవలెను. స్థిరమైన ఆత్మబలము విసుగులేని పట్టుదలకూడ నుండవలెను. అప్పుడే అతడు యోగములో విజయము పొందగలడు. ఎల్లప్పుడు క్రొత్తవస్తువులను కోరువాడు యోగమునకు అర్హుడుకాడు. నీవు ఒక్క స్థలమునకు ఒక్క గురువునకు ఒక్క పద్ధతికి ఒక్క యోగమునకు స్థిరపడియుండవలెను. అప్పుడే నీకు తొందరగా వృద్ధికలుగును. నీవు భగవత్సాక్షాత్కారమునకు నిజమైన దాహము కలిగియుండవలెను. అప్పుడు ని అడ్డంకులన్నియు తొలగిపోవును. అప్పుడే యోగమార్గమందు నీవు స్థిరపడియుండగలవు. కేవలము తమాషాకు కేవలము ఆవేశములను పొందుట, లేక సిద్ధులు శక్తులు పొందగోరుట—వీని వలన నీకు సరియైన పర్యవసానమేమియు కలుగనేరదు.

నీకు ధ్యానములో కొంత వృద్ధికలిగిన తరువాత నీవు ఉద్రేకములకు లోబడవు. అప్పుడప్పుడు ఉద్రేకము ఇతర విషయములందు అనవసరమైన ఆసక్తి కలుగవచ్చును. కాని వానిని లోబరచుకొనుటకు నీకు శక్తి యుండును.

వానికి నీవు లోబడవు. క్రమశః ఈ ఆసక్తులన్నియు ధ్యాన మను నిప్పుచే దగ్ధము చేయబడును.

నీవు అజాగ్రత్తతో నుండినను నీవు నీ సాధనయందు క్రమము తప్పినను నీ ఆసక్తి సన్నగిల్లినను సోమరితనము వలన నీవు కొలది దినములు నీ సాధన విడిచిపెట్టినను ప్రత్యర్థి శక్తులు నిన్ను నిజమైన యోగమార్గమునుండి భ్రష్టుని చేయును. అప్పుడు నీవు ఏమియు ఆధారము లేక యుందువు. అపుడు నీవు తిరిగి మొదటి ఉచ్చస్థితికి వచ్చుటకు చాల కష్టము. కాబట్టి నీవు నీ అభ్యాసములయందు చాల నియమ ముగా నుండవలెను.

స్థిరత్వములేని నీమనస్సును నీ కోరికలు తగ్గించు కొనుటవల్లను అనవసరములగు ప్రాకృతిక కోరికలు నిర్మూ లము చేసికొనుటవల్లను శాంతపఱుపవలయును. మోక్షము నకు తీవ్రమైన కోరికమాత్రము కలిగియుండవలెను. అప్పుడు నీ మనస్సును ఉచ్చ ఆధ్యాత్మిక అవకాశములకు ప్రేరేపించ వచ్చును. దివ్యప్రకాశము నెమ్మదిగా దిగును. నీవు ఆంతరిక మార్పు ఆధ్యాత్మికవృద్ధి స్వయముగా అనుభవింపగలుగు దువు. క్రమశః నీ వస్తుచైతన్యము విశ్వచైతన్యములో ఏకీభావము పొందును. వ్యక్తికూడ దివ్యశక్తి లేక విశ్వ శక్తిలో నిమగ్నమగును. దీనినే సమాధి లేక పరమ చైతన్యస్థితియని అందురు. ఇప్పుడు వ్యక్తి భగవంతునిలో కలిసిపోవును. కొన్ని శతాబ్దముల అనంతరము అతడు తిరిగి

తన ప్రథమ నివాసస్థలమున్ను లేక అమరత్వ స్థితిని—శాశ్వతానందమును పొందును.

నీవు నీ మనస్సునుండి రజస్సునంతను బయటకు తీసివేయవలయును. రజస్సు అనునదియే మోహము. ప్రపంచ వృత్తికొరకు కలుగు ఆసక్తులన్నియు రజస్సుయొక్క పదార్థములే లేక రజస్సువల్ల పుట్టినవియే. ఉన్నతస్థితికోరుటయే మనస్సుకు స్థిరత్వము లేకుండజేయును. ఉన్నతస్థితి మనము పొందనియెడల మనస్సు నిరుత్సాహముతో ఆదుర్దాలతో నిండియుండును. ఉన్నతస్థితిని కోరువానికి మనశ్శాంతి యుండదు. అతడు ఈప్రకారము ఆదుర్దాపొందుచుండును. 'నేను నా ప్రయత్నములో ఉత్తీర్ణుడను కాగలనా? ఉత్తీర్ణుడనైనను ఫలానా మనుష్యునకు గలిగిన పలుకుబడి అధికారము పొందగలనా?' ఉన్నతస్థితిని కోరుట అనునది యోగమునకు గొప్ప అడ్డంకి. నీవు మొట్టమొదట మనశ్శాంతి గలుగుటకు ప్రయత్నించవలెను, తరువాత యోగము నభివృద్ధి చేయవచ్చును. శాంతిగల మనస్సునందే దివ్యజ్యోతికలదు. శాంతితో గూడిన మనస్సు కలిగినచో నీకు ఉచ్చదృశ్యముల వెలుగులు కనిపించును.

విచారగ్రస్తుడగు మనుజుడు తనచుట్టును అసంతుష్టి, విచారముతోకూడిన స్పందనములు ప్రసరింపజేయును. కాన నిరుత్సాహముకంటె నెక్కువ అంటువ్యాధి యింకొకటి

లేదు. నీకు నిరుత్సాహము కలిగియుండిన నీ గదిలోనుండి బయటకు రాకుము. ఎందువల్లననగా నీ నిరుత్సాహవ్యాధి నీ స్నేహితులకు ఇరుగుపొరుగు వారికి వ్యాపింపజేయుదువు. నిరుత్సాహము నీ మూలాధారమును తినివేయును. అది కొఱుకుడు పుండువలె చాల ప్రమాదము గలుగజేయును. అది ప్రమాదకరమైన ప్లేగుజబ్బు. దానికి కారణము నీ యొక్క ఆశాభంగము, ఓటమి, తీవ్రమైన అజీర్తి, తీవ్రమైన సంఘర్షణ, తప్పుడు ఆలోచన, తప్పుడు ఊహ వగైరా. నీవు ఇట్టి వ్యతిరిక్త ఉద్దేశములనుండి విడివడుము. పరమ పురుషునితో తాదాత్మ్యము పొందుము. అంతర్జీవితము గలిగియుండుము. బయటి ఆవేశములు నిన్ను మార్చజాలవు. నీవు మార్పులేని వాడవుగా నుందువు. నిరుత్సాహము వ్యతిరేకశక్తులు నిన్ను మార్చజాలవు. విచారణవలన నీ నిరుత్సాహమును తరిమివేయుము. భగవంతుని నామ సంకీర్తనము చేయుము. ప్రార్థింపుము. ప్రాణాయామమును ఓం కారమును స్మరింపుము. విడిగాలిలో తిరుగుము. సంతోష విషయమునే స్మరింపుము. అన్ని స్థితులలో సౌఖ్యముగా నుండుటకు ప్రయత్నింపుము. మరియు నీచుట్టునుండు వారందరకు సంతోషము వెదజల్లుము.

ఈ ప్రపంచము హిరణ్యగర్భుడు లేక దేవునియొక్క ఊహారూపముల స్థూలరూపముగాని వేరుగాదు. విజ్ఞాన శాస్త్రమందు వేడి వెలుతురు విద్యుచ్ఛక్తియొక్క ప్రవాహములుగలవు. యోగమందు ఊహా ప్రవాహములుండును

ఊహా చాలబలీయమైనది. ప్రతిమనుజుడు తనకు తెలియ కుండ కొంతవరకు ఊహాశక్తిని ఉపయోగించుచున్నాడు. నీకు ఊహాస్పందనములయొక్క పని తెలిసియుండినచో, ఊహా లను స్వాధీనపరచుకొను మార్గము తెలిసియుండినచో దూరములో నున్న మనుష్యులకు ఉపయోగింపబడు ఊహాలు నీవు ఊహాచిత్రముద్వారా వారికి పంపగలశక్తి నీకున్న యెడల అట్టి ఉహాశక్తిని వేయిరెట్లు ఎక్కువగా నీవు ఉపయోగింపవచ్చును. ఊహా కదలును. ఊహా అత్యద్భుత ములను గలిగించును. ఊహా చికిత్సచేయును. ఊహాకు బరువు రూపము పరిమాణము రంగు గలవు. తప్పుడు ఊహా బంధిం చును. సరియైన ఊహా ముక్తిని గలిగించును. కాబట్టి సరిగా ఊహించి ముక్తుడవు కమ్ము.

కర్మను స్థిరపరచునది ఊహామాత్రమే కాదు. ఒక విషయమై మంచిచెడ్డలు బాగా విమర్శించు తెలివిగల మనుష్యులు కొందరుందురు. కాని అవసరము గలిగినపుడు వారు కొన్ని ప్రేరణలవల్ల చెడుత్రోవను వెళ్ళుదురు. వారు తప్పుడు పనులుచేసి తరువాత పశ్చాత్తాపపడుదురు. కొందరు తత్త్వశాస్త్రజ్ఞులు ఊహాలకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి కర్మను స్థిరపరచునది ఊహాయని చెప్పుదురు. రెండు గోపు రములున్నవి. అవి ఒక్కొక్కటి 20 అడుగుల ఎత్తున నున్నవి. ఒక అడుగు వెడల్పుగల పొడుగుపాటి కొయ్య ఆ రెండు గోపురములు కలుపునట్లు వానిపైన వేయబడినది. ఆ బల్ల మీాద నడచునపుడు నీవు అచ్చటినుండి పడిపోవుదునని తలం

తువు కాని ఆ బల్లయే నేలమీదనున్నచో దానిమీద బాగా నడువగలుగుదువు. మరియు ఇరుకు సందులో నీవు బైసికిల్ మీద పోవుచున్నావనుకొనుము. త్రోవలో పెద్ద రాయి ఉన్నది. నీవు ఆ సైకిలు ఆరాయికి గ్రుద్దుకొన్నట్లు ఊహింతువనుకో, అట్టి నీయూహావలన నిజముగా నీ సైకిలు ఆరాతికి తగులును. కొందరు తత్త్వశాస్త్రజ్ఞు లిట్లుచెప్పు దురు: పనిని చేయునది మన ఉద్దేశమే. అట్టి ఉద్దేశము ఏ పనినైనను చేయగలదు. వారి దృష్టియందు ఉద్దేశమే ఆత్మ శక్తి. వేదాంతులుకూడ ఇట్టి అభిప్రాయమునే కలిగి యుందురు.

మనుష్యుడు మిశ్రగుణముగల సాంఘిక జంతువు. వానికి అనేక ఆసక్తులుండును. అతడు జీవశాస్త్ర సంబంధమైన జీవి. కాబట్టి వానికి జీవశాస్త్ర సంబంధమైన కొన్ని కర్తవ్యములు గలవు. అవియేవియనగా: నెత్తురు ప్రవహించుట, ఆహారము జీర్ణమగుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, మల మూత్రములు విడుచుట వగైరా. ఇంకను వానికి తత్త్వ సంబంధమైన పనులుగూడ కొన్నికలవు. అవి ఆలోచనలు ఊహించుట చూచుట లేక తెలిసికొనుట జ్ఞాపకముంచు కొనుట మొదలగునవి. అతడు చూచును; ఆలోచించును; రుచిచూచును; వాసనచూచును; అనుభవించును. తత్త్వ శాస్త్రము ప్రకారము ఆలోచించిన అతడు భగవంతుని యొక్క రూపము; అతడు బ్రహ్మమే. ముట్టకూడని చెట్టు పండును రుచిచూచి తన దివ్యశక్తిని పోగొట్టుకొనినాడు. ఆ

ప్రకారము పోయిన దివ్యప్రభావము తిరిగి మానసిక శిక్షణ వలన యోగాభ్యాసమువలన పొందగలడు.

ఓ బిడ్డా నీవు ఎందుకు ఏడ్చెదవు? నీకళ్లకు కట్టిన గంతను తొలగించిచూడుము. మాయాయవనిక తొలగించుము. నీవు సత్యము, సత్యమువల్లనే చుట్టబడియున్నావు. నీకళ్లు తెఱచి స్పష్టముగా చూడుము. నీవు ఎక్కడ చూచినను పూర్ణమైన వెలుగు ఆనందము మాత్రమే ఉన్నవి. అజ్ఞానమే కంటిజబ్బు. నీ దృష్టిమందగించినది. ఆ అవరోధమును తక్షణమే తొలగించుకొనుము. క్రమమైన ధ్యానము ద్వారా నీ ఆంతరజ్ఞానదృష్టి నభివృద్ధిపఱచుకొనుము. క్రొత్త అద్దముల కండ్లజోడు నుపయోగింపుము.

హరి ఓం తత్ సత్!

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# శ్రీ శివానందస్వామి తత్త్వము బోధనలు

## I

ఓం నమో భగవతే శివానందాయ

నేను చాలసంకోచముతోనే నా ప్రియమైన గురుదేవునియొక్క తత్త్వమును బోధనలను తెలియపఱచుటకు సాహసించుచున్నాను.

నా మామూలు మానవబుద్ధితో సచ్చిదానంద స్వరూపుడగు ఆ గురుదేవుని అంతులేని బోధనలను పూర్తిగా ఎట్లు గ్రహింపగలుగుదును? లేదు. నా నియమితమైన మనస్సు ఆయంతులేని అద్భుతమైన శ్రీ శివానందస్వామి తత్త్వమును సరిగా విమర్శింపజాలదు.

స్వామిజీయొక్క బోధనలు ఆయన ఎల్లప్పుడు సంసర్గము గలిగియున్న ఉత్కృష్ట శక్తియొక్క ప్రతిధ్వనులు. ఆ కారణమువలన వారి దివ్యశక్తి వారి ప్రతి శబ్దములోను ప్రవహించుచుండును. మానవ హృదయములో జొచ్చి దానిలోనుండు దివ్యత్వమును కలచివేయును. వారియొక్క ఆకర్షణీయమైన మాటలయొక్క అధిక్యత నెవరును అడ్డగింపజాలరు.

శివానంద తత్త్వమునందు వేదాంతము, ఉపనిషత్తుల సారము ఇమిడియున్నది. అవి మానవ జాతి ఆత్మయొక్క

గాఢవాంఛల అవసరములకు ఉపయోగపడును. వివిధ దేశీయుల యభివృద్ధికొఱకు ముఖ్య అవసరములన్నింటి విషయమై తెలియపరచుచున్నది.

ఆయన పురాతన మతగ్రంథముల విమర్శించువాడైనను ఆధునిక జీవనము దాని సమస్యలు బాగా తెలిసినవాడు. ఆయన తన తత్త్వమునందు ఉపనిషత్తులలోని ముఖ్య బోధనలన్నిటిని కూర్చి విపులముగా విమర్శించినారు. అయినను దానితోపాటు ఆధునిక ప్రపంచమునకు వీలుగా నుండునట్లు క్రొత్త ఊహాపద్ధతిగూడ అనుభవయోగ్యముగా తెలియపఱచినారు.

ప్రపంచ చరిత్రయందు తన జీవితకాలమందే తన బోధనలు అనేక జాతులకు జెందిన లక్షలకొలది స్త్రీ పురుషులచే ప్రచండమైన ఆమోదమునకు సేవకు ఆస్పదమైన శ్రీస్వామిజీవంటి వేరొక మహాపురుషుడు కనిపించడు. ఆయన ప్రపంచమంతటిలో పరమబోధకుడుగా నెంచబడుచున్నాడు. మానవ హృదయములందు అంతగా గౌరవింపబడు మహాపురుషుడు ప్రపంచమందెచ్చటను కనిపించడు. ఆయనయొక్క తత్త్వము ఏ యితర తత్త్వవేత్తలభావములకు విరుద్ధముగా నుండుటగాని, ఖండించుటగాని లేదు. అందువలననే అది పూర్వ పశ్చిమదేశములందు అందరిచేతను ఆమోదించబడుచున్నది.

ఆయన యిట్లు బోధించును: భగవంతుడు మనలో

నున్నాడు. మనము ఏది చూచినను వినినను లేక ముట్టు కొనినను ఊహించినను అదంతయు భగవంతుడే. కాబట్టి మనము ఎవరినీ ద్వేషించకూడదు. ఎవరినీ మోసగించ కూడదు. మనోవాక్కాయ కర్మల ద్వారా ఎవరికిని ఆపద కలుగ జేయకూడదు. భగవంతుడు ఆత్మ లేక బ్రహ్మము ఒక్కటియే నిజమైనవస్తువు. అది యొక్కటియే జీవము గలిగి మార్పు లేని శాశ్వత చైతన్యము అది అన్ని నామ రూపములలో నుండును. కాన నిజముగా మనమందరము ఒకటియే. మనము శరీరములము కాము. హద్దుగల మనస్సు లముగాము. కాని అంతటను వ్యాపించు ఆత్మయే మనము. తనంతట తాను ఉండు స్థితిగలిగి స్వయం ప్రకాశకమగు ఆత్మయందే శాశ్వతమైన పూర్ణమైన శాంతి ఉన్నది. మనము అశాంతిగా నున్నాము. ఏలననగా ఈ సంకుచిత ప్రపంచమందు మాయవలన పట్టుకొనబడితిమి. మనము మన జీవితగమ్యమగు ఆత్మ సాక్షాత్కారమును పొందుటకై మానవులముగా పుట్టితిమి. ఈ జననమరణ సంసారము నుండి అట్టి అనుభవము మాత్రమే మనలను విడుదల చేయ గలదు.

మాయయే మనబుద్ధిని మార్చి భ్రమకలుగజేయు చున్నది. మాయ అనేకమైన యీ ప్రపంచ దృశ్యములకు కారణమగుచున్నది. మాయయే మనలను అనేక విధము లుగా ప్రబోధించి బయటి వస్తువులయందు వ్యక్తిని ఆరో

పించి వానిని వెదకునట్లు చేయుచున్నది. మనము ఆత్మ సాక్షాత్కారము పొందినప్పుడు ఈమాయ అదృశ్యమగును.

భగవంతుడు ఇంద్రియములకు అతీతుడు. కాని మనము ఇంద్రియ విషయములను వాని చేష్టలను విడిచి యోగము ధ్యానము—ఈ మార్గములందు నడిచిన ఆయనను అనుభవమునకు తెచ్చుకొనగలము.

యోగమనునది భగవంతునితో లేక పరమాత్మతో లేక ఆత్మతో కలయుట. స్వామిజీ సమన్వయయోగమును ఆమోదించును. ఆయన తనయందు జ్ఞాని భక్తుడు కర్మ యోగి—వీరందరి జీవితపద్ధతులన్నింటినికలిపి అనుభవించు చున్నాడు. అతని ఉద్దేశము ప్రకారము కర్మయోగము అన్ని యోగములకు మూలాధారమై యుండవలెను. ఏల ననగా అది హృదయమందలి మలినము లన్నింటిని తుడిచి వేయును. ఆయన చెప్పునది యేమనగా: ఏవ్యక్తియైనను తాను చేయుపనులయందును వాని ఫలితములయందును ఆసక్తి లేక నిస్వార్థమైన సేవచేయునో అది తనంతట తాను అట్టి వ్యక్తికి దివ్యసద్గుణములను దయ సహనశక్తి ప్రేమ దయ మొదలగు వానిని వృద్ధిపఱచుకొనుటకు సహాయపడును. స్వామిజీ దినమంతయు ఎట్టి బహుమతియు కృతజ్ఞతా సూచకమగు నవ్వును ధన్యవాదమును కోరకయే మానవ జాతికి వివిధరకములగు సేవలుచేయుచుండును. ఆయన ఉప కారముచేసిన అజ్ఞాని ఆయనను అనవసరముగా నిందించి

నను ఆయన ఆత్మభావముతో వానికి సేవచేయుచునే యుండును.

తరువాత తరించు విషయములో స్వామిజీ భక్తి యోగమునకు ప్రాముఖ్యతనిచ్చెను. మనుష్యుడు ఉద్రేకములకు ఆస్పదమైనవాడని ఆయన చెప్పెను. నెమ్మదిగలిగి నిజమార్గమున నడుచువాడుకూడ ఉద్రేకముయొక్క బాధను తప్పించుకొనజాలడు. భక్తిమార్గము ఆ ఉద్రేకములను దివ్య ఆవేశముగా మార్చి ఆ వ్యక్తిగత ఆత్మను విశ్వాత్మలో లీనము చేయును.

అజ్ఞాన పటలమును తొలగించుకొనుటకు జ్ఞాన యోగము అత్యవసరము. సత్సంగము, గురుసేవ, వేదాంత గ్రంథముల అధ్యయనము మహాపురుషుల శ్రుతులను వినుట విచారణ ఎడతెగని ధ్యానము—వీనిద్వారా దానిని పొందవచ్చునని ఆయన సలహాయిచ్చెను. ఆత్మజ్ఞానము అజ్ఞానమును బాధను విచారమును పోగొట్టి జనన మరణ చక్రమునుగూడ అంతమొందించును.

ఆయన యిట్లు చెప్పెను: జననమరణములు భ్రమ. అది మాయయొక్క గారడి. ఆత్మ శాశ్వతమైనది. దానికి జననమరణములు లేవు. కర్మ ఫలములను అనుభవించుటకు మానవశరీరము మనకు ఇవ్వబడినది.

చాల ఉత్కృష్టమైన స్వామిజీ తత్త్వము సామాన్యమైనటువంటియు, మనస్సునకు నచ్చునటువంటియు మాట

లతో ఉదాహరించగల ప్రత్యేక తెలివిగలది. అతడు తన ఉత్తేజకరమగు బోధనను ముక్తసరిగా 'సమన్వయయోగ' మను పాటయందు ఇమిడ్చియున్నాడు. అది యిట్లున్నది :

సేవింపుము, ప్రేమింపుము, ఇమ్ము, పవిత్రుడవగుము, ధ్యానింపుము, తరింపుము, మంచిగా నుండుము. మంచి చేయుము. దయగలిగియుండుము. 'నేను ఎవడను' అని విచారింపుము. ఆత్మను కనుగొనుము. మోక్షము. పొందుము. వెదకుము, కనిపెట్టుము, లోనికిపొమ్ము. విశ్రాంతి తీసికొనుము.

ఇట్టి మామూలు గౌరవముతో గూడిన మాటలతో ఆయన అన్ని యోగములు వేదాంతము—వీనియొక్క సారమంతయు తెలియపఱచియున్నారు.

ఆధ్యాత్మిక ప్రకాశము ముక్తఆత్మయొక్క బోధన పద్ధతి ముఖ్యమైనది; ఆకర్షణీయమైనది మరియు మస్తిష్కమునకు బాధకలుగజేయనిది. అనేక సమయములందు మిక్కిలి వేదాంతముయొక్క కఠినపాఠములు బాగా తెలిసికొనుటకు వీలుగలభాషతో వ్రాయుచుందురు. ఉదాహరణకు: ఆఫీసులో పనిచేయుచుండగా నొకదినము ఒక మామూలు ఉదాహరణ ద్వారా ఆత్మ అన్నిటికంటె చాల ప్రియమైనదని ఆయన మాకు బోధించెను. ఆయన చెప్పినదేమన: ఇంద్రియములు ఇంద్రివస్తువులకంటె మనుజునకు ప్రియమైనవి. ఒక వ్యక్తి సినీమాలు చూచుటయందు అభ్యాసమున్నను కంటి

జబ్బువలన డాక్టరుచే ఆ సినిమా చూచుట నిషేధింపబడి నప్పుడు తనకండ్లు రక్షించుకొనుటకు సినిమాకు వెళ్ళుట మాని వేయును. కాబట్టి యింద్రియములు ఇంద్రియవస్తువులకంటె ప్రియమైనవని తెలుచున్నది. కాని ప్రాణము లేక జీవితము ఇంద్రియములకంటెకూడ ప్రియతరమైనది. అదిలోనఉండునది ఒక మనుష్యునకు కంటిజబ్బున్నదని అనుకొందము. డాక్టరు ఆకన్ను తీసివేయవలెను లేనియెడల ప్రాణమునకు భంగము కలుగునని చెప్పెననుకొందము. అప్పుడు ఆవ్యక్తి కన్ను తీసివేయుటకు తక్షణము ఒప్పుకొనును. కాబట్టి జీవితము లేక ప్రాణము ఇంద్రియములకంటె ప్రియమైనది. కాని ఒక వ్యక్తి ఒకానొక జబ్బువల్ల భరించలేని బాధ అనుభవించు చుండునసుకొందము. అతడు తనజీవితము అంతము చేసికొన వలెననికోరును. కాన ప్రాణముకంటె ఇంకను ప్రియమైనది లోన నున్నది. ఆమిక్కిలి ప్రియమైన వస్తువే ఆత్మ. కాన ఆత్మ అన్నింటికంటె ప్రియమైనది.

ఆధ్యాత్మిక జీవితమునందు ఉత్తీర్ణతకు ఆత్మశిక్షణ యొక్క ప్రాముఖ్యత స్వామిజీ నొక్కి చెప్పియున్నారు. ఆయన 'సరిపెట్టుకొనుము, సర్దుకొనుము, సహాయము చేయుము. దూషణభరించుము బాధసహింపుము. ఇదియే ఉత్కృష్ట మైనసాధన' అను తన పాటను తరుచుగా పాడుటకు విసుగు జెందుదురు. ఈసాధన చాలకష్టమైనదైనను మనము దానిని అభ్యసించనియెడల మన ఆధ్యాత్మిక జీవితమందు వృద్ధిగాని శాంతిగాని సౌఖ్యముగాని మనము అనుభవింపజాలము.' అని

ఆయన నొక్కి చెప్పుచున్నాడు. కాని నిజమైన దీనత్వమే మన అహమును నలిపివేయగలదు. నిజముగా తనపావనమగు దీనత్వమువల్లనే ప్రతిమానవుడు మన గురుదేవుని గౌరవించి పూజించుచున్నాడు.

తీక్ష్ణమైన దివ్యప్రేమకు రూపము వహించిన స్వామిజీ మనము తమవలెనే యితరమతములను కూడ నమ్మవలసినదిగా ఉద్బోధించును. ఒకానొకప్పుడు అన్ని మతముల యొక్క బోధనలు మన శరీరముయొక్క అవయవములతో వారు పోల్చియున్నారు. ఆయన చెప్పినదేమన: ఏ ప్రకారము వ్యక్తి శరీరముయొక్క వివిధ అవయవములు—కాళ్లు, చేతులు, కడుపు, కండ్లు చెవులు వగైరాలు—ఒకటియో ఆ ప్రకారమే వివిధమతములయొక్క బోధనలు అట్టిమతములు మతమను శరీరముయొక్క వివిధభాగములు. మతసారమంతయు ఒకటియే. అదియే ప్రేమమతము, సత్యమతము.

నిజమైన విద్య ఆత్మను అనుభవమునకు తెచ్చుకొనుటయని ప్రాథమిక విద్యార్థులకు స్వామిజీ బోధించును. కావున విశ్వవిద్యాలయ విద్యతోపాటు విద్యార్థి దివ్యజీవనము గడుపు పద్ధతికూడ నేర్చుకొనవలెను. అహింస, సత్యము బ్రహ్మచర్యము—వీనిని అనుసరించవలసినదిగా ఆయన వారికి సలహా యిచ్చును. అవి అన్ని యోగములకు మూలాధారములని నొక్కి చెప్పును. కావున వ్యక్తి తన

జీవిత ప్రారంభమునుండి యితరుల మనస్సునకు నొప్పి కలుగ జేయకుండుట అందరియందు భగవంతుని జూచి వారికి సేవ చేయుట ప్రాణమునకు అపాయము కలిగినను నిజమును విడువకుండుట ప్రాకృతిక దేహసంబంధమైనవి, బుద్ధిసంబంధమైనవి ఆధ్యాత్మిక సంబంధమైనవి—అన్నియు ఇతరులతో పంచుకొనుటయు నేర్చుకొనవలయును.

స్వామిజీ స్త్రీలకు ఈవిధముగ ఉద్బోధన చేయుచుందురు: మీ శారీరక స్వభావమును మరచి స్త్రీ పురుష వివక్షత చూడక నేను 'అమర ఆత్మను' అని అనుకొనుడు. మన గురుదేవుడు బోధించినట్లు స్త్రీలుకూడ భగవత్సాక్షాత్కారమునకు ప్రయత్నించవలెనని యింకెవరును చెప్పియుండ లేదు. ఆత్మ విషయమై ఆయన వారితో ఈ ప్రకారము చెప్పెను: ఆత్మ అందమైన వానిలో మిక్కిలి అందమైనదని యెంచి బాహ్య అందములు విడిచిపెట్టుడు. ప్రపంచకర్తవ్యములలో మగ్నమైయున్నను మానసిక సన్యాసము అభ్యసింపుడని వారికి సలహా యిచ్చెను. ఆకర్షణ కలుగు విధముగా ఆయనవారితో యిట్లు చెప్పెను: 'మీ మెడలోని హారములవలె ఓర్పును, దుస్తులవలె ప్రేమను కలిగియుండుడు.'

జ్ఞాన స్వరూపుడగు స్వామిజీ వేదాంతము మాత్రమే

ప్రపంచమును కలుపగల శక్తిగలదని చెప్పియుండెను. ఒక్కమతమే ఉండవలెను. అది హృదయముయొక్క మతము—ప్రేమయొక్క మతము. ఇట్టిమతమును అంగీకరించునప్పుడే యీ ప్రపంచమునకు శాంతిగలుగును.

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో యోగతత్త్వ శాస్త్రమును బోధించియున్నాడు. కాని యిచ్చట ఆనంద కుటీరములో మన గురుదేవునియందు సజీవమైన శ్రీకృష్ణ శక్తియున్నది. ఆయన తన దైనిక కర్మలలో అన్ని యోగములను యోగసారముగా మార్చి తాను జీవించుచు ప్రత్యక్షముగా ఇతరులకు కనపడుచును. స్వామిజీ తన తత్త్వము ఇతరులకు తన బుద్ధి కుశలతవల్లకాక, నేను ఆధ్యాత్మిక బోధకుడనని చెప్పి అందు తనకుగల శక్తిని ప్రకటించుట వలనగాక తన విశ్వప్రేమ దయ మరియు సహిష్ణుత—వీని వలన బోధించును.

ఆ భగవంతునికి దీనమును హృదయ పూర్వకమును నయిన నా ప్రార్థన యిది: జ్ఞాన స్వరూపుడును ప్రపంచ ప్రఖ్యాతి గలిగిన ఆధ్యాత్మిక గురువును అగు ఈ మహానుభావునకు ఆ భగవంతుడు దీర్ఘాయుర్దాయమును పూర్ణ ఆరోగ్యమును ఇచ్చును గాక.

# శ్రీ శివానందస్వామి తత్త్వము బోధనలు

## II

భగవంతుడు మహాసముద్రమువలె నుండును. జీవులన్నియు దానియందలి బుడగలు.

ఏ జాతికి ఏ రంగుకు ఏ సంస్కృతికి జెందిన మనుష్యులైనను వారియొక్క గమ్యమునకు నడుపు సర్వశక్తిమంతుడగు భగవంతు డొక్కడే!

అందము, మంచి, సత్యము — ఈ మూడును ఒక దానిలోనివి. అందులో ఒక్కొక్కటియు ఈ మూడింటిలోనిది. పవిత్రుడు సచ్చిదానంద స్వరూపుడునగు భగవంతునితో అవి తాదాత్మ్యమును పొందుచున్నవి.

''ఆత్మైవేదం సర్వమ్'' ఇది అంతయు ఆత్మయే.

''సమం సర్వేషు భూతేషు'' అన్ని జీవులలోనుండు ఆత్మ ఒక్కటియే.

జీవితమంతయు ఒకటే. ఆజీవితముయొక్క ఏకత్వమును అనుభవమునకు తెచ్చుకొనుము.

భగవంతుడు మంచికంతకును మూలాధారము. జీవించియున్నవాని అన్నింటి ఏకత్వము, సత్యము — ఇవియే భగవంతుడు.

ఊహను విడిచి స్వతంత్రముగా నుండు ప్రపంచము లేదు.

ప్రపంచమునకు స్వయముగు ఉనికి లేదు. మనస్సు యొక్క సహాయము లేకుండ అది కనిపించదు.

ఊహనుండి విడిగా మనస్సునకు ఉనికి లేదు. ఊహే మనస్సగును.

మనస్సు తనపనిచేయనప్పుడు ద్వైతముండదు.

మనస్సుయొక్క మూలము లేక ఉత్పత్తి కనుగొనుము. ఆ మనస్సును ఆ మూలమున నుంచుము. అప్పుడు మనస్సు నశించును.

మనస్సు శ్రద్ధ ఇంద్రియ సంస్కారములను ఏరుకొనినవానికి సంయోగపరచును. అది సుఖమునకును కష్టమునకును స్థానము.

చిత్తము లేక దిగువమనస్సు జ్ఞాపకశక్తి కలిగించును. అది చిహ్నములు, సహవాసములు భావములయొక్క మూలస్థానము. (భాండాగారము)

మనుష్యునియొక్క స్వేచ్ఛయనగా కర్మనుండి స్వేచ్ఛకాదు. అది కర్మలో స్వేచ్ఛ.

నీతియందు జితేంద్రియత్వము ఇతరులసేవ యిమిడియున్నవి.

ఆధ్యాత్మిక మార్గమునకు ప్రారంభ అవసరములు సామాన్యమైన మంచి జీవితము, నిజాయితీ జీవితము, లోకమంతటికి మంచిగానుండుట, కోపము దురాశ కామము అహము క్రమముగా తగ్గించుకొనుట.

దివ్యజీవితమువలన స్వేచ్ఛయు ఆనందముగలుగును.

అదియే జీవితము యొక్కయు యోగము యొక్కయు ఉద్దేశము.

అన్ని మతములయొక్క ఉద్దేశము ఆత్మయొక్క నిజమును తెలుపు జీవితమార్గమునకు త్రోవచూపుట.

మతము జీవితము రెండుకావు. అవి రెండును ఒకటియే. ప్రతిదినము దివ్యజీవనము గడుపుము. ధ్యానము చేయుము, అధ్యయనము చేయుము. సేవచేయుము.

క్రమముగాను చురుకుగాను ధ్యానముచేయుము. ధ్యానముచేయువాడు దైవత్వమునుపొందును. అతడు దేని విషయమై ధ్యానము చేయుచుండునో ఆ రూపమును పొందును.

నిశ్చలముగానుండుము. ఊహల అలలను శాంతి పొందింపుము. ఆ నిశ్చలత్వమునందు మనస్సు కరుగును. అప్పుడు స్వయంప్రకాశమును పవిత్రచైతన్యమును అగు ఆత్మ ప్రకాశించును.

భగవంతుని కనుగొనుము. వానిని అనుభవమునకు తెచ్చుకొనుము. అన్నిజబ్బులకు అదియేమందు.

భగవత్సాక్షాత్కారమును పొందుము. దీని అర్థమే పరిపూర్ణత మోక్షము స్వేచ్ఛ సమత్వము సమష్టి సంతోషము ఆనందము శాశ్వతశాంతి.

పావనపురుషుడు ఏ చట్టములవలనను బంధింపబడడు. అదృష్టము వానిని ఏమియుచేయజాలదు. అతడు స్వేచ్ఛగానుండును.

# 1. పళని ఆండవన్ ప్రార్థన

పళని ఆండవా, సుబ్రహ్మణ్య ప్రభూ! నా ప్రియమైన దయాస్వరూపా! ప్రేమస్వరూపా! నీవు నాయందు అంత క్రూరముగా ఎందుకున్నావు? నీవు ఇప్పుడు నా ప్రార్థనలు ఎందుకు వినుటలేదు? నిన్ను ఎల్లప్పుడు నా హృదయములోపల ఉన్నట్లు అనుకొనుచున్నాను. నీవు అక్కడ ఏమి పని చేయుచున్నావు? ఈ విచిత్రమును ప్రత్యేకమునయిన యింద్రియజ్ఞానము ఎట్టిది? నా హృదయము బ్రద్దలగుచున్నట్లు నాకు తోచుచున్నది. అప్పుడప్పుడు నీవు ఆనందతరంగములను నా శరీరమంతట కప్పుచున్నట్లు అనుభవము కలుగును. నేను నిస్సహాయురాలనుగా భావింతును. నీవు నా దృష్టినుండి దాగియున్నప్పుడు నేను నిన్ను ఎట్లు తెలిసికొనవలెనో అట్లు తెలిసికొనునట్లు నీవు నన్ను చేయనపుడు నీవే నా జ్ఞప్తియందుండునట్లు చేయుటకు కారణమేమి? నా విషయమై నీ ఉద్దేశమేమి? కొంత విశ్రాంతి కలుగుటకు నేను ఏమి చేయవలెనో నాకు నీవు ఎందుకు చెప్పవు? లోగడ నేను అనుభవించుచుండిన వానియందు ఇపుడు నాకు ఎట్టి ఆసక్తియు లేదు. నేను నీదగ్గరగా నుండవలెనని కోరుచున్నాను. కాని నేను అన్నివైపుల గొలుసుతో బంధింపబడినట్లు నీవు చూచుచున్నావు. నేను విడివడుటకు మార్గము నాకు చూపవా? నా కర్తవ్యమేదియో నాకు కనుపర్చవా? నేను నా ప్రస్తుతపు జీవితము

నుండి పారిపోవుట ఆత్మత్యాగము కాదా? ఏలననగా ఇచ్చటనుండి నేను ఎచ్చటికి వెళ్ళెదనో అచ్చట సౌఖ్యమే అనుభవించెదను గదా! కాన నేను నా సౌఖ్యమునకు ప్రయత్నించుటలో ఇతరులకు అసౌఖ్యము కలుగజేయుదును. గనుక నేను చేయుపని స్వార్థపరత్వము కాదా? నాపైన ఆధారపడువారిని విడిచిపెట్టుట పాపము కాదా? అట్టివారు తమంతట తాము తమ్ము పోషించుకొనగలిగివారు కానప్పుడు వారిని విడిచిపెట్టుట పాపము కాదా? నా జీవితముకంటె ఎక్కువగ ప్రేమించెడువారి దయ ప్రేమయొక్క కూడని ఉపయోగము పొందుట నా స్వప్రయోజన పరత్వము కాదా? నేను చేయుపనులకు వానిని నేరారోపణచేయుటను నేను ఎట్లు సహింపగలను? నేను వానికి సహాయకారిగా నుండుటకు బదులు వానికి బరువుగా ఎట్లు ఉండగలను? నీవు ఎందుకు మౌనముగా నున్నావు? నీ బీద ఆత్మయొక్క దీనాలాపమునకు నీవు ఎందుకు జవాబీయవు? ఈ ప్రకారము నేను బాధపడుట నీకు సంతోషమా? అట్టి శిక్షపొందుటకు నేను ఎట్టి తప్పు చేసితిని? నలువది సంవత్సరముల శిక్ష చాలదా? నేను చేసిన తప్పులను క్షమించుటకు నేను ఏమి చేయవలెను? ఓ ప్రభూ! నాయందు దయగలిగి యుండవలెను. అధమపక్షము ఈ బాధ సహించుటకు శక్తినైన నను ఇవ్వవలెను. నీదయకు పాత్రురాలనగుటకు నేను ఏమి చేయవలెను? నీయందు శరణాగతి పొందినవారికి నీవు చేయుపని యిదియేనా? నేను నిన్ను తలపని ఒక్కనిమిష

మైనను గలదా? పగలంతయు నిన్నే తలచుచుంటిని. ఇప్పుడు రాత్రికూడ నిన్ను తలచునట్లు చేసితివి. నీవు నాతో ఎందుకు మాటాడవు? నీవు నన్ను ఎందుకు ఓదార్చవు? నా ప్రభూ! నిన్ను నేను గ్రహింపజాలకున్నాను.. నిన్ను చేరుటకు ఇంకను నాకు సమయము రానప్పుడు నీవు నాయందు ఇట్టి ఆధ్యాత్మికతృష్ణను ఎందుకు కలుగజేసినావు? అట్టి తృష్ణ కలుగజేసినప్పుడు ప్రపంచ ఝంఝాటము నిన్ను పూజించుటకు నాకు ఎందుకు అవకాశము నిచ్చుటలేదు? నా స్వల్ప తెలివితో మీ ఉద్దేశము తెలిసికొన జాలకున్నాను. మీ నిజమైన రూపము నాకు చూపుడు. నేను నీ విచిత్ర మాహాత్మ్యమును తెలిసికొనుటకు నా హృదయమును ప్రకాశముతో నింపుము. పూజనీయమైన నా ప్రభూ! త్వరగా నిన్ను చేరుటకు నన్ను దీవింపుము. నేను నీకు పూర్ణశరణాగతి అగుటకును ప్రతిపనీ నీకొఱకై చేయుటకును అవసరమగు శక్తి నాకిమ్ము. నా చేతులు దివ్యమైన పనులయందు ఉపయోగించునట్లు చేయుము. ఇకముందు నన్ను విడిచిపెట్టకుము. నేను నీకొఱకు బెంగపెట్టుకొని శుష్కించుచున్నాను.

# 2. ప్రార్థన

ఆండవా, నా ఆశ, నా సంతోషమా నా జీవితమా
నా ప్రియమైన ప్రభూ; నా దివ్యప్రేమా
నేను నీకు ఆనందబాష్పములతో మ్రొక్కుచున్నాను.
ఓ ప్రభూ! నీకు ఎట్లు ధన్యవాదములీయవలెనో నాకు
తెలియదు

అన్ని ఊహాలు అన్ని స్వప్నములు అన్ని రూపములు
శరీరమును కలచివేయునదంతయు
అన్ని నీకు కోరికలు మరియు ప్రేమ అయినది.
అవి పవిత్రమైన మంచి ఊహాలతో కూడియున్నవి.

నీ స్వర్గీయ కటాక్షముయొక్క మోహాములో కట్టుబడి
నా మనస్సు దివ్యప్రేమతో అవాక్కు అయినది.
నేను మీస్వర్గీయ పాదములవద్దనే జీవితమును అర్పణ
చేయుచున్నాను

నీ చూపుమలిపి నా ఆత్మవంక చూడుము.

[వచ్చెదను
దీనత్వముతోకూడిన నమ్మకముతో నేను మీావద్దకు
కాళ్లు మోకరించి మిమ్ము ప్రార్థించుచున్నాను.
మీా చేతులుజాపి నన్ను శాశ్వత ఆనందమునకును
దివ్య జీవనమునకును తీసికొని వెళ్లుడు.

# 3. చంద్రునితో నా కోరిక

చంద్రుడు ఆకాశమందు పైన ప్రకాశించుచున్నాడు.
అతడు ప్రపంచమునకు వెలుతురిచ్చుచున్నాడు ఆకిరణములు
తొందరగా ప్రసరించును.

వానికి ఆ త్రోవ నాకు ఈ త్రోవ
అతడు దయగల హృదయమందు ఆత్మలను కలుపును.

ఓ చంద్రుడా! ఓ చంద్రుడా! ఓ రాత్రియొక్క దీపమా
ఎందుకు నీవు నవ్వుచున్నావు? నీవు ఏమి చూచుచున్నావు?
అంత ఎత్తున నీవు ఉండుటకు నీవు చాల అదృష్టవంతుడవు.
నా ఆత్మయొక్క ప్రభువు నా భగవంతుని చూచుటకు

ఓ చంద్రుడా! ఓ చంద్రుడా! గర్వము పొందకుము
నాకంటెగాని నా ప్రభువుకంటెగాని నీకు భేదము లేదు.
బాహ్య ప్రభావముయొక్క పై తొడగు తీసివేసి
నాతోను నా ప్రభువుతోను ఏకత్వము అనుభవింపుము.

ఓ చంద్రుడా! ఓ చంద్రుడా! ఓ అందమైన చంద్రుడా!
గౌరవముతో ఆతురతతో నేను నీసహాయము కోరుచున్నాను
నా పవిత్రమైన భక్తి పుష్పములు తీసికొని
వాని అమరాత్మపై చల్లుము.
ఓ మేఘములారా, ఓ మేఘములారా! మీతొందర తగ్గింపుడు
మీ నీడతో అతని దృశ్యమును అడ్డగింపకుడు
అతడు తనతో నా సందేశమును వానికి తీసికొని
పోవుచున్నాడు.
అతడు దయగల ప్రభువు, అన్నియు తెలిసిన ప్రభువు.

# 4. నా ప్రియమైన గురుదేవునకు

నా ప్రియమైన ప్రభూ! నీవు ఎక్కడ ఉన్నావు?
నీవే నా ఆశ జీవితము మరియు ప్రేమ
నీవద్దకు వచ్చుటకు మెట్లు ఎక్కుటకు నాకు బలమునిమ్ము
మరియు ధైర్యము నిమ్ము.

మీరు చాపిన పవిత్రమైన చేతులను నేను చూచుచున్నాను
ముళ్ళమార్గముగుండా నడిపించుటకు ప్రపంచ పోరాటముల
నుండి
విడిపించుటకు మరియు దివ్య ఆనందమునకు తిన్నగా
నడుపుటకును

నేను చేయు ప్రతి పనియందు నా ఊహాలనన్నిటియందు
మీ ముఖము నేను చూచుచున్నాను. మీకటాక్షము
నేను కనిపట్టుచున్నాను
మిమ్ములను ఎల్లప్పుడు సేవించుటయే నా వెఱ్ఱితనము
మీ పాదములను సేవించుటయే నేను కోరునదంతయు.

ఉబుకుచున్న దివ్యప్రేమయను అలలలో నేను తేలుచున్నాను
గురుదేవుడు నావద్ద ఉన్నాడు ఎవరుఇప్పుడు నాకు నొప్పి
కలుగజేయలేరు.

అచ్చటచ్చట మీ ప్రభావము నేను చూచుచున్నాను
స్వర్గము మరియు భూమి మీతో నిండియున్నది.

మీరున్నచోట భగవంతుడు నివసించును.
మీలో ప్రేమ మరియు జ్ఞానము నివసించును.

నెమ్మదిగా వీచు ప్రతిగాలి,
పుష్పించు ప్రతి అందమైన పువ్వు
తీపిగానుండు ప్రతి మృదుసంగీతము
మీయొక్క రహస్యమైన ధ్వని నాకు వచ్చుచున్నది.

ఈ అందమైన పుణ్యస్థానము నీవు చూచినావా?
నేను నీ కొఱకు కట్టిన భక్తియొక్క భవనము
దానియందు కామము దురాశ లేకుండజేసి
నీవు కూర్చుండుటకు తగిన దానినిగా దానిని చేసితిని.

రాత్రింబగళ్లు నీకొరకు వేడుచుంటిని
నీవు వచ్చి యీ అల్పస్థితిలోనున్న పవిత్రస్థానమును
దీవింపుము.
నన్ను మీయొక్క విధేయతగల పనిముట్టుగా చేసికొనుము
నేను మీకు హృదయపూర్వకముగా సేవచేసెదను.

# 5. నా దివ్య స్వప్నము

అది ప్రకాశమానమైన అందమైన ప్రాతఃకాలము
అది మేఘముల తెరలోనుండి నవ్వుచున్నది.
సూర్యుడు తన నిర్మలమైన వేడిని ప్రసరించుచు
ఆకాశము పై భాగమునకు పోవుచున్నాడు.

నేను దివ్య ఊహాలతో ఎండిన దాననై
గంగానది ఒడ్డునకు వెళ్లితిని
నేను ఒక చెట్టు నీడను కూర్చొని
కళ్లుమూసికొని మౌన ప్రార్థన చేయుచుంటిని.

తొందరలో నొక ప్రకాశమానమైన వెలుతురు
దివ్య ఆనందముతో నాలో ప్రవేశించినది
నేను కొట్టుకొనుచుండిన హృదయముతో
ఊపిరి బిగబట్టుకొని కళ్లు తెఱచి చూచితిని కాని నేనేమి
మాట్లాడలేదు.

తొందరలో నేను పవిత్రమైన పసుపురంగు బట్టలతో
రాజఠీవితోను దివ్య చిరునవ్వుతోను కూడిన వ్యక్తి
నాదగ్గరకు వచ్చుట చూచితిని.

ఆ రూపము చూచుటకు చాల అందమైనది
వాని ముఖము నిర్మలమైన ఆనందముతో కూడియున్నది.
వానికండ్లు నమ్మకముతో ప్రేమతో ప్రకాశించుచు
చుట్టు విచిత్రమైన శక్తి ప్రసరించుచుండెను.

ప్రేమసంబంధమైన వాని చేతులుచాచి [స్పృశించెను
నేను ఆయన నిమిత్తము తలవంచగా నాతలను అతడు
అతడు మృదువుగా నెమ్మదిగా ఇట్లనెను
ఓ దివ్య ఆత్మా నిన్ను భగవంతుడు ఆశీర్వదించుగాక.
నీ ప్రపంచబాధలనుండి రక్షించుటకు
నేను నీ దగ్గరనున్నాను భయపడకుము
ఎల్లప్పుడు నేను నీ దగ్గరనున్నట్లు భావింపుము
నీ ప్రభువును సంతోషపెట్టుటకు నీపని నీవు చేయుము.

నేను చిరునవ్వు నవ్వితిని ఏడ్చితిని [లేకపోతిని
ఆ దివ్యస్వరూపముయొక్క సంతోషమువల్ల స్పృహ
అది నన్ను స్వర్గీయ ప్రాంతమునకు లేవనెత్తెడు
చాల ఉత్కృష్టమైన నిజమైన దృశ్యము.

# 6. నా గురుదేవుడు

నీవు నా గొప్ప గురుదేవుని చూచితివా?
అతడు ప్రపంచమంతటిలో చాల గొప్ప ఆత్మ.
నీవువచ్చి వాని పవిత్రపాదములు చూచుటకు
దివ్యజీవితము గడపుటకు నేర్చుకొనుము.

గర్వము గాఢభ్రమ పోగొట్టుకొనుము.
నీవుపరుగెత్తి వాని ఆధ్యాత్మిక గృహము వెదకుము.
నీ హృదయమును దివ్యప్రేమతో నింపుము.
అందరికి ప్రభువగువానిని పూజింపుము.

వాని పాదపద్మములకు పవిత్రహృదయముతోను,
దివ్యప్రకాశముతోను మ్రొక్కుము.
భగవంతునివలె పావనమగు వానిముఖము
ప్రేమతోను నమ్మకముతోను చూడుము.

వాని మానముతోగూడిన అందము మృదువైన చిరునవ్వు,
వాని దివ్యమైన నిర్మలమైన మృదువైన చూపు [కంఠధ్వని
వాని ఉద్రేక ఊహాలయొక్క శాంతము గలుగజేయు
నీ గొప్ప ఆదుర్దాను పోగొట్టు శక్తిగలది. [చూచును.
భాగ్యవంతులను బీదవారిని అతడు ఒకవిధముగానే
కులమత భేదములు లెక్కచేయడు.

అతి సామాన్యమైన వినయముతో కూడిన జీవనమును
ప్రేమించును.
నిష్కామసేవయే ఆయనకు ఆహారమైయున్నది.

పేరుప్రతిష్ఠలు నిన్ను క్రిందకు పడద్రోయును
యౌవనము అందము వడికిపోవును
నీకు అవసరముకలిగినపుడు ప్రజలు నిన్ను విడిచిపెట్టెదరు
కాని, ప్రియమైన గురుదేవుడు మనలను ఎన్నడును విడువడు
నీ అశాంతితో కూడిన మనస్సును అతడు మచ్చికచేయును
నీ జీవితమును పవిత్రముగాను నిర్మలముగాను మార్చును
కామము దురాశ పారిపోవును
నిర్మలమైన ఆనందము నీ జీవితమందు కలుగును.
నీ బాలహృదయమును అతడు శాంతిపరచును
మాయయొక్క ఆశ అను తెరను చించివేయును
నీ కర్మగ్రంథులను పగులగొట్టును
నీవు నీ ధ్యేయమును చేరుటకు నీకు స్వేచ్ఛ గలుగజేయును.

# 7. నా ప్రియమైన ప్రభువునకు

నా ప్రియమైనవాడా! నా ప్రియమైన ఆత్మా!
నా దివ్యమైన ప్రియుడా! నా మృదువైన ప్రభూ!
శాశ్వతమైన ధ్యేయమును చేరుటకు నేను చాల బాధ
పడుచున్నాను
నా బలముపోయినది నా మెదడు మొద్దుబారినది.
నా శరీరము ఇంద్రియములు హృదయము జీవితము అన్నియు
నా నిర్మలమైన ఆత్మశక్తితో పోరాడుచున్నవి.
దేవుని ఉద్దేశముప్రకారము నేను బాధసహించుటకు చేయు
ప్రార్థనను అవి అంగీకరించుటలేదు.
రాత్రింబగళ్లు బాధతో వ్రాయుచుండుటచే,
నా జీవితము నా ఊపిరి దిగజారిపోవుచున్నవి.
నా త్రోవలోనుండు ముళ్ళు (అడ్డంకులు) తీసివేసి
నన్ను సరిచేయుటకు నీదయ నాపై నెప్పుడు కలుగును?
నా స్నేహితులను నేను కోల్పోతిని, నా బంధువులను
మఱచిపోతిని.
పేరుప్రతిష్ఠలు వాని పట్టువిడిచినవి
నా హృదయమందు అపవాదులు బాధలు నేను సహించు
చున్నాను
నా ఆత్మయొక్క ఆలాపనను నీవు ఎందుకు వినిపించుకోనవు?
దయగలిగి నా ధ్యేయమునకు మార్గమును చూపుము.

